




# గోరా

## నాస్తికుని జీవితం

వల్లభనేని కాశీ విశ్వనాథం



ప్రజాశక్తి బుక్‌హౌస్




Title : Gora - Nastikuni Jeevitam
Author : Vallabhaneni Kashiviswanatham

ప్రచురణ సంఖ్య : 1433
నాస్తిక కేంద్రం : మొదటి ముద్రణ, 1964
రెండవ ముద్రణ, 1980
మూడవ ముద్రణ, 1993
ప్రజాశక్తి ప్రథమ ముద్రణ : డిసెంబర్ 2016

వెల : ₹. **140/-**

ప్రతులకు




ప్రజాశక్తి బుక్‌హౌస్
27-1-64, కారల్‌మార్క్స్ రోడ్, గవర్నర్‌పేట,
విజయవాడ -520 002, ఫోన్ : 0866 - 2577533.

మా బ్రాంచీలు
విశాఖపట్నం, కాకినాడ, విజయవాడ, గుంటూరు,
ఒంగోలు, నెల్లూరు, తిరుపతి, కర్నూలు

ముద్రణ
ప్రజాశక్తి డైలీ ప్రింటింగ్ ప్రెస్, విజయవాడ
website : www.psbh.in



# విషయసూచిక



5

# ప్రచురణకర్తల మాట

దైవం ఉనికిని నమ్మని వారు నాస్తికులు. దేవుడు సర్వాంతర్యామిగా గాని, ఏ రూపంలోగాని లేరన్నది వారి వాదన. యుగయుగాలుగా మానవ శక్తులకు అతీతమైన శక్తి ఉందని నమ్మేనాటికే అటువంటి శక్తి లేదని నమ్మేవారూ ఉన్నారు. కార్యాకారణాలు తెలియడం వలన జ్ఞానం పెరుగుతుంది. అపోహలు, భయాలు తొలగిపోతాయి. కొత్త జ్ఞానం, కొత్త భయాలనూ కల్పించవచ్చు. మరింత జ్ఞానంతో ఈ కొత్త భయాలూ తొలగవచ్చు. తెలుసుకోవలసిన విషయాలు ఉన్నన్ని రోజులూ అందుకు సంబంధించిన భయాలూ, ఆందోళనలూ ఉంటాయి. ఆ భయాలను అధిగమించేందుకు 'దైవం' ఆసరా మానవులు తీసుకుంటారు. నాస్తికులు జ్ఞానాన్వేషణ ఆసరా తీసుకో మంటున్నారు. అందుకై గోరా నాస్తిక కేంద్రాన్ని స్థాపించి తన జీవితకాలం శాస్త్రీయ దృక్పథం పెంచేందుకు ఎంతో కృషిచేసారు.

ఈనాడు ఒకవైపు శాస్త్రీయ జ్ఞానం పెరుగుతున్నా ఆ జ్ఞానాన్ని నిజజీవితంలో అన్వయించుకోక పోవడం సర్వసాధారణంగా మారింది. ఉదాహరణకి సూర్యుడే ఒకనాడు 'శక్తి'కి మూలం. నీటి నుండి, గాలి నుండి, అణువుల నుండి, వ్యర్థాల నుండి, రకరకాల ఇతర పద్ధతులలో శక్తిని వెలికితీసి ఉపయోగించుకుంటున్నా ఈనాటికీ 'శక్తి' ప్రాధాన్యతలో సూర్యునిదే ప్రథమ స్థానం. 'శక్తి'నిచ్చే ఇతర పదార్థాలను కొలవం! సూర్యుడిని కొలుస్తాం!!

సూర్యుడు ఒక నక్షత్రమని గుర్తించాం. అయినా గ్రహణాలను పాటిస్తున్నాం. రాహుకేతువుల కథలను నమ్ముతున్నాం. గ్రహణాల పట్టువిడుపులు, స్నానాలు, పూజలూ పెరుగుతున్నాయి. సూడో సైన్స్ పెరుగుతున్నది. ఇది పరిశోధనలను, శాస్త్రీయ ఆలోచనలను వెనకపట్టు పట్టిస్తుంది. పూర్వం మునులకు దూరదృష్టి ఉండేదని మనం తపస్సు చేసుకునేందుకు అడవులకు పోవడం లేదు. చక్కగా మొబైల్ ఫోన్లు వాడుతున్నాం. టీవిలు చూస్తున్నాం. స్కైప్ చేస్తున్నాం. అదే సమయంలో లెక్కలేనన్ని మూఢనమ్మకాలను పాటిస్తున్నాం. ప్రశ్నించడం లేదు. తరిగిపోవల్సిన నమ్మకాలు పెరుగుతున్నాయి. తొలగిపోవాల్సిన అపోహలు కొనసాగుతూనే ఉన్నాయి. సన్యాసులు చేసే గారడీలు, దైవత్వాలుగా చలామణీ అవుతూనే ఉన్నాయి. ప్రశ్నించే తత్వం, వ్యక్తిగతంగా ఆలోచించే తత్వం, పరీక్షించే తత్వం పెరగనిదే పెరిగిన జ్ఞానం వలన సమాజానికి మేలు జరగదని విశ్వసిస్తున్నాం.

ప్రశ్నించే తత్వాన్ని పెంచుకోవాలనీ, శాస్త్రీయ దృక్పథాన్ని అలవరచుకోవాలనీ అభిలషిస్తూ నాస్తిక కేంద్రం ఇదివరకే ప్రచురించిన ఈ పుస్తకాలను తిరిగి ప్రచురిస్తున్నాం. పాఠకులు ఆదరిస్తారని ఆశిస్తున్నాం.

*– ప్రజాశక్తి ప్రింటర్స్ & పబ్లిషర్స్ ప్రైవేట్ లిమిటెడ్*

# నిర్మాణాత్మక నాస్తికత్వం

సాంఘిక విప్లవకారులు, స్వాతంత్ర్య సమరయోధులు, నాస్తికత్వాన్ని నిర్మాణాత్మక జీవిత విధానంగా, ఆచరణాత్మకంగా ప్రజలముందు పెట్టిన గోరా 1940లో ప్రపంచంలోనే ప్రపథమ నాస్తికకేంద్రాన్ని సరస్వతీగోరాతో కలిసి ప్రారంభించారు.

నాస్తికత్వం కేవలం సిద్ధాంత చర్చ మాత్రమే కాదనీ, కుల, మత రహిత సెక్యులర్ సమాజ నిర్మాణానికి నాస్తికత్వం వచ్చినంత మాత్రాన చాలదని, ఆర్థిక సమానత్వం, సాంఘిక సమానత్వం సాధనకు నిరంతరం కృషి జరగాలని, మనిషిలో ఉన్న పరాధీన ప్రవృత్తిని పారద్రోలి, స్వశక్తి విశ్వాసాన్ని పెంపొందించాలని, గోరా స్పష్టంగా చెప్పారు. మనిషిలో నిహితమై ఉన్న శక్తి సామర్థ్యాలను, కర్తృత్వశక్తిని పెంపొందించాలని, కాలం చెల్లిన పాతభావాలను, మూఢనమ్మకాలను పారద్రోలడానికి నిర్మాణాత్మక నాస్తికత్వం అత్యవసరమని గోరా కృషి కొనసాగించారు.

మతాలలో వచ్చిన విప్లవాలు పాతదేవుళ్ళను, కాలం చెల్లిన భావాలను తొలగించడానికి తోడ్పడ్డాయికాని పాత దేవుళ్ళ స్థానంలో కొత్త దేవుళ్ళను పునః స్థాపించడం జరిగిందని, మత నియంతృత్వాల వలన ప్రజలలో సమాజ ప్రగతికి అవరోధం కలిగిందని గోరా స్పష్టం చేశారు. మనిషిలోని పరాధీన ప్రవృత్తి ఆస్తికత్వం అని, సైన్సు-శాస్త్రీయదృష్టి ప్రబలడం వలన ప్రజాస్వామిక విధానం బలపడుతున్నకొద్దీ సమాజం మతానంతర సమాజం (Post-Religious Society) వైపు పురోగమిస్తుందని గోరా స్పష్టం చేశారు.

ఎన్నో ఉద్యమాలు నిర్వహించిన గోరా రెండుసార్లు 1970లోను, 1974 లోను ప్రపంచ వ్యాప్తంగా పర్యటించారు. 'సంఘం', "ఆర్థికసమత" "ATHEIST" "ఇన్సాన్" (హిందీ) పత్రికలు దశాబ్దాల పాటు నిర్వహించారు. అదే రీతిలో "ATHEIST" 'నాస్తికమార్గం' పత్రికలు కొనసాగుతున్నాయి. ప్రపంచవ్యాప్తంగా నాస్తికత్వం ప్రబలుతోందని, నాస్తికత్వాన్ని మరింత బలోపేతం చెయ్యడానికి ప్రప్రథమ ప్రపంచ నాస్తిక మహాసభలు గోరా 1972లో ప్రారంభించారు. గోరా పెట్టిన ఒరవడిలో ఇంతవరకు 9 ప్రపంచ నాస్తిక మహాసభలు నిర్వహించబడ్డాయి. వాస్తవికత, సంఘదృష్టి, వ్యక్తిత్వం (వా.స.వ్య) గోరా లక్ష్యం. "జై ఇన్సాన్" గోరా నినాదం. గోరా శతజయంతి సందర్భంగా భారత ప్రభుత్వం ప్రత్యేక పోస్టేజి స్టాంపును కూడా వెలువరించింది.

1975 జూలై 26న గోరా మరణించినా, ఆయన స్ఫూర్తితో నాస్తికకేంద్రం వివిధ రంగాలలో ప్రజలను చైతన్యపరచడానికి, అస్పృశ్యతను అంతం చెయ్యడానికి, సెక్యులర్ వ్యవస్థా నిర్మాణానికి, సైన్సు, శాస్త్రీయ దృష్టిని పెంపొందించడానికి కృషి చేస్తూ ఉంది. మూఢనమ్మకాలు అజ్ఞానాన్ని పారద్రోలడానికి నాస్తికకేంద్రం కార్యక్రమాలు నిర్వహిస్తూ ఉంది. సెక్యులర్ విద్యావిధానాన్ని వ్యాప్తి చెయ్యడానికి, గ్రామీణ ప్రాంతాలలో సెక్యులర్ సోషల్‌వర్క్ కార్యక్రమాలను నిర్వహిస్తూ ఉంది. సెక్యులరిజానికి ప్రజాస్వామ్యానికి అవినాభావ సంబంధం ఉంది.

జిజ్ఞాసను, నాస్తిక చైతన్యాన్ని, సమానత్వ భావాలను, జనసామాన్యంలో వ్యాప్తి చెయ్యడానికి ప్రజాశక్తి బుక్‌హౌస్,నాస్తికకేంద్రం పుస్తకాల ప్రచురణకు పూనుకోవడం హర్షదాయకం.

**డిసెంబర్ 2016**

నాస్తికకేంద్రం
బెంజిసర్కిల్, విజయవాడ -10
ఫోన్ : 0866 - 2472330
సెల్: 09848458220
Email : positiveatheist@gmail.com
www.atheistcentre.in

# రెండవ ముద్రణకు పీఠిక

నేను ఈ పుస్తకాన్ని 1964లో వ్రాశాను. అప్పటికి తెలుగులో గోరా జీవితం తెలిపే గ్రంథం ఏదీ లేదు. 1962లో హిందీలో గోరా జీవితం చిన్న పుస్తకం వెలువడింది. అది చదివినప్పుడు గోరా జీవితం తెలుగులో లేకపోవటం పెద్ద లోపంగా కనిపించి ఈ పుస్తకాన్ని రచించాను.

ఈ పుస్తకం రెండవ ముద్రణ 15 సంవత్సరాల తరువాత ఇప్పుడు వెలువడుతోంది. ఈ మధ్య, 1975లో గోరా మరణించటం జరిగింది. 1964లో ఈ పుస్తకం వ్రాసినప్పుడు అప్పటి వరకు గోరా జీవితంలోని సంఘటనలు తీసుకొని వ్రాశాను. సమగ్రంగా గోరా కార్యకలాపాలను, జీవితంలోని వివిధ సంఘటనలను, వారి నాస్తిక పరిచయాన్ని ఇందులో అందజేయాలని ప్రయత్నించాను. సమకాలీన సమాజం ఇతర అందరు సంస్కర్తలను, విప్లవకారులను హింసించినట్లే గోరాను కూడా చాలా బాధలు పెట్టింది. వాటిలో కొన్ని నాకూ తెలుసు. అయినా వాటిని ఇందులో చర్చించదలచుకోలేదు. ఇంకా చాలామంది ఈ పుస్తకం వ్రాసేనాటికి జీవించియున్నారు కనుక అవన్నీ వ్రాయటం సమంజసం అనిపించలేదు.

ఈ రచనకు నాకు 'సంఘం' సంపుటాలు, గోరా రచనలు, 'శ్రీగోరా అభినందన సంచిక', మిత్రుల అనుభవాలు తోడ్పడ్డాయి. వీటన్నిటిని మించి మిత్రులు శ్రీ లవణం సహకారం లభించి ఉండకపోతే ఈ పుస్తకంలో ఉదహరించిన వివరాలలో సగం సేకరించుట కూడా కష్టమయ్యేది. ఎప్పటికప్పుడు వ్రాతప్రతిని చూసి అమూల్యమైన సలహాలిచ్చి, సూచనలు చేసి ఈ గ్రంథాన్ని ప్రామాణికంగా రచించుటకు శ్రీ లవణం తోడ్పడ్డారు. వారికి నా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనములు.

ఈ రెండవ ముద్రణలో 1964 తరువాత 1975లో గోరా చనిపోయేవరకు జరిగిన విషయాలను క్లుప్తంగా చేర్చడం జరిగింది. అందుచేత ఇప్పుడు పాఠకునికి గోరా జీవితం పూర్తిగా ఇందులో లభిస్తోంది.

సుమారు ఐదు దశాబ్దాలు ఆంధ్రదేశాన్ని వివిధ రంగాలలో ఉర్రూతలూగించి, భారతదేశాన్నే కాక ప్రపంచం మొత్తంమీద నాస్తికులను హేతువాద, మానవతావాద ఉద్యమాలను, సమాజ పరివర్తనారంగంలో కృషిచేసే కార్యకర్తలను గోరా ప్రభావితం చేశారు. వారితో నాకు ప్రత్యక్ష పరిచయం 1940లో కలిగింది. అంతకుముందు వారి గురించి నేను చాలా వినివున్నాను. పరిచయమైన ప్రథమ క్షణంలోనే వారు

నన్ను ఆకర్షించారు. చివరి వరకు వారు నన్ను ప్రభావితం చేస్తూనేవున్నారు. వయస్సులో నేను వారికంటె చిన్నవాడినయినా, ఉత్సాహంలో, కృషిలో గోరా గారే నా కంటే యువకులుగా వుండేవారా అనిపించింది. ఆయన వయస్సును ధిక్కరించి జీవించారు. అందుకే చివరి క్షణం వరకు ఆయన సక్రియంగా వుంటూ ఆకస్మాత్తుగా సభలో వాక్యం మధ్యలో రాలిపోయారు. ఆయన జీవితం ఎంత ధన్యమో ఆయన మరణం అంత ధన్యమైనదని నాకు అనిపిస్తోంది.

గోరా భావాలన్నిటితో నేను ఏకీభవించలేకపోవచ్చు. అయితే వారు చేసిన ప్రతిపనీ సమాజ శ్రేయస్సుకే చేశారని నేను అంగీకరిస్తాను. అందుకే నా సొంత అభిప్రాయాలు ఏవీ ఈ పుస్తకంలో జొరబడకుండా గోరా జీవితాన్ని, భావాలను, కార్యక్రమాలను నిజాయితీతో ప్రతిబింబింపచేయాలని ప్రయత్నం చేశాను. ఈ ప్రయత్నం ఎంత వరకు ఫలించింది పాఠకులే నిర్ణయించాలి.

గోరా గురించి సమగ్రంగా తెలుసుకొనుటకు, పరిశీలించుటకు ఈ గ్రంథం ఏమాత్రం తోడ్పడినా నా కృషి ఫలించినట్లు భావిస్తాను. మొదటి ముద్రణ వెలువడగానే నన్ను మిత్రులు ఎంతగానో అభినందించారు. ఈ గ్రంథాన్ని చక్కగా ఆదరించారు. అందుచేత ఈ గ్రంథరచన ద్వారా నేను చేసిన ప్రయత్నం తెలుగు ప్రజలకు నచ్చిందనే అనుకొంటున్నాను.

గోరావంటి వ్యక్తుల జీవితాలు రచించటంలో చాలా ఇబ్బందులున్నాయి. అందుచేత ఎక్కడైనా లోపాలు జరిగితే అవి నావిగా భావించి మన్నించగలరని ఆశిస్తున్నాను.

ఈ గ్రంథం మొదటి ముద్రణ నా సొంత ప్రచురణ సంస్థ అయిన 'లాల్ పబ్లికేషన్స్' ద్వారా ప్రచురించాను. కానీ ఇప్పుడు గోరా అనంతరం ఈ పుస్తకం నాస్తిక సాహిత్యంలో భాగంగా నాస్తిక కేంద్రం తరఫున ప్రచురింపబడటం నేను గర్వకారణంగా భావిస్తున్నాను. నాస్తిక కేంద్రం వారికి నా కృతజ్ఞతలు.

గోరా జీవితాన్ని రచించుటకు నేను చేసింది ప్రథమ ప్రయత్నం. గోరా జీవితం గురించి వివిధ దృక్పథాల నుంచి పరిశీలిస్తూ ఇంకా ఎన్నెనా గ్రంథాలు రావలసిన అవసరం వుంది. అందుకు ఈ పుస్తకం ఏమాత్రం తోడ్పడినా నా కృషి ఫలించినట్లు భావిస్తాను.

ఏలూరు — వల్లభనేని కాశీవిశ్వనాథం

ఏప్రిల్ 1980



# గోరా

గోరా అనగానే ప్రతి ఒక్కరూ "ఆయనే కదండి. నాస్తికుడు." అని అంటారు. గోరా అనే పదం ప్రముఖంగా నాస్తికత్వానికి పర్యాయపదమైంది. 1940-41 ప్రాంతాల్లో శ్రీ న్యాపతి నారాయణమూర్తి గారు "ఆంధ్రప్రభ" 'పాన్-సుపారీ'లో గోరాగారి గురించి వ్రాస్తూ కృష్ణా జిల్లాకు వెళ్ళి 'దేవుడు లేని ఊరు' అని అడగండి చాలు, అన్నారు. గోరా తన భావాలను ఎంత పట్టుదలతో, ఎంత విరివిగా ప్రచారం చేశారో తెలుసుకొనుటకు ఈ ఒక్క ఉదాహరణే చాలు.

ప్రపంచంలో సమాజం చాలామందిని నాస్తికులంది. నాస్తిక శబ్దాన్ని ఒక దూషణ శబ్దంగా వాడింది. ప్రవక్తలను, సంఘసంస్కర్తలను వైజ్ఞానికులను సమకాలీన సమాజం ఇలా హింసించింది. అయితే, తామే నాస్తికులమని ఎలుగెత్తి చాటుకున్న వారు బహుకొద్దిమంది. వీరిలో చెప్పుకోదగిన వారు ఇంగ్లాండులో చార్లెస్ బ్రాడ్లా. భారతదేశంలో గోరా. వీరిద్దరిలో గోరాది మరీ ప్రత్యేకత. సాధారణంగా నిరీశ్వరవాదాన్నే నాస్తికత్వం అని అనుకుంటారు. కాని గోరా నాస్తికత్వానికి నూతన నిర్వచనమిచ్చారు. నాస్తికత్వం అంటే స్వేచ్ఛా ప్రవృత్తి; స్వశక్తి విశ్వాసం అని. అందుకే గోరా సేవాగ్రాం ఆశ్రమంలో గాంధీజీని కలిసినప్పుడు "నిరీశ్వరవాదితో నేనేమి మాట్లాడను!" అని గాంధీజీ ఛలోక్తి విసిరితే, "బాపూ! నేను నిరీశ్వరవాదిని కాను; నాస్తికుణ్ణి" అన్నారు గోరా చిరునవ్వుతో.

గోరా నిరీశ్వరవాది కాదు. నాస్తికుడు. మానవునిలోని పరాధీన ప్రవృత్తి ఆస్తికత్వమనీ; స్వేచ్ఛా ప్రవృత్తి నాస్తికత్వమనీ గోరా నిర్వచించినప్పుడు, నిరీశ్వరవాదం నాస్తికత్వంలో ఒక భాగం మాత్రమే అవుతుంది. పరాధీన ప్రవృత్తిలో దైవభావానికి

మానవుడు దాసుడగుట ఒక అంశం మాత్రమే. దైవ భావానికే గాక, కర్మసిద్ధాంతానికి, పరిస్థితులకు, సమాజ కట్టుబాట్లకు, ప్రభుత్వానికి కూడా మానవుడు బానిస అవుతున్నాడు. నాస్తికత్వం అంటే ఏ విధమైన బానిస భావమైనా సరే, దానిమీద యుద్ధం ప్రకటించడం. బానిసత్వ బంధనాల నుంచి మానవునికి విముక్తి కలిగించి, నైరాశ్యాన్ని , పురుషార్థహీనతనూ పారద్రోలి, స్వేచ్ఛా ప్రవృత్తికి ప్రోత్సాహమిచ్చి, స్వశక్తి విశ్వాసాన్ని కలిగించి, బాధ్యతగల వ్యక్తిగా చేయడం. అందుకే గోరాకు నాస్తికత్వం పాండితీ ప్రకర్షతో కూడిన వేదాంత చర్చ కాదు; అనుక్షణం అడుగడుగునా ఆచరణను రూపొందించే జీవిత విధానం.

గోరా నాస్తికత్వాన్ని జీవిత విధానంగా చేపట్టడం వలన ఎంతగా పండితులతో దీర్ఘమైన చర్చలు జరిపారో, అంతకంటే ఎక్కువగా సామాన్యుని జీవితంలోనికి ప్రవేశించి కార్యక్రమాలు రూపొందించారు. తాత్వికంగా స్వేచ్ఛకు పట్టంగట్టి, సాంఘికంగా కుల మతతత్వాలకు స్వస్తి చెప్పి, ఆర్థికంగా గ్రామరాజ్య విధానాన్ని ప్రచారం చేసి, రాజకీయంగా ప్రజాస్వామ్యాన్ని వికసింపజేయాలని పార్టీల నిర్మూలనకు పూనుకున్నాడు. గోరా భావాలలో ఎంత నూతనత్వం ఉందో, ఆయన జీవితం అంత వైవిధ్యంతో కూడుకున్నది. ఆయన తొక్కిన దారి నలుగురు పోయిన బాట కాదు. కనీసం పదిమంది వెంటనే తోడురాగల దారీ కాదు. అయినా విరామమెరుగని పురోగమనం ఆయనది. తాను ముందుగా ఎగుడు దిగుడులను, కీకారణ్యాలను, కొండలను, వాగులను దాటుకుంటూ తన వెనుక భావితరాలకు ఒక రాజబాటను నిర్మిస్తున్నారు. అధ్యాపకునిగా, తత్వవేత్తగా, సంఘసంస్కర్తగా, విప్లవకారునిగా ఆయనకు ఆయనే సాటి. ఆలోచన, ఆచరణకు సేతువు ఆయన జీవితం.



# జననం - బాల్యం

గోరా అనేది గోరాగారి అసలు పేరు కాదు. ఆయన పూర్తి పేరు గోపరాజు రామచంద్రరావు. గోపరాజులో 'గో', రామచంద్రరావులో 'రా' ఈ రెండు మొదటి అక్షరాలు పొడి అక్షరాల సంతకంగా వాడేవారు. రానురాను అదే అయనకు ప్రచలితనామమైంది. గోరా కులమతాలకు అతీతుడు కనుక తన పూర్తిపేరులో హిందుత్వ ప్రభావం ఉందని, తాను కూడా నూతన సంక్షిప్త నామానికే ఎక్కువ ఇష్టపడేవారు. అంతేకాక, తర్వాత తనపేరు 'గోరా'గా మార్చుకున్నట్లు గవర్నమెంటు గెజిట్‌లో ప్రకటింపజేశారు.

గోరా పూర్వీకులది గుంటూరు జిల్లా కొలకలూరు గ్రామం. కొలకలూరు కరణీకం గోపరాజువారిదే. పేరు ప్రతిష్టలు గల వంశం అది. గోరా తాతగారగు శ్రీ గోపరాజు వేంకట నరసింహారావు గారు పందొమ్మిదవ శతాబ్దపు పూర్వార్థం చివరిభాగంలో కొలకలూరు నుంచి విశాఖపట్టణం జిల్లా విజయనగరం సంస్థానాధీశుని కొలువులో ఉద్యోగానికి వెళ్లారు. రాజుకు విశ్వాసపాత్రుడై జీవితాంతం అక్కడే ఉండిపోయారు.

నరసింహారావు గారికి ఇద్దరు కుమారులు. నలుగురు కుమార్తెలు. పెద్ద కుమారుడు సూర్యనారాయణ. రెండవ కుమారుడు వేంకట సుబ్బారావు. గోరా తండ్రియగు వేంకట సుబ్బారావు గారు విజయనగరంలోనే 1869లో జన్మించారు. మహాత్మాగాంధీ జన్మించిన సంవత్సరమే అది. వేంకట సుబ్బారావు గారు విజయనగరంలోనే మెట్రిక్యులేషను ప్యాసై ప్రభుత్వ అటవీశాఖలో ఉద్యోగిగా చేరారు. బెజవాడ వాస్తవ్యులు శ్రీ పామరాజు రామకోటి గారి కుమార్తె రాజ్యలక్ష్మితో వేంకట సుబ్బారావు గారి వివాహం జరిగింది. శ్రీ గోపరాజు వేంకట సుబ్బారావు-రాజ్యలక్ష్మి

గార్ల తృతీయ సంతానం-ద్వితీయ పుత్రుడు-మన గోరా. గోరా 1902 నవంబరు 15న ఛత్రపురంలో (ఇప్పుడు ఒరిస్సాలోని గంజాం జిల్లాలో ఉన్నది) జన్మించారు. ఆ రోజు కార్తీక పౌర్ణమి.

గోరా జన్మించేనాటికి వేంకట సుబ్బారావు గారి కుటుంబం సనాతన బ్రాహ్మణ సాంప్రదాయాలలో మునిగి తేలుతూ నిరంతరం భజనలతో, పూజా పునస్కారాలతో గడుపుతూ ఉండేది. గోరాకంటే ముందుగా జన్మించిన కుమార్తెకు కృష్ణవేణి అనీ, కుమారునకు తాతగారి పేరు వేంకట నరసింహారావు అనీ పెట్టిన తర్వాత తృతీయ సంతానానికి రామచంద్రరావు అని నామకరణం చేశారు. గోరాకు రామచంద్రరావు అని పేరు పెట్టుటలో కూడా విశేషం ఉంది. వారి మాతామహుని పేరు రామకోటిలో నుంచి రామశబ్దాన్నీ, పౌర్ణమినాడు చంద్రోదయ సమయాన జన్మించుట చేత చంద్ర శబ్దాన్నీ జోడించి రామచంద్రరావు అన్నారు. గోరా తర్వాత వరుసగా ఇద్దరు ఆడపిల్లలు పుట్టి పోవడం వల్ల ఇంట్లో గోరాయే చిన్నపిల్ల వానిగా ఉండి చాలా ముద్దుగా పెరిగారు.

బాలారిష్టాలు దాటకుండానే ముగ్గురు కుమార్తెలు పోగా వేంకట సుబ్బారావు గారికి మిగిలిన సంతానం ఎనిమిది మంది. ఐదుగురు కుమార్తెలు. ముగ్గురు కుమారులు. గోరా తర్వాత వరుసగా బాలాత్రిపురసుందరి, అనసూయ, సౌభాగ్యం, సామ్రాజ్యం అని నలుగురు ఆడపిల్లలు. చివర సాంబశివరావు కనిష్ట పుత్రుడు. సుబ్బారావుగారి కుటుంబంలో తల్లితండ్రులు - పిల్లలు, సోదరీ సోదరుల మధ్య అన్యోన్యత, పరస్పర ప్రేమానురాగాలు మెండు. అల్లుళ్ళకు కూడా కుమారులంతటి చనువు, బాధ్యత.

గోరాకు ఒక సంవత్సరం వయస్సు ఉన్నప్పుడు పర్లాకిమిడి రాజా చనిపోగా కోర్ట్ ఆఫ్ వార్డ్సులో ఉద్యోగిగా సుబ్బారావు గారు నియమింపబడ్డారు. ఆ పదవిలో ఆయన 8 సంవత్సరాలున్నారు. అందుచేత గోరా బాల్యం, ప్రాథమిక విద్య పర్లాకిమిడిలోనే గడిచాయి.

ఆ రోజుల్లో ఓఢ్రప్రాంతంలో 'సంగాతో' అనే అచారం ఉండేది. అంటే బాలుడు బాల్యంలోనే తన కుటుంబానికి బయట మరొక బాలునితో సాంప్రదాయరీత్యా నేస్తం కడతాడు. జీవితాంతం వారిద్దరూ ఆదర్శమిత్రులుగా ఒకరి కష్టసుఖాలలో మరొకరు భాగం పంచుకుంటూ పరస్పరం సహకరించుకుంటూ ఉండాలి. 'సంగాతో' అంటే ఒరియా భాషలో చెలికాడు, స్నేహితుడు అని అర్థం. ఈ సంగాతోలు ఒకరినొకరు పేరుపెట్టి పిలుచుకోరాదు. సంగాతో అనే పిలుచుకుంటారు. ఇండ్లలో ఈ సంఘటన ఒక పెద్ద శుభకార్యము. శాస్త్రోక్తంగా ఈ శుభకార్యం జరిపించుటకు వివాహపు

ఏర్పాట్లంత కర్మకాండ ఇటూ అటూ పెద్దలే చేస్తారు. గంజాం జిల్లా మాతృభాష తెలుగు అయినా ఓఢ్రదేశానికి సరిహద్దుగా ఉండుటచేత అక్కడా ఈ ఆచారం ఉండేది. పర్లాకిమిడి రాజపురోహితుల కుటుంబానికి చెందిన బాలుడు సత్యనారాయణ రాజగురుతో గోరాకి నేస్తం కట్టే శుభకార్యం మతసాంప్రదాయికంగా జరిగింది. అప్పుడు గోరా వయస్సు 5 సంవత్సరాలు. సత్యనారాయణ కుటుంబీకులు ఓఢ్రులు. వారి మాతృభాష ఒరియా. బాల సంగాతోలిద్దరకూ భాష పెద్ద అవరోధమైంది. సత్యనారాయణకు తెలుగురాదు. గోరాకి ఒరియా రాదు. వీరిద్దరూ సన్నిహితంగా రాగలిగింది సుమారు పాతిక సంవత్సరాల తర్వాత. అప్పటికి ఇద్దరూ పెద్ద చదువులు చదివి ఆంగ్ల విద్యను అభ్యసించారు. శ్రీ సత్యనారాయణ రాజగురు ఒరిస్సా ప్రభుత్వం పురాతత్వ పరిశోధనాశాఖ (ఆర్కియాలజీ) లో ఉన్నతాధికారిగా పనిచేసి రిటైరు అయినారు. గోరాకి తన విద్యార్థులన్నా, మిత్రులన్నా ఎక్కువ అభిమానం, ఆప్యాయత. అందుకు బీజాలు బాల్యంలోనే పడ్డాయి.

సుబ్బారావుగారు గొప్ప శివభక్తులు. అయినా సర్వమత సామరస్యమును ఆయన అంగీకరించేవారు. ఎక్కువగా తెల్లదొరల క్రింద పనిచేయుట వల్ల మరీ ఛాందసత్వంకాక కొన్ని అభ్యుదయ భావాలు ఆయనలో ప్రవేశించాయి. పరోపకారదృష్టి, దానధర్మాలు హెచ్చుగా ఉండేవి. శైవ భక్తుడుగా శివరాత్రిని జరిపినట్లే, శ్రీకృష్ణ జన్మాష్టమి కూడా ప్రతీ సంవత్సరం జరిపేవారు. ఆయన నిత్యం "మహదేవ శంభో" అనడం చేత ఆయన అసలు పేరుతో కంటే మహాదేవ శంభోగానే ఎక్కువ ప్రచారమయ్యారు. సుబ్బారావు గారు రాత్రి వీభూది రాసుకొని, పగలు నామాలు పెట్టేవారు. భగవన్నామ సంకీర్తనంలో కవిత్వం, నృత్యం, సంగీతం అలవర్చుకున్నారు. "అక్షర హంసలు" రెండు భాగాలుగా (పద్యాలు, కీర్తనలు) వ్రాసి ప్రచురించారు. ఇవిగాక "శ్రీమద్భాగవదామృతము", "శంభో శతకము" "సాంబా శతకము" మొదలైన కావ్యాలు రచించారు.

గోరా, వారి అన్నగారగు నరసింహారావు విద్యార్థిదశ దాటేవరకూ పూర్తిగా తండ్రి ప్రభావంలోనే ఉండేవారు. సుబ్బారావుగారు తన పిల్లలకు భారత, భాగవత, రామాయణాలు చెప్పేవారు. రోజూ తనతోపాటు పిల్లలచే కూడా భగవన్నామ సంకీర్తనం చేయించేవారు. సుబ్బారావు గారు 86 సంవత్సరాలు జీవించారు. తమ జీవితకాలంలో ఆయన 62 సంవత్సరాలు ఎట్టి ఆటంకం లేకుండా పట్టుదలతో నిర్విఘ్నంగా ప్రతీ సంవత్సరం శివరాత్రులు జరిపించారు. ఎన్ని అడ్డంకులు వచ్చినా శివరాత్రి ఉత్సవానికి షష్టిపూర్తి జరిపించుటలో వాటిని ఆయన లెక్కచేయలేదు. తండ్రిలోని ఈ పట్టుదలనే

గోరాగారు పుణికి పుచ్చుకున్నారనిపిస్తుంది. 20 సంవత్సరాల వయస్సు వచ్చేవరకూ గోరా ప్రతీ శివరాత్రి సమయంలోనూ తండ్రితోపాటు గజ్జెలు కట్టుకుని గెంతుతూ భజనలు చేసేవారు.

1912 పర్లాకిమిడిలో కోర్ట్ ఆఫ్ వార్డ్స్ ఎత్తివేసినప్పుడు సుబ్బారావు గారిని కర్నూలు ఫారెస్టు ఆఫీసు హెడ్‌క్లర్క్‌గా బదిలీ చేశారు. పెద్ద పిల్లలను పర్లాకిమిడిలోనే ఉంచి, చిన్న పిల్లలను తీసుకుని కర్నూలు వెళ్ళారు. కాని తన శిష్యకోటికి దూరం కావడం ఆయనను బాధపెట్టింది. దానితో అటవీశాఖలోనే ఉంటే పైకివెళ్ళే అవకాశాలు ఉన్నప్పటికి, అవి అన్నీ వదలుకొని, ఒకేచోట స్థిరంగా ఉండటం కొరకూ పిల్లల చదువులు చూచుకొనుటకూ, తిరిగి సర్కారు జిల్లాలకు రావాలనీ, తన సర్వీసు రెవెన్యూ డిపార్టుమెంటుకు మార్పించుకున్నారు. ఈ విధంగా ఒక్క సంవత్సరం మాత్రమే కర్నూలులో పనిచేసి 1913లో కాకినాడ కలెక్టర్ ఆఫీసులో హుజూరు క్యాష్ కీపరుగా బదిలీ అయ్యారు. సుబ్బారావుగారు పదవీ విరమణ చేసేవరకూ కాకినాడలోనే ఉన్నారు. కాకినాడ వారికి శాశ్వత నివాసం అయింది.



# విద్యార్థి జీవితం - వివాహం

**1913**లో వేంకట సుబ్బారావుగారు కాకినాడ చేరిన తర్వాత పర్లాకిమిడిలోని తన పిల్లలను కూడా తీసుకువచ్చారు. 1913లో గోరా పిఠాపురం రాజా కాలేజీ హైస్కూలులో ఒకటవ ఫారంలో చేరారు. వరసగా చదువుతూ 1919లో స్కూలు ఫైనలు పరీక్షకు వెళ్ళారు. కాని ఆ సంవత్సరం ప్యాస్ కాలేదు. మరుసటి సంవత్సరం 1920లో స్కూలు ఫైనలు ప్యాసై పి.ఆర్. కాలేజీలో ఇంటర్‌మీడియట్‌లో జీవశాస్త్రం ప్రధాన విషయంగా తీసుకుని చేరారు.

ఆంధ్రదేశంలో బ్రహ్మసమాజానికి కాకినాడ కేంద్రంగా ఉండేది. గోరా హైస్కూలులో చదువుకునే రోజుల్లో శ్రీ రఘుపతి వెంకటరత్నం నాయుడు గారు కాలేజీ ప్రిన్సిపాలుగా ఉండేవారు. అయితే గోరా కాలేజీ తరగతులకు వచ్చేసరికి క్రమశిక్షణకు ఖ్యాతిగాంచిన డాక్టర్ వేమూరి రామకృష్ణారావుగారు ప్రిన్సిపాలు అయ్యారు.

గోరా హైస్కూలులో చదువుతున్న రోజులలోనే గాంధీజీ దక్షిణాఫ్రికా నుంచి భారతదేశం వచ్చి స్వరాజ్యోద్యమానికి కాంగ్రెసును సంఘటిత పరుస్తున్నారు. వేంకట సుబ్బారావు గారు సరళ హృదయుడు, ఉదారస్వభావుడు కావడంచేత జాతీయోద్యమ ప్రభావానికి లోనయ్యారు. గోరాకు దేశభక్తి గురించి, తిలక్, అనీబిసెంటు, గాంధీ నాయకత్వం గురించి స్వయంగా చెప్పేవారు. జాతీయోద్యమానికి సుబ్బారావు గారు సానుభూతిపరుడుగా తయారయ్యారు.

గోరా కాలేజీలో ప్రవేశించిన వెంటనే సహాయనిరాకరణోద్యమం ప్రారంభమైంది. నూనూగుమీసాల నవయౌవనం. జాతీయ భావాలు అప్పటికే చొరబడ్డాయి. దానితో కాలేజీని వదలిన మరికొంతమందితో పాటు గోరా కూడా సహాయ నిరాకరణోద్యమంలో

పాల్గొన్నారు. అదే సమయంలో గోరా తండ్రియగు వేంకట సుబ్బారావు గారు కాంగ్రెసుకు 2 బస్తాల ధాన్యం విరాళంగా యిచ్చారు. ఇంకేముంది? సుబ్బారావు గారు కొంతకాలం వరకూ ఉద్యోగంలోంచి సస్పెండు చేయబడ్డారు. తర్వాత ఆయన తిరిగి ఉద్యోగంలోనికి తీసుకోబడ్డారు. ఇటు సహాయ నిరాకరణ ఉద్యమంలో పాల్గొన్న విద్యార్థులలో కొద్దిమందిని మాత్రమే ప్రభుత్వం అరెస్టు చేసింది. ఊరిలోని పెద్దలు, సంరక్షకులు, అధ్యాపకుల కృషి ఫలితంగా మిగిలినవారిలో చాలామంది తిరిగి కాలేజీలో చేరారు. గోరా కూడా వారిలో ఒకరు.

కాకినాడ కాలేజీలో విద్యార్థిగా ఉన్నప్పుడు గోరాని ఎక్కువ ప్రభావితం చేసినవారు జీవశాస్త్ర ఆచార్యులు శ్రీ ఆర్.వి. శేషయ్య గారు. శేషయ్య గారు గొప్ప ఆదర్శవాది. చక్కని విద్యావేత్త. విద్యార్థులను భావిపౌరులుగా మలచుటలో ఆయన చాలా శ్రద్ధ తీసుకునేవారు. 1922లో గోరా జీవశాస్త్రం ప్రధాన విషయంగా ఇంటర్ ప్యాసైనారు.

ఇంటర్ ప్యాసైన వెంటనే గోరా వివాహం ఆ వేసవిలోనే జరిగింది. గోరా ఉన్నతవిద్యకు మద్రాసు వెళ్ళబోతున్నారు. అప్పుడు వెంటనే వివాహం చేసుకోవాలనే ఉద్దేశ్యం ఆయనకు లేదు. ఇంతలోనే విచిత్రమైన సంఘటన జరిగింది. శ్రీ పోడూరి లక్ష్మీనరసింహారావుగారు, వేంకటసుబ్బారావుగారు విజయనగరంలో బాల్యస్నేహితులు, సహపాఠకులు. 1922 ఆ వేసవిలో ఆకస్మాత్తుగా ఇద్దరు మిత్రులూ కాకినాడలో రోడ్డుమీద కలుసుకున్నారు. చాలాకాలానికి తిరిగి కలుసుకున్నందున మిత్రులిద్దరూ కుశలప్రశ్నలు వేసుకున్నారు. సుబ్బారావుగారు నరసింహారావు గార్ని తన ఇంటికి తీసుకుని వచ్చారు. ఇలా కాకినాడ వచ్చిన పని ఏమని అడిగారు. దానిపై నరసింహారావుగారు తన కుమార్తె సరస్వతికి సంబంధాలు చూచుటకు వచ్చామన్నారు. అమ్మాయికి 11 ఏళ్ళు. అప్పుడే ఇంటరు ప్యాసై, పై చదువులకు పోనున్న తన కుమారునికే ఆ సంబంధం చేసుకుంటే బాగుండుననిపించింది సుబ్బారావుగార్కి. ఈ సంబంధంతో బాల్యస్నేహితులు వియ్యమందుతారు. ఇద్దరూ సంతోషించారు. పెళ్ళిచూపులయ్యాయి. కట్నాలు-కానుకలుగా ఆడపెళ్ళివారు వెయ్యి రూపాయలు ఇచ్చేట్లు నిశ్చయించుకున్నారు.

నరసింహారావుగారు విజయనగరం రాజాగారి కొలువులో పనిచేసేవారు. తనవెంట కూతురిని కూడా అప్పుడప్పుడు రాజాగారి వద్దకు, మహారాణి గారి వద్దకూ తీసుకుని వెళుతూ ఉండేవారు. ఈ విధంగా మహారాణీ గార్కి సరస్వతి యెడల అభిమానం, వాత్సల్యం ఏర్పడ్డాయి. తన వాత్సల్యం చూరగొన్న సరస్వతికి వివాహ సంబంధం నిశ్చయమైనదని తెలియగా మహారాణీగారు చాలా సంతోషించారు. వరుని గురించి

వివరాలు అడిగి తెలుసుకుని తగిన వాడేనని అభినందించింది. అమ్మాయి వివాహానికి అయ్యే కట్నము, ఖర్చులు తానే భరిస్తాననీ, పెండ్లి వైభవంగా జరిపించవలసిందనీ మహారాణీ గారు నరసింహారావుగారిని కోరారు. ఈ విధంగా గోరాకీ సరస్వతికి 1922 మే 7 వ తేదీన వివాహం జరిగింది. వివాహ కర్మకాండ 5 రోజులు అతి వైభవంగా జరిపించారు. సరస్వతిది బాల్యవివాహం. అప్పటికామె 4వ తరగతి చదువుతూ ఉండేవారు. సరస్వతి నలుగురు అన్నల తర్వాత ఒక్కర్తే ఆడకూతురు. అందుచేత అతిగారాబంగా పెరిగింది. అన్నలందరూ పెద్ద చదువులే చదివారు. విజయనగరంలో పోడూరివారి కుటుంబం చాలా సనాతన ధర్మ సాంప్రదాయాలు కలది. తమ కుటుంబానికి తగిన అల్లుడే లభించాడని సరస్వతి తల్లి కొండమ్మ గారు కూడా చాలా సంతోషించారు.

వివాహనంతరం గోరా పై చదువుకు మద్రాసు వెళ్ళిపోయారు. అక్కడ ప్రెసిడెన్సీ కాలేజీలో వృక్షశాస్త్రం (బోటనీ) బి.ఎ. ఆనర్సులో చేరారు. కాలేజీకి ప్రక్కనే ఉన్న విక్టోరియా హాస్టల్‌లో ఉండేవారు. కాలేజీకి, హాస్టలుకు కూడా ఎదురుగా నిర్విరామంగా అలలతో హోరుపెట్టే విశాలమైన సముద్రం.

ఆ సంవత్సరం బోటనీ ఆనర్సులో 5 గురు విద్యార్థులు చేరారు. సాధారణంగా అంతకంటే తక్కువ ఉండేవారు. ఆ రోజుల్లో దక్షిణ భారతదేశం మొత్తంమీద బోటనీ ఆనర్సు తరగతులు బోధించే కళాశాల అది ఒక్కటే. ఈ ఆనర్సు పరీక్ష ప్యాసైతే ఒక సంవత్సరం తర్వాత యూనివర్శిటీవారు ఎం.ఏ. పట్టం ఇచ్చేస్తారు. ఆ సంవత్సరం చేరిన 5గురులో గోరా ఒక్కరే ఆంధ్రులు. మిగిలిన నలుగురూ తమిళులు. తమాషాగా మిగిలిన నలుగురూ వృక్షశాస్త్రంతో పాటు రెండవ విషయంగా భూగర్భశాస్త్రం (జియాలజీ) తీసుకోగా, గోరా ఒక్కరే రెండవ విషయంగా జంతుశాస్త్రం (జూఆలజీ) తీసుకున్నారు. ఆ రోజులలో జంతుశాస్త్రం తీసుకునే విద్యార్థులు చాలా అరుదుగా ఉండేవారు. గోరాకి కొన్ని సంవత్సరాల ముందు, కొన్ని సంవత్సరాల తర్వాత వరకూ వృక్షశాస్త్రంతో పాటు రెండవ విషయంగా జంతుశాస్త్రాన్ని ఎవరూ తీసుకోలేదు. గోరా కాలేజీలో ఆదర్శ ఉపాధ్యాయుడుగా ఉండిన శ్రీ ఆర్. వి. శేషయ్య గారు జంతుశాస్త్రంలో ఎం.ఏ. పట్టం తీసుకున్నారు. కనుక గోరాకి తన రెండవ విషయంగా జంతుశాస్త్రాన్ని ఎన్నుకొనుటలో శేషయ్యగారి ప్రభావం ఉందని చెప్పవచ్చు.

గోరా బోటనీ ప్రొఫెసర్ శ్రీ పార్థసారథి అయ్యంగార్ తన విద్యార్థులను కన్నబిడ్డలుగా చూచుకునేవారు. పాఠాలు చెప్పడంలోనూ గొప్ప దిట్టగా పేరుపొందారు. పార్థసారథి అయ్యంగారి సాన్నిధ్యంలో గోరా మద్రాసు విద్యార్థి జీవితం 3 సంవత్సరాలూ అతి సరళంగా గడిచిపోయింది.

విద్యార్థిగా గోరా చాలా బిడియపడేవారు. మితభాషి, పితృభక్తి, గురుభక్తి మెండు. మతసాంప్రదాయానికి భిన్నంగా పోయేవారు కాదు. పిలక, బొట్టు కూడా ఉండేవి. తండ్రి మంత్రించి ఇచ్చిన వీభూతిపొట్లం ఎప్పుడూ జేబులో ఉండేది. తన చదువు తప్ప ఇతర విషయాలు ఎక్కువ పట్టించుకునేవారు కాదు.

1925వ సంవత్సరంలో ఫైనల్ పరీక్ష జరిగింది. గోరా జట్టులోని ఐదుగురూ ప్యాసైనారు. గోరా తనకు మంచి మార్కులు రాగలవని ఆశించారు. కాని తీరా ఫలితాలు వస్తే 5 గురిలోనూ చివరివానిగా గోరా ప్యాసైనారు. మొదట్లో ఈ ఫలితం గోరాని కొంత కృంగదీసింది.

సరిగ్గా ఆ రోజుల్లోనే గోరా తండ్రి కొన్ని కేసులలోపడి ఆస్తినంతనూ పోగొట్టుకున్నారు. ఇల్లు, పొలం అన్నీ పోయాయి. ఇది గోరాను మరీ కలవరపరిచింది. రీసెర్చి చేద్దామని లోపల ఎంత కోర్కె వున్నా, కాశీ విశ్వవిద్యాలయానికి వెళితే వచ్చే స్కాలర్‌షిప్ చాలదు. తండ్రి తనకు ప్రత్యేకంగా డబ్బు పంపే స్థితిలో లేరు. ఇవన్నీ ఆలోచించి ఉద్యోగంలో ప్రవేశిద్దామనుకున్నారు. వెంటనే తన ప్రొఫెసరు అయిన పార్థసారధి అయ్యంగారి వద్దకు వెళ్ళి తనకు ఏదైనా ఉద్యోగం ఇప్పించమన్నారు. 'నువ్వు చివరి వానిగా ప్యాస్ అయ్యావు. కనుక చివరనే నీకు ఉద్యోగం వస్తుంది" అని జవాబు చెప్పారు.

గోరా ఓర్మికి ఇది పరీక్షగా తయారైంది. నిరాశ చెందే బదులు ఆయనలో పట్టుదల పెరిగింది. జీవితంలో నేను విజయవంతుణ్ణి కావాలి. సాధించి తీరాలి అనే పట్టుదల ఆయనలో పెరిగింది. వెంటనే తిరుపతిలో వున్న తన గురువు ఆర్.వి. శేషయ్య గారి వద్దకు వెళ్ళారు. శేషయ్య గారు ఆ రోజుల్లో తిరుపతిలో జంతుశాస్త్రంలో ప్రయోగాలు చేస్తూ ఉండేవారు. తన భవిష్యత్తు నిర్ణయమయ్యే వరకూ శేషయ్య గారి వద్దనే ఉండాలని నిశ్చయించుకుని గోరా ఆయనకు పనిలో సహాయం చేయనారంభించారు.



# ఉపాధ్యాయ వృత్తి ప్రారంభం జీవితంలో తొలి అనుభవాలు

**1925** జూలైలో గోరా శేషయ్య గారి వద్దకు తిరుపతి వెళ్ళారు. ఆరువారాలు కూడా పూర్తికాకుండానే పార్థసారధి అయ్యంగారి నుండి గోరాకు ఉత్తరం వచ్చింది. మధుర అమెరికన్ వాడు. ఉపాధ్యాయవర్గంలో గోరా ఒక్కడే ఆంధ్రుడు. క్లాసులోకి కాలేజీలో "నాచురల్ సైన్సు" లెక్చరర్ ఉద్యోగానికి వెళతావా అని అడిగారు. ఎక్కడ కాకినాడ, ఎక్కడ మధుర! ఆ రోజుల్లో మద్రాసు వారే మధుర ఉద్యోగానికి వెళ్ళడమంటే దూరంగా భావించేవారు. అయినా జీవితంలో నెగ్గితీరాలి అనే పట్టుదలతో సరికొత్త మనిషిగా తయారైన గోరా ఆ ఉద్యోగానికి వెంటనే అంగీకరించారు. పరీక్షలో చివరివాడుగా ప్యాసైనప్పటికీ మిగిలిన నలుగురూ వేరు వేరు కారణాల వల్ల ఆ ఉద్యోగానికి అంగీకరించకపోవుటతో గోరాకే తొలిగా ఉద్యోగం లభించింది.

మధుర ఉద్యోగం అయితే వచ్చింది. కాని లెక్చరర్‌గా క్లాసుకు వెళ్ళాలంటే రెండు జతల సూట్లు అయినా కావాలి. ప్రయాణపు ఖర్చులు, వెళ్ళగానే ఒక నెలవరకూ భోజనం ఇత్యాది ఖర్చులు భరించాలి గదా. ఆలోచనలో పడ్డారు గోరా. నీకేం భయంలేదు నేను ఉన్నాను గదా అన్నారు శేషయ్యగారు. తనవద్ద కూడా డబ్బు లేదు. శిష్యుడు వెంటనే వెళ్ళి ఉద్యోగంలో చేరాలి. అందుచేత శేషయ్యగారు కోఆపరేటివ్ బ్యాంకులో వందరూపాయలు అప్పు తీసుకువచ్చి యిచ్చారు. ఉద్యోగంలో చేరిన వెంటనే

ఆ అప్పును గోరా తీర్చివేశారు. గోరాగారు సూట్లు కుట్టించారు. సూటు వేయడం అదే ప్రథమం. ఎందుకంటే విద్యార్థిగా ఆయన పంచె కట్టేవారు.

చివరకు మధుర చేరారు. ఉపాధ్యాయుడుగా తొలి అనుభవం. అది అమెరికన్ మిషన్ కాలేజి. అమెరికా దేశస్తుడు రెవరెండ్ డబ్ల్యు. డబ్ల్యు. వాలెస్ ప్రిన్సిపాలు. వయస్సు మళ్ళిన వ్యక్తి. వెళితే తనకంటే పెద్దవారు విద్యార్థులుగా ఉన్నారు. అయినప్పటికీ అతి త్వరలోనే తోటి ఉపాధ్యాయ వర్గంలో మంచి మిత్రుడు అనీ, విద్యార్థులలో సమర్థుడైన ఉపాధ్యాయుడనీ పేరుపొందారు.

మధుర పుణ్యక్షేత్రం అవడంచేత ఆ రోజుల్లో ఇండ్లకొరత ఎక్కువ ఉండేది. ఎంత వెతికినా ఇల్లు దొరకలేదు. ఊరిబయట స్మశానం ప్రక్క ఒక పెద్ద ఇల్లు ఉందనీ, అయితే అది దెయ్యాల ఇల్లు అనీ స్థానికులు అన్నారు. జీవితంలో నెగ్గి తీరాలనే పట్టుదల ప్రవేశించిన గోరాలో హేతువాదం ఉదయించింది. దేనినైనా మూఢంగా ఎందుకు నమ్మాలి? దెయ్యాలు నిజంగా ఉన్నాయా? ఉంటే అవి ఏమిటి? అసలు ఇంతవరకూ దెయ్యాలను చూచి నిర్ధారణగా ఇదమిద్ధమని చెప్పినవారు ఎవరూ లేరేమి? ఏ విషయమైనా నిర్ధారణ చేసుకోవడం మంచిదిగదా? ఇలా ఆలోచిస్తూ నెలకు 20 రూపాయలు అద్దె ఇస్తానన్నా గది దొరక్కపోవుటచేత చివరకు మొండిగా ఆ దెయ్యాల ఇంటి సంగతే తేల్చుకుందామనుకున్నారు. కాలేజీ మిత్రులు వద్దు, వద్దు అని చాలా గోల పెట్టారు. అయినా గోరా ఖాతరు చేయలేదు.

ఇంటి యజమాని వద్దకు వెళితే ఆశ్చర్యమే. 2 సంవత్సరాలకు పైగా ఆ ఇంటివైపు ఎవరూ కనీసం తొంగి అయినా చూడలేదు. ఏమైతేనేం! 2 సంవత్సరాలుగా దెయ్యాల కొంప అని పాడుబడిన తన ఇంట్లో ఎవడో ఒక మొండివాడు వచ్చి దిగుతానంటున్నాడు. ఎవరో ఒకరు ముందు దిగితే దెయ్యాల కొంప అనే పేరు పోతుంది గదా అని సంతోషించాడు ఇంటి యజమాని. గదికి నెలకు పన్నెండణాల చొప్పున రెండు గదులకు రూపాయిన్నర అద్దెగా నిర్ణయించారు. నెలకు పన్నెండణాలు అనేది కాలేజీ హాస్టలులో గదికి తీసుకునే అద్దె.

ఇల్లు తాళం తీసుకుని గోరా రెండు గదులు దులిపి కడిగించారు. రెండు సంవత్సరాల నుంచి పాడుబడి ఉందేమో బోలెడంత దుమ్మురాలింది. ఆ దుమ్ముతోబాటే దెయ్యాల మూఢనమ్మకం కూడా రాలిపోయింది! ఆ ఇంట గోరా దిగిన నాటి

సాయంత్రం ఆయనతోపాటు ఇంట్లోకి వెళ్ళుటకు తోటివారెవరూ సాహసించలేకపోయారు. ఆ రాత్రికి దెయ్యాలు గోరాని సజీవంగా మిగలనివ్వవని మిత్రులు ఎంతో భయపడ్డారు. మర్నాడు తెల్లవారింది. గోరా చిరునవ్వుతో మామూలుగా అందరికీ కనబడ్డారు. ఒకరోజు, రెండురోజులు, వారంరోజులు గడిచాయి. ఏ దెయ్యమూ రాలేదు. అద్దె హెచ్చు ఇవ్వనక్కరలేదుగాని మిగిలిన గదులన్నీ, మొత్తం ఇల్లు వాడుకోమన్నాడు ఇంటి యజమాని. పదమూడు గదులున్న ఆ ఇంటినంతనూ గోరా ఒక్కరే వాడుకోవడం ప్రారంభించారు. మొదట్లో నెలకు 20 రూపాయలు ఇస్తానన్నా ఇల్లు దొరకలేదు. అదే, మూఢనమ్మకాలను తొలగించుకునే సరికి నెలకు రూపాయన్నర మాత్రమే యిచ్చి మధురలో ఉన్న సంవత్సరకాలమూ పెద్ద ఇల్లు అనుభవించారు. ఈ సంఘటన వల్ల గోరాలో ఆత్మవిశ్వాసం పెరిగింది. తోటివారికి గోరా అంటే వీరపూజభావం ఏర్పడింది.

గోరాను గొప్ప గురువుగా నిరూపించిన ఘటన కూడా మధురలోనే జరిగింది. యూనివర్శిటీ పరీక్షలకు ముందు కాలేజీ పరీక్షలు జరుగుతాయి. వీటిని సెలక్షన్ ఎగ్జామినేషన్స్ అంటారు. ఇందులో ప్యాసైతేనే పబ్లిక్ పరీక్షకు పంపుతారు. ప్రతీవిషయం లోను ప్రతిక్లాసులోను ఇలాంటి పరీక్షలు జరగడం, కొందరే ప్యాసు కావడం, కొందరు తప్పడం, ప్యాసైన వారు మాత్రమే పబ్లిక్ పరీక్షలో కూర్చోవడం ఆ రోజుల్లో మామూలు.

గోరా మధురలో ఒక విచిత్రమైన పనిచేశారు. తన విషయమైన జీవశాస్త్రంలో సెలక్షను పరీక్ష వ్రాసిన అందర్నీ ప్యాసు చేశారు. అంటే అందరికీ పబ్లిక్ పరీక్షలో కూర్చునే అర్హత కల్పించారు. ఫలితం ప్రకటింపబడుటకు ముందు ప్రిన్సిపాలు వద్దకు వెళ్ళింది. అది చూచి ప్రిన్సిపాలు గోరాను పిచ్చి ఆదర్శవాది అని అనుకొని నవ్వుకున్నాడు. గోరాను పిలిపించి, నీకు అనుభవం లేదు - ఇలా చదివినవాడినీ చదవనివాడినీ అందర్నీ ప్యాసు చేయకూడదనీ, ఫలితాలు తిరిగి సరిచూడమనీ కోరారు. కానీ గోరా అందుకు అంగీకరించక నిర్భయంగా "విద్యార్థులకు పాఠాలు నేను చెప్పాను. ప్రశ్నల పత్రం నేను కూర్చి ఇచ్చాను. పరీక్ష పేపర్లు నేను దిద్దాను. కనుక అందరూ పబ్లిక్ పరీక్షకు అర్హులనే నా అభిప్రాయం" అన్నారు. గోరా మొండిధైర్యాన్నీ, ఆదర్శవాదాన్నీ చూచి విస్తుపోయాడు శ్వేతజాతీయుడైన ప్రిన్సిపాల్ వాలెస్. "నువ్వు యువకుడివి. ఉపాధ్యాయవృత్తికి కొత్తవాడివి. అయినా ఈ సంవత్సరం నీ మాటను

ఆమోదిస్తాను. ఈ విధంగా మనకు ఇంతవరకూ జీవశాస్త్రంలో వస్తున్న ఉత్తీర్ణుల శాతాన్ని నువ్వు నిలపగలిగితే సంతోషం. అలా కాకపోతే పైసంవత్సరం నుంచి పాత విధానాన్నే అనుసరించాలి." అన్నారు ప్రిన్సిపాల్. విజయోత్సాహంతో గోరా ఆనందపడ్డారు.

విద్యార్థులకు ఫలితాలు చెప్పి "నా పని నేను చేశాను. ఇక మీ పని మీరు చెయ్యాలి." అన్నారు గోరా. ఇక పరీక్షలకు మిగిలి ఉన్న కొద్దిరోజులలోనూ విద్యార్థులు ఉత్సాహంతో, పట్టుదలతో చదివారు. కొత్త ఉపాధ్యాయుని యెడల విద్యార్థులకు గౌరవం అధికమైంది. జీవశాస్త్రంలో విద్యార్థులందరూ పబ్లిక్ పరీక్షకు కూర్చున్నారు. ఆశ్చర్యజనకమైన ఫలితాలు. 78 మంది విద్యార్థులలో 14 మంది ఫస్టుక్లాసులో ప్యాసైనారు. ప్రతీ సంవత్సరం వచ్చే శాతానికి దాదాపు రెట్టింపు శాతంలో విద్యార్థులు ప్యాసైనారు. ఎన్నో డిస్టింక్షన్స్ వచ్చాయి. తన బోధనా విధానం మీద, విద్యార్థుల మీద గోరాకు అచంచల విశ్వాసం. ఫలితాలు ఈ విషయాన్ని రుజువు చేశాయి. తొలి ప్రయత్నంలోనే గోరా అఖండ విజయం సాధించారు. తలనెరిసిన ప్రిన్సిపాల్ యూనివర్శిటీ నుంచి కొత్తగా ప్యాసై వచ్చిన ఉపాధ్యాయుణ్ణి హృదయ పూర్వకంగా అభినందించారు.

గోరా సాధించిన ఈ విజయం కొత్త సమస్యను తెచ్చి పెట్టింది. గోరా ప్రతిభను గుర్తించిన కాలేజీ అధికారులు ఆయనను క్రైస్తవ మతం స్వీకరించమని వత్తిడి చేశారు. అయితే అప్పటివరకూ గోరా తనను తాను హిందువుడనుకునేవారు. అందుచేత క్రైస్తవ మతంలో చేరితే తమ ఖర్చులమీద అమెరికా పంపి డాక్టరేటు చేయిస్తామనీ, తిరిగి రాగానే పెద్ద జీతమిస్తామనీ చూపిన ఆశ కూడా పనిచేయలేదు. తాను నమ్మిన దానికి నిలబడదలుచుకున్న వ్యక్తిని ఏ ఆశలు లోబర్చుకోగలుగుతాయి?

ఇక ఆ కాలేజీలో ఉండుటకు మనస్కరించక ఉద్యోగానికి 1926లో రాజీనామా యిచ్చారు. పదినెలలే ఉన్నా మధుర ఉద్యోగం జీవితంలో కల్పించిన తొలిఅనుభవాలు గోరా గారి భావిజీవితానికి బాటను సుగమం చేశాయి.

మధురలో రాజీనామా చేయగానే వెంటనే కోయంబత్తూరులోని వ్యవసాయ కళాశాలలో కాటన్ రీసెర్చి అసిస్టెంటు ఉద్యోగం లభించింది. అది గవర్నమెంటు సర్వీసు. మధురలో ఒంటరిగా ఉన్నారుగాని కోయంబత్తూరు రాగానే భార్యను తీసుకువచ్చి కాపురం పెట్టారు.

ఉద్యోగంలో చాలా తీరిక ఉండేది. మధురలో తనను క్రైస్తవ మతంలో చేరమన్నప్పటి నుంచీ తన మతమగు హిందూమతం గురించీ క్రైస్తవమతం గురించి బాగా అధ్యయనం చేసి పోల్చి చూడాలనే కోరిక కలిగింది. కోయంబత్తూరులో అందుకు అవకాశం కలిగింది. వేదాలు, ఉపనిషత్తులు, భగవద్గీత, ద్వైతాద్వైతాలు, బైబిలు, కురాను అధ్యయనం చేశారు. దీనితో గోరాలో మతతత్వంపై నమ్మకం సడలిపోతూ మానవత్వంలో విశ్వాసం పెరగనారంభించింది. కొత్తగా కాపురానికి వచ్చిన భార్య సరస్వతికి తన భావాలు చెప్పసాగారు.

గవర్నమెంటు సర్వీసులోని చాలామంది అనుభవాలు చూడగా అందు స్వేచ్ఛకు తావులేదనిపించింది. స్వతంత్ర భావాలు గల గోరా తనకు ప్రభుత్వోద్యోగం పరిపడదని నిర్ణయించుకుని ఒక సంవత్సరం కాగానే 1927లో కోయంబత్తూరు ఉద్యోగానికి రాజీనామా యిచ్చారు. పైకి వెళ్ళుటకు అవకాశాలున్న ప్రభుత్వోద్యోగానికి రాజీనామా ఇచ్చారంటే తల్లిదండ్రులకు కోపం వచ్చింది. అత్తవారికి కష్టం కలిగింది. ప్రభుత్వోద్యోగం అయితే వృద్ధాప్యంలో పింఛను పుచ్చుకుంటూ ఉండ వచ్చునని చాలామంది ప్రభుత్వోద్యోగం కొరకు ఎంతో తాపత్రయ పడతారు. అలాంటిది ముందు ఎప్పుడైనా తన స్వతంత్రభావాలకు అడ్డు తగలవచ్చునని ఇప్పుడే ప్రభుత్వోద్యోగానికి రాజీనామాను ఇచ్చారంటే గోరా ప్రొఫెసరుకి కూడా కష్టం కలిగింది. ఈ రాజీనామాను ఎవరూ హర్షించలేకపోయారు. అయినా గోరా సడల లేదు.



# కొలంబో ఉద్యోగం : జిజ్ఞాస - అన్వేషణ

కోయంబత్తూరు ఉద్యోగానికి రాజీనామా చేసి గోరా సకుటుంబంగా కాకినాడ తిరిగి వచ్చేశారు. సరస్వతిగార్ని పుట్టింటికి పంపి ముందు ఏమి చేద్దామా అని ఆలోచిస్తున్నారు. 1927 జూన్ నెలలో అత్తగారింటికి విజయనగరం వెళ్ళారు. వెళ్ళిన మూడు - నాలుగు రోజులకే గోరా ప్రొఫెసరు పార్థసారథి అయ్యంగారి నుంచి టెలిగ్రాం వచ్చింది. కొలంబో ఆనందా కాలేజీవారికి బయాలజీ లెక్చరరు కావాలనీ, వెంటనే బయలుదేరి వెళ్ళమనీను. సాహసంతో ముందుకు త్రోసుకువెళ్ళే గోరాకు సంతోషం కలిగింది. దూరప్రాంతానికి, దేశంకాని దేశానికి వెళుతున్నారని బంధువులకు కష్టం కలిగినా గోరా కొలంబో వెళ్లుటకు నిశ్చయించుకున్నారు. అప్పటికే దూరప్రదేశమగు కోయంబత్తూరులో ఒక సంవత్సరం ఉండి వచ్చుట చేత సరస్వతి గారు కూడా అభ్యంతరం చెప్పలేదు. వెంటనే గోరా కొలంబోకు ప్రయాణం కట్టారు.

దారిలో మద్రాసులో ఆగి తన ప్రొఫెసరు శ్రీ పార్థసారథి అయ్యంగారిని గోరా కలుసుకున్నప్పుడు "నువ్వు మొండివాడివి. ఎంత దూరదేశమైనా జయించుకుని రాగలవు. అందుకే నిన్న కొలంబో పంపుతున్నాను. సుఖంగా వెళ్ళి యశస్సుతో తిరిగిరా." అని ఆశీర్వదించారు.

కొలంబో వెళ్లగానే అంతా కొత్త వాతావరణం. ఆనందా కాలేజీ బౌద్ధమిషన్ వారిచే నడుపబడుతూంది. ఆ రోజుల్లో సింహళంలో పెద్ద విద్యావేత్తగా ఖ్యాతిగాంచిన పాట్రిక్ డిసిల్వా కులరత్న ఆ కాలేజీ ప్రిన్సిపాలు. లండన్ మెట్రిక్, లండన్ ఇంటరు, కేంబ్రిడ్జి సీనియర్ పరీక్షలకు ఆ కాలేజీలో తర్ఫీదు ఇచ్చేవారు. సింహళానికి ఆ కాలంలో

ప్రత్యేక విశ్వవిద్యాలయం లేదు. ఉపాధ్యాయునిగా గోరా సమర్థతను తెలుసుకున్న ఆనందా కాలేజీ నిర్వాహకులు, అధ్యాపకులు తమందరిలోకి చిన్నవాడైనా గోరా యెడల ప్రత్యేక అభిమానం, గౌరవం చూపేవారు. గోరా వారందరితో ఒక సోదరునిగా, ఆత్మీయునిగా కలిసిపోయారు.

సింహళంలో ఎక్కడో చెదురుగా తప్ప అందరూ మాంసాహారులే. బౌద్ధులు తామై జంతువులను చంపరుగాని ఇతరులు చంపగా ఆ మాంసాన్ని వాడుతారు. ఇది బౌద్ధులలో విచిత్రమైన అహింసా మనస్తత్వం. అందరూ మాంసాహారులే అవడంతో గోరాకు ఆహారం పెద్ద సమస్యగా తయారైంది. కొలంబో పట్టణం అంతటికీ ఆ రోజుల్లో శాకాహార హోటలు ఒక్కటే ఉండేది. గోరా కొలంబో వెళ్ళిన 2 నెలలకు గాని సరస్వతిగారు వెళ్ళలేదు. ఈ 2 నెలలూ 5, 6 మైళ్ళు దూరం రెండుపూట్లా వెళ్ళి భోజనం చేసి రావలసి వచ్చేది.

సింహళంలో బౌద్ధమతం బాగా ప్రచారంలో ఉండటం వల్లనూ, ఆనందా కాలేజీ బౌద్ధులు నడిపే కాలేజీ కావడంతోనూ కొలంబోలో గోరాకి బౌద్ధ ధర్మ శాస్త్రాలు అధ్యయన చేయుటకు అవకాశం కలిగింది. అంతే కాకుండా కొలంబోలో గోరా అద్దెకున్నది మహమ్మదీయుని ఇంట్లో. మిత్రులుగా చాలామంది క్రైస్తవులున్నారు. ఈ విధంగా మత గ్రంధాలు తాత్వికంగా అధ్యయనం చేయడమేగాక, ప్రత్యక్ష జీవితంలో వివిధ మతస్థుల ఆచార వ్యవహారాలు చూచుటకు కూడా అవకాశం కలిగింది. ఇది గోరాలో కొత్త జిజ్ఞాసను, అన్వేషణను రేకెత్తించింది.

దేవుడు ఒక్కడే అయితే, మానవులందరూ దేవుని బిడ్డలే అయితే ఇన్ని మతాలెందకు? వీటిమధ్య ఇంత హింసాకాండ ఎందుకు? ప్రతి మతస్థులు తమ దేవుని నమ్మితేనే మోక్షం, ఇతర దేవుళ్ళను నమ్మడం దైవ ద్రోహం అని కత్తులు నూరడమేమిటి? హిందువులు కర్మసిద్ధాంతం, జన్మపరంపరలో నమ్మితే, క్రైస్తవులు, మహమ్మదీయులు పునర్జన్మను నమ్మరే? ఏదైనా యదార్థమైతే, సత్యమైతే అందరికీ ఉండాలి. అంతేగాని కొందరికి ఉండి, కొందరికి ఉండకపోవడమేమిటి? నేడు హిందువైతే పునర్జన్మలో నమ్మడం, అదే వ్యక్తి రేపు క్రైస్తవునిగానో, మహమ్మదీయుని గానో మారితే పునర్జన్మను నమ్మకపోవడమేమి? మతం మారితే నిప్పుకాలడంలో మార్పు వస్తుందా? దేవుడు సర్వశక్తిమంతుడు, దయామయుడు అయితే ప్రపంచంలో ఇన్ని కష్టాలు, బాధలు ఎందుకు ఉన్నాయి? అంటే దేవుడు దయామయుడైనా కాకుండా పోవాలి, లేదా సర్వశక్తిమంతుడైనా కాకుండా పోవాలి. అంతా దైవేచ్ఛ అయితే మానవునికి స్వేచ్ఛ లేదా? మానవునికి స్వేచ్ఛ లేకపోతే తన ప్రవర్తనకు తాను బాధ్యుడు

కాదుగదా ! వ్యక్తికి బాధ్యత లేకపోతే నీతికి స్థానమేది? దైవేచ్ఛా ఉంది, వ్యక్తికి స్వేచ్ఛా ఉంది అంటే ఎంత వరకు దైవేచ్ఛ ఎక్కడి నుంచి వ్యక్తి స్వేచ్ఛ? ఈ రెంటినీ తెలిపే హద్దు ఏది? లౌకికం వేరు పారలౌకికం వేరు అంటే మాటకు చేతకు సంబంధం ఉండనక్కరలేదా? ఇలా గోరాలో ఎన్నో ప్రశ్నలు ఉదయించాయి. తనలో తాను తర్కించుకుంటున్న కొద్దీ కొత్త ఆలోచనలు వచ్చాయి. దైవం అబద్ధం, అది కేవలం మానవ కల్పితం, దైవం ఊహ కనుకనే వేరువేరు సందర్భాలలో వేరు వేరు గుణాలు – పరస్పరం విరుద్ధమైన గుణాలు–అపాదించబడ్డాయి. రకరకాల కల్పనలు చేయబడ్డాయి. కల్పనమీద ఆధారపడిన మతనమ్మకాలు యదార్థంతో సంబంధం లేకుండా మూఢ నమ్మకాలుగా తయారైనాయి. ఏమైనా, మానవులందర్నీ సమానంగా గౌరవించాలి. అందరికీ సమానంగా అవకాశాలు కావాలి. ఈ విధంగా గోరా ఆలోచనలు ముందుకు సాగాయి.

గోరా దంపతులు కొలంబోలో ఉండగానే ఒకసారి చంద్రగ్రహణం వచ్చింది. అప్పుడు సరస్వతిగారికి నాలుగో నెల గర్భిణి. హిందువులలో గ్రహణం అంటే రాహు కేతువులు చంద్రుణ్ణి, సూర్యుణ్ణి తినేస్తున్నాయని నమ్మకం. అందుచేత రాహుకేతువుల బారినుండి చంద్రుణ్ణి, సూర్యుణ్ణి రక్షించమని స్నానాలుచేసి ప్రార్థిస్తారు. రాహు కేతువులు విజృంభించడం దుర్ముహూర్తము కనుక ఆ సమయంలో గర్భిణి స్త్రీలు బయటకు రారాదనీ, ఏ పనీ చేయరాదనీ, తిరగరాదని, పడుకునే ఉండాలని హిందువుల ఆచారం. అలాకాక గ్రహణసమయంలో బయటకువచ్చి తిరిగినా, ఏ పని చేసినా కడుపులోని బిడ్డకు మొర్రి వస్తుందని ఒక మూఢ నమ్మకం. ఈ నమ్మకం ఒక్క హిందువులలోనే తప్ప ఇతరులలో లేదు. ఇతర మతాలకు చెందిన స్త్రీలు గ్రహణసమయంలో గర్భిణీస్త్రీలు బయట తిరిగినందుకు, పనులు చేసినందున అండంలోని బిడ్డలకు మొర్రివస్తే, హిందువులు–మహమ్మదీయులు క్రైస్తవులు–బౌద్ధులు అనే తేడా లేకుండా ఎవరు తిరిగినా రావాలి. మరి ప్రపంచంలో హిందూయేతర గర్భిణీస్త్రీలు గ్రహణ సమయాల్లో కూడా తమ పనులు చేసుకుంటున్నారు. వారికి పిల్లలు పుదుతున్నారు. మొర్రెలు రావడంలేదే? అసలు గ్రహణం అనేది రాహుకేతువులు సూర్యచంద్రలను తినడమూకాదు. ఏమీకాదు. భూమిచుట్టూ చంద్రుడు, సూర్యుని చుట్టూ చంద్రుని సమేతంగా భూమీ తిరుగుతున్నప్పుడు చంద్రునికి సూర్యునికి మధ్య భూమి అడ్డమైననప్పుడు చంద్రగ్రహణం అయింది. భూమికి సూర్యునికి మధ్య చంద్రుడు అడ్డం వస్తే సూర్యగ్రహణం అయింది. ఒక పక్క శాస్త్రీయ విజ్ఞాన దృష్ట్యా గ్రహణాలను అర్థ చేసుకున్నా మరో ప్రక్క రాహు కేతువులు సూర్యచంద్రులను మ్రింగుతున్నారనీ, ఆ సమయంలో గర్భిణీ స్త్రీలు బయట

తిరగరాదనీ నమ్మడం మూఢనమ్మకం కాక మరేమిటి? తెలిసిన విజ్ఞానాన్ని ఆచరణలో పెట్టి మూఢనమ్మకాలను పారద్రోలాలి. అప్పుడే మనలో నిజాయితీ ఉంటుంది. జీవితం సుఖంగా ఉంటుంది. మన ఈ నిజాయితీయే కొరవడింది. గ్రహణం ఎందుకు వస్తుందో శాస్త్రీయ దృష్ట్యా పిల్లలకు సోదాహరణంగా బోధించిన సైన్సు మాష్టారు తీరా గ్రహణం సమయంలో స్నానంచేసి రాహుకేతువుల బారినుండి సూర్యచంద్రులను రక్షించమని ప్రార్థించే దేశం మనది. విజ్ఞానానికి ఆచరణకూ ఎక్కడా లంకె కుదరని సమాజం మనది. అందుకే ఇంతగా విజ్ఞానం పెరిగినా, ఇంత మంది చదువుకున్న వాళ్ళు ఉన్నా మూఢనమ్మకాలు రాజ్యం చేస్తున్నాయి నేటికీ కూడా.

తన ఆలోచనలను, జ్ఞానాన్ని ఆచరణలోనికి తీసుకొని రావాలనే గోరా వెంటనే ఈ విషయం సరస్వతితో సంప్రదించారు. సరస్వతి ధైర్యంగా ముందుకు వచ్చి మూఢనమ్మకాలను ఛేదించుటకు పూనుకున్నారు. నాలుగోనెల గర్భిణిలో ఉంటూ చంద్రగ్రహణ సమయంలో రాత్రి మామూలుగా రోడ్డుమీద బయట షికారుకు వెళ్ళారు. గోరాతో, గ్రహణాన్ని చూశారు. ఆపిల్ పళ్ళూ అవీ ఆ సమయంలో కోసితిన్నారు. ఆ తర్వాత పుట్టిన అమ్మాయి మనోరమకు ఏ మొర్రీ లేదు. ముందు ఈ విషయం బంధువులకు వ్రాస్తే వారంతా కంగారుపడి "తొలి సంతానం, అఘాయిత్యపు పనులకు ఒడిగట్టారు. ఎలా ఉంటుందో ఏమిటో" నని అనుకున్నారు. తీరా బిడ్డ పుట్టిన తర్వాత అందరూ ఏమీ అనలేక ముక్కుమీద వ్రేలు వేసుకున్నారు. ఈ సంఘటన సరస్వతి గారిలో యదార్థ దృష్టిని, చైతన్యాన్ని పటిష్టం చేసింది. గోరా సరస్వతి గార్లకు 9 మంది సంతానం. కనుక సరస్వతి గారు గర్భిణిగా ఉన్నప్పుడు వేరు వేరు నెలలో వేరు వేరు గ్రహణాలు వచ్చాయి. అన్ని సందర్భాలలోనూ ఆమె మామూలుగా పనులు చేసుకుంటూ ఇరుగుపొరుగు గర్భిణీలు బయటకు రారాదనీ, అలా వస్తే సంతానం సక్రమంగా ఉండదనీ వ్యాపించిన మూఢనమ్మకాన్ని పటాపంచలు చేశారు. ఈ విధంగా మూఢనమ్మకాలను తానే కాక తన కుటుంబం కూడా ఎదిరించేటట్లు చేయటం గోరా కొలంబోలోనే ప్రారంభించారు.

కొలంబోలో ఆనందా కాలేజీలో గోరా విద్యార్థులకు వృక్షశాస్త్రం, శరీరశాస్త్రం, ఆరోగ్యశాస్త్రం బోధించేవారు. శరీరశాస్త్రం బోధించేటప్పుడు హృదయస్పందన చూపుటకు కప్పకు క్లోరోఫారం యిచ్చి కోసి హృదయం స్పందన చూపుట సర్వసాధారణం. అలాగే ఆనందా కాలేజీలో విద్యార్థులకు చూపుదామని ఒకరోజు గోరా కప్పను తీసుకుని వెళ్ళారు. యింకేముంది! కాలేజీ అంతా పెద్ద సంచలనం. "అహింసా పరమో ధర్మః" అని బుద్ధుడు బోధించాడు. అలాంటి బౌద్ధమిషన్ నడిపే

కాలేజీలో కప్పను చంపడం హింస, మహాపరాధం" అంటూ గగ్గోలు పెట్టారు. ఈ విషయం తెలిసిన వెంటనే బౌద్ధసంఘం నిరసన తెలుపుతూ కాలేజీ అధికారుల వద్దకు ఒక ప్రతినిధి వర్గాన్ని పంపింది. ఆఖరికి గోరా కప్పను కోయటం ఆగిపోయింది. విద్యార్థులు ప్రత్యక్షంగా హృదయ స్పందన చూచుట జరగనేలేదు. బౌద్ధులు మాంసం తింటారు. కాని విద్యార్థులకు హృదయస్పందన పాఠం చెప్పేటప్పుడు కప్పను కోయనివ్వలేదు. అహింస ఎలా మూఢనమ్మకంగా మారిందో యిదొక ఉదాహరణ. గోరాకి ముందు ఎందరో ఆ కాలేజీలో శరీరశాస్త్రం బోధించారు కాని ఎవరూ ప్రత్యక్షంగా హృదయస్పందన చూపాలని ప్రయత్నించలేదు. గోరా ఈ విషయాన్ని ప్రిన్సిపాల్‌తో చర్చించారు. కాని ప్రిన్సిపాల్ మతనమ్మిక ముందు తన నిస్సహాయతను వెలిబుచ్చారు.

ఈ రోజుల్లో కొలంబోలో డాక్టర్ అసరప్పగారని, ఆరోగ్యశాఖలో ఉన్నత అధికారిగా ఉండేవారు. వారికి భారతీయులంటే చాలా ఇష్టము, అభిమానమూను. కొలంబోలోని భారతీయులందరూ అసరప్పగారి కుటుంబానికి పరిచితులయ్యేవారు. అసరప్పగారింట భారతీయుల సమావేశాలు జరుగుతూ ఉండేవి. గోరా దంపతులు కూడా అసరప్పగారికి పరిచయమయ్యారు. అసరప్పగారు వయస్సులో చాలా పెద్దవారు. అప్పుడు గోరా వయస్సు 25 సం॥లు, సరస్వతికి 16 సంవత్సరాలు. అందుచేత గోరా దంపతులు అసరప్పగారి కుటుంబానికి అతి సన్నిహితమగుటతో అసరప్పగారు వీరిద్దర్నీ తమ కూతురూఅల్లుడుగా చూచుకొనేవారు. గోరా ప్రధమ సంతనానికి మనోరమ అని పేరు పెట్టినది కూడా అసరప్పగారే. గోరా అభ్యుదయ భావాలను అసరప్పగారు హర్షించేవారు.

కొలంబోలో గోరాకి త్వరలోనే చాలామంది మిత్రులయ్యారు. వేరువేరు మతాలవారు, వేరు వేరు ఆచార వ్యవహారాలవారూను, వీరు దాదాపు అందరూ మాంసాహారులే. వారి ఇళ్ళల్లో విందులకు గోరా దంపతులను కూడా ఆహ్వానించేవారు. అక్కడ విందులంటే మాంసం తప్పనిసరి. గోరా దంపతులు శాఖాహారులు. ఆ విందులకు ఎలా వెళ్ళడం అనే ప్రశ్న ఎదురైంది. మిత్రులను వదులుకోవాలా? లేక అలవాట్లు మార్చుకోవాలా? మిత్రులను వదులుకోలేరు గదా, అయితే తాము మాంసాహారం తీసుకోము. ఇతరులు తమ ప్రక్కన కూర్చుని తీసుకుంటే తమకు అభ్యంతరం లేదు అని స్పష్టంగా చెప్పి వెళ్ళేవారు. గోరా దంపతులకు ప్రత్యేకంగా శాఖాహారం చేయించేవారు. అయితే గోరాలోని సమానతా దృష్టి తిరుగుబాటు చేసింది. జన్మతః శాఖాహారులని, జన్మతః మాంసాహారులని ఎందుకు ఉండాలి? ఆహార నియమాలలో నిర్బంధం ఉండరాదు. అది వ్యక్తిగత విషయం. ఎవరి ఇష్టమైన ఆహారం వారు

తీసుకోవచ్చు. కాని ఆహారనియమాలలో మూఢనమ్మకాన్ని ఛేదించాలి అని గోరా అనుకున్నాడు. అప్పుడు ఒక విందులో మాంసాహారం కొద్దిగా అడిగి తీసుకుని గోరా బహిరంగంగా తిన్నారు. జీవితంలో మాంసం భుజించడం గోరాకి అదే ప్రథమం. శాఖాహార భోజనం కొరకు 5,6, మైళ్ళు కూడా పోయిన గోరా మాంసం తిన్నారంటే మిత్రులందరూ ఆశ్చర్యపోయారు. అయితే గోరా మాంసం తిన్నది రుచికొరకు కాదు, ఇతరుల వత్తిడివల్ల అంత కంటే కాదు. ఆహారనియమాలలో మూఢనమ్మకాలు ఉండరాదనే సిద్ధాంతము కొరకు, అప్పుడు సరస్వతి తాను మాంసాహారం తీసుకొనకపోయినా, 12 సంవత్సరాల తర్వాత తన పిల్లలతో సహా అందరూ తమకు మాంసాహారం అంటే అసహ్యతలేదు అని తిని చూపించారు.

ప్రజలలో శాస్త్రీయ దృక్పథం పెరిగితేగాని మూఢనమ్మకాలు తొలగవు. కనుక ప్రజలకు వారి భాషలో, వారికి అందుబాటయ్యే శైలిలో విజ్ఞాన విషయాలు అందించాలని అప్పటినుంచే గోరాగారు ప్రయత్నం ప్రారంభించారు. ఆ రోజుల్లో విజయవాడ నుంచి శ్రీ విశ్వనాథ సత్యనారాయణ మరికొందరు కలిసి తెలుగులో "జయంతి" అనే సారస్వత వైజ్ఞానిక పత్రిక నడిపేవారు. ఆ పత్రికలో ప్రకృతి విజ్ఞానశాస్త్రం గురించి గోరా ఎక్కువగా వ్యాసాలు వ్రాశారు. ఈ విధంగా తెలుగులో విజ్ఞానశాస్త్రం గురించి ప్రారంభంలో వ్రాసిన కొద్దిమందిలో గోరా ఒకరు.

ఈ విధంగా 1927-28లో కొలంబో జీవితం గోరాలో నూతన జిజ్ఞాసకు, అన్వేషణకు నాంది అయింది. అయితే 1926లో ఆంధ్ర విశ్వవిద్యాలయం స్థాపింపబడుటతో 1928లో కాకినాడ కాలేజీలో బి.ఏ. వృక్షశాస్త్రం తరగతులు ప్రారంభించబడ్డాయి. (విజ్ఞాన శాస్త్ర విషయాల బి.ఏ. తరువాత బి.యస్.సి అయింది) కాకినాడ కాలేజీ ప్రిన్సిపాల్‌గా ఉన్న వేమూరు రామకృష్ణారావుగారు, దేశాంతరంలో కూడా ఖ్యాతినార్జించిన తన పాత విద్యార్థినే ఉపాధ్యాయునిగా ఆహ్వానించుటలో ఆశ్చర్యం ఏముంది? రామకృష్ణారావుగారు గోరాని కాకినాడ రమ్మని ఉత్తరం వ్రాశారు.

కొలంబో ఉద్యోగం గోరాకి నచ్చింది. తన భావాలకు అనుకూలమైన జీవితమూ కుదిరిందచట. జీతమూ హెచ్చుగానే ఉండేది. తాను పనిచేసిన సంవత్సరం సింహళ ద్వీపం అంతటా అంతకుముందు ఎప్పుడూ రానంత శాతం విద్యార్థులు విజయం సాధించారు. అంతకుముందు వృక్షశాస్త్రంలో 40% ఉంటే గోరాగారు బోధించగా 80%, అంతకుముందు శరీరశాస్త్రంలో, ఆరోగ్య శాస్త్రంలో 20% ఉంటే గోరా బోధించగా 69% విద్యార్థులు విజయమొందారు. అందుచేత ఆనందా కాలేజీవారు గోరాని వదులుకొనుటకు సహజంగానే ఇష్టపడలేదు.

గోరా, సరస్వతి వయస్సులో చిన్నవారు కనుక ఇంటిమీద బెంగ పెట్టుకున్నారేమోనని ప్రిన్సిపాల్ కులరత్న, ఆయన యూరోపియను భార్య ఇద్దరూ కలిసి గోరాదంపతులను లాలించి ఇంకా ఎక్కువ సదుపాయాలు కూడా ఇస్తామన్నారు. కాని తాము బెంగపెట్టుకొనుటకాదనీ, తనకు ఆనందాకాలేజీ చాలా నచ్చిందనీ, ఐతే తాను చదువుకున్న కళాశాలకే తనను పిలుస్తున్నారనీ, తాను విద్యార్థిగా రామకృష్ణారావుగారి వద్ద చదువుకున్నాననీ, ఇప్పుడు ఆయనవద్దే పనిచేసే అవకాశం రావడం తనకు గర్వకారణమనీ గోరా చెప్పారు. ఇక అప్పుడు వారేమి అనగలరు?

ఈ విధంగా ఒక సంవత్సరం కొలంబో జీవితంలో అనుభవాలను, ఎంతోమంది మిత్రుల ప్రేమాభిమానాలను, ఉపాధ్యాయవృత్తిలో గొప్ప విజయాలను వెంటతీసుకొని 1928లో గోరా కొలంబో నుంచి కాకినాడకు ప్రయాణమయ్యారు.



# మతంపై తిరుగుబాటు

**1928** జూన్ మాసాంతానికి గోరా కొలంబో నుంచి కాకినాడ వచ్చారు. తమ కుమారుడు తిరిగి తమవద్దకే వచ్చినందుకు తల్లిదండ్రులు, తమ కాలేజీ పూర్వవిద్యార్థే ఇప్పుడు ఆచార్యునిగా వచ్చినందుకు ప్రిన్సిపాలు, కాలేజీ అధికారులు సంతోషించారు. గోరాయే కాకుండా జర్మనీలో వృక్షశాస్త్రంలో డాక్టరేటు తీసుకొన్న ఉప్పల లక్ష్మణరావుగారు కూడా ఆ సంవత్సరమే కాకినాడ కాలేజీకి రావడం జరిగింది. ఇది కాకినాడ కాలేజీ గర్వించదగిన విషయం.

వృక్షశాస్త్రంలో మొట్టమొదట ఎం.ఏ.పట్టా తీసుకున్న ఆంధ్రులు, బందరు జాతీయ కళాశాల స్థాపకులు కీ.శే.శ్రీ కోపల్లె హనుమంతరావు. శ్రీ హనుమంతరావు తర్వాత సుమారు పాతిక సంవత్సరాల అనంతరం వృక్షశాస్త్రములో ఉన్నత విద్య నభ్యసించిన ఆంధ్రులు ఉప్పల లక్ష్మణరావు, గోరా. హనుమంతరావు, గోరా మద్రాసు ప్రెసిడెన్సీ కళాశాలలో చదివి ఎం.ఏ.పట్టా తీసుకోగా, లక్ష్మణరావు ఇంగ్లాండులోని ఎడింబరో విశ్వవిద్యాలయంలో ఎం.ఏ. పట్టా పుచ్చుకున్న తర్వాత జర్మనీలోని ట్యూబింగెన్ విశ్వవిద్యాలయం నుంచి డాక్టరేటు తీసుకున్నారు. వృక్ష శాస్త్రంలో డాక్టరేటు పుచ్చుకున్న తొలి ఆంధ్రులు లక్ష్మణరావుగారే. 1922లోనే శ్రీ కోపల్లె హనుమంతరావు మరణించుటచేత 1928 నాటికి వృక్షశాస్త్రంలో ఉన్నత విద్య నభ్యసించి పట్టం పొందిన ఆంధ్రులు లక్ష్మణరావు, గోరాగార్లే. ఆంధ్ర విశ్వవిద్యాలయమంతటికీ మొట్టమొదటిగా బి.ఏ. వృక్షశాస్త్రం 1978లో కాకినాడ కాలేజీలోనే ప్రారంభించారు. అలాంటప్పుడు లక్ష్మణరావు, గోరా ఇద్దరూ రాగలగడం గర్వకారణం గదా. వృక్షశాస్త్రశాఖకు అధిపతి (హెడ్ ఆఫ్ ది డిపార్డ్‌మెంటు) చేస్తామని మాట యిచ్చి కాలేజీ అధికారులు గోరాను

కొలంబో నుంచి రప్పించినప్పటికీ, తనకంటే వయస్సులోను, యోగ్యతలోను అధికులైన లక్ష్మణరావు రాగానే వారినే వృక్షశాస్త్రశాఖ అధిపతిగా చేసి తాను వారితో కలసి పనిచేయుటకు గోరా సంతోషంతో అంగీకరించడం అందరికీ సంతృప్తిదాయకం అయింది.

లక్ష్మణరావు, గోరా ఇద్దరూ కూడా అన్నదమ్ములవలె కలసిపోయి విద్యార్థులకు ఆదర్శమూర్తులైనారు. వీరిద్దరికీ అప్పుడు విద్యార్థిగా ఉండిన గూడూరి వెంకటచలంగారి మాటల్లో – "పిఠాపురం రాజావారి కళాశాల 'బోటనీ లేబరేటరీ' విప్లవభావాలకు ఒక నారుమడి అయిపోయింది. ఆ 'నారుమడి' లోని 'మొక్కల' ఆలనా పాలనా డాక్టర్ లక్ష్మణరావు, శ్రీగోరాగారు చూస్తూ, విజ్ఞానానికీ సంఘానికి ఈ 'మొక్కలు' సహాయంగా ఉండాలని ఎంతో జాగ్రత్తవహించి పెంచారు. ఆ "మొక్కలే" నేడు ఆంధ్ర దేశంలో అనేక ప్రాంతాలలో పెరిగి, వృక్షాలయి – విస్తరించి, స్వతంత్ర భారతదేశంలో ప్రజలందరిలో వచ్చే నూతనభావ విప్లవానికి పట్టుగొమ్మలైనాయి"*.

డాక్టర్ లక్ష్మణరావు కాకినాడ కాలేజీలో ఒక సంవత్సరం మాత్రమే ఉండి తర్వాత ఆలీఘర్ విశ్వవిద్యాలయానికి వెళ్ళిపోయారు. అప్పుడు 1929లో గోరా వృక్షశాస్త్రశాఖ అధిపతి అయ్యారు.

కాకినాడ రాగానే గోరా తన తల్లితండ్రులతోనే ఉండసాగారు. అప్పటికే గోరా తండ్రి వేంకట సుబ్బారావుగారు ఉద్యోగం నుంచి రిటైరు అయి ఫించను పుచ్చుకుంటున్నారు. తన కుమారుడు చదువుకుని ఉద్యోగంలో ప్రవేశించిన తర్వాత అంతకంతకూ మత సాంప్రదాయాలను, కుల కట్టుబాట్లను సడలిస్తున్నాడని సుబ్బారావుగారికి కష్టం కలిగింది. తిరిగి తన కుమారుని దారికి తీసుకురావాలని అనుకున్నారు. అంతకు ముందు మూడు సంవత్సరాల నుంచి గోరా జంధ్యమును తండ్రి వద్దకు వచ్చినప్పుడు వేసుకోవడం, లేనప్పుడు తీసివేయడం చేస్తూ వుండేవారు. ఈ విషయం సుబ్బారావుగారికి తెలుసు. గోరా కాకినాడ వచ్చిన రెండు నెలలకే ఆగస్టులో ఆ సంవత్సరం శ్రావణ పౌర్ణమి వచ్చింది. శ్రావణపౌర్ణమి నాడు కొత్తజంధ్యాలు వేసుకోవడం ఆచారం. అందుచేతనే శ్రావణ పౌర్ణమిని జంధ్యాల పౌర్ణమి అని కూడా అంటారు. సుబ్బారావుగారు ఆనాడు కొత్త జంధ్యం ఒకటి స్వహస్తాలతో పేని, గోరాను పిలిచి అది ఆయనకు ఇస్తూ "నేను నీకు 4 రోజులు వైభవంగా వొడుగు చేయించి యజ్ఞోపవీతం వేశాను. ఈ మధ్య కొంతకాలంగా నువ్వు దానిని తీస్తూ వేస్తూ వస్తున్నావు.

---

* శ్రీ గోరా షష్టిపూర్తి అభినందన సంచిక

ఇప్పుడు నేను నా స్వహస్తాలతో దీనిని ఇస్తున్నాను. ఇక శాశ్వతంగా ఉంచుకో" అన్నారు. తండ్రియెడల తనకున్న గౌరవభావానికి లోపం లేకుండానే, తన భావాలను స్పష్టం చేయదలచారు గోరా – "నాన్నగారూ, మీరు చెప్పింది నిజమే. మీరంటే నాకున్న భయభక్తుల కారణంగా మీ ఎదుట జంధ్యం వేసుకుంటూ తర్వాత తీసేస్తూ వచ్చాను. కాని నాకు ఈ కులతత్వంమీద, వర్ణవ్యవస్థ మీద నమ్మకంపోయింది. జంధ్యం కులచిహ్నం. అందుచేత నేటినుంచీ పూర్తిగా జంధ్యం మానివేయ దలచుకున్నాను" అన్నారు.

తన కుమారుని నోట ఈ మాటలు వినేసరికి సుబ్బారావుగారికి ఆకాశం విరిగి మీద పడినట్లయింది. ఏమీ మాట్లాడలేక పోయారు. చివరకు "సరే, నువ్వు నాపంక్తిని కూర్చొని భోజనం చేయడానికి వీల్లేదు. ఇక నేను నీ మొహం చూడను. అవతలికి పో" అన్నారు.

గోరా జీవితంలో నూతనాధ్యాయం ఆరంభమైంది. ఆయనలోని విప్లవకారుడు, సంఘసంస్కర్త మేల్కొన్నాడు. సమాజంలో సమానత్వాన్ని, స్వాతంత్ర్యాన్ని, విజ్ఞానాన్ని, నీతినీ, న్యాయాన్నీ పెంపొందించాలనుకున్న ప్రతి ఒక్కరికీ సాంఘికవెలి తప్పలేదు. సోక్రటీస్‌ని విషమిచ్చి చంపారు. క్రీస్తును శిలువ వేశారు. బ్రూనోను మంటలకు ఆహుతి చేశారు. అబ్రహాంలింకన్‌ను పిస్తోలుతో కాల్చారు. అయినా ప్రగతిపథం పురోగమించక ఆగలేదు. వ్యతిరేకతలు విప్లవకారులకు బలం కలిగిస్తాయి. వెలి సంస్కర్తలను సంకుచిత పరిధినుండి దూరం చేసినా, విశాలమానవ సమాజానికి చేరువుగా చేస్తుంది.

అప్పటికి గోరా పెద్దబిడ్డ మనోరమ వయస్సు ఆరువారాలు. జులైలోనే పుట్టింది. ఆనాటి సాయంత్రం కాలేజీనుంచి ఇంటికి రాగానే భార్యను, పసిబిడ్డను వెంటతీసుకుని కట్టుబట్టలతో ఇంటిలోనించి వీధిలోనికి నడిచారు గోరా. గోరా తల్లి విలవిల ఏడ్చింది. ఒకటి రెండు రోజులు గోరా ఒక స్నేహితుని ఇంట ఉండి ఈలోగా ఇల్లు అద్దెకు తీసుకున్నారు ఉద్యోగంలో ఉంటూ ఆర్థికంగా స్వతంత్రుడు కావడంచేత సాంఘిక వెలి గోరాని అణచలేకపోయింది.

తనను వెలిపెట్టిన తండ్రిపై గోరాకేమీ ద్వేషం లేదు. ఆనాటి సమాజం అది. అప్పుడప్పుడు తాను వెళ్ళి తల్లినిచూచి వచ్చేవారు. తండ్రి రిటైరు అయిపోయారు. కనుక వారికి ప్రతీనెల కొంత ఆర్థిక సహాయం చేయాలని నిశ్చయించుకొని ఆ విధంగా ఇదివరకే ప్రారంభించారు గోరా. ఇప్పుడు తనను వెలివేసినా ఇంటిఖర్చు నిమిత్తం అనుకున్న సహాయం మాత్రం క్రమంగా తల్లికి ప్రతినెలా ఇచ్చేవారు.

1928లోనే ఇంటినుంచి బయటకు వచ్చిన వెంటనే గోరా హరిజనవాడలోకి వెళ్ళి రాత్రి పాఠశాల ప్రారంభించి వయోజన విద్య గడపసాగారు. గోరా దృష్టిలో వయోజన విద్య అంటే వారికి అక్షరాస్యత నేర్పడం మాత్రమే కాదు. అక్షరాస్యత గౌణం. ప్రధానంగా వయోజనులను రాజకీయంగా, సాంఘికంగా, వైజ్ఞానికంగా చైతన్యవంతులను చేయుట, చైతన్యవంతులైన వయోజనులు తమ పరిస్థితులను మార్చుకొనుటకు కృషి చేయగలరు. అందుచేత రోజూ రాత్రి దినపత్రిక చదివి విషయాలు వారికి అర్థమయ్యేట్టు చెప్పటం గోరా ప్రముఖంగా పెట్టుకున్నారు. రోజూ రాత్రి దినపత్రిక, లాంతరు, గ్లోబు, దేశపటాలు తీసుకుని హరిజనవాడకు వెళ్ళేవారు. హరిజనవాడలో అలా రోజూ ఒకటి – రెండు గంటలు గడపటం గోరాకి కొత్త కొత్త అనుభవాల నిచ్చింది. కొంతమంది హరిజన యువకులు పత్రికాపఠనం వినుటకు, చదువునేర్చుకొనుటకు ముందుకు వచ్చినా, మరికొంతమంది "మాకెందుకు బాబయ్యా! ఈ చదువులూ, సంధ్యలూలు. మా కర్మ ఇంతే. దేవుడు మమ్మల్ని ఇలాగే పుట్టించాడు. మా నుదుట ఎలా రాసి ఉంటే అలా జరుగుతుంది. మీరెందుకు బాబు కష్టపడటం" అని నిస్పృహతో అనేవారు. వారిలోని ఈ బానిసభావాన్నీ, నైరాశ్యాన్నీ తొలగించుటకు గోరా దేవుడు-కర్మ అబద్ధమనీ, నుదుటివ్రాత అనేది లేదనీ, ఉత్సాహంతో కృషి చేస్తే అస్పృశ్యతనీ దారిద్ర్యాన్నీ నిర్మూలించవచ్చుననీ, దేశానికి బానిసత్వం నుంచి విముక్తి కలిగించవచ్చుననీ ప్రబోధిస్తూ ఉండేవారు గోరా వారిని తాకి, వారు తమ చేతులతో తెచ్చియిచ్చే మంచినీళ్ళు త్రాగి తనపై వారికి విశ్వాసం కలిగేలా చేశారు. గోరా మాటలు ఆ హరిజనులకు కొత్తగా ఉండేవి. అయినా గోరా ఆచరణవల్ల హరిజనులెంతో ప్రభావితమయ్యారు. ముఖ్యంగా హరిజన విద్యార్థులకు గోరాలో ఒక నూతన "విముక్తిదాత" కన్పించారు.

ఈ లోగా దేశంలో రాజకీయ వాతావరణం తిరిగి మరొక సమరానికి సన్నద్ధమౌతూంది. 1920 నుంచి 25 వరకూ ఖద్దరు ధరించి తర్వాత లెక్చరర్‌గా సూట్లువేసిన గోరా 1930లో తిరిగి ఖాదీ ధరించడం ప్రారంభించారు. ఖాదీ పైజామ, పొడుగులాల్చీ వేయటం ప్రారంభించారు. 1930లో ఉప్పు సత్యాగ్రహ సమర శంఖం గాంధీజీ పూరించారు. కాకినాడలో అందు ప్రత్యక్షంగా పాల్గొనే స్వయంసేవకులు చాలామంది ముందుకు వచ్చారు. వెనుక ఉండి విరాళాలు సేకరించి, స్వయం సేవకుల కుటుంబాల యోగక్షేమాలను విచారించే బాధ్యత కొందరు మీద వేసుకోవలసి వచ్చింది. గోరా కూడా ఆ పనికి పూనుకున్నారు. తోటి అధ్యాపకులలోనూ, మిత్రులలోనూ, విరాళాలు వసూలుచేసి కాంగ్రెసునాయకులకు పంపుతూ ఉండేవారు. ఉప్పుసత్యాగ్రహ సమయంలో పుట్టిన తన పెద్ద కుమారునికి జాతీయోద్యమంలో సాగిన ఆ చిరస్మరణీయ ఘట్టానికి చిహ్నంగా "లవణం" అని పేరు పెట్టారు. గోరా మత సాంప్రదాయాలపై

చేసిన తిరుగుబాటు, ఆయన ప్రగతిశీల ఆచరణ తన పిల్లలకు పేర్లు పెట్టుటలో కూడా ప్రతిబింబించింది. 'లవణం' పేరు గోరా జాతీయ భావాలకు, గాంధీజీ ఉద్యమం యెడల ఆయనకు గల సానుభూతికీ ప్రతీకం. లవణం పేరుకు మాత్రమేకాక తన యదార్థ జీవితం కూడా గోరా ఆశయ-ఆశయాలకు ప్రతీకారంగా మలచుకొన్నాడు. ఆ విషయం తర్వాత ముచ్చటించుకొందాము.

మత సాంప్రదాయాలను, కులతత్వాలను త్రెంచుకొని ఇలా గోరా తాను నమ్మిన బాటలో పురోగమిస్తూనే ఉన్నారు. అటు తండ్రికి మాత్రం తన కుమారుని గురించి ఆలోచన, ఆవేదన ఎక్కువయ్యాయి. ఇలా తండ్రీ కొడుకులు దూరం కావటం చాలా మంది మిత్రులను కలవరపెట్టింది. తండ్రి అంటే అమిత గౌరవం గోరాకు, కుమారునియెడల విపరీతమైన ప్రేమ సుబ్బారావుగారికి, తండ్రి కొడుకులని తిరిగి కలపాలని మిత్రులు ప్రయత్నాలు ప్రారంభించారు. అభ్యుదయ భావాల దృష్ట్యా చూస్తే గోరా చేస్తున్నది తప్పు అనలేదు. సనాతన సాంప్రదాయాల రీత్యా ఆలోచిస్తే సుబ్బారావుగారి యెడల సానుభూతీ ఉంటుంది. గోరాకు మిత్రుడూ, సుబ్బారావుగారికి కుటుంబ వైద్యుడు అయిన ఒక డాక్టరు సుబ్బారావుగారికి నచ్చచెప్పుటకు ప్రయత్నించారు. గోరా వలె చాలామంది యువకులకు జంధ్యంలో నమ్మకం లేదనీ ఏవైనా కర్మకాండలు వస్తే వేసుకొని లేనప్పుడు వేసుకొనుట లేదని చెప్పి, తానుకూడా రోజూ జంధ్యం వేసుకోనని చొక్కావిప్పి చూపించారు. గోరా ధైర్యంగా, బహిరంగంగా జంధ్యం తీసివేశారనీ, మిగిలినవారు పిరికివారై వేసుకొంటూ, తీసేస్తూ, సనాతన సాంప్రదాయాల యెడల నిష్ఠ ఉన్నట్లు నటిస్తున్నారనీ, గోరా ధైర్యాన్ని మెచ్చుకోవాలని ఆ డాక్టరు చెప్పారు. ఇది కొంత సుబ్బారావుగారిని ఆలోచింపజేసింది.

ఆ సమయంలోనే మతోపన్యాసములిచ్చుటకు ఒక స్వాములవారు కాకినాడ వచ్చారు. సుబ్బారావుగారు ఆయన వద్దకు తన కుమారుని విషయం చెప్పి ఏమి కర్తవ్యమని అడిగారు. ఆ స్వాములవారు కొంత ఆంగ్ల విద్యనభ్యసించి, ఆధునిక భావాలతో బాగా పరిచయమున్నవారు. అంతా విన్న తర్వాత ఆయన కాల ధర్మము, పితృధర్మము అనే విషయాలమీద నొక్కి చెప్పారు. మార్పు కాలధర్మమనీ కాలం ఎల్లప్పుడూ ఒకే రీతిని ఉండదనీ ఎప్పటికప్పుడు యువతరం కాలధర్మానికీ అనుకూలంగా ఉంటుందనీ కుమారుడు ఎలాంటివాడైన, కుమారుని క్షమించి సహించుట తండ్రిధర్మమనీ ఆ స్వాములవారు తన అభిప్రాయాలను తెలిపారు. ఈ విషయంలో గోరాగారి ధైర్యాన్నీ, తానునమ్మినది ఆచరించే ఆయన సహనాన్ని స్వాములవారు హర్షించి, పెద్దవారు కనుక సుబ్బారావుగారు తిరిగి తన కుమారుని చేరదీయాలని బోధించారు.

ఎవరిధర్మాన్ని వారు నిర్వహించాలి అనే దృక్పథంలో ఆలోచించగా సుబ్బారావుగారిలో క్షమాదృష్టి ఏర్పడింది. సహజంగా విశాల హృదయులు, ఉదార స్వభావులు, జాతీయ భావాలు కలవారగుటచేత వెంటనే గోరా తనవద్దకు రావలసిదిగా కబురు చేశారు. ఈ విధంగా సుమారు రెండున్నర సంవత్సరాల ఎడబాటు తర్వాత తండ్రీ కొడుకులు తిరిగి కలుసుకున్నారు.

అప్పటికి గోరా ఊరు బయట స్థలం కొని, చిన్న పూరిపాక వేసుకొని నిరాడంబరంగా కాపురం ఉంటున్నారు. ఆ స్థలంలో చుట్టూ చిన్న తోట కూడా పెంచారు. అందుచేత సుబ్బారావుగారు గోరాగారిని తిరిగి తన ఇంట్లో వచ్చి ఉండమని ఆహ్వానించినప్పటికీ, ప్రశాంతంగా ఉంటుంది కనుక పర్ణకుటీరమైన తనవద్దకు రమ్మని తల్లిదండ్రులను గోరా ఆహ్వానించారు. దానినే స్వంత ఇంటిగా భావించుకుని స్వేచ్ఛగా వుండమని తల్లిదండ్రులకు గోరా చెప్పారు. ఆ తర్వాత తండ్రి భజనలకు గోరా అడ్డుచెప్పలేదు. కుమారుని కార్యకలాపాలకు సుబ్బారావుగారు అడ్డు చెప్పలేదు. తరువాత సుహృద్భావపూర్వక వాతావరణంలో తండ్రీ కొడుకుల మధ్య ఆస్తిక నాస్తికత్వాల గురించి చర్చలు కూడా జరుగుతూ ఉండేవి. ఆ కుటుంబంలో గోరాగారి విధవ మేనత్త జోగమ్మగారు సుబ్బారావుగారి కనిష్ట సంతానం సాంబశివరావు కూడా ఉండేవారు.

గోరా కాకినాడ వచ్చినప్పటినుంచీ నాస్తిక దృక్పథంతో ఒక ప్రక్క అధ్యయనం చేస్తూ, మరోప్రక్క మిత్రులతో నాస్తికత్వం గురించి చర్చలు జరుపుతూ ఉండేవారు. దైవం అబద్ధం, మానవ కల్పన, కులాలు-మతాలు తప్పు, మానవులంతా సమానులు అనే అభిప్రాయం గోరా నిత్య జీవితాచరణలో అడుగడుగునా కనపడుతూ ఉండేది. ప్రతీరంగంలోనూ గోరా ఆచరణ ఇతరులకంటే ఎంతో భిన్నంగా ఉండి అందర్నీ ఆకర్షించేది.

గోరా కుటుంబం అప్పటికి చిన్నది అగుటచేత, తల్లిదండ్రులకు కొంత ఆర్థిక సహాయం చేసినా, తన జీతంలో ఇంకా మూడవభాగమైనా మిగిలేది. మొదటినుంచీ కూడా గోరాకి ఆస్తి సంపాదించాలి, డబ్బు కూడబెట్టాలి అనే కాంక్ష లేదు. అన్ని విషయాలలోవలెనే ఈ విషయంలో కూడా సరస్వతిగారు గోరాకు పూర్తిగా తోడ్పడ్డారు. "ప్రజాసమూహాలకు మేధా సంపదను అందిస్తే, వారు తమ సమస్యలను తామే పరిష్కరించుకోగలరు అనే వివేకానందుని సూక్తి గోరాకి చాలా ప్రియమైనది. అందుచేత వీలైనంత ఎక్కువగా విద్యార్థులకు సహాయపడాలని గోరా ఎప్పుడూ ఉవ్విళ్లూరుతూ ఉండేవారు. తన ఇంట్లో కొంతమంది విద్యార్థులకు భోజన సదుపాయం కల్పించారు.

కాలేజీ జీతాలు పరీక్ష ఫీజు కట్టడంలోనేమి, పుస్తకాలు కొనుక్కోవడంలోనేమి బీద విద్యార్థులకు సహాయపడుతూ ఉండేవారు.

మొదటినుంచీ కూడా గోరా జీవితాచరణలో నిరాడంబరత, ప్రజాధనాన్ని, అతిజాగ్రత్తగా వాడడం కనబడుతుంది. విశ్వవిద్యాలయానికి సంబంధించిన ఎన్నో కమిటీలలో గోరా సభ్యులుగా ఉండేవారు. కమిటీ సమావేశాలకు వెళ్లినప్పుడు కొన్ని సందర్భాలలో మొదటితరగతి, మరికొన్ని సందర్భాలలో రెండవ తరగతి ప్రయాణపు ఖర్చులు ఇచ్చేవారు. కాని గోరా ఎప్పుడూ రైలులో 'ఇంటర్' తరగతిలోనే ప్రయాణం చేసి'ఇంటర్' తరగతి ప్రయాణఖర్చులే పుచ్చుకునేవారు. (స్వాతంత్ర్యం వచ్చేవరకూ రైల్లో 1,2, ఇంటర్, 3వ తరగతులుండేవి. స్వాతంత్రానంతరం పాత 1వ తరగతిని రద్దుచేసి, పాత రెండవ తరగతిని ఇప్పటి ఒకటవ తరగతిగానూ, పాత ఇంటరును ఇప్పటి రెండవ తరగతిగానూ మార్చారు.) గోరా వలెనే అప్పుడు ఇంటర్ తరగతిలో ప్రయాణం చేసి, ఇంటర్ ప్రయాణపు ఖర్చులే తీసుకున్న మరొకరు శ్రీ శొంఠి పురుషోత్తంగారు. అప్పుడు వీరు విజయనగరం మహారాజా కళాశాల గణితశాస్త్ర శాఖాధిపతిగా ఉండేవారు. గోరా యూనివర్శిటీ వారిచే దినసరిభత్యంలో కూడా సగానికిసగం తగ్గించి పుచ్చుకునేవారు. ఆంధ్ర విశ్వవిద్యాలయం మొత్తం మీద గోరా పురుషోత్తంగార్లు మాత్రమే ఇలా చేశారు. మిలిగిన వారు నిర్ణయించబడిన ప్రయాణపు ఖర్చులు, భత్యం పూర్తిగా తీసుకునేవారు. పై తరగతి ప్రయాణపు ఖర్చులు తీసుకుని ఇంటర్‌లో వెళ్ళటం అరుదుకాదు. ఇలాంటి విషయాలు విద్యార్థుల దృష్టిలోకి రాకుండా ఉండవుగదా! గోరా ఆదర్శాలు వల్లించడం, సిద్ధాంతాలు ప్రచారం చేయడమేకాదు, వాటిని ఆచరించి చూపుటచేత విద్యార్థులకు వీరిపై అపరిమితమైన అభిమానం, గౌరవం ఉండేవి. తన విద్యార్థులను గోరా ఎక్కువగా విజ్ఞాన యాత్రలకు తీసుకుని వెళుతూ ఉండేవారు. ఇలాంటి సందర్భాలలో వృక్షశాస్త్రం గురించేకాక దేశ, ప్రపంచ పరిస్థితుల గురించి సమాజం గురించి ఎన్నో విషయాలు చెబుతూ ఉండేవారు.

విద్యార్థులలో శీలసంపద అభివృద్ధి చెందాలంటే ఉపాధ్యాయులకు విద్యార్థులకు క్లాసు రూమ్‌లలోనే కాక బయటకూడా సన్నిహిత సంబంధాలు ఉండాలనేవారు గోరా. అందుచేతనే కాలేజీ బయటకూడా తరచు విద్యార్థులు గోరాని ఇంటివద్ద కలుసుకుంటూ ఉండేవారు. అందరూ కలిసి మెలసి అల్పాహారం, భోజనాలు చేసేవారు. ఎన్నో విషయాలు చర్చించేవారు. వారు వీరు అనే తేడా లేకుండా అన్ని కులాలవారు ఏకోదరులవలె కలసిపోయేవారు. ఇలా కలసిమెలసి భోజనాలు చేసినప్పుడు కాకినాడ కాలేజీ బ్రహ్మసమాజ వాతావరణం కనుక చాలా మంది అంతగా పట్టించుకోకపోయినా,

కొందరు పిల్లల సంరక్షకులకు మాత్రం కష్టంగానే ఉండేది. ఒకసారి గోరా విద్యార్థియగు ఒక వైశ్యుడు ఆ దరితో కలసి భోజనం చేసి ఇంటికి వెళ్ళగా, ఈ విషయం తెలుసుకున్న వారి తాత మనుమణ్ణి పిలిచి మందలించాడట. ఆ మనుమడు 'తాతయ్యా! అక్కడున్న వారందరూ బ్రాహ్మలే' అన్నాడుట. దానికి వ్యవహర్త అయిన ఆ తాత "వైశ్యునితో కలసి తిన్న బ్రాహ్మడు మాదిగ వాళ్ళతో కలసి తినకుండా ఉంటాడా? అలాంటి బ్రాహ్మడితో నువ్వెందుకు సహపంక్తి కూర్చున్నావు?" అని కోప్పడినాడట. ఇలాంటి సంఘటనలు కూడా జరుగుతూ ఉండేవి.

విద్యార్థుల సహకారంతో గోరా కొన్ని కొన్ని విషయాలపై సామాజికంగా ప్రయోగాలు చేసేవారు. వాటిలో పేర్కొనదగినది భిక్షకవృత్తికి, శ్రమశక్తికి నిష్పత్తిలో తారతమ్యం కనుక్కొనుటకు చేసిన ప్రయత్నం. కాకినాడకు 3 మైళ్ళదూరంలో చొల్లంగి అనేచోట గోదావరిపాయ ఒకటి వచ్చి సముద్రంలో కలుస్తుంది. అక్కడ సంవత్సరాని కొకసారి అమావాస్యనాడు సముద్రస్నానాలు చేస్తారు. అది చొల్లంగి అమావాస్య అని ప్రసిద్ధి. చుట్టుప్రక్కల ప్రాంతాలనుంచి జనం సముద్రస్నానాలకని అక్కడికి వస్తారు. తమ ప్రయోగానికి గోరా దానిని ఎన్నుకున్నారు. తన విద్యార్థులలో నమ్మకస్తుల్ని 11 మందిని ఏరి తీసుకున్నారు. తనతో కలిపి 12 మంది, ఈ 12 మంది ఆరుగురు చొప్పున రెండు జట్లు అయినారు. ఒక జట్టువారు తాళంగాని, సీలుగాని లేకుండా పైన కన్నం కొట్టిన డబ్బాలు తీసుకుని 'ధర్మం, ధర్మ' అంటూ బిచ్చం అడగడం, రెండవ జట్టువారు స్నానాలకు వెళ్ళే యాత్రీకుల మూటలు భద్రపరచి వారు తిరిగిరాగానే జాగ్రత్తగా అప్పగించడం. ఇందుకుగాను వెదుళ్ళతో చిన్న గది కూడా కట్టారు. మూటకు అర్ధణా పుచ్చుకోవడం, అయితే ధర్మం అడగటానికి వెళ్ళినవారు, జనంలో ఒక్కరైనా "దేనికి ధర్మం? సీలు ఏది, తాళం ఏది? అని ప్రశ్నిస్తారేమో చూడాలి. అలాంటివాడు ఒక్కడు కనిపించినా పన్నెండు మందీ అట్టివానికి, ఆలోచించినందుకు సాష్టాంగ ప్రణామం చెయ్యాలనుకున్నారు. ఉదయం 6 గంటలకు రెండు జట్టులూ ఎవరిపనికి వారు పూనుకున్నారు. బిచ్చం అడుగుటకు వెళ్ళినవారు ఆరుగురూ పదిగంటలు కాకుండానే తమ డబ్బాలు చిల్లరతో నిండిపోయాయని తిరిగి వచ్చారు. ఒక్కరుకూడా 'ఏమిటి, ఎందుకు' అని అడగలేదు. శ్రమశక్తి తీసుకున్న జట్టుకు ఆఖరి మూట వారు వచ్చి తమమూట తీసుకుని వెళ్ళేసరికి మధ్యాహ్నం 1 గంట అయింది. వచ్చిన డబ్బులు లెక్కబెడితే ఉదయం 6 నుంచి మధ్యాహ్నం 1 గంట వరకూ పనిచేసిన 6 గురు సంపాదన తొమ్మిదణాలు. ధర్మం అడిగిన ఆరుగురు 4 గంటలు కూడా అవసరం లేకుండానే 14 రూపాయల చిల్లర సంపాదించారు. ఆరుగురు 7 గంటలు పనిచేస్తే 9 అణాలు. 6 గురు 4 గంటలు బిచ్చమెత్తితే 14

రూపాయలు. ఇదీ మనదేశం, ఇదీ మన సమాజం. విద్యార్థులందరికీ ఈ ప్రయోగం పెద్ద కనువిప్పు అయింది. 1931లో సంగతి అది. దీని తర్వాత రైల్వేస్టేషనులో రెండు రైళ్ళ వద్ద 6గురు కూలీలుగాను, 6గురు బిచ్చగాళ్ళుగానూ చేసి చూద్దామనుకున్నారు. కూలిగానూ, బిచ్చమెత్తగానూ వచ్చిన మొత్తం డబ్బు రైల్వే కూలీలకు ఇచ్చేస్తామని చెప్పినా, రైల్వే అధికారులు అందుకు అంగీకరించలేదు.

గోరా ఆచరణ విద్యార్థులకు ఉత్సాహాన్ని కలిగిస్తూ ఉండేది. జాతీయోద్యమ ప్రభావంతో సిగరెట్లు మాని బీడీలు కాల్చమని, సిగరెట్లు త్రాగే విద్యార్థులకు గోరా సలహా యిచ్చేవారు. ఇందుకుగాను బీడీకట్టలు తెచ్చి సాయంత్రంపూట, శెలవు దినాలలోనూ విద్యార్థులు తన ఇంటికి వచ్చినప్పుడు గోరా వారి ముందు పెట్టేవారు. విద్యార్థులు సిగ్గుపడకుండా తానుకూడా వారితో బీడీలు అప్పుడప్పుడు కాల్చేవారు.

ఇలాగే సినీమాలకు వెళ్ళినప్పుడు తాను రిజర్వు తరగతి కొనుక్కుని కూడా విద్యార్థులెవరైనా క్రింది తరగతులలో కూర్చుని ఉంటే వారి వద్దకు వెళ్ళి కూర్చునేవారు. ఇలాంటి ప్రవర్తన సమానత్వ భావం అయితే కావచ్చుగాని, ఉపాధ్యాయుల ప్రతిష్టకు భంగకరంగా ఉందని భావించి సినిమాలలో విద్యార్థులతో కలసి కూర్చొనుట గురించి కాలేజీ అధికారులు సంజాయిషీ కూడా అడిగారు.

మన విద్యా విధానం మనిషి నుంచి మనిషిని దూరంగా ఉంచడంలోనే ప్రతిష్టను చూస్తుంది. అంతేగాని విద్యార్థులను ఉత్తమ భావిపౌరులుగా తయారుచేయాలని ప్రయత్నించదు. గోరా ఒకప్రక్క తన క్లాసులో క్రమశిక్షణగాని పరీక్షాఫలితాలుగాని ఏ లోపం లేకుండా, ఇతరులు ఈర్షపడేంత ఘనంగా విజయం సాధించారు. గోరా దృష్టిలో ఉపాధ్యాయుని ప్రతిష్టకు అర్థం వేరు. కాలేజీ అధికారులు దృష్టిలో అర్థం వేరు.

1930 ఉప్పు సత్యాగ్రహ సమయం నుంచీ సూటు మాని గోరా ఖాదీ పైజామా, లాల్చీ వేయడం ప్రారంభించారు కదా. ఇది కూడా ఉపాధ్యాయుల హుందాతనానికి తగలేదని కాలేజీ అధికారుల భావన. 1931లో గోరాపై 'డ్రెస్ రెగ్యులేషన్స్' పెట్టారు. అంటే సూటు, కోటు, టై, బూటు, హ్యాటుతో రావాలి. లేదా పైజామాగాని, పంచెగాని కడితే లాంగ్‌కోట్, తలపాగాతో రావాలి అని ఈ డ్రెస్ రెగ్యులేషన్సు పెట్టగా, గోరా నల్లటి ఖాదీ లాంగ్‌కోటు, తెల్లటి ఖాదీ తలపాగాతో కాలేజీకి వచ్చారు. తమ గురువుగారి యెడల కాలేజీ అధికారులు చాలా అమానుషంగా ప్రవర్తిస్తున్నారని విద్యార్థులు భావించారు. మర్నాడు కాలేజీలోని బోటనీ విద్యార్థులందరూ తలపాగాలు చుట్టుకుని వచ్చారు. గోరాపై విద్యార్థులకున్న అభిమానం అది.

గోరా తన విద్యార్థులు చేసే పనులకు తానే బాధ్యత వహించి వారిని ఎప్పుడూ కాపాడుతూ ఉండేవారు. ఇలాంటి స్వీయ అనుభవమొకదానిని గోరా పూర్వ విద్యార్థి శ్రీ నందూరి పాలశంకరరంగారు ఇలా వర్ణించారు – "ఏ వ్యవహారమందైనను తోడివారిని యిరికించి తాను మిగిలియుండు 'లౌకిక ప్రవృత్తి' వీరియం దిసుమంతయు లేదు. పైపెచ్చు తమకు రవ్వంత ప్రమేయమున్నను పూర్తి బాధ్యత తన పైనే వైచుకుని నిలబడు ధీశాలి. 1932లో మా కాలేజీ వార్షికోత్సవము జరిగినది. మోచర్ల రామచంద్రరావు పంతులుగారు అధ్యక్షులు, నేను బి.యస్‌సి. సీనియర్ తరగతిలో నుంటిని. ఉత్సవసభలో నుండి అధ్యక్షులకు నా సంతకముతో నొక చీటి పంపితిని. విద్యార్థి లోకమునకు సంబంధించి రెండవ రౌండ్‌టేబిల్ కాన్ఫరెన్సు విశేషములు తెలుపవలసినదని అందుకోరితిని. ప్రిన్సిపాలుగారి నియామకము ననుసరించి మాతరగతిని కాపలాకాయుచున్న గురువర్యులకు చీటీ ముందుగా మాత్రము చూసి 'వల్లె' అన్నమీదట పంపితిని. ఇది మాత్రమే వారికిగల ప్రమేయము యీ విషయములో. చీటీ ప్రిన్సిపాలుగారి చేతికి వెళ్ళినది. అది వారు చదువుకొని వారి జేబులో భద్రపరచిరి. మొగము కందగడ్డ చేసుకొనిరి. నా గుండె జారిపోయినది. తెల్లవారుసరికి పెద్ద పుకారు. నేను క్రమశిక్షణను అతిక్రమించి కాలేజీ గౌరవమును గంగపాలు చేసితినట. నన్ను పరీక్షకు పంపరట. సస్పెండు చేయుదురట. ఈ వార్త గురువర్యులే స్వయముగా నా వద్దకు వచ్చి వినిపించిరి. భయములేదని హెచ్చరించిరి. చీటీని తనకు ముందుగా చూపుటతో నా బాధ్యత తీరినదనియు, యందలి బాధ్యత పూర్తిగా తమదే యనియు, తన ఉద్యోగము పోయిన తరువాతగాని ప్రిన్సిపాలుగారు నా మీద చర్య తీసుకొనలేరనియు చెప్పి అభయ మిచ్చిరి. గురువుగారి నాయబుద్ధికి ధైర్యసాహసములకు ఆశ్చర్యచకితుడనై అట్టిదెపుడు జరగదని మాత్రమంటిని. ఆ సాయంత్రమే పూర్వ విద్యార్థి వార్షికోత్సవసభ జరిగినది. అందు ప్రిన్సిపాలుగారు నన్ను దుయ్యబట్టుకొనిరి. ఘాటుగా నా తప్పిదమును విమర్శించిరి. క్రమశిక్షణ చర్య తప్పదనిరి. ఒక్కుమ్మడి గురువర్యులు లేచి తమ సమ్మతిపైననే చీటి పంపబడినదనియు, బాధ్యత తనదనియు చెప్పుటకు సభాపీఠము వైపునకు పోబోవుచుండగా బ్రతిమాలుకొని, నేను సంకల్పించి చేసినదానికి వారు బాధ్యులు కార; నా వ్యక్తిత్వమును మరుగుపరచవలదని సభాప్రాంగణము నుండి మరల్చుకొని పోతిని, కాని దరిమిలా నాకు తెలియకుండగనే తమ బాధ్యతను ప్రిన్సిపాలుగారికి యెరుకపరచుకొని వారి ఆగ్రహమునకు పాత్రులైరి. ఇట్టి ఘట్టములే వారు కాలేజీ ఉద్యోగము వదులుకొనుటకు దారితీసినవని వినికిడి."*.

శ్రీ పాల శంకరంగారు వర్ణించినటువంటి ఘట్టాలు గోరా జీవితంలో ఎన్నో ఉన్నాయి. ఆ రోజుల్లో ఏ విద్యార్థిలోనైన జాతీయభావాలు, స్వతంత్ర్య భావాలు, ఆత్మాభిమానము కనబడితే చాలు. "నువు బోటనీ విద్యార్థివా?" అని అడగటం పరిపాటి అయింది. విద్యార్థులు కూడా స్వాభిమానముతో 'అవును' అని చెప్పేవారు గోరా తన విద్యార్థులలో అంతటి ఆత్మవిశ్వాసాన్ని నింపారు.

1932 నాటికి ఉప్పుసత్యాగ్రహంలో అరెస్టు అయిన నాయకుల విడుదల ఆరంభమైంది. శ్రీమతి గుమ్మిడిదల దుర్గాబాయమ్మగారు (ఇప్పటి దుర్గాబాయి దేశముఖ్) కూడా విడుదలై వచ్చారు. అప్పటికే దుర్గాబాయమ్మగారు, సరోజినీనాయుడు కమలాదేవి చటోపాధ్యాయవలె దేశమంతటా స్వాతంత్ర్యసమరంలో గొప్ప నాయకురాలుగా ఖ్యాతినార్జించారు. ఆంధ్రదేశమంతటా ఆబాలగోపాలం ఆమె పేరు స్మరిస్తూ ఉండేవారు. ఆ రోజులలో ఆంధ్రదేశంలో స్త్రీలు పెద్దగా చదువుకొనుట తక్కువ. అలాగే దుర్గాబాయమ్మగారు కూడా మామూలు తెలుగు చదివే చదువుకున్నారు. హిందీని బాగా అభివృద్ధి చేసుకున్నారు. తమ ఆస్తినంతనూ జాతీయోద్యమానికి ఖర్చుచేసి త్యాగం, ధైర్యం పట్టుదలతో స్వాతంత్ర్యోద్యమంలో నాయకత్వం వహించారు. జైలునుంచి తిరిగి వచ్చిన తర్వాత ఆమె ఇంగ్లీషు చదువుకోవాలనుకున్నారు. కాని ఎలా? దుర్గాబాయమ్మగారికి అన్న వరసయగు దగ్గర బంధువు గోరా సహపాఠి. దుర్గాబాయమ్మగారి సోదరుడు గోరా విద్యార్థి. అప్పటికే గోరా జాతీయ భావాలు,, విప్లవాచరణ మొదలైనవాటి గురించి ఆమె వినియున్నారు. గోరాగారే తనకు తగిన ఉపాధ్యాయుడు కాగలరని ఆమె నిర్ణయించుకున్నారు. అయితే దుర్గాబాయిగారికి చదువు చెప్పడమంటే సామాన్యంకాదు. చదువనే మిషతో స్వాతంత్ర్యోద్యమ సందర్భంలో ఏమైనా కుట్ర పన్నుతున్నారేమోనని పోలీసులకు అనుమానం రావచ్చు. కనుక ఎలాంటి పరిణామాలకైనా సిద్ధపడాలి. దుర్గాబాయమ్మగారి సోదరులు గోరాను సంప్రదించగా ఆయన సంతోషంగా అంగీకరించారు. గోరా స్త్రీ విద్యా వ్యాప్తిని కోరే వ్యక్తిగనుక, తానామెను బెనారస్ మెట్రిక్‌కు పంపుతాననీ, అయితే ఎం.ఎ.వరకూ చదువుతానని ఆమె మాట ఇవ్వాలని ఆయన కోరారట. ఆమె అలాగే మాట ఇచ్చారట. ఇద్దరూ తమ మాటను నిలబెట్టుకున్నారు. గోరా 1934లో ఆమెను బెనారస్ మెట్రిక్‌కు పంపారు. తర్వాత ఆమె పట్టుదలతో ఎం.ఏ.బి.యల్, చదివారు. దుర్గాబాయమ్మగారితో పరిచయం వల్ల గోరా రాజకీయ రంగానికి మరింత సన్నిహితమయ్యారని చెప్పవచ్చు.

1932 నాటికి బహిరంగంగా కాకపోయినా, మిత్రుల గోష్టులలో నాస్తికత్వం గురించి తన అభిప్రాయాలు గోరా స్పష్టంగా చర్చిస్తూ ఉండేవారు.

---

★ శ్రీ గోరా షష్టిపూర్తి అభినందన సంచిక

ఒకసారి కాకినాడలో మంత్రిప్రగడవారి సత్రంలో విగ్రహారాధన కూడునా, కూడదా? అనే విషయమై సనాతనులు ఒక చర్చను ఏర్పరిచారు. విగ్రహారాధన అవసరమని వాదించినవారికి శ్రీ కాశీభట్ల బ్రహ్మయ్య శాస్త్రిగారు నాయకత్వం వహించారు. శ్రీ శాస్త్రిగారు ఆర్షవిద్యా ప్రవీణులు, గొప్ప తర్కశాస్త్ర వేత్తలు. విగ్రహారాధన కూడదు అని బ్రహ్మసమాజీకులు చాలామంది వాదించారు. వీరిలో శ్రీ పెద్దాడ రామస్వామిగారు, ప్రిన్సిపాలు వేమూరి రామకృష్ణారావుగారు ప్రముఖులు. ఈ సమావేశం ఐదురోజులపాటు జరిగింది. సమావేశానికి అటు సనాతన పండితులు, ఇటు బ్రహ్మసమాజికులు చాలామంది హాజరైనారు. కాలేజీ పాలక వర్గము, విద్యార్థులు కూడా ఈ సమావేశానికి హాజరయ్యారు. చర్చ చాలా తీవ్రంగా సాగింది. చివరిరోజు కాబోలు, గోరా కూడా మాట్లాడారు. భగవంతుడే లేనప్పుడు అనతు సాకారుడా, నిరాకారుడా అని చర్చించుటలో అర్థం లేదన్నారు. ఈ చర్చ ఎండమావిలోని నీరు మోకాలులోతా, నడుం లోతా అని వాదించుకున్నట్లుంది అని చెప్పి, దైవం అబద్ధమనీ, అది ఒక భావమనీ, మానవకల్పిత భావమనీ గోరా చెప్పారు. ఇంకేముందు, అటు సనాతనులకు, ఇటు బ్రహ్మసమాజికులకు కూడా గోరా మాటలు తీవ్రంగా కనిపించాయి. తమ కాలేజీ అధ్యాపకుడే ఇలా మాట్లాడడమా అని కాలేజీ అధికారులు కలతచెందారు. అయినా గోరా చలించలేదు. దైవం మానవకల్పితమైన ఊహ, అబద్ధం అనే తన భావాన్ని గోరా బహిరంగంగా చెప్పడం అదే ప్రథమం.

కాలేజీ విద్యార్థులు కొందరు విడిగా, ఒక లాడ్జి నడుపుకుంటూ ఉండేవారు. తమ లాడ్జితరుఫున 'ది క్రిటిక్' అనే వ్రాతపత్రిక ఒకటి ప్రచురించేవారు. ఆ పత్రిక సుమారు 20 కార్బన్ కాపీలు తీసి ముఖ్యమైన క్లబ్బులలోనూ, లైబ్రరీలలోనూ పెట్టేవారు. అలాగే కాలేజీలో కూడా ఒక ప్రతి యిచ్చేవారు. 1932 చివరలో గోరా ఆ పత్రికలో "On the Conception of God" అని ఒక చిన్న వ్యాసం వ్రాశారు. అందులో దైవం అబద్ధమనీ, అయితే అది ఒక ఉపయోగకరమైన అబద్ధమనీ, తనకు తెలీని విషయాలను దైవసృష్టి అని చెప్పి సంతృప్తి చెందుటకు, సమాజంలో నీతిని పెంపొందించుటకు, లలిత కళలు- సాహిత్యం అభివృద్ధి అగుటకు దైవభావం ఉపయోగపడిందనీ, ఎంత ఉపయోగం ఉన్నప్పటికీ అది అబద్ధం కనుక, అబద్ధాన్ని మూఢంగా నమ్మటచే మానవులు కష్టాలపాలు అవుతున్నారని గోరా వ్రాశారు. ఆంగ్లంలో వ్రాసిన ఆ వ్యాసం చాలా చిన్నదే. కాని అది కాకినాడలోని మేధావులకు చిచ్చు పెట్టినంత పని చేసింది.

1932 నవంబరు వరకూ డాక్టర్ వేమూరి రామకృష్ణారావు గారు ప్రిన్సిపాల్‌గా ఉండేవారు. నవంబరులో ఆయన రిటైర్ అయినారు. రామకృష్ణారావుగారు ప్రిన్సిపాల్‌గా

ఉన్నప్పుడు ఉపాధ్యాయుని కాలేజీ జీవితంవరకే ఆయన శ్రద్ధగా చూచేవారు. క్లాసులో క్రమశిక్షణ, మంచిఫలితాలు కాలేజీతో సత్సంబంధాలు, వీటి గురించే ఆయన పట్టించుకుని, వ్యక్తిగత భావాలకు స్వేచ్ఛ వదిలేవారు. అందుచేతనే గోరా నాస్తికభావాలు గురించి ఆయనకు తెలిసి కూడా వ్యక్తిగత స్వేచ్ఛకు ఉదారంగా వదిలివేసేవారు.

రామకృష్ణారావుగారి తర్వాత శ్రీ పెద్దాడ రామస్వామిగారు ప్రిన్సిపాలు అయినారు. ఆయన దృష్టికి 'ది క్రిటిక్'లో గోరా వ్రాసిన వ్యాసం వచ్చింది. గోరాని పిలిచి ఈ అభిప్రాయాలు మార్చుకోవలసిందిగా కోరారు. కాని గోరా ఏమీ సంకోచంలేకుండా – "అవి నా నిశ్చితాభిప్రాయాలు. వాటిని మార్చుకునే ప్రసక్తి లేదు. ఇతరులు హిందువులుగా, మహమ్మదీయులుగా, క్రైస్తవులుగా, తమ తమ అభిప్రాయాలు కలిగి ఉండుటను మీరు వ్యతిరేకించుట లేదు గదా. వారు తమ తమ అభిప్రాయాలను ప్రచారం చేస్తున్నట్లే నేనూ నా అభిప్రాయాలను ప్రచారం చేసుకుంటాను. కాలేజీలో నేనేమీ నాస్తికత్వం బోధించుటలేదు. కాలేజీలో నేను బోటనీయే చెబుతున్నాను. కాలేజీకి సంబంధించినంతవరకూ విద్యార్థుల క్రమశిక్షణలోగాని ప్యాసు ఫలితాలయందుగాని ఏమైనా లోపం ఉంటే చెప్పండి" అని స్పష్టం చేశారు.

గోరా నుంచి ఇంతకంటే భిన్నంగా ఎలా ఆశిస్తారు. అప్పటికే నాస్తికునిగా గోరా ప్రవర్తనవల్ల విద్యార్థులలో ఆత్మవిశ్వాసం, ఆత్మాభిమానం, స్వతంత్రభావాలు ఏర్పడ్డాయి. ఈ పరిణామాన్ని కాలేజీ అధికారులు హర్షించలేకున్నారు. ఇప్పుడు 'ది క్రిటిక్' లోని వ్యాసం వారికి ఒక ఆయుధంగా దొరికింది. ముందు జరగబోయేదేమిటో అందరికీ స్పష్టంగా తెలుసు. 1933 ఏప్రిల్ 1వ తేదీన కాలేజీ అధికారుల నుంచి గోరాకి శ్రీముఖం అందింది. అది మూడు నెలల నోటీసు. జూలై 2వ తేదీ నుంచి ఇక కాలేజీకి రానక్కరలేదని.

5 సం॥రాలు పనిచేసిన కళాశాల : అంతకుముందు తాము చదివిన కళాశాల : ప్రతీ చిన్న వస్తువు తన చేతులతో నిర్మించిన బోటనీ లేబరేటరీ: అన్నిటికీ దూరం. అయితేనేమి, తాను నమ్మిన ఆదర్శాలకు దూరం కావటంలేదు. ఇటుక, సున్నంతో కట్టిన కాలేజీ భవనాలకు దూరం కావచ్చు కాని తన విద్యార్థుల ప్రేమాభిమానాలకు ఎప్పుడూ సన్నిహితమే.



# సోషలిస్టు ప్రయోగం

ఏథెన్సు మహానగరంలో వీధులవెంట తిరుగుతూ మూఢంగా దేనినీ నమ్మవద్దు అనీ, అన్యాయం – అక్రమం ఎక్కడ ఉన్నా ఎదిరించమనీ తన తరంలోని యువకులకు ప్రబోధించాడు సోక్రటీసు. ఆనాటి దైవభావం మూఢనమ్మకంగా మారింది. కనుక తానా దైవాన్ని అంగీకరించను అన్నాడు సోక్రటీసు. తర్వాత విచారణలో అతనిపై నాస్తికుడని ఆరోపించబడితే – "నేను నాస్తికుణ్ణికాను. అయితే మీరందరూ నమ్మే దైవంవేరు; నేను నమ్మే దైవం వేరు" అని స్పష్టం కూడా చేశాడు. అయినా నాటి పరిపాలకులు, సంఘపెద్దలు సోక్రటీసు నూతన భావాలను అంగీకరించలేదు. విషం త్రాగి మరణించాలనే శిక్ష విధించబడింది.

పంథొమ్మిదవ శతాబ్దంలో ఆంగ్ల సాహిత్యంలో కవికుల చంద్రుడు పెర్సిబైసీ షెల్లీ, స్వతంత్ర ఆలోచనాపరుడుగా షెల్లీ ప్రసిద్ధి. విద్యార్థిగా నున్నప్పుడు షెల్లీ ఆలోచనాధోరణి దైవం ఉనికివైపు పోయింది. ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయంలో చదువుతూ ఉండగా "The Necessity of Atheism"- నాస్తికతావశ్యకత అని ఒక వ్యాసం 1811లో వ్రాసి ప్రచురించారు. అందులో ఏ ప్రమాణరీత్యా చూచినా దైవం ఉనికి సందేహాస్పదం అని ప్రకటించాడు. అంతే తత్వశాస్త్రాలు, విజ్ఞానశాస్త్రాలలో నూతన పరిశోధనలను ప్రోత్సహించే విద్యాసంస్థ కూడా షెల్లీ వ్యాసాన్ని, స్వతంత్రాలోచనను సహించలేకపోయింది. షెల్లీ ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయం నుంచి వెళ్ళగొట్టబడ్డాడు.

మార్చు గొప్పతత్వశాస్త్ర పండితుడు. హెగెల్ శిష్యుడు అతని పాండిత్యానికి ప్రేమించి ఒక జమీందారు కూతురు మార్చుని వివాహమాడింది. తాత్వికంగా భౌతిక

వాదం గురించి ఆర్థికంగా కార్మికులు - యజమాని సంబంధాల గురించీ స్వతంత్రంగా ఆలోచించసాగాడు. స్వదేశమైన జర్మనీ అతన్ని దేశంనుంచి వెళ్ళగొట్టింది. స్వాతంత్ర్యం-సమానత్వం-సౌభ్రాత్రం అనే సిద్ధాంతాలతో విప్లవం సాధించిన ఫ్రాన్సు కూడా అతన్ని బహిష్కరించింది. చివరకు లండన్‌లో తలదాచుకుని నికృష్టమైన పేదరికంలో మార్క్సు అతి దైన్యంగా జీవితం గడపవలసి వచ్చింది.

మహనీయుల కృషి ద్వారా సమాజం నిరంతరం పురోగమిస్తున్నా ఎప్పటికప్పుడు మౌఢ్యంలో చతికిలబడి కూర్చుంటుంది. తాతల మౌఢ్యాన్ని నిరసించేవారు మనుమల అభ్యుదయాన్ని హర్షించలేకున్నారు. ఇది మానవ చరిత్రలో మాటిమాటికి కనబడుతున్న విషయం. గోరాగారి సందర్భంలోనూ అంతే జరిగింది. సనాతన ధర్మంపై గొడ్డలి తీసుకుని విరుచుకుపడిన బ్రహ్మసమాజీకులు గోరాగారి భావాలను హర్షించ లేకపోయారు. ఆయనను ఉద్యోగంలోనుంచి తొలగించారు.

తన భావాలకు ఈ మూల్యం చెల్లించక తప్పదని గోరాగారికి తెలిసినా, ఇంత అకస్మాత్తుగా అది వచ్చి మీదపడుతుందని ఊహించలేదు. అయినా వచ్చిన పరిణామాన్ని చూచి భయపడి వెనక్కు తగ్గే ప్రసక్తేలేదు. ధైర్యంగా ఎదుర్కోనవలసిందే. 1933లో కాలేజీనుంచి తొలగింపబడిననాటికి గోరాకు ముగ్గురు సంతానం. పెద్దకుమార్తె మనోరమ్మ, పెద్దకుమారుడు లవణం, తర్వాత గాంధీ - ఇర్విన్ ఒడంబడిక అనంతరం పుట్టిన కుమార్తె - మూడవ సంతానానికి మైత్రి అని పేరు పెట్టారు. ఆ రోజుల్లో రెండువందలకు పైగా సంపాదిస్తున్న ఉద్యోగం ఒక్కసారి పోయేసరికి గోరా ఆలోచనలోనే పడ్డారు. డబ్బు కూడబెట్టే అలవాటులేదు కనుక పెద్ద బ్యాంకు బాలన్సు కూడా లేదు. కుటుంబ బాధ్యతేకాక కొంతమంది విద్యార్థులకు కూడా గోరాగారు సహాయంచేస్తూ ఉన్నారు. వారి సంగతి ఏమౌతుంది అనే ఆలోచన ఎక్కువైంది. అందులో ఒక విద్యార్థికి అతను ఎం.ఎస్.సి. పూర్తిచేసే వరకూ సహాయం చేస్తామని మాట ఇచ్చి ఉన్నారు.ఆయన ఇంకా ఒక సంవత్సరం చదవవలసి ఉంది. అయినా తాను చదువు మానేస్తానని, తన గురించి ఆలోచించవద్దు అనీ గోరా, సరస్వతిగార్లకు చెప్పాడట. కాని అతని చదువు కొనసాగి తీరుతుందనీ, ఏవిధంగానూ నిరుత్సాహపడవద్దనీ అభయమిచ్చారు. సరస్వతిగార్కి వివాహసమయంలో పెట్టిన నగలు ఆమె ధరించకపోయినా ఇంకా అలాగే ఉన్నాయి. వాటిని అమ్మి ఆ విద్యార్థి చదువుకు అవసరమైన డబ్బు ఇచ్చి, తన విద్య కొనసాగించి ఘనవిజయం పొందమని ఆశీర్వదించి పంపారు. గోరా తన విద్యార్థుల యెడల చూపిన ప్రేమాభిమానాలు - బాధ్యతకు ఇది ఒక నిదర్శనం. జీవితాంతం తమ సహచరుల యెడల వారు అట్టి బాధ్యతాయుత వైఖరినే అవలంబించారు.

గోరా తను కుటుంబ పోషణకై వెంటనే చేయగలిగింది ఉపాధ్యాయవృత్తే. అందుచేత గోరా పాత విద్యార్థులు తాము పూర్తిగా సహకరిస్తామనీ, ఒక ట్యుటోరియల్ కాలేజీని నడుపుదామనీ సలహాఇచ్చారు. ఇందుకు బాధ్యత మీద వేసుకుని తీవ్రంగా కృషి చేసినది గోరా పూర్వవిద్యార్థి (కీ.శే.) శ్రీ ముప్పిడి భాస్కర రామారావు, భాస్కరరామారావు అప్పటికి బి.ఎస్.సి ప్యాసైనారు. అప్పటికి ఆంధ్రదేశంలో నాటకాలలో స్త్రీ పాత్రలు వేసి దుఃఖరసాన్ని మెప్పించుటలో సాటిలేనివారుగా పేరుపొందిన ముప్పిడి జగ్గరాజుగారి పుత్రులు. వారికి గోరా అంటే చాలా అభిమానం. భాస్కర రామారావుకు అమిత గురుభక్తి. మంచిజీతం రాగల ఉద్యోగంలోనికి వెళ్ళే యోగ్యత ఉన్నప్పటికీ తన కుమారుడు గోరాకు కుడి భుజంగా నిలవడాన్ని జగ్గరాజు గారు హర్షించి ప్రోత్సహించారు. గోరా-భాస్కరరామారావుల సన్నిహితత్వాన్ని గురించి కొంతమంది విచిత్రంగా అనుకున్న సంఘటన ఒకటుంది. భాస్కరరామారావు తెల్లగా అందంగా ఉండేవారు. స్వచ్ఛమైన ఉచ్ఛారణ, మంచి మర్యాదగల ప్రవర్తన-అలవాట్లు. దీనితో గోరాకు కులాభిమానం అపాదించి కొందరు ప్రచారం చేశారు. "నువ్వు బ్రాహ్మణుడివి కనుక ఆయన అంత సన్నిహితంగా చేరదీశారు" అని కొందరు భాస్కరరామారావుతో మొహంముందు అన్నా, ఆయన నవ్వి ఏమీ సమాధానం చెప్పకుండా ఊరుకునేవారు. కొంతకాలానికి భాస్కర రామారావు 'కాపు' కులానికి చెందినవారని తెలియగా, తమతొందరపాటుకు వారెంతో సిగ్గుపడి, పశ్చాత్తాపపడ్డారు.

1933 జూలైలో ఆంధ్ర ట్యుటోరియల్ కాలేజీ ప్రారంభించబడింది. గోరా, భాస్కర రామారావు కాక మరి 12మంది ఉపాధ్యాయులు వీరిలో పదిమంది పూర్వవిద్యార్థులే. ఈ ట్యుటోరియల్ కాలేజీని సోషలిస్టు ఆదర్శాలపై నడిపారు. కాలేజీలో ప్యూన్‌లు ఎవరూ లేరు. గదులు ఊడవడం, మంచినీళ్ళు పెట్టడం నుంచి అన్ని పనులూ కూడా 14 మంది ఉపాధ్యాయులూ వంతులవారీగా చేసేవారు. ప్రతీనెలా వచ్చిన ఆదాయంలో ఖర్చుపోను మిగిలినది 14 మంది ఉపాధ్యాయులూ సమానంగా పంచుకునేవారు. నెలకు ఒక్కొక్కరికి రు.25-30 లు మధ్యలో వచ్చేది.

ట్యుటోరియల్ కాలేజీ స్వతంత్రజీవనం కావడంతో ఇతర బంధనాలు ఏవీలేవు గోరాకు. అందుచేత దుర్గాబాయమ్మగారు చేసిన సంఘసేవాకార్యక్రమాలలో గోరా ఎక్కువ సమయమిచ్చి పాల్గొనేవారు. అప్పటికి వీరేశలింగంగారు ఎంత కృషి చేసినప్పటికీ ఇంకా విధవా పునర్వివాహాలు పెద్ద సమస్యగానే ఉండేవి. దుర్గాబాయమ్మగారు ఈ సమస్యపై తీవ్రంగా కృషి చేస్తున్న రోజులవి. ఉప్పాడకు చెందిన పుత్సల సత్యనారాయణ, వారి తల్లిదండ్రులు దుర్గాబాయమ్మగారితో కలసి ఈ సంస్కరణకు తోడ్పడుతూ ఉండేవారు. పుత్సల సత్యనారాయణ మారు వేషాలలో

వెళ్ళి, ఎక్కడైనా విధవలు పునర్వివాహం చేసుకోవాలనే కోర్కె ఉన్నప్పటికీ, కుటుంబ కట్టుబాట్లతో బయటకు రాలేని స్థితిలో ఉంటే, అలాంటివారిని కలుసుకుని రహస్యంగా ఇంటి నుంచి తప్పించి తీసుకువచ్చేవారు. వారందరికీ ఆశ్రయం దుర్గాబాయమ్మగారి ఇల్లు. వివాహం బహిరంగంగానే జరిగేది. గోరా, సరస్వతిగార్లు అలాంటి వివాహాలకు హాజరవుతూ, వధూవరులను తమ ఇంటికి భోజనానికి పిలిచి సన్మానించేవారు. ఎవరు సాంఘికంగా వెలిబడ్డా గోరావారిని ఆహ్వానించి, పదిమంది స్నేహితులతో విందు చేసేవారు. ఈవిధంగా సంఘ సంస్కరణలో ముందుకువచ్చేవారికి అభయమిచ్చేవారు.

ఆ సంవత్సరమే గాంధీజీ హరిజన యాత్రలో ఆంధ్రదేశం వచ్చారు. సాంబమూర్తి, దుర్గాబాయమ్మగారు బ్రహ్మజోస్యుల సుబ్రమణ్యంగారు, రంగయ్యగారు తూర్పు గోదావరి జిల్లా ఏర్పాట్లు చూశారు. అప్పుడు కాకినాడ, రాజమండ్రి, సీతానగరంలో గాంధీజీకి ప్రైవేటు వాలంటీర్లలో ఒకరుగా గోరా పనిచేశారు. గాంధీజీని, వారి దినచర్యను సన్నిహితంగా చూచుటకు గోరాకు లభించిన తొలి అవకాశమది. అప్పటికి గాంధీజీ మహాత్ముడై 13 సంవత్సరాలు అయింది. అయినప్పటికీ ఆయన ప్రజలకు అతిసన్నిహితంగా మసలేవారు. అప్పుడు కొవ్వూరు స్టేషనులో రద్దీగా వున్న 3వ తరగతి రైలు పెట్టెలో గాంధీజీ ఎక్కడం గోరా చూచారు. గాంధీజీ ఎక్కగానే అందులో కూర్చున్నవారు లేచి గాంధీజీకి ఒక బల్ల ఖాళీచేసి ఇచ్చారు. గాంధీజీ సామాన్యులకు తమతో కలిసి ప్రయాణం చేయటం వారికెంతో సంతృప్తినీ, సంతోషాన్ని కలిగించింది. గాంధీజీకీ స్పెషల్ కంపార్టుమెంటులు, స్పెషలురైళ్ళు 1942 ఉద్యమం తర్వాతనే. అంతకు ముందు మామూలు జనంతోనే కలిసి కూర్చునేవారు. నిరాడంబర జీవితంలో తన కార్యకర్తలకు గాంధీజీ ఉత్కృష్టమైన ఆదర్శం చూపారు. కాని గాంధీజీ పేరు చెప్పుకొని అధికారం సంపాదించిన వారికి గాంధీజీ చూపిన ఆదర్శం మాత్రం ఎక్కడం లేదు.

ఉద్యోగంలో నుంచి తొలగించిన తర్వాత నాస్తికత్వం గురించి గోరా ఇంకా అధికంగా కృషి ప్రారంభించారు. ఆ రోజుల్లో కాకినాడలో ఎక్కువగా స్వాములవార్లు వచ్చి ఉపన్యాసాలు ఇస్తూ ఉండేవారు. గోరా ఆ సమావేశాలకువెళ్ళి స్వాములవార్లను ప్రశ్నలు వేసి చర్చించేవారు. చాలామందికి కోపం వచ్చేది. కొంతమంది గోరాని దూషించేవారు. మరి కొంతమంది గోరాని తప్పించుకునేవారు. అప్పుడు మూఢభక్తులు వెర్రి కోపంలో గోరా మీద ఏమైనా దౌర్జన్యం చేస్తారేమోనని భయం కూడా ఉండేది. అందుచేత యువజన సంఘం యువకులు గోరాకు ఎప్పుడూ అండగా ఉండేవారు. ఆ సంఘంలోని చాలామంది గోరా పూర్వ విద్యార్థులే.

ఒకప్రక్క వివిధ రంగాలలో స్వేచ్ఛగా గోరా పురోగమిస్తున్నప్పటికీ, వారి మిత్రులు చాలామంది గోరాని ఉద్యోగం నుంచి తీసివేయుటలో అన్యాయం జరిగిందని భావించారు. తర్వాత భారతదేశం రాష్ట్రపతిగా ఉన్న డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్‌గారు ఆ రోజుల్లో ఆంధ్ర విశ్వవిద్యాలయం వైస్‌చాన్సలర్‌గా ఉండేవారు. గోరా గొప్ప ఆచార్యునిగా పేరు పొందడంచేత యూనివర్శిటీ అంతా వారు బాగా తెలుసు. తాత్వికునిగా భావస్వాతంత్ర్యాన్ని, విద్యావేత్తగా స్వతంత్ర ఆలోచనాశక్తిని ప్రేమించే రాధాకృష్ణన్ గోరాకి అన్యాయం జరిగిందని బాధపడి ఆయన యెడల సానుభూతిచూపారు. ఒకప్రక్క రాధాకృష్ణన్ శ్రద్ధతీసుకోవడం, మరోప్రక్క ఆంధ్రదేశంలో వివిధకాలేజీలలో ఉన్న ప్రముఖులు గోరాకి ఏదైనా కాలేజీలో స్థానం కల్పించాలని పూనుకోవడంతో, గోరా మరికొంత కాలం వరకూ విద్యారంగానికి సేవచేయగల సదవకాశం లభించింది. బందరు హిందూ కళాశాల ప్రిన్సిపాలు శ్రీ కాజ శివర్రామకృష్ణారావుగారు, కాలేజి కమిటీ సభ్యులు గోరాని తమ కాలేజీకి తీసుకురావాలని తీవ్రంగా ప్రయత్నించారు. అయితే తమ కాలేజిలో వృక్షశాస్త్రంలేదు. గోరాని తీసుకువచ్చుట కొరకు వృక్షశాస్త్రం ప్రారంభించదలిచారు. కాలేజిలో కొత్త శాఖ దేనిని ప్రారంభించాలన్నా యూనివర్శిటీ కమీషను ఒకటి పరిశీలించి అంగీకరిస్తూ రిపోర్టు పంపాలి. మద్రాసు విశ్వవిద్యాలయానికి చెందిన డాక్టర్ ఏకాంబర కమీషన్‌గా వచ్చారు. వారికి గోరా చాలా సన్నిహితులు. విద్యారంగంలో స్వతంత్రభావాలు కలిగియున్నందుకు గోరాకు అన్యాయం జరిగిందని అందరికీ తెలిసిందే. కనుక లాంఛనాలన్నీ అతి త్వరగా పూర్తి అయ్యాయి. 1934 విద్యాసంవత్సరం నుంచే బందరు హిందూ కళాశాలలో బోటనీశాఖ ప్రారంభించుటకు నిర్ణయం జరిగింది. అప్పుడు గోరా ట్యుటోరియల్ కాలేజీ ఇతర మిత్రులకు అప్పగించి, 1934 జూలైలో బందరు హిందూ కళాశాలకు వచ్చారు. ఇది గోరాకి, విద్యారంగంలో భావస్వాతంత్ర్యం నిలపాలని ప్రయత్నించిన వారికీ ఘనవిజయం.



# బందరు రాక-నూతన కాలేజీకై కృషి

గోరా 1934లో బందరు హిందూ కాలేజీలో ప్రవేశించారు. డాక్టరు పట్టాభిసీతారామయ్యగారు, కృష్ణాపత్రిక సంపాదకులు ముట్నూరి కృష్ణారావుగారు మొదలైనవారి కార్యక్షేత్రం అది. భారతదేశంలో ఆంగ్లేయులు తొలిగా కాలూనిన భూమి అది. ఆంధ్రదేశంలో తొలి కళాశాల నోబుల్ కాలేజీ ప్రారంభించబడిన పట్టణమది. భారతదేశంలో గాంధీజీ ఉద్యమం ఆరంభమగుటకు ముందే జాతీయ విద్యావిధానం, వృత్తివిద్యా శిక్షణ ప్రాధాన్యతను గుర్తించి శ్రీ కోపల్లె హనుమంతరావుగారు దక్షిణాది కంతకూ తొలి జాతీయ కళాశాలను స్థాపించిన ప్రదేశమది. గోరా రాకతో నాస్తికత్వం వ్యాపింపజేయుటకు కూడా అది కేంద్రమైంది.

గోరా బందరు వచ్చిన ఆరు నెలలకే వారి మేనత్తయగు జోగమ్మగారు సుమారు 75 సంవత్సరాల వయస్సులో గోరా వద్దనే మరణించారు. జోగమ్మగారు చిన్నతనంలోనే వితంతువు కావడంతో, తన తమ్ముడగు వెంకట సుబ్బారావుగారి పిల్లలందరూ ఆమె వద్దనే పెరిగారు. అందులోనూ గోరా అంటే ఆమెకు పిచ్చి ప్రేమ. గోరా కోయంబత్తూరులో కాపురం పెట్టినప్పుడు ఈమె వారి వద్ద ఉన్నారు. కాకినాడలో కలిసే ఉన్నారు. గోరా బందరు రావడంతో జోగమ్మగారు కూడా తన మేనల్లుని వద్దకు వచ్చారు. గోరా జోగమ్మగారిని బెదిరించి లొంగదీసిన సంఘటన ఒకటి ఉంది. జోగమ్మగారు మొదటినుంచీ పూజాపునస్కారాలు చేస్తూ ఉండేవారు. ఆమెకు కామేశ్వరమ్మ 'దేవత' పూనేదట. ఆ సమయంలో అవి చెయ్యమనీ, ఇవి చెయ్యమనీ తెగ ఆజ్ఞాపించి అధికారం చెలాయించేవారు. 'దేవత' యందు విపరీతమైన భక్తి గల సుబ్బారావు గారు తన అక్క చెప్పినట్లల్లా చేసేవారు. చిన్నప్పుడు పిల్లలందరూ కూడా

ఆమె ఆజ్ఞలను అనుసరించేవారే. అవి కోరంటికపు రోజులు అవడంతో గోరా తల్లి రాజ్యలక్ష్మి గారు ఎంత చేసినా, కామేశ్వరమ్మ పూనకం పేరుతో ఆమెను ఇంకా రాచి రంపాన పెట్టేవారు. చిన్నప్పుడు సహించినా, నాస్తిక భావాలతో కొలంబో నుంచి తిరిగి వచ్చిన గోరా ఇది సహించలేక పోయారు. గోరాకు పూనకాలలో నమ్మకం పోయింది. పూనకాలంటే మనోద్రేకం, భావోద్రేకం కొంతా, నటన కొంతా అని ఆయన అభిప్రాయం. కొలంబో నుంచి కాకినాడ తిరిగివచ్చిన కొత్తలోనే, ఒకరోజు మధ్యాహ్నం గోరా కాలేజినుంచి ఇంటికి వచ్చేసరికి మేనత్తు జోగమ్మగారు కామేశ్వరమ్మ పూనకంలో పూజాగృహంలో ఉన్నారు. ఆ పూనకం రూపంలో రాజ్యలక్ష్మి గారిని నిందిస్తున్నారు. గోరా రక్తం ఉడికిపోయింది. కాలిబూట్లు అయినా విప్పకుండా ఒక పేముబెత్తం పుచ్చుకుని గబ గబా తలుపులు తెరుచుకుని పూజాగృహంలో ప్రవేశించారు. "మళ్ళా ఈ ఇంట్లోకి కామేశ్వరమ్మ పూనకం వచ్చిందంటే తరిమేస్తాను. జాగ్రత్త" అన్నారు. జోగమ్మగారు నిశ్చేష్టురాలై కొయ్య బారిపోయారు. కోపంతో ఎర్రగా కందిపోయిన గోరా ముఖం చూచి ఇంట్లోనే ఉన్న తండ్రి సుబ్బారావుగారు కూడా ఏమీ మాట్లాడలేదు. అంతే! ఆనాటి నుంచీ మళ్ళా కామేశ్వరమ్మ అడుగు పెట్టలేదు. ఈ సంఘటన వల్ల జోగమ్మ గారికి చాలా కాలం వరకూ గోరా అంటే కోపం ఉండేది. కాని గోరా నిర్మల హృదయం ఆమెను ఆకర్షించింది. చివరి రోజులలో ఆ కోపం అంతా పోయింది. గోరా, సరస్వతిగార్లంటే వెర్రి అభిమానం ఏర్పడింది. చివరికి ఆమె గోరా - సరస్వతిగార్ల చేతులలోనే మరణించింది. ఆఖరి క్షణాలలో తల గోరా ఒడిలో నుండగా రొమ్మును, సరస్వతిగారు కాచుతుండగా ఆమె ప్రాణాలు విడిచారు.

జోగమ్మగారి శవాన్ని శ్మశానానికి తీసుకువెళ్ళి దహనం చేయడం మినహా గోరా మరేమీ చేయదలచుకోలేదు. ప్రొద్దున్న ఆ దారిన వెళుతున్న శ్రీ చెరుకువాడ వెంకట నరసింహంగారు, కాలేజి ఉపాధ్యాయులు శ్రీ పుచ్చా శివరామకృష్ణయ్యగారు ఈ వార్త తెలిసి గోరా ఇంటికి వచ్చారు. ఈలోగా విద్యార్థులు కూడా కొంతమంది వచ్చారు. జోగమ్మగారి శవాన్ని శ్మశానం వరకూ వీరే మోసుకుని వెళ్ళారు. వీరిలో వేరు వేరు కులాల వారున్నారు. సనాతన సంప్రదాయావలంబులగు మిత్రులు జోగమ్మ గారి అస్తి సంచయనం చేయమని ఎంత చెప్పినా గోరా వినలేదు. ఏ విధమైన కర్మకాండ గోరా జరుపకపోవడం అందర్నీ ఆశ్చర్యపరిచింది. నాస్తికత్వం గురించి ఎంతచెప్పినా, మామూలు కర్మకాండలు యథా ప్రకారం జరపగలరని అందరూ ఆశించారు. కాని గోరా ప్రవర్తన వారు అనుకున్న దానికి భిన్నంగా వుంది. ఇది బందరు పట్టణంలో చర్చనీయాంశమై అందరి దృష్టిని ఆకర్షించింది. బందరులో బోటనీ డిగ్రీ తరగతులు లేకపోవడం వల్ల గోరాకి చాలా తీరిక ఉండేది. అందుచేత నాస్తికత్వం గురించి

వాదనకు, ప్రతివాదనకు విరివిగా వివిధ విషయాలను చదవసాగారు. నాస్తికత్వం ప్రచారం కొరకు తొలిసభ 1935లో విశాఖపట్టణం హిందూపఠన మందిరంలో ఏర్పాటు చేయబడింది. సభ రెండురోజులు జరిగింది. తొలి దినం రెండు గంటలకు పైగా మాట్లాడి, గోరా దైవం మానవకల్పితమైన భావమనీ, అది మానవుని పరాధీన ప్రవృత్తికి సూచన అనీ, దైవభావంతో ప్రమేయం లేకుండా నీతిని సాంఘిక నియమంగా నిలపవచ్చుననీ ప్రతిపాదించారు. రెండవ రోజు ప్రతిపాదింపబడిన విషయంపై సభికుల ప్రశ్నలకు గోరా సమాధానాలు యిచ్చారు. అన్నిటికీ జవాబు చెప్పారు. కాని ఐరోపీయ తత్వశాస్త్రంలో ఒకనొక ప్రత్యేక విషయమై అడిగిన ప్రశ్నకు గోరా "ఆ విషయమై నాకు తెలీదు. మీకు తెలిస్తే చెప్పండి. ఇద్దరం కలిసి ఆలోచిద్దాం" అన్నారు. అయితే ఆ ప్రత్యేక విషయమై తనకు వివరాలు తెలియవని ప్రశ్నకర్త అన్నారు. తనకు తెలియని విషయం తెలియదని గోరా ధారాళంగా అంగీకరించడం సభికులందరూ హర్షించారు. నాస్తికత్వం గురించి సభికులు సీరియస్‌గా ఆలోచించేటట్లు చేయడంలో సౌజన్యం మూర్తీభవించిన గోరా ప్రవర్తన కూడా తోడ్పడింది. నాస్తికత్వంపై కాకినాడలో గోరా భావాలు విన్న మిత్రులు ఈ ఉపన్యాసాన్ని ఏర్పాటు చేశారు. విశాఖపట్టణం యూనివర్శిటీ గల విద్యా కేంద్రం కనుక మేధావులు విషయాన్ని చర్చించుట ద్వారా గోరాకి మరింత బలం చేకూరగలదని సమావేశ కర్తల ఉద్దేశం. ఈ ఉద్దేశం పూర్తిగా నెరవేరింది. నాస్తికోద్యమ చరిత్రలో విశాఖపట్టణంలో గోరా చేసిన తొలి నాస్తికోపన్యాసం చిరస్థాయిగా నిలచిపోతుంది.

* * *

విద్యారంగంలో పది సంవత్సరాలు అనుభవం గడించిన గోరాకి ఆదర్శ విద్యాసంస్థను - ఒక కాలేజీని - నెలకొల్పాలనే ఉద్దేశం కలిగింది. అప్పటికి పశ్చిమగోదావరి జిల్లా మొత్తానికి ఒక్క కళాశాల కూడా లేదు. అందుచేత భీమవరంలో 'గౌతమ కళాశాల' అనే పేరుతో కాలేజీ నెలకొల్పుటకు నిర్ణయించి ఒక కమిటీ ఏర్పరిచారు. డిప్యూటీ కలెక్టరుగా రిటైరు అయి, క్రమశిక్షణకు, నీతి - న్యాయాలకు పేరుపొందిన శ్రీ అల్లూరి రామ కృష్ణరాజు ఈ కమిటీకి అధ్యక్షులు. డాక్టర్ పాలకోడేటి సత్యనారాయణశర్మ కార్యదర్శి. గోరా దీనికంతకూ ప్రధాన సూత్రధారి. అయినప్పటికీ, వేరే కళాశాలలలో పనిచేస్తూ ఉండటం చేత కమిటీలో ఒక సభ్యునిగా మాత్రమే ఉన్నారు.

కాలేజీ కమిటీ తయారుచేసిన పాలకవర్గ నిబంధనావళిలో కాలేజీ నిర్వహణ ఐదు ఉపసంఘాల మీద ఆధారపడి ఉండాలని వ్రాశారు. 1. దాతల సంఘం 2.

సంరక్షకుల సంఘం 3. పూర్వ విద్యార్థుల సంఘం 4. ప్రస్తుత విద్యార్థుల సంఘం 5. కాలేజీ ఉపాధ్యాయుల సంఘం. ఈ ఐదు సంఘాల నుంచి ప్రతినిధులు కార్యనిర్వాహక సమితికి ఎన్నుకోబడతారు. కార్యనిర్వాహక సమితి సభ్యునిగా ఎన్నుకోబడుటకు ఈ క్రింది అర్హతలలో ఏవో రెండు ఉండాలి. పట్టభద్రులైనా అయి ఉండాలి, సంవత్సరానికి రెండు వేల రూపాయల ఆదాయం వచ్చేవారైనా అయి ఉండాలి. 40 సంవత్సరాల వయసు దాటినవారైనా అయి ఉండాలి. లేదా నాలుగింట మూడువంతుల మెజారిటీతో ఎన్నుకోబడాలి. ఈ చివరి అర్హత ముఖ్యంగా ప్రస్తుత విద్యార్థి కార్యనిర్వాహకవర్గం లోనికి వచ్చుటకు అవకాశమిస్తుంది. ఉపాధ్యాయులందరూ ఒక సహకార సంఘంగా ఏర్పడుతారు. కాలేజీ పాలకవర్గం ఉపాధ్యాయులకు యూనివర్శిటీ నిర్ణయించిన ప్రకారం జీతాలు ఇచ్చేస్తుంది. కాని, ఉపాధ్యాయులు తమ తమ జీతాలన్నీ ఉపాధ్యాయుల సహకార సంఘానికి ఇచ్చేస్తారు. దానినుండి తమతమ అవసరాలననుసరించి తీసుకుంటారు. బ్రహ్మచారి అయితే ఇంత, భార్యాభర్తలకు ఇంత, ఒక్కొక్క బిడ్డకు ఇంత, వీరిపై ఆధారపడిన తల్లిదండ్రులు, అక్కచెల్లెళ్ళు, తమ్ముళ్ళు ఎవరైనా ఉంటే వారికి ఒక్కొక్కరికి ఇంత అని సహకార సంఘంలో నిర్ణయించుకుంటారు. దాని ప్రకారం ఉపాధ్యాయులు తీసుకుంటారు. దీనివల్ల అసలు జీతం తక్కువ అయినా కుటుంబం పెద్దది అయితే సహకార సంఘం నుంచి ఎక్కువ డబ్బు వస్తుంది. అసలు జీతం ఎక్కువ అయినా కుటుంబం పెద్దదికాకపోతే సంఘదృష్టితో తక్కువ తీసుకుంటారు. సహకార సంఘం సభ్యులందరికీ జీవితభీమా కడుతుంది. ఉచిత వైద్య సదుపాయం చేస్తుంది. కాలేజీ తమ ఉపాధ్యాయులకు ఉచిత గృహ వసతి, వారి పిల్లలకూ, సంరక్షణలో నున్నవారికీ ఉచిత విద్యా సౌకర్యం చేస్తుంది. విద్యార్థులందరూ ఏదో ఒక చేతివృత్తిలో శిక్షణ పొందుట నిర్బంధమౌతుంది. ఇలా అందరి మధ్యా సహకారం, సౌభ్రాత్రం సమానత్వం ఉండేట్లుగా నిబంధనావళి రూపొందించారు. ఇదే విజయవంతమై ఉంటే విద్యారంగంలో గొప్ప విప్లవాన్ని సాధించిన ప్రయోగమై ఉండేది.

కమిటీవారు ముందుగా ఒక లక్షరూపాయలు వసూలు చేస్తే యూనివర్శిటీ కాలేజీని ప్రారంభించుటకు పర్మిషను ఇస్తుంది. వసూళ్ళను కూడా ప్రతీ శని ఆదివారాలలోనూ కమిటీసభ్యులతో పాటు గోరా ప్రముఖంగా వెళ్ళేవారు. విరాళాల సేకరణ సందర్భంలో జరిగిన ఒక సంఘటన కాలేజీ రూపొందక పోవుటకు ప్రధాన కారణాలలో ఒకటైంది. విరాళాల వసూలు ప్రారంభించిన కొత్తలోనే గోరా ఒకరివద్దకు విరాళమడుగుటకు వెళ్ళారు. ఆయన లక్షాధికారి. విద్యాధికుడు. ఆయన కాలేజీకి 65 వేల రూపాయలు విరాళం ఇచ్చుటకు కూడా ముందుకు వచ్చారు. అయితే ఒక

షరతు పెట్టారు. గోరా తిరిగి జంధ్యం వేసుకోవాలని. "ఈ కాలేజీకి మీరు ప్రధాన వ్యక్తిగా ఉంటారు. అందుచేత మిగిలిన వారు సహజంగానే మిమ్ములను ఆదర్శంగా పెట్టుకుంటారు. మీరు జంధ్యం తీసివేశారు కనుక మీలాగే మిగిలినవారూ తీసివేయవచ్చు. అది నేను హర్షించలేను. ఇదీ ఆయన వాదన. ఆయన వరకూ ఆ వాదన సరియైనదే. కాని గోరా తన విషయంలో స్థిరసంకల్పుడు. "మీ సూచనను నేను ఆమోదించలేను. 65వేలు ఇస్తే జంధ్యం వేసుకున్నాడు అని మీరు అనుకునేకంటే, 65వేలు ఇస్తానన్నా జంధ్యం వేసుకోనన్నాడు అని మీరు అనుకోవడమే నేను వాంఛిస్తాను. అందుచేత క్షమించండి. నాస్తికదృక్పథాన్ని నేను వదులుకోలేను." అని మృదువుగాను స్పష్టంగాను గోరా తెలిపారు. ఈ సంఘటనపై గోరా తీవ్రంగా ఆలోచించారు. తాను నాస్తిక దృక్పథాన్నే అవలంబించదలచుకుంటే సంస్థలను నిర్మించడంగాని, సంస్థలలో పనిచేయడం గాని సాధ్యంకాదని గోరాకు అర్థమైంది. సంస్థలను నిర్మించాలంటే అందుకు అవసరమైన అవకాశాలు సంపాదించుటకొరకు ఎన్నో రాజీలు పడవలసి వస్తుంది. దృఢాభిప్రాయాలు గలవారు, వాటిని జీవితాచరణ దృక్పథంగా తీసుకున్నవారు మూలవిషయాలలో రాజీపడలేరు. గోరా జీవితం పొడుగునా ఈ సంఘర్షణ కనపడుతుంది. ఆయన ఎప్పటికప్పుడు అవకాశాలు వదులుకున్నారుగాని ఆశయాల నుంచి సడలలేదు. అందుచేత ఈ కాలేజీ విషయంలో కూడా ఆయన ఒక నిర్ణయానికి వచ్చి కమిటీలోని సహచరులందర్నీ సంప్రదించారు. తాను కమిటీలో నుంచి వైదొలుగుతానని చెప్పారు. తాను ప్రధానపాత్ర వహించకుండా దూరంగా ఉండి కాలేజీ అభివృద్ధికి చేయగలిగిన సహాయం అంతా శక్తి వంచన లేక చేస్తానని చెప్పారు. మిగిలిన వారందరూ కాలేజీ నిర్వహణ నియమావళి ఆదర్శాలు అంగీకరించారు కనుక తాను లేకుండానే కాలేజీ స్థాపనకు ప్రయత్నాలు కొనసాగించమని గోరా కోరారు.

అయితే అనతికాలంలోనే ఘోరవిపత్తు జరిగింది. కాలేజీ కమిటీ అధ్యక్షులైన రామకృష్ణరాజు హత్యకావింపబడ్డారు. ఆయన పంచాయతీబోర్డులో ఉంటూ అతి నీతివంతంగా పరిపాలించాలని ప్రయత్నించగా, అవినీతికర శక్తులు ఆయనను తమ దారినుంచి తొలగించాయని వినికిడి. ఆయన అతి క్రూరంగా చిత్రవధ చేయబడ్డారు. దీనితో ఆదర్శయుతమైన విద్యాసంస్థను నెలకొల్పాలనే కృషి నిలిచిపోయింది. రామకృష్ణరాజు బ్రతికి ఉంటే గోరా ఆశించినట్లు కాలేజీ రూపొంది ఉండేది. కాని అది జరగలేదు.



# నాస్తిక ప్రచారం

**1935**-36లలో గౌతమ కళాశాల గురించి గోరా సమయం అంతా వెచ్చించి తీవ్రంగా కృషిచేశారు. ఆ కృషి విజయవంతమై యుండినప్పటికీ కాలేజీ నిర్వహణను మిత్రులకు అప్పగించి తాము నాస్తికత్వ ప్రచారం, అస్పృశ్యతా నిర్మూలనలను చేపట్టేవారు. అలాంటి ఆదర్శాలతో ఒక కళాశాల ఉండాలని మాత్రమే గోరా వాంఛ. ఈ విషయం ఇతర మిత్రులకు ఆయన ముందుగా చెప్పారు. కళాశాల ప్రయత్నం విరమింపబడిన తర్వాత మరల గోరా తన సమయాన్ని నాస్తిక చర్చలవైపు మళ్ళించారు.

1936లో దేశమంతటా ఎన్నికలు జరిగాయి. కాంగ్రెస్ ఆ ఎన్నికలలో పోటీచేసి ఘనవిజయం సంపాదించింది. ఆ ఎన్నికలలో గోరా తన విద్యార్థులను వెంట పెట్టుకుని కాంగ్రెసు పక్షాన తీవ్రంగా పనిచేశారు. కాంగ్రెసు ఎన్నికలలో సాధించిన ఘనవిజయానికి చిహ్నంగా 1936 డిశంబరులో జన్మించిన రెండవ కుమారునికి (5వ సంతానం) విజయం అని పేరు పెట్టారు. అంతకు పూర్వం బందరు వచ్చుటకు ముందు 1934లో పుట్టిన తృతీయ కుమార్తెకు (4వ సంతానం) విద్య అని పేరు పెట్టారు. కాకినాడ కాలేజీ నుంచి తొలగించుటతో తాత్కాలికంగా ట్యుటోరియల్ కాలేజీ పెట్టినా, విద్యారంగాన్ని వీడవలసి ఉంటుందని గోరా అనుకున్నారు. కాని తిరిగి బందరు రావడంతో విద్యారంగంలోనే కొనసాగుతున్నందుకు సూచనగా విద్య అని పెట్టుకున్నారు.

ఆ రోజులలో బందరులో ఎక్కువగా స్వాములవార్ల ఆస్తికోపన్యాసాలు జరుగుతూ ఉండేవి. అవి వేదాంత గోష్ఠులుగా ఉండేవి. వారి వాదనలు విని, ప్రశ్నలు వేసి

తనకు తెలియని విషయాలు తెలుసుకుందామనే జిజ్ఞాసతో గోరా వాటికి వెళ్ళేవారు. కాని ప్రతీ సందర్భంలోనూ స్వాములవార్ల అసహనమే ఎదురయ్యేది.

ఒకసారి ఒక స్వాములవారిని గోరా బ్రహ్మ అర్థం గురించి ప్రశ్నవేశారు. దాని కాయన ఉగ్రుడై "నువ్వు నాస్తికుడిలా ఉన్నావు. నీకు సమాధానం చెప్పను. ఇక్కడనుంచి పో'' అన్నారు. అందుకు గోరా 'నేను నాస్తికుడ నైనప్పటికి విషయం తెలుసుకొనవచ్చునుగదా' అన్నారు. దీనితో ఆ స్వాములవారికి మరీ కోపం ఎక్కువైంది. నన్ను ధిక్కరించడమా అని ఆవేశం వచ్చి, 'నువ్వు పోకపోతే నేను పోతాను' అంటూ లేచి దూరంగా వెళ్ళిపోయారు. గోరాకు ఈ సంఘటన బాధ కలిగించి వెంటనే ఆ ప్రదేశం నుంచి నిష్క్రమించారు.

మరొక స్వాములవారు చదువుకున్నవారు. గోరా ఆయన వద్దకు వెళ్ళి ముందుగానే 'నేను నాస్తికుణ్ణి, మీతో చర్చించి నా అనుమానాలు తీర్చుకోవాలని ఉంది' అని చెప్పారు. అందుకు ఆయన సంతోషించి, వారంరోజులు రోజూ రమ్మనీ తర్వాత చర్చ ప్రారంభిద్దామని అన్నారు. అలాగే గోరా రోజూ వెళ్ళి ఆయన ప్రవచనం వినిపిస్తూ ఉండేవారు. ఒక రోజున స్వాములవారు గోరాను పిలిచి "నేటి నుంచీ ప్రారంభిద్దాం. అయితే ముందు నువ్వు నా శిష్యుడవని అంగీకరించు, నా బోధ వినడమే గాని ఎదురు ప్రశ్నలు వేయుటకు వీలు లేదు" అని చెప్పారు. కాని గోరా అందుకు అంగీకరించ లేదు. నేను ముందే చెప్పాను. నాస్తికుణ్ణి అని. నా అనుమానాలు ప్రశ్నించి తీర్చుకోకపోతే ఎలా అని అడిగారు. నాకు అందరూ సాష్టాంగ ప్రణామాలు చేస్తున్నారు. నువ్వు దూరంగా నిలుచొని నమస్కారం చేసినా నేను ఊరుకున్నాను." అన్నారు స్వాములవారు. "కావాలంటే మీకు సాష్టాంగ ప్రణామం చేస్తానుగాని, ప్రశ్నించే హక్కును వదులకోను" అని స్పష్టం చేశారు గోరా. ఈ విధంగా అది భగ్నమైంది. స్వాములవార్లతో ఇలాంటి అనుభవాలు చాలా అయినాయి.

విద్యార్థులతో గోరా ఎప్పుడూ సన్నిహితంగానే ఉండేవారు. తరచు శలవలలో జరిగే విద్యార్థి, యువజన రాజకీయ శిక్షణ తరగతులకు వెళ్ళి నాస్తికత్వం గురించీ, పరిణామ సిద్ధాంతం గురించీ, వయోజన విద్య గురించీ ఉపన్యాసాలు ఇస్తూ ఉండేవారు. బందరులో విద్యార్థుల లాడ్జీలకు వెళ్ళి మూఢనమ్మకాలు, సాంఘిక దురాచారాలు ఎదుర్కోవడం, నాస్తికత్వం మొదలైన విషయాలు వారితో చర్చించేవారు. విద్యార్థులకు రాజకీయ పరిజ్ఞానం కావాలనీ, దేశపరిస్థితులు - ప్రపంచం గురించి తెలుసుకుని మార్పుకై కృషిచేయాలనీ చెబుతూ ఉండేవారు. వైదిక కర్మకాండ లేకుండా పూలదండల పెండ్లిండ్లు జరిపేవారు. కులతత్వం పోవాలంటే వర్ణాంతర వివాహాలు

అవసరమని బోధించేవారు. ఈ రీత్యా గోరా భావాలను హర్షించే విద్యార్థులు తమ తమ గ్రామాలలో ఆయనను పిలిచి నాస్తికత్వంపై ఉపన్యాసాలు ఏర్పరిచేవారు. సాధారణంగా గోరా సభ రెండు రోజులు ఉండేది. మొదటి రోజు ఆయన ఉపన్యాసం చెప్పేవారు. రెండవరోజు సభికుల ప్రశ్నలకు జవాబులు చెప్పేవారు. ఆస్తికులు బోధ చెయ్యడమే గాని సంశయాలు తీర్చరు. కాని గోరా అలాకాదు. దేనినీ మూఢంగా నమ్మవద్దు అంటారు. ఆలోచించి అనుమానాలు తీర్చుకుని ఆ పైన స్వీకరించమంటారు. ప్రతి సభలోనూ కొంత సమయం ప్రశ్నోత్తరాలకు తప్పనిసరిగా కేటాయించేవారు. రకరకాల ప్రశ్నలు వేస్తారు కనుక ఉపన్యాసం కంటే ప్రశ్నోత్తరాలే రసవత్తరంగా ఉండేవి. ఏ ప్రశ్నకు ఏమి సమాధానం యిస్తారోనని శ్రోతలు కూడా శ్రద్ధగా వినేవారు. అంతేకాక ప్రశ్నలు వేయుట కొరకు విషయాన్ని అర్థం చేసుకొనేవారు. ఈ ప్రశ్నలలో తాత్విక ప్రశ్నల నుంచి చిలిపి ప్రశ్నల వరకూ ఉండేవి. అందుకే ప్రశ్న వ్రాసి పంపితే క్రింద ప్రశ్నకర్త అడ్రసు గోరా వ్రాయమనేవారు. ప్రతిసభలోనూ విశేషంగా ప్రశ్నలు వేయమని కోరి, వాటికి సమాధానాలు చెప్పినది భారతదేశం మొత్తం మీద గోరా ఒక్కరేనేమో.

కృష్ణాజిల్లాలో మొదటి నాస్తిక బహిరంగోపన్యాసం 1938లో కంకిపాడు గ్రామంలో జరిగింది. పునాదిపాడు హైస్కూలులో అప్పుడు తెలుగుపండితులుగా ఉండిన శ్రీ కాట్రగడ్డ విజయరామయ్య, వారి విద్యార్థులు ఈ సభను ఏర్పరిచారు. సభ రెండు రోజులు జరిగింది. మొదటిరోజు మామూలుగా ఉపన్యాసం. ప్రారంభదినాల్లో గోరా ఎక్కువగా దైవం అబద్ధమనీ, మానవకల్పిత భావమనీ సోదాహరణగా వివరించేవారు. మూఢనమ్మకాలను ఖండించేవారు. అందుకుగాను పసుపులో సున్నం కలిపితే ఎర్రగా పారాయణ కావడం, దానిలో నిమ్మకాయరసం వేయగా అది తిరిగి పసుపు పచ్చగా మారిపోవడం చేసి చూపిస్తూ ఉండేవారు. దీనిలో ఏ మహత్యం లేదనీ, రసాయనిక ప్రక్రియ అనీ, అలాగే అన్ని విషయాలూననీ చెప్పేవారు. కంకిపాడు ఉపన్యాసం కూడా ఈ రీతినే సాగింది.

విజయరామయ్య తన మిత్రులు, సంస్కృత పండితులు అయిన శ్రీ సూర్యదేవర శోభనాద్రి రావుని ప్రత్యేకంగా మీటింగుకు ఆహ్వానించారు. గోరా గ్రామీణులకు చెప్పే ఉపన్యాసపద్ధతి గ్రామీణులకు బాగా నచ్చేది, కాని పండితులకు తేలికగా ఉన్నట్లుండేది. శోభనరావుకీ అదే అభిప్రాయం కలిగింది. అయినా ప్రశ్నలకు ఏమి సమాధానం చెబుతారో చూద్దాం అని మర్నాడు కూడా సభకు వెళ్ళారు. భగవద్గీత మీద వచ్చిన ఒక ప్రశ్నకు గోరా సమాధానం చెబుతూ అది త్రికరశుద్ధికి భంగం కలిగించింది

అన్నారు. ఈ వాక్యం శోభనరావుకు చాలా కష్టం కలిగించింది. ఆయన చివాలున లేచి "మీ మీద ఇంతవరకూ గౌరవభావం ఉండేది. కాని మీ ఈ వాక్యం విన్న తర్వాత ఆ గౌరవభావం పోయింది" అన్నారు.

అందుకు గోరా క్షమించండి. నేను కారణాలు తెలుపకుండా నా భావాన్ని ముందు చెప్పాను. ఆ నిర్ణయానికి నేను ఎందుకు వచ్చానో విపులంగా చెబుతాను. నా వివరణ విన్న తర్వాత మీ అభిప్రాయం ఏర్పరచుకోండి" అని చెప్పి, నైతికంగా దేశం పతనమై యున్నప్పుడు భగవద్గీత వ్రాయబడిందని తన అభిప్రాయమనీ, భగవద్గీతలో చాలా పరస్పర వైరుధ్యాలు ఉన్నాయనీ, ఒక ప్రక్క కుమ్మరివాని సారెమీద మట్టి తిరిగినట్లే నువ్వూ తిరుగుతున్నావని పరాధీనతను బోధించి, మరోప్రక్క అర్జునా, లే! గాండీవం ధరించు అని పురుషార్థం ప్రబోధించబడిందనీ, ఆలోచనకు చేతకు మధ్య సామంజస్య లేమిని భగవద్గీత సమర్థించి సమాజానికి తీరని అపకారం చేసిందని గోరా అన్నారు. వేదాలు, ఉపనిషత్తులు, పురాణాలలో నుంచి ఎన్నో ఉదాహరణలిచ్చి దైవభావం క్రమేణా ఎలా పరిణామం చెందిందీ వివరించారు.

ఒక్క హిందూ మతంలోనేకాక ఇతర మత గ్రంథాలు కూడా పరాధీనతను ఎలా బోధించిందీ బైబిలు, కురానులోనుంచి కూడా ఉదాహరణలిచ్చారు. తాత్వికంగా పరాధీనత బోధించినా, వ్యక్తి స్వేచ్ఛ యధార్థం కనుక తాత్విక పరాధీనతను, వ్యవహారస్వేచ్ఛను సమర్థించుటకు భగవద్గీత ప్రయత్నించినదనీ, అందుచేత అవినీతికి ఆశ్రయమిస్తోందని సుమారు ఒక గంట సేపు గోరా వివరంగా చెప్పారు. అంతవరకూ సాధారణస్థాయిలో పిట్టకథలతో తన భావాలను ప్రవేశపెట్టిన గోరా ఒక్కసారి గంభీరమైన తత్వచర్చలోకి దిగి లోతుగా వివరించేసరికి సభ ఆశ్చర్యపోయింది. అంతా విన్న శోభనరావు తనకు వివరణ నచ్చిందనీ, తాను ఆలోచిస్తాననీ, సభలోనే చెప్పారు. ఇది ఆయన గొప్పతనానికి నిదర్శనం. ఉపన్యాసాన్ని హర్షించిన శోభనరావు గోరా ఆచరణను కూడా ఎలా హర్షించినదీ వారే 'సంఘం' తృతీయ వర్షారంభ సంచిక (30-1-1951) లో ఇలా వ్రాశారు:

"కంకిపాడులో 1938లో శ్రీ గోరాగారు నాస్తికత్వం గురించి ఉపన్యసించారు. మొదట ఎదుర్కొన్నదీ, ఆ తర్వాత సంశయాలు తీరి అభినందించినదీ నేనే".

"పరోపదేశ పాండిత్య సర్వే వ్యాసపరాశరాః." అవును. పరోప దేశములో వ్యాస పరాశరులు అద్వితీయులు. అంతకేమీ తగ్గనివారే తరువాత కాలపు ధర్మోపదేష్టలు కూడా. ఉపదేశాలు, ఉపన్యాసాలు అంబరవీధిని విహరిస్తుంటే ఆచరణలు అగాధమార్గాన పయనిస్తుంటాయి. మరి ఈ కంకిపాడు ఉపన్యాసకుల సంగతి ఏమిటి?

మూఢవిశ్వాసాలను ఖండించుటతో ఆగక, దేవునిపై దెబ్బతీయుటతో నిలవక, కర్మ కల్ల అన్నారు. పునర్జన్మ హుళక్కి అన్నారు – అంతేనా, "కులమూ, మతమూ నాన్సెన్సు" ఓయబ్బా! చూతాం.

"కొంతకాలం గడిచింది. కంకిపాడు కాస్త మరుపులో పడవచ్చు ఉపన్యాసకులకు. ఆహ్వానం లేకుండానే, ముందు తెలుపకుండానే బందరులో వారింటికి వెళ్ళాను సాయంకాలం వేళకు. కావాలనే ఆ వేళకు వెళ్ళటం, వారు ఇంటిదగ్గర యుండరుగదా యని, ఇల్లు చూచి, ఇల్లాలిని చూస్తే రంగులు కొంత వరకూ తేలిపోతాయిగా. కాని, ఇంటాయన కూడా ఇంట్లోనే ఉన్నారు. పథకంలో పట్టు తప్పింది. నావంక ఎగాదిగా చూడసాగారు వారంతా. గోడలపైనున్న పటాలు, ఫోటోలపైనే నా దృష్టి. అద్దెకొంప కోసం తిరిగేవాడినేమోనని వారి ఊహ. చూస్తుండగానే తృటిలో పట్టుబడిపోయాను. చిరునగవుతో గృహస్తు లేచివచ్చి ఈ అతిధిని ఇంట్లోకి ఆహ్వానించారు. ఇంటిని మించిన జనం. అందులో పిల్లలే ఎక్కువ. మంచి అవకాశమే ఇది గృహస్తు యొక్క పూర్ణరూపాన్ని చూడడానికి. పిల్లలుంటే వారివల్ల కొన్ని సంగతులు తేలిపోతాయి: స్త్రీలవల్ల మరికొన్ని సంగతులు, నేనక్కడ గడిపిన 14 గంటల కాలములో రాత్రి నిద్రవేళ 6 గంటలు మినహాయించి నా అన్వేషణ మానలేదు. దంపతుల కనుమరుగున మనోరమతో (9 ఏళ్ళ కూతురు) "మీ కులమేమిటి" అని నా ప్రశ్న. ప్రశ్న కర్థమే తెలియనిది జవాబేమి ఇస్తుంది? లవణం (కొడుకు) జవాబు ఇచ్చాడు "అదేమిటో తెలియదండి" అని. మానవకులం అని నేర్పబడిన జవాబు ఇస్తాడేమో అనుకున్నాను. కులం ప్రసక్తే ఆ ఇంట్లో ఏనాడు ఉండదన్న మాట. భోజన మంతా కలసి చేస్తుండగా గృహిణితో "ఏమండీ మీ ఇండ్ల భోజనము–" అంటుండగా అర్థోక్తిలోనే గృహిణి చిరునగవుతో చిన్నగద్దింపు, అర్థోక్తి అర్థోక్తిగానే నిలిచి పోయింది. అంతే మరి నేను శంకించ వలసిందీ, విమర్శించ వలసిందీ కానరాలేదు. కంకిపాడులో ఉపన్యాసానికి పూర్వపు నా స్థితికి అంతరస్థితికీ ఎంత భేదముండెనో– వారి యింటికివెళ్ళి వచ్చిన తర్వాత నాలో అదే రీతి, అనగా వారి మాటలను బట్టి, ఉపన్యాసాలబట్టీ ఉండవలసిన దానికంటే లేదా మనమూహించిన దానికంటే అత్యధికంగా వారి ఆచరణలో పురోగమనం కనిపించింది. ఆ పురోగమనమే ఆ చిరకాలంలో తీవ్రగమనమై కాలేజీ ఉద్యోగమునకు రాజీనామాకు కారణమైంది. ఆపై మరికొన్నాళ్ళకే స్వాతంత్ర్య సమరంలో సకుటుంబంగా దూకి ఎన్నో కష్టాలనెదుర్కో వలసి వచ్చింది. ఒక దానిని మించింది మరొకటిగా ఇట్టి కష్టాలను, సమస్యలను ఎదుర్కొని నెగ్గారు.

"రామచంద్రరావు గారి నాస్తికోద్యమము అర్థిక రాజకీయ దృష్టితో సమ్మిళితమై విస్తరించింది. నాస్తికత్వమేనాటినుంచో ఆస్తికత్వంతో పోరాడుతున్నప్పటికి అది

సాంఘికరంగంలోనే. ఆ పోరాటాన్ని ఆర్థిక రాజకీయరంగాలకు విస్తరింపజేయుట వీరి ప్రత్యేకత. దానివలననే నాస్తికత్వానికి సంపూర్ణ విజయము కలదు. అది మనతరంలోనే చూడగలం."

ఈ విధంగా శోభనరావు ఆదిలో వ్యతిరేకించీ, ఆ తర్వాత అభినందించి, చివరకు గోరాకి గొప్ప అండగా తయారైనారు, నాస్తిక భావాలను సాహిత్య రూపాలద్వారా ప్రచారం చేసే బాధ్యతను ఆయన మీద వేసుకొని "సత్యాన్వేషణము" అనే నాటకాన్ని, కొన్ని ఏకాంకికలను రచించారు, ఆయన కలం ఎంత శక్తివంతమైనదంటే బ్రిటీష్ పరిపాలకుల హయాంలో "సత్యాన్వేషణము" ప్రదర్శన నిషేధింపబడింది. శ్రీ శోభనరావు చాలా కాలంగా తీవ్రమైన అస్వస్థతకు గురియై తాను అనుకున్నంతగా నాస్తికత్వాభివృద్ధికి సేవ చేయలేకపోతున్నాననే అని బాధ వ్యక్తం చేస్తూ ఉండేవారు. 1963 డిసెంబరు 1న విజయవాడలో జరిగిన గోరా 62వ జన్మదిన సన్మాన సభకు వీరే అధ్యక్షత వహించారు.

గోరా నాస్తిక ప్రచారంలో గ్రామాలకు వెళ్ళినప్పుడు జరిగిన రెండు, మూడు సంఘటనలు తెలుసుకుందాం.

ఒక గ్రామంలో గోరా ఉపన్యాసం మధ్యాహ్నం ఒంటిగంటకు అని ప్రకటించబడింది. సభ సినీమాహాలులో అని ప్రకటించారు. ఒక యింటిలో గోరా విశ్రాంతి తీసుకుంటున్నారు. 12-30 అయింది. ఇంకా నిర్వాహకులు తనను తీసుకువెళ్ళుటకు రాలేదు. 12-45 అయినా రాలేదు. అప్పుడు గోరా లేచి సినీమాహాలు కనుక్కొని వెళ్ళారు. హాలులో పదిమంది బెంచీలమీద పడుకుని ఉన్నారు. అక్కడున్న టేబుల్లు, కుర్చీలు గోరాయే సరిచేశారు. హాలులో విశ్రాంతి తీసుకుంటున్నవారు గోరాని ఎవరో అనుకుని ఉంటారు. సరిగ్గా ఒంటిగంట అవగానే గోరా "మహాశయులారా నేటి ఈ సభలో ఉపన్యసించవలసిన వ్యక్తిని నేనే-" అంటూ ప్రారంభించారు. ఆ ఉన్న పది-పన్నెండుమందీ ఆశ్చర్యంతో లేచి, "మీరేనా రామచంద్రరావుగారు? ఆగండి. బోలెడంతమంది జనం విశ్రాంతి తీసుకుంటున్నారు. పూలదండలు తీసుకురాను పోయిన ఆయన ఇంకా రానేలేదు. అప్పుడే మీటింగు ఏమిటి?" అన్నారు.

"మరి మీటింగు మధ్యాహ్నం ఒంటిగంటకు అని కరపత్రంలో ప్రకటించారు గదండీ" అని బదులు చెప్పారు గోరా.

"ఒంటి గంట అంటే ఒంటిగంటేనా? ఏ రెండో-మూడో అవుతుంది." అన్నారు వారు. అందుకు గోరా "అవునులెండి. ఆస్తికత్వంలో ఒంటిగంట అంటే రెండో-మూడో అవుతుందేమోగాని, నాస్తికత్వంలో మాత్రం ఒంటిగంట అంటే ఒంటిగంటే" అన్నారు.

ఈ సమాధానంతో ఇకవారేమీ అనలేదు, ఈ లోగా వారిలోనుంచి నలుగురైదుగురు నాలుగు వైపులా వెళ్లి, చుట్టుప్రక్కల గ్రామాలనుంచి వచ్చి విశ్రాంతి తీసుకుంటున్న జనానికి సభ ప్రారంభమైందని చెప్పి వచ్చారు. చూస్తూ చూస్తూ ఉండగా 10-15 నిముషాలలో హాలు అంతా నిండి పోయింది. అరగంటలో నిర్వాహకులు పూలదండలు తీసుకుని వచ్చారు. అప్పటికే సభ ప్రారంభం కావటం వారికి కాస్త కష్టం కలిగించింది. అయితే, 'నాస్తికత్వంలో ఒంటిగంట అంటే ఒంటిగంటే' అన్న వాదన అందరినీ సంతృప్తి పరచింది. ఆస్తికులు తమ అశ్రద్ధను, ఆలస్యాన్ని 'తానొకటి తలచిన దైవమొకటి తలచును' అని చెప్పి కప్పిపుచ్చుకుంటారు. బాధ్యత కర్మమీదో భగవంతుని మీదో నెట్టివేస్తారు. నాస్తికులు అలాకాదు. బాధ్యత తామేవహిస్తారు. అలాంటప్పుడు ఒంటిగంట ఒంటిగంటే కాక మరేమవుతుంది. అప్పటినుంచీ ఆ చుట్టుప్రక్కల గ్రామాలలో నాస్తికోపన్యాసాలంటే ప్రకటించిన సమయానికి సరిగ్గా ఆరంభ మౌతాయని ప్రజలు ముందుగానే వచ్చేవారు.

మరొక సంఘటన ఆ గ్రామంలో క్రైస్తవులు-రోమన్ కాథలిక్కులు ఎక్కువ. వారి తర్వాత అధిక సంఖ్యాకులు మహమ్మదీయులు, హిందువులు తక్కువ. గోరా నాస్తికోపన్యాసం ఇవ్వడానికి "సైతానులాగా వచ్చాడు. దేవుడు లేడంటాడా? ఎలా మాట్లాడుతాడో చూస్తాం" అంటూ క్రైస్తవులు రెచ్చిపోయారు. ఏమైతేనేమి చెట్టుక్రింద సభకు ఏర్పాట్లు అన్నీ పూర్తి అయ్యాయి. జనం కూడా వచ్చారు. గోరా ఉపన్యాసం ప్రారంభించుటకు లేవగానే అలజడి ప్రారంభమైంది. కొందరు గోరాను కొట్టుటకు కర్రలు వేసుకుని మీదకు వస్తున్నారు. సభను ఏర్పరచిన యువకులు తాము ఊహించని ఈ పరిణామాలకు భయపడి పోలీసులకు కబురు చేద్దామని వెళ్ళారు. అటునుంచి కర్రలతో వచ్చినవారు ముందుకు వస్తుండగా, అచటి మహమ్మదీయులందరూ గోరాచుట్టూ రక్షక వలయంగా ఏర్పడి "ఆయన చెప్పేదానితో మేమూ ఏకీభవించం. కాని ఆయనపై దౌర్జన్యానికి పూనుకోవడం మాత్రం అమానుషం. దానిని మేము అడ్డుతాం." అన్నారు. దీనితో కర్రలతో వచ్చిన వారు కొంత వెనుకంజ వేశారు. వారిలో ఒకరు కాలిచెప్పుతీసి "సైతాన్, చెప్పుతో కొట్టాలి" అని విసరబోయాడు. గోరా వెంటనే అయ్యా, విసిరితే ఒక చెప్పు వద్దు. రెండూ విసరండి. ఒకటి మీవద్ద, మరొకటి నా వద్ద ఉంటే ఎవరికీ ఉపయోగం ఉండదు" అని హాస్యోక్తి విసిరారు. అందరూ నవ్వారు. దీనికి చెప్పు తీసిన అతను సిగ్గుపడి, చెప్పు విసరకకుండానే అక్కడినుంచి వెళ్ళిపోయాడు. ఆ తర్వాత క్రైస్తవ పెద్దలు కూడా ఈ సంఘటనకు సిగ్గుపడి గోరాని క్షమాపణ కోరుకున్నారు. ఆ రోజు సభ ఆగిపోయింది. కాని మర్నాడు అందరి సహకారంతో నాస్తికోపన్యాసము నిర్విఘ్నంగా కొనసాగింది.

ఇంకొక సంఘటన ఆంధ్రదేశంలోని ఒక పట్టణంలో గోరా నాస్తికోపన్యాసం జరిగింది. సభకు చాలా మంది విద్యార్థికులు, మేధావులు వచ్చారు. ఉపన్యాసానంతరం సభికుల ప్రశ్నలకు గోరా సమాధానాలు ఇస్తారు గదా, అప్పుడు ఒకరు "మీకు దేవునిలో నమ్మకం లేకపోతే రామచంద్రరావు అని ఎందుకు పెట్టుకున్నారు" అని అడిగారు. దానికి గోరా "రామచంద్రరావు అనే పేరు నేను పెట్టుకున్నది కాదు. మా నాన్నగారు పెట్టారు. నేను గోరా అనే పేరును కూడా నాకు వాడుకుంటున్నాను." అన్నారు. అప్పుడు ఆయనే "మీ పిల్లలకు మీరు పెట్టుకున్న పేర్లు ఏవి? అని అడిగారు. "లవణం, మైత్రి, విద్య, విజయం" అని గోరా జవాబు.

ప్రశ్న కర్త అసహనం ఎక్కువైంది. "మరి మీకు దేవునిలో నమ్మకం లేకపోతే నమస్కారం ఎందుకు పెడతారు?" అని ప్రశ్నించారు.

"నమస్కారం అంటే గౌరవసూచకంగా వస్తున్నాను, వెళుతున్నాను అని చెప్పడం. కొందరు గుడ్‌మార్నింగ్ అంటారు. కొందరు సలాం ఆలేకుం అంటారు. కొందరు కౌగలించుకుంటారు. కొందరు షేక్‌హాండ్ చేసుకుంటారు. ఎస్కిమోలు అయితే ముక్కు ముక్కు రాసుకుంటారు అలాగే నమస్కారం అభివాదం చేసుకునే ఒక పద్ధతి" అని గోరా వివరించారు. ప్రశ్నకర్త ఉండబట్టలేక పోయారు. "అదే అయితే వచ్చేటప్పుడు వెళ్ళేటప్పుడు ఒక చెంపదెబ్బ ఎందుకు కొట్టకూడదు?" అని ప్రశ్నించారు. అందుకు గోరా అతి నెమ్మదిగా "కొట్టవచ్చును. తిరిగి చెంపదెబ్బ స్వీకరించుటకు (ప్రత్యభివాదంగా) సిద్ధంగా కనుక ఉంటే కొట్టవచ్చును. అందుకు నేను సిద్ధంగా లేను కనుక నమస్కారం అంటున్నాను, ఎదుటివారూ నమస్కారం అంటున్నారు" అని అన్నారు. దీనితో ఆ ప్రశ్నకర్త సభ వదిలి వెళ్ళిపోయారు కోపంగా.

విభిన్న మనస్తత్వాలు తెలిపే యిలాంటి సంఘటనలు నాస్తిక ప్రచారం గోరా ఎదుర్కొన్నారు. ఒకచోట "దేవుడూ దెయ్యం లేకపోతే తల్లినే ఎందుకు పెళ్ళిచేసుకోకూడదు?" అనే ప్రశ్న కూడా వేశారు. ఇలాంటి ప్రశ్నలు ప్రశ్నకర్తల సాంస్కృతిక స్థాయిని తెలుపుతాయి. మధ్యప్రదేశ్‌లోని రత్లాం పట్టణంలో 1959లో నాస్తికత్వం గురించి సభ జరుగగా లవణంని ఒక విద్యార్థికుడు మీరు గోరా పుత్రుడేనని నిరూపించుకోగలరా? అని అడిగారు. ప్రశ్న వెనుక భావాన్ని గమనించి లవణం "నేను నిరూపించుకోలేను" అన్నారు. దీనితో ప్రశ్నకర్తకు కథ అడ్డం తిరిగింది. ఆయన ఆశించిదివేరు. లవణం ఇలాంటి వ్యక్తిగతమైన ప్రశ్నకు ఉద్రేకపడతారనుకున్నారు. అలా జరగక స్పష్టమైన సమాధానం రావడంతో ప్రశ్నకర్త చేసేదిలేక "అలాగే దేవుణ్ణి కూడా నిరూపించులేను" అన్నారు. దానిపై "నేను చెప్పేది అదే. దేవుణ్ణి

నిరూపించలేననీ, అది మా నమ్మకమనీ స్పష్టంగా చెప్పండి" అన్నారు. లవణం. న్యాయశాస్త్రంలో 'మాతృత్వం నిరూపించదగినది, పితృత్వం విశ్వసించవలసినది మాత్రమే, అని ఒక సూత్రము ఉన్నది. దానినే లవణం గుర్తుచేశారు. ఇలా రకరకాల ప్రశ్నలు వస్తూ వుంటాయి.

దైవం అబద్ధం అనగానే ముందుగా ఎదుర్కొనేవి మూఢ నమ్మకాలు, దేవుడు లేకపోతే ఆ మహాత్మ్యం ఎలా జరిగింది, ఈ అద్భుతం ఎలా జరిగింది, అనే ప్రశ్నలు వస్తాయి. చాలా సందర్భాలలో మహాత్మ్యాలు అని చెప్పబడేవి జరగకుండానే జరిగేయని ప్రచారంలోకి వస్తాయి. వాటిని నిర్ధారణ చేసుకొనుటకు ప్రయత్నిస్తే ఈ విషయం బయటపడుతుంది. మరికొన్ని సందర్భాలలో ఏదో కిటుకేగాని, మహాత్మ్యం ఏమీ ఉండదు. వాటిని ఎవరైనా చెయ్యవచ్చు. నాస్తిక ప్రచార సందర్భంలో కొన్నిటిని నిర్ధారణ చేసి అవి జరగలేదని నిరూపించారు. మరికొన్నింటిలో మహాత్మ్యం లేదనీ, ఎవరైనా చేయవచ్చునని చెప్పి తానుచేసి చూపించారు.

1939 నవంబరు చివరివారం 'ఆంధ్రప్రభ' ఈ దిగువ వార్తను ప్రచురించింది.

## భగవన్మహిమ ప్రత్యక్షంగా కనబడుట

### భక్తుడు తన నాలుకను కోసి అర్పిస్తే అది మళ్ళీ మొలుచుట

### టెంకాసీవద్ద తిరుమల శ్రీ సుబ్రహ్మణ్యస్వామి వారి

### అద్భుత మహిమకు ప్రత్యక్ష నిదర్శనం

కొట్టాకులంలో సుదల ముత్తుపిళ్లై కుమారుడు సుబ్బయ్య పిళ్లై వయసు 35 యేళ్లు. ఇతడు పదేళ్ళ నుంచీ అతి తీవ్రమైన దారుణ వ్యాధివల్ల చాలా బాధపడుతూ ఉన్నాడు. ఎంతమంది ఘనవైద్యులు చికిత్స చేసినా యీ వ్యాధి కుదరలేదు. ఇది కుదరదని వైద్యులందరూ చెప్పేశారు. వెంటనే నా జబ్బు పూర్తిగా కుదరదని వైద్యులందరూ చెప్పేశారు. వెంటనే నా జబ్బు పూర్తిగా కుదిరితే నేను 40 రోజులు నిరాహారవ్రతం చేస్తాను. నా నాలుకను కోసి నీకు అర్పిస్తాను. అని యితడు టెంకాసికి దగ్గరగా ఉన్న తిరుమలలో వేంచేసియున్న సుబ్రహ్మణ్య స్వామికి మొక్కుకున్నాడు. అలాగ మొక్కుకున్న తర్వాత కొద్దిరోజులలోనే సుబ్బయ్యపిళ్లై జబ్బు పూర్తిగా కుదిరింది. అందువల్ల ఈ నెల 10 తేదీ శుక్రవారం నాడు ఇతడు మొక్కు చెల్లించడానికి కొత్తాకుళం నుంచి తిరుమలవెళ్ళాడు. జబ్బు కుదరగానే నిరాహారదీక్ష కూడా ప్రారంభించాడు. 10వ తేదీ శుక్రవారం సాయంత్రం 5 గంటలకు సుబ్రహ్మణ్యస్వామి దేవాలయంలో స్వామి యెదుట తన నాలుకకొసను రెండు అంగుళాలు కొలత గల ముక్కను కోసి

స్వామి ఎదుట సమర్పించినాడు. ఈ అద్భుత వార్త విని చాలామంది ప్రజలిదివరకే అక్కడకు వచ్చారు. ఆ దేవాలయం సూపరింటెండెంటు కె. చిదంబరం పిళ్లె, యలంజి గ్రామవాస్తవ్యులైన ఐ.వి. పిచ్చయ్యపిళ్లె, మరి అనేకమంది చూస్తూ ఉండగానే ఆతను నాలుక కొని సమర్పించాడు. అలాగ కోసిన ముక్కమీద సంతతధారగా నీళ్ళు పోసేందుకు అక్కడ వున్న పెద్దలు యేర్పాటు చేశారు. అంటే దాని మీద ఒక ముక్కాలు పీట పెట్టి, దానిమీద ఒక సన్న రంధ్రంగల బేసిను ఉంచారు. ఆని నిండా నీళ్ళు పోశారు. ఆ సన్నరంధ్రంగుండా నీళ్ళు సంతత ధారగా ఆ నాలుక ముక్కమీద పడుతూ వున్నాయి. ఆ ముక్క క్రమక్రమంగా కరిగిపోతూ ఉండడం అందరూ చూశారు. అది కరుగుతూ ఉంటే సుబ్బయ్యపిళ్ళె నాలుక కొన కూడా క్రమంగా పెరుగుతూ వచ్చింది. ఆ రాత్రి 8 గంటలయ్యేసరికి సుబ్బయ్య పిళ్లెగారి నాలుక పూర్తిగా మొలిచింది. ఆయన బాగా మాట్లాడగలిగినారు. బాగా భోజనం చేస్తున్నారు. ఈ విధంగా ఈ కలియుగంలో కూడా సుబ్రహ్మణ్య స్వామి భక్తవాత్సల్యం వల్ల తన అద్భుత మహిమను లోకానికి ప్రత్యక్షంగా వెల్లడి చేశారు. (ఇండియన్ ఎక్స్‌ప్రెస్.)

ఈ వార్త చదివిన గోరా టెంకాసిలోని ప్రభుత్వ వైద్యునికి ఈ వార్త యొక్క నిజానిజాలు తెలుపవలసినదిగా కోరుతూ ఒక ఉత్తరం వ్రాశారు. ఆయన నుంచి గోరాకి ఈ క్రింది జాబు వచ్చింది.

S.K. RAMASWAMY. TENKASI

M.B., B.S. 28-11-1939

Civil Assistant Surgeon

**Dear Sir**

Your kind letter to hand. From enquiries at close quarters I got the following information. A stranger suffering from a disease of the tongue probably (maccro glossia) or a big tongue came to the Tirumalai Temple. He gave out that God appeared in his dream one night and told him that if he sacrificed a portion of his tongue his disease would be cured. Accordingly, he cut half of his tongue in the temple himself. Some boys it seems saw him actually cutting his tongue. In the evening he went away. Nobody saw him after he cut his tongue. So about the remaining part of the story I have no reliable

information. I enquired the executive officer of the temple and he denies any knowledge of the affair. The man did not go over to the hospital for treatment. More than the above information I am not able to get. If I get any further details. I shall certainly write to you.

Yours faithfully,
(Sd.) S.K. RAMASWAMY

ఎస్.కె. రామస్వామి టెంకాసి
యం.బి.బి.యస్. 28-11-1939
సివిల్ అసిస్టెంట్ సర్జన్.

ఆర్యా,

మీ ఉత్తరం అందింది. మీరు వ్రాసిన విషయమై విచారించగా ఈ క్రింది సమాచారం లభించింది. నాలుకకు సంబంధించిన జబ్బుతో (బహుశః మాక్రోగ్లోషియా లేక పెద్దనాలుక కావచ్చు) బాధపడుచున్న ఒక రోగి తిరుమలదేవస్థానానికి వచ్చాడట. ఒకనాటి, రాత్రి కలలలో తనకు దేవుడు కనిపించి తన నాలుకలో కొంతభాగాన్ని కోసి సమర్పిస్తే జబ్బు కుదరగలదని చెప్పాడని అన్నాడు. అందుచేత స్వయంగా తనకు తానే నాలుకలో సగంభాగం దేవాలయంలో కోసుకున్నాడు. అతను తన నాలుక కోసుకుంటూ ఉండగా కొంతమంది పిల్లలు చూచారట. సాయంత్రం అతను వెళ్ళిపోయాడు. అతను నాలుక కోసుకున్న తర్వాత ఎవరూ అతనిని చూడలేదు. అందుచేత దీని సంబంధమైనా మిగతా విషయం గురించి నాకు విశ్వసనీయమైన సమాచారం లభించలేదు. దేవస్థానం ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌ను కూడా విచారించాను. ఈ విషయమై తనకు ఏమీ తెలియదన్నారు ఆయన. ఆ వ్యక్తి చికిత్స నిమిత్తం ఆస్పత్రికి కూడా పోలేదు. పై సమాచారంకంటె మంచి ఏమీ నాకు తెలియలేదు. నాకింకా వివరాలు ఏమైనా తెలిస్తే తప్పక వ్రాస్తాను.

మా విశ్వాసపాత్రుడు
(సం.) ఎస్.కె. రామస్వామి

యదార్థానికి, పత్రికలో వచ్చినదానికి ఏమీ సంబంధంలేదనే విషయంపై ఉత్తరం వల్ల స్పష్టం అయింది. దేవస్థానం నిర్వహణాధికారికే ఏమీ తెలియదు.

పత్రికలలో వార్త మాత్రం మహాత్మ్యమేదో జరిగినట్లు వచ్చింది. అలాగే నిర్ధారణ చేసుకొంటే మహత్మ్యాల నిజానిజాలు బయటపడతాయి.

ఆ రోజుల్లో హరనాథ్ బాబా ప్రచారం ఎక్కువగా ఉండేది. భజనచేస్తూ ఉంటే పటంలోనుంచి చెయ్యిజాపి వెన్న తీసుకుంటాడనీ, వెన్న చేతివ్రేళ్ళతో తీసుకున్న గుర్తు మిగిలిన వెన్నముద్ద మీదపడి ఉంటుందనీ ప్రతీతి. అందరూ ఈ విషయమై గోరాని ప్రశ్నిస్తూ ఉండేవారు. అందుచేత ఆయన దీని గురించి తేల్చుకుందామని హరనాథ బాబా భజనలు చేసే వారిని వెళ్ళి అడిగారు. తనకు చూపించమని. నిర్ధారణకొరకు గోరా బయలుదేరే సరికి ఎక్కడి కక్కడే మావద్ద కాదు, ఫలానాచోట జరుగుతోంది అని చెప్పేరు. అలా చెప్పిన ప్రతీ చోటకూ, దూరప్రదేశాలు కూడా వెళ్ళేరు. కాని ఎవరూ మావద్ద జరుగుతోందని అనలేదు.

చివరకు అమలాపురం తాలూకా పుల్లేటికుర్రు గ్రామంలో జరుగుతోందంటే అక్కడకు వెళ్ళారు. గోరా ముందుగానే తాను నాస్తికుణ్ణనీ, తనకు ఈ మహత్మ్యాలలో నమ్మకంలేదనీ, పరిశీలించుటకు వచ్చాననీ చెప్పారు. ఒకవేళ నిజంగా జరిగితే ఏంచేస్తారు అని అడిగారు. నిజంగా జరిగితే, జరిగిందనే యదార్థాన్ని అంగీకరించి, తర్వాత ఎలా జరిగిందో పరిశీలిస్తాను. ఈలోగా తాత్కాలికంగా నాస్తికప్రచారం ఆపుతాను" అని జవాబిచ్చారు గోరా.

పుల్లేటికుర్రు వారు వెన్నను ఇత్తడిపెట్టిలో ఉంచి ప్రక్కనే నేతిదీపం వత్తి వెలిగించి హరనాథ బాబా పటం ఎదురుగా పెట్టేవారు. వెన్న మీద బాదం ఆకు వేసేవారు. భజన చేస్తూ ఉంటే కొంత సేపటికి పెట్టె తీసి చూస్తే హరనాథ బాబా చేతివ్రేళ్ళు వెన్నముద్దమీద కనబడేవట. ఇత్తడి పెట్టెకు ప్రక్కనే దీపం ఉండుటచేత ఆ వేడికి వెన్నకరిగి ఆకు ఈనెలు వెన్నముద్ద మీద పడుతున్నాయని గోరా అన్నారు. అందుచేత ఆయన వెన్నను గుడ్డలోవేసి గట్టిగా పిండారు. వెన్నముద్దలు మూడు చేశారు. ఒక దానిమీద ఇంటివారు వేస్తున్నట్లు బాదంఆకు, రెండోముద్దమీద అరటిఆకువేసి, మూడో ముద్దమీద ఆవాలు జల్లారు. దీపాన్ని కొంచెం దూరంగా పెట్టించారు. ఒకవేళ దీపం వేడికే వెన్న కరిగితే ఆవాలు జారిపోయి ఆ పెట్టెలోనే ఉండాలి. బాదంఆకు పెట్టిన వెన్న ముద్ద మీద వాలుగా ఈనెలు పడితే అరిటాకు పెట్టిన ముద్దమీద నిలువుగా ఈనెలు పడతాయి. ఒకవేళ నిజంగా వెన్న కొంత భాగం మాయమై హరనాథ బాబా తీసుకున్నట్లు గుర్తుపడితే మర్నాడు ఇత్తడి పెట్టెలో కాక, గాజు పెట్టెలో పెట్టి పరిశీలిస్తానని గోరా ముందుగానే చెప్పారు.

భజన ఆరంభమైంది. ఆయన అక్కడే కూర్చుని రెప్పవాల్చకుండా వెన్న ఉంచిన పెట్టెవైపే చూస్తున్నారు. రెండు గంటలు భజనచేసి పెట్టె తీసి చూస్తే ఏమీ మార్పులేదు.

తర్వాత మరొక గంట భజనచేసి చూశారు. మూడుగంటల భజన అనంతరం కూడా ఏమీ మార్పులేదు. పెట్టిన వెన్నముద్దలు పెట్టినట్లే ఉన్నాయి. ఏమీ జరగలేదు. చివరకు వారు తేల్చినది గోరా నాస్తికులు కనుక, నమ్మలేదు కనుక మహాత్మ్యం జరగలేదని, యదార్థం అయితే నమ్మకం ఉన్నా జరగాలి, నమ్మకం లేకపోయినా జరగాలి. నమ్మకం ఉంటేనే జరుగుతుందంటే అందులో ఏదో రహస్యం ఉందన్నమాట.

దయ్యాలు, భూతాలు అనేది సర్వసాధారణ నమ్మకం. వివిధ కారణాలవల్ల వచ్చే మానసిక వ్యాధులకు, హిస్టీరియా జబ్బులకు దయ్యాలని భయపడడం ఇప్పటికీ జరుగుతోంది. ఇవి కాక దయ్యాలు మానవులకు తెలియకుండా ఏవో దుర్మార్గపు పనులు చేస్తాయని చాలామంది అనుకుంటారు.

1940 జనవరి మాసంలో ఏలూరులో ఒకరి ఇంట్లో దయ్యాలు విహరిస్తున్నాయనీ, పరుపులు, దిండుగలేబులు, జంపకానాలు, దుప్పట్లు తగులబడుతున్నాయనీ, బిందెలు, కాగులు ఎగిరిపడుతున్నాయనీ పెద్ద అలజడి జరిగింది. పత్రికలు, ఫొటోలుతీసి 'దయ్యాలంటే నమ్మకం లేదూ? అయితే చూడండి' అంటూ ప్రచురించాయి. ఈ సంఘటనను ఆధారం చేసుకుని కొంతమంది మోసగాండ్రు దయ్యాలబారినుండి మిమ్ము, మీ కుటుంబాన్ని కాపాడుకొనుటకు మా మందులు వాడండి. మేము తయారుచేసిన రక్షక కవచాలు ధరించండి అని వాటిని అమ్మి బాగా డబ్బు గడించుకున్నారు. గోరా ఏలూరు వెళ్లి పరిశీలించారు. అప్పటికే ఏ ఇంట్లో అయితే దయ్యాలు విహరిస్తున్నాయన్నారో ఆ యింటివారి వ్యతిరేకులు రసాయనిక పదార్థాలు ఎవరిచేతనో రహస్యంగా ఆ ఇంట్లో పెట్టిస్తూ ఉండుటచేత ఇలా జరిగిందనే అభిప్రాయానికి చాలామంది వచ్చారు. గోరా పని సులభమైపోయింది. మోసగ్రాండు, దుర్మార్గులు మూఢనమ్మకాల ముసుగులో తమ దుశ్చర్యలు కొనసాగిస్తూ ఉంటారు.

ఒకసారి ఒక భూతవైద్యుడు బందరు వచ్చారు. గోరా నాస్తికులని తెలిసిన మిత్రులు ఆ భూతవైద్యుని గోరావద్దకు తీసుకునివచ్చారు. ఆయన దయ్యాలు చూపుతానన్నారు. గోరా సరేనన్నారు. దయ్యాలనుచూపితే ఆయనకు 50 రూపాయలు ఇచ్చేటట్లు, ఆయన చూపలేకపోతే బహిరంగసభలో ఇలాంటి మోసం ఎప్పుడూ చెయ్యవద్దని గోరా ఆయనను ఒక చిన్న గుద్దు గుద్దేట్లు, ఆయన గోరాని చీకటిరోజు స్మశానానికి అర్థరాత్రి రమ్మన్నారు. గోరా సరే అన్నారు. అయితే తనకు త్రాగుటకు ఏమీ ఇవ్వరాదనీ, అలాగే వంటిమీద ఏమీ జల్లరాదనీ, ఎక్కడైనా తనను కూర్చోమంటే తాను ఒక పీట వేసుకుని కూర్చుంటాననీ గోరా చెప్పారు. భూతవైద్యుడు సరే అన్నాడు. దూరంగా ముసుగు వేసుకుని పోతున్నట్లుగా దయ్యం కనబడుతుందని ఆయన అన్నారు. గోరా సరే అని, ఆ దయ్యాన్ని తుపాకితో కాలుస్తాను అని చెప్పారు. ఈ షరతుకు భూతవైద్యుడు

ఆశ్చర్యపోయాడు. "మీరు ఎవరైనా ఒక మనిషికి ముసుగువేసి ఆ సమయంలో అలా వెళ్ళమని చెప్పవచ్చుగదా. దానినే దయ్యమని నాకు చూపుతారు. అది నిజంగా దయ్యమైతే నేను తుపాకీతో కాల్చగా అదేమౌతుందో చూస్తాను" అన్నారు గోరా. సాయంత్రం వస్తానని చెప్పి వెళ్ళిన ఆ భూతవైద్యుడు తిరిగి రాలేదు.

ఈ మహాత్మ్యాల గురించే తర్వాత జరిగిన మరి రెండు సంఘటనలు కూడా ఇక్కడ వ్రాస్తాను. 1955లో వినోభా ఆంధ్ర పర్యటనలో గోరా కూడా వినోభా వెంట ఉన్నారు. డిసెంబరు 25వ తేదీ అమరావతి మకాం. గోరా సన్నిహితమిత్రులు, విద్యాధికులు కొందరు ఆయన వద్దకు వచ్చి అమరావతిలోనే అప్పుడు ఒక స్వాములవారు ఉన్నారనీ, ఆయన ఇసుక గుప్పిడితో తీసి మంత్రించి గుప్పిడి విప్పేసరికి పంచదార అయిపోతోందని, గోరాని వచ్చి చూడమనీ బలవంత పెట్టారు. సన్నిహితమిత్రులు కావడంతో వారిమాట తీసేయలేక గోరా వెళ్ళారు. అలా జరగదనీ, తాను వెళ్ళితే దేవునిలో నమ్మకంలేనివారి ఎదుట ఈ మహాత్మ్యం జరగదని అని అనవచ్చుననీ గోరా ముందుగానే చెప్పారు. గోరా తన వెంట తన కుమారులు విజయం, సమరం– ఇద్దర్నీ తీసుకుని వెళ్ళారు. స్వాములవారి వద్దకు ప్రవేశించినప్పటి నుంచీ ఆయన కుడిచేతిని ఒకరు, ఎడమచేతిని మరొకరూ పరీక్షిస్తూ చూడమని వీరిద్దరినీ ఆదేశించారు. అయితే వెళ్ళగానే నాస్తికులవద్ద తానేమీ చేయననీ, నమ్మకం లేనివారికి మహాత్మ్యం తెలియదనీ ఆ స్వాములవారు తప్పించుకున్నారు.

విజయవాడలో మరో సంఘటన జరిగింది. చనిపోయిన వారి ఆత్మలు పలుకుతాయని, మనసుల్లో ప్రశ్న అనుకుంటే ఆత్మ సమాధానం చెబుతుందని, దీనిని ఎలా చేస్తారంటే ఇంగ్లీషు ఎ.బి.సి.డి.లు జడ్ వరకూ చిన్న చిన్న కాగితాలమీద వ్రాసి టేబిలు మీద విడి విడి అక్షరాలు పరుస్తారు. ఆ అక్షరాలపై ఒక గాజుపలక పెడతారు. గాజుపలకమీద ఒక గాజుగ్లాసు బోర్లించి ఇటొకరు అటొకరు – ఇద్దరు – రెండు చేతివ్రేళ్ళను గ్లాసు కొసమీద పెడతారు. ఒక వ్యక్తి మనసులో ప్రశ్న అనుకున్న కొంతసేపటికి ఆత్మవచ్చి గాజుగ్లాసులో ప్రవేశించి గ్లాసును అక్షరాలమీద ఒక అక్షరంనుంచి మరొక అక్షరానికి నడిపిస్తుందట. ఆ అక్షరాలు స్పెల్లింగును కూడాబలుకుతే మాటలు తెలుస్తాయి. ఒక మిత్రుడు తానది చూచాననీ, లవణంగారిని కూడా వచ్చి చూడమనీ కోరారు. తాను వస్తే నాస్తికుడు వచ్చాడు కనుక జరుగలేదనీ వారు అనవచ్చునని ముందుగానే లవణంగారు చెప్పారు. కాని, వెళ్ళి చూచారు.

రోమన్‌లిపి చూచి "ఆత్మలకు ఆంగ్లభాష తప్ప వేరుభాష రాదు కాబోలు" అని చిన్న ఛలోక్తి విసిరారు. తీరా గంటసేపు అలా వ్రేళ్ళు పెట్టుకు కూర్చున్నా గ్లాసు కదలదు. లవణంగారు వ్రేలు పెట్టలేదు. అక్కడవారినే పెట్టమన్నారు. తాను గ్లాసు ఎలా కదులుతుందో చూస్తానన్నారు. గ్లాసువంకా, దానిపై పెట్టి ఉంచిన చేతివ్రేళ్ళ

వంకా లవణంగారు తదేకధ్యానంగా చూచారు. గంట అయినా కదలకపోయేసరికి "మీ మానసిక ఏకాగ్రత శక్తి (విల్ పవర్) ఎక్కువై ఆత్మలను గ్లాసులోనికి రానివ్వకుండా అడ్డు తగులుతోంది" అని లవణంగారితో వారన్నారు. "సరిగ్గా నేను చెప్పేది అదే. మానసికంగా బలహీనంగా ఉండేవారికి భ్రాంతులెక్కువ. ఈ మంత్రశక్తులు, మహాత్మ్యాలు, భ్రాంతులు యదార్థాలు కావు. చాల సందర్భాలలో ఇవి మోసాలు." అని లవణంగారు అన్నారు. "1936-37 ప్రాంతాలలో ఇలాగే చనిపోయినవారు మాట్లాడుతారంటూ ప్రచారం ప్రారంభించారు. ముక్కోణంగా ఉండే బల్లకు ముందువైపు పెన్సిలు, వెనుక రెండు ప్రక్కలా చక్రాలు పెట్టారు. కాగితం మీద ఆ బల్లను పెట్టి మాట్లాడదలచుకున్న వారు ఆ బల్లమీద నాలుగువ్రేళ్ళుపెట్టగా ఆ వ్యక్తి నాలుగు వ్రేళ్ళు పెడతారు. బల్లను కొంచెం కొంచె త్రోస్తూ ఉంటే ముందున్న పెన్సిల్ అక్షరాలు వ్రాసేది. అలాగే ఈ గ్లాసును కూడా తోస్తారని నా అభిప్రాయం.'' అని లవణంగారన్నారు. దీనిని ప్రారంభించిన వారు ఇంగ్లీషుభాషను ఎంచుకోవడంలో ఉద్దేశ్యం 26 అక్షరాలతో సరిపోతుందని. తెలుగు అయితే గుణింతాలు, ద్విత్వాక్షరాలతో చాలాకష్టం కనుక ప్రారంభించినవారు అలా ఆలోచించే చేశారనీ ఇంగ్లీషును ఎంచుకొన్నారని లవణంగారు అన్నారు.

ఇలాంటి సంఘటనలు ఎన్నో జరిగాయి. ఈ మహాత్మ్యాలని చెప్పబడేవేవీ నిర్ధారణకు నిలువవు. అవి యదార్థాలు కావు కనుక ఎక్కడైనా జరుగుతున్నాయంటే చేసేవారిలో మోసం, ఆమోదించే వారిలో మౌఢ్యం, భ్రాంతి. అందుచేతనే గోరా, లవణం వంటివారు నిర్ధారణకు పూనుకుంటే ఒక్కటీ నిలవడం లేదు.

ఒకసారి నాస్తికోపన్యాసంలో గోరాని "మీకు దేవునిలో నమ్మకం లేకపోతే నిప్పుమీద నడుస్తారా" అని ప్రశ్నించారు. ముఖ్యంగా మహమ్మదీయులు పీర్ల పండుగ రోజు పీర్లుపుచ్చుకుని నిప్పుమీద నడవడం ఆచారం. అప్పటికి ఆయన నడవలేదు గాని నడుస్తానని అన్నారు. ఆ తర్వాత కాలేజీ క్లాసులో ఒక రోజు గోరా విద్యార్థులను మీరెప్పుడైనా నిప్పుమీద నడిచారా అని అడిగారు. కె జగన్మోహనరావు అనే విద్యార్థి తాను చిన్నతనం నుంచీ చాలాసార్లు నడిచానని, తన బంధువు ఒకరికి నిప్పు గుండం తయారు చేయుట తెలుసుననీ చెప్పాడు. ఆ తర్వాత గోరా జగన్మోహనరావుచేత ఆ బంధువుని పిలిపించి బందరులో తన విద్యార్థి అయిన పిల్లారసెట్టి వేణుగోపాలరావు ఇంటి ఆవరణలో అగ్ని గుండం వేయించారు. ఏ కారణం వల్లనైనా ప్రమాదం సంభవిస్తే ఏమౌతుందోననే భయంతో గోరాచే ఈ ప్రయోగం మాన్పించాలని ఆయన మిత్రులు ఎంతో ప్రయత్నించారు, కాని లాభం లేకపోయింది. చివరకు చేసేదిలేక ప్రమాదంజరిగితే సహాయం కొరకని గోరావెంట అగ్నిగుండం వద్దకు వెళ్ళారు.

మిత్రుడైన డాక్టరు మందులు కూడా తీసుకుని వెళ్ళారు. ఇంత మందీ చూస్తూ ఉండగా జగన్మోహనరావుతో పాటు గోరా షుమారు ఆరు అడుగుల పొడవుగల అగ్నిగుండం ఆచివరినుంచి ఈ చివరకు నవ్వుతూ నడిచి వచ్చేశారు

ఆశ్చర్యం. కాళ్ళు కాలలేదు. నిప్పుమీద ఎవరైనా నడవచ్చు. అందులో ఏమీ మహాత్మ్యం లేదు. ప్రమాదం జరుగుతుందేమో సహాయం చేద్దామని వచ్చిన మిత్రుల్లో కొందరు ఇది చూచి తామూ ఆయన వెనుక నిప్పుమీద నడిచారు. కణకణ మంటున్న ఆ నిప్పుమీద నడిస్తే దూదిపరుపు మీద నడిచినట్లుంది వారికి. ఆ తర్వాత ముదునూరు, వానపాముల గ్రామాలలోనూ మరికొన్ని చోట్ల గోరా, సరస్వతి, లవణంగార్లు నిప్పుమీద నడిచి చూపించారు. ముదునూరులో 1941లో ఈ కార్యక్రమం పెట్టినప్పుడు స్త్రీలు, పిల్లలు కూడా నిప్పుమీద నడిచారు.

నిప్పుమీద నడిస్తే ఎందకు కాలదో వివరిస్తూ "సంఘం" పత్రికలో ఇలా వ్రాశారు.

"మన ప్రాంతంలో నిప్పుమీద నడవడం ఒక పెద్ద మూఢనమ్మకంతో ముడిపెట్టబడి ఉంది. కొన్ని కొన్ని దైవారాధన సందర్భాలలో గొప్ప ఘనకార్యంగా నిప్పుమీద నడుస్తారు. నడుచుటకు ముందు ఉపవాసాలు, స్నానాలు, జపాలు చేస్తారు. ఇది ఒక దైవ మహిమ అంటారు.

కాని, ఇందులో సత్యం వేరు. దరిదాపు ఒక బండి బరువు కర్రను ఐదారు గంటలకాలం బాగా కాల్చి కణకణలాడే ఆ బొగ్గును దళసరిగా బల్లపరువుగా పరచి, దానిమీద ఎవరైనా ఎప్పుడైనా నడవవచ్చు. ఆ నిప్పు కాలదు. కాలికి వెచ్చగా ఉండవచ్చునేగాని చురకదు. స్నానాలతోను, ఉపవాసాలతోను దైవప్రార్థనలతోను దీనికి సంబంధం లేదు.

"ఇట్టి నిప్పులమీద ఎవరైనా నడచి నిర్ధారణ చేసుకోవచ్చు.

"అయితే నిప్పు ఎందుకు కాలదు? అనేది ప్రశ్న. దాని గురించి యదార్థం తెలిసికొనుటకు ప్రయత్నించవలసినదే. ఇట్లు ప్రయత్నం చేయుట వల్లనే విజ్ఞానం అభివృద్ధి చెందుతుంది. అంతేగాని, సోమరిపోతులమై విషయాలు తెలిసికొనుటకు అశ్రద్ధ వహించి మనకు తెలియనిదల్లా దైవమహిమ అంటే అల్పసంతృప్తి కలుగునేమో కాని, విజ్ఞానం కలుగదు. నిజానికి దైవనమ్మిక పోతేనేగాని విజ్ఞానం పెరగదు.

"నిప్పు ఎందుకు కాలదో ఆలోచిద్దాం. కణకణలాడే నిప్పు కాలకపోవడానికి కారణం అది చాలా వేడిగా ఉండటమే.

"మన చర్మం ఎప్పుడూ కొంత తడిగా ఉంటుంది. అంతే కాక నిప్పులమీద నడిచేవారు సాధారణంగా ముందు కాళ్లు కడుక్కుంటారు కూడాను. బాగా వేడిఉన్న

నిప్పులమీద తడిగా ఉన్న పాదం పడగానే ఆతడి వెంటనే ఆవిరి అవుతుంది. చర్మానికి నిప్పుకి మధ్య ఈ ఆవిరి ఒక పొరగా అడ్డు ఉండి చర్మానికి వేడి ఎక్కనివ్వదు. నిప్పుమీద ఎవరూ చాలాసేపు నిలబడరు. పరుగులో పాదం వేసి పాదంతీసే అంత సేపట్లో ఆవిరి అడ్డువలన చర్మం కాలదు. ఆలస్యం అయితే కాలుతుంది.

"ఈ విధానాన్ని ఒక ఉదాహరణ స్పష్టపరుస్తుంది. కొలిమిలో ఇనుపసామాను కాల్చేటప్పుడు కొంతసేపటికి ఇనుము బాగా వేడెక్కి ఎర్రగా అవుతుంది. అప్పుడు దానిమీద నీళ్ళు చల్లండి. ఆ నీటి బిందువులు వెంటనే ఆవిరి అయిపోక కొంతసేపు నీరుగానే ఉంటాయి. తర్వాతగాని ఆవిరి అయిపోవు.

"అంతవేడిమీద నీరు వెంటనే ఎందుకు ఆవిరి అవలేదు అని ఆలోచించండి. ఆ ఇనుము అంత వేడిగా ఉండటమే దానికి కారణం.

"ఎర్రగా కాలిన ఇనుమును నీటిబిందువు తాకిన తక్షణం దగ్గరగా ఉన్న నీటిపొర వెంటనే ఆవిరి అయింది. తక్కిన నీటికి వేడి ఇనుముకు మధ్య ఈ ఆవిరి ఒక పొరగా వేడిని పైనున్న నీటికి వెళ్ళకుండా అడ్డింది. అట్లు అడ్డగలిగిన కొంతసేపూ పైనున్న నీరు వేడెక్కదు."★

"ఇంత విస్తారం వేడిలేని ఇనుముమీద నీరు జల్లితే నెమ్మదిగా అంతనీరూ ఒక్కసారిగా ఆవిరిఅవుతుంది. ఎందుకంటే వేడి తక్కువ వల్ల ఇనుమును తాకిన వెనువెంటనే నీరు ఆవిరి కాదు. ఆవిరి తెర మధ్య లేకపోవుటచేద ఆ నీరు ఒక్కసారి వేడెక్కుతుంది.

"ఈ విషయం తెలుసుకుంటే నిప్పుమీద నడిచేటప్పుడు నిప్పు ఎంత వేడిగా ఉంటే, అంత తక్కువ కాళ్ళు చురుకుతాయని గ్రహించవచ్చును. కాళ్ళు కడుక్కుని తడి చేసుకుంటే మరీ మంచిది. నిప్పువేడి తక్కువగా ఉన్నప్పుడే కాళ్ళు కాలతాయి."

ఈ విధంగా బందరు వచ్చిన తర్వాత నాస్తికత్వంపై గోరా తీవ్రమైన కృషి ప్రారంభించారు. స్వాములవార్లతో చర్చించుటకు ప్రయత్నాలు, వివిధ ప్రాంతాలలో ఉపన్యాసాల ద్వారా నాస్తికత్వం గురించి బహిరంగ ప్రచారం, మూఢనమ్మకాలు పటాపంటలు చేయడం ఇదంతా గోరాకి ప్రముఖమైనది. నాస్తికత్వం గురించి ఇంగ్లీషులో ఒక గ్రంథ రచనను కూడా ఆయన ప్రారంభించారు. అంతకు ముందు ప్రపంచం మొత్తంమీదనే తానే నాస్తికుణ్ణి అని చెప్పుకుని ఇంత పెద్ద ఎత్తున సామాన్య ప్రజానీకంలో నాస్తికత్వ ప్రచారానికి ఎవరూ పూనుకోలేదు.



---

★ **దీనినే ఫిజిక్సులో "గ్లొబాయిడల్ యాక్షన్" అని అంటారని "సంఘం" పత్రికలోనే మరొకచోట వ్రాశారు.**

# ఉద్యోగమా ! ఆదర్శమా ?

**బం**దరు వచ్చినప్పటినుంచీ గోరా కార్యకలాపాలు ఎక్కువైపోయాయి. ఒకవైపు నాస్తిక ప్రచారం, మరోవైపు నూతన ఆదర్శాలతో కళాశాల స్థాపనకు ప్రయత్నం. ఇవికాక విద్యార్థులలో ఆయన సాహచర్యంవల్ల సాంఘిక-రాజకీయ చైతన్యం ఉప్పొంగడం. సహజంగానే కాలేజీ నిర్వాహకుల దృష్టి గోరామీదకు పోయింది.

బందరు వచ్చిన తర్వాత విద్యార్థులతో గోరా సాన్నిహిత్యం పెరిగింది. బందరులో విద్యార్థుల లాడ్జీలకు వెళ్ళడమేకాదు, నాస్తికోపన్యాసాలను ఎక్కువగా విద్యార్థులు ఏర్పాటుచేయడమే కాదు, విద్యార్థి – యువజన రాజకీయ శిక్షణ తరగతులలో ఆయన పాల్గొనడమేకాదు; విద్యార్థుల గ్రామాలలో వారి ఇండ్లకు 40–50 మంది విద్యార్థులను తీసుకుని సైకిళ్ళపై విజ్ఞానయాత్రలుగా కూడా వెళ్ళేవారు. ఇలాంటి యాత్రలలో కాలేజీలోని ఇతర ఉపాధ్యాయులు కొందరు అప్పుడప్పుడు పాల్గొనేవారు. ఈ యాత్రలలో బోటనీ విద్యార్థులే పాల్గొనాలనిలేదు. ఏ విద్యార్థి అయినా రావచ్చు.

25–30 మైళ్ళ దూరం వరకూగల గ్రామాలకు కూడా వెళ్ళేవారు. ఏ విద్యార్థి అయినా తన గ్రామానికి రమ్మని ఆహ్వానించేవాడు. అతను ముందుగావెళ్ళి తన గ్రామంలో 40–50 మందికి భోజనం–అల్పాహారం ఏర్పాట్లు చేసేవాడు. బృందంవారు ఉదయం 5 గంటలకు బందరునుంచి సైకిళ్ళమీద బయలుదేరి ఆ గ్రామానికి వెళ్ళేవారు. తమ మిత్రుని ద్వారా ఏర్పాటైన గ్రామస్తుల అతిథ్యం స్వీకరించి ఆపూట అంతా ఆ గ్రామంలో గడిపేవారు. గ్రామపరిస్థితులను అధ్యయనం చేసేవారు. గ్రామస్తులతో వివిధ విషయాల గురించి చర్చించేవారు. సాయంత్రం వరకు అక్కడ

గడపి, రాత్రికి బందరు తిరిగివచ్చేసేవారు. తమ అబ్బాయి సహాధ్యాయులు, ఉపాధ్యాయులు వస్తున్నారంటే సంరక్షకులకు సంతోషంగా ఉండేది.

గ్రామాలకు ఈవిధంగా విద్యార్థులు, ఉపాధ్యాయులు వెళ్ళడం ఆ రోజులలో క్రొత్త. అందుచేత గ్రామస్తులందరికీ అదొక పెద్ద పండగగా ఉండేది. ఇలా గోరా విద్యార్థులతో సైకిళ్ళమీద వెళ్ళి ఒకో రోజున 100 మైళ్లు సైకిలు త్రొక్కిన సంఘటనలు కూడా ఉన్నాయి. మనదేశంలోని లక్షలాది గ్రామాలే భారతదేశం. అందుచేత విద్యార్థులకు గ్రామాలతో, గ్రామాల సమస్యలతో సంబంధం ఉండాలని గోరా అభిప్రాయం. దానికిగాను ఇలాంటి కార్యక్రమాలు ఏర్పరుస్తూ ఉండేవారు. వీటివల్ల సాంఘిక కలయిక కూడా జరిగేది. విద్యార్థులు గ్రామాలకు వెళ్ళినప్పుడు "బియ్యం చెట్లు ఎలా ఉంటాయో చూపించండి" అని అడిగిన సందర్భాలు కూడా లేకపోలేదు. పట్టణంలోనే పుట్టి, పట్టణంలోనే పెరిగి, చదివి, పట్టణంలోనే పెళ్ళి చేసుకుని ఉద్యోగం చేసేవారికి గ్రామాల జ్ఞానం లేదంటే ఆశ్చర్యపడవలసినదేమీ లేదు.

గోరా తన విద్యార్థులతో గ్రామాలకు వెళ్ళడం కాకినాడలోనే ప్రారంభించారు. అయితే బందరులో దానికి స్పష్టమైన కార్యక్రమరూపం యిచ్చి నెలకు రెండుసార్లు అయినా వెళుతూ ఉండేవారు, ప్రారంభదినాల్లో, 1928లో జరిగిన ఒక సంఘటన ముచ్చటించుకుందాము. గోరా తనతో మరి ముగ్గురు విద్యార్థులను తీసుకుని కోనసీమ చూద్దామని బయలుదేరారు. తెలిసినవారు గ్రామాలలో ఉంటే భోజనాలకు పర్వాలేదు. కాని ఎవరూ తెలియక పోతే కొంత యిబ్బందే. ఆ రోజుల్లో పెద్దగ్రామాల్లో కూడా హోటళ్ళు ఉండేవికావు. ఆ పర్యటనలో ఈ నలుగురు కాలినడకన, పడవమీద, బస్సుమీద అలా ప్రయాణం చేశారు. ఒకరోజున ఒక గ్రామానికి వచ్చేసరికి చీకటిపడింది. నడిచి నడిచి అలసిపోయారు. భోజనం ఏర్పాటు గురించి ఆలోచించారు.

గోరా వెంటవున్న ముగ్గురు విద్యార్థులలో ఒకరు వకీలుగారి అబ్బాయి. ఆ ఊళ్ళో వకీలుగారి క్లయింటు ఒకరు ఉన్నారు. అందుచేత వీరందరూ ఆ క్లయింటు ఇంటివద్దకు వెళ్ళారు. గోరా ఆ వకీలుగారి అబ్బాయితో ముందుగానే చెప్పారు. తాను వారి ఉపాధ్యాయుడినని చెప్పవద్దనీ, సహాధ్యాయుడనే చెప్పమని లేకపోతే తమ వకీలుగారి అబ్బాయి టీచరుకు తగిన మర్యాదలు జరపాలని అనవసరంగా యిబ్బందిపడతారని. ఇష్టంలేకపోయినా ఆ అబ్బాయి అలాగే చెప్పాడు. వంటైంది. భోజనాలకు లేవమన్నారు. గోరాకు, మరొక విద్యార్థికి కరణంగారింట్లో భోజనాల ఏర్పాటు జరిగింది. వకీలుగారి అబ్బాయికి, మరొక విద్యార్థికి క్లయింటు ఇంట్లోను, తాము నలుగురు విడిపోయి

భోజనం చేయడం గోరాకు ఇష్టంలేకపోయింది. "మాలో బ్రాహ్మణులెవరండీ." అని గోరా అన్నారు. అందరూ ఒకరి మొహాలొకరు చూసుకున్నారు. క్లయింటు వకీలు అబ్బాయిని నలుగురి కులాలు అడిగి ఉంటారు. అప్పుడతను కులాలు చెప్పి ఉంటాడు. కులాల ప్రకారం భోజనాల ఏర్పాటు జరిగింది. గోరా ఇలా అనేసరికి కొత్త సమస్య ఎదురైంది. క్లయింటు ఆశ్చర్యపడి పొరపాటు పడ్డాం లెండి అని మిగిలిన యిద్దరికి కూడా తన యింటివద్దనే మళ్ళా వండించి అప్పుడు భోజనం పెట్టారు. మూడవ విద్యార్థికి పరిషించనిదే భోజనం చేసే అలవాటు లేదు. అందుచేత గోరా అతనికి మరీ మరీ చెప్పారు. చేతిలో నీళ్ళు పోసుకుని విస్తరిచుట్టూ తిప్పుతాడేమో జాగ్రత్త అని. ఆ క్లయింటు వైశ్యుడు. అందుచేత భోజనం చేసిన తర్వాత విస్తళ్ళు ఎవరు తీయాలి అనే సమస్య ఎదురైంది. వకీలు అబ్బాయి ఎలాగైనా నా క్లయింటుకు ఎక్కువే. అందుచేత అతను తియ్యడానికి వీలులేదు. రెండో విద్యార్థి చిన్నవాడు. అరిటాకుల్లో భోజనమే అలవాటు లేదు. అందుచేత అరిటాకులు ఎత్తలేడు. మూడో విద్యార్థి కులరీత్యా మిగిలిన ఇద్దరికంటే అగ్రవర్ణస్తుడు. సరసన కూర్చుని భోజనం చేశాడు గాని, విస్తళ్ళు తియ్యమంటే బాగుండదు. కనుక చివరకు వారి ముగ్గుర్నీ నోరెత్త వద్దని చెప్పి గోరాయే నలుగురి విస్తళ్ళూ ఎత్తి పారవేశారు. ఇలా జరిగినందుకు ఆ ముగ్గురూ చాలా బాధపడ్డారు.

మరి ఇలాంటి సంఘటనలను సమాజం సహించాలంటే ఎంత మార్పురావాలో: విప్లవనాయకులు తామే మార్పు తీసుకువస్తారు గాని, ఎవరో తెచ్చేవరకూ ఆగరు గదా. సమాజంలో అప్పటిస్థితిని ఆమోదిస్తూ కొనసాగించే సంస్థలలో ఆ స్థితిని భగ్నం చేసే వ్యక్తికి స్థానం ఎలా ఉంటుంది?

ఇవన్నీ ఇలా ఉండగా 1938లో కాలేజీ విద్యార్థులు సమ్మె చేశారు. గోరా వల్ల విద్యార్థులలో తిరుగుబాటు భావం పెరుగుతున్నదనీ, ఈ విధంగా గోరా పరోక్షంగా సమ్మెకు బాధ్యులని కాలేజీ అధికారుల భావం. వీటన్నిటివల్లా గోరాను ఉద్యోగం నుంచి తొలగించాలని కాలేజీ కమిటీలో కొద్దిమంది సమావేశమై ఆమోదించారు. 1939 ఏప్రిల్‌లో కాలేజీ అధికారులు గోరాకు 3 నెలల నోటీసు ఇచ్చారు. కాని ఈ ఉత్తర్వు అన్యాయమని కాలేజీ కమిటీ సభ్యులందర్నీ కలుసుకుని గోరా చెప్పారు. ఈ సందర్భంలో విద్యార్థుల నుంచి గోరాకు లభించిన అండ అసాధారణమైనది. అట్టి ఉదాహరణలు ఎక్కడో గాని కనపడవు. కమిటీ సభ్యుల వద్దకు విద్యార్థులు అధిక సంఖ్యాకులుగా వెళ్లి విజ్ఞప్తి చేయడం, తమ సంరక్షకులచేత చెప్పించడం మొదలైనవి చేశారు. తిరిగి కమిటీ సమావేశమైంది. అప్పుడు అత్యధికంగా కమిటీసభ్యులు హాజరై

గోరాను తొలగిస్తూ అంతకుముందు ఆమోదించిన ఉత్తర్వును ఉపసంహరించారు. ఇది విద్యార్థులు సలిపిన నిర్విరామ కృషికి, గోరాకు గొప్ప విజయం.

గోరాపై కమిటీ తొలగింపు ఉత్తర్వును రద్దుచేసింది. అయినా, ప్రిన్సిపాలు గోరాపై క్రమశిక్షణ నిబంధనలంటూ కొన్ని నిషేధాలు విధించారు. వాటిలో నాస్తికత్వం గురించి ఎక్కడా ప్రచారం చేయరాదనీ, వ్యాసాలు పుస్తకాలు వ్రాయరాదనీ, వేరే విద్యాసంస్థలు నెలకొల్పుటకు ప్రయత్నించరాదనీ, విద్యార్థులను క్లాస్‌రూమ్ బయట కలుసుకొనరాదనీ – ఆంక్షలు విధించారు.

అన్నిటికంటే, క్లాసురూం బయట తన విద్యార్థులను కలవరాదని ఉపాధ్యాయునిపై విద్యాసంస్థ ఆంక్ష విధించడం గోరాను కదిలించివేసింది. ఈ ఆంక్షల సంగతి సరస్వతిగారికి చెప్పేసరికి సరస్వతిగారు వెంటనే "ఇంత హీనంగా ఉద్యోగంలో బ్రతికేకంటే ఎక్కడైనా కూలి చేసుకోవడం మేలు" అని గోరాకు బలమిచ్చారు. సరస్వతిగారు నగలు తీసివేశారు, బంధువులకు దూరమయ్యారు, కులం వదులుకున్నారు, ఆస్తినీ – ధనాన్నీ కాంక్షించలేదు– చివరకు తన భర్తను ఉద్యోగం కూడ వదిలివేయమని ప్రోత్సహిస్తున్నారు. అప్పటికి వారి సంతానం తక్కువ ఏమీ కాదు. ఆరుగురు పిల్లలు. వదిలేస్తే రేపు ఏమౌతుందో తెలియదు. అయినా ముందడుగు వేయవలసిందే! త్యాగానికి ఏ భార్య తన భర్తను ఇలా ప్రోత్సహించగలదు: గోరా ఆదర్శాలకు, ఆచరణకు సరస్వతిగారి ప్రోత్సాహం వన్నెతెచ్చింది. పసిడికి పరిమళమబ్బింది. ఇక ఏమి కావాలి కనుక!

విద్యార్థుల పట్టుదలపై ఆ ఒక సంవత్సరం ఎలాగో అజ్ఞాతవాసం గడుపుటకు గోరా అంగీకరించారు. ఆ సంవత్సరం ఒక యుగం వలె గడిచింది వారికి. ఆ విద్యా సంవత్సరం పూర్తి అవగానే 1940 ఏప్రిల్లో గోరా రాజీనామా లేఖను పంపారు. గోరాను లొంగదీశామని విర్రవీగుతున్న వారికి పిడుగు మీద పడ్డట్లయింది. గోరా తన భవిష్యత్తును నిర్ణయించుకోవలసి వచ్చింది. ఆదర్శాలకు తిలోదకాలిచ్చి ఉద్యోగాన్ని కాపాడుకుంటూ, ఉదర పోషణ చూచుకోవడమా, ఉద్యోగాన్ని కాలదన్ని త్యాగ పథాన ఆదర్శ శిఖరంవైపు అధిరోహించడమా? ఉద్యోగాన్ని వదిలారు. భార్యాబిడ్డలు వెంటరాగా నిజమైన జీవితయాత్ర ఆరంభించారు.

# ముదునూరు రాక - గ్రామసేవా కార్యక్రమాలు

నాస్తిక ప్రచారంలో గోరా పర్యటిస్తున్నప్పుడు తాను ఎంతో కాలం ఉద్యోగంలో ఉండడం పడదేమోనని, ఈ మారు కాలేజీ అధికారులు తనమీద ఆంక్షలు పెడితే, తాను ఉద్యోగం వదలి ఏదేనా గ్రామంలో వచ్చి ఉండాలనుకుంటున్నానని చెప్పేవారు. అలాగే ఒకసారి కృష్ణాజిల్లాలో గుడివాడకు దగ్గరగా ఉన్న ముదునూరు అనే గ్రామానికి వెళ్ళినప్పుడు కూడా చెప్పారు. శ్రీ తుమ్మల రామారావు అనే యువకుడు ముదునూరులో గోరా నాస్తికోపన్యాసం 1938లో ఏర్పరిచారు. అప్పుడే గోరాకు ముదునూరు గ్రామస్తులు, ప్రముఖ జాతీయవాదులు, కాంగ్రెసు నాయకులు ఆయిన శ్రీ అన్నే అంజయ్య పరిచయమయ్యారు. ప్రథమ పరిచయంతోనే ముదునూరు గ్రామ యువకులకు, గోరాకు అవినాభావ సంబంధం ఏర్పడింది. 1920 నుంచీ కూడా ముదునూరు గ్రామస్తులు జాతీయోద్యమంలో పాల్గొన్నారు. గోరా భావాలను ముదునూరు గ్రామస్తులు హెచ్చుగా హర్షించారు.

ఎప్పుడైతే 1940లో గోరా తమ బందరు ఉద్యోగానికి రాజీనామా ఇచ్చారో, అంజయ్య గారు గోరాను ముదునూరు రావలసిందిగా ఆహ్వానించారు. అప్పటికి గోరాకు ఆరుగురు సంతానం. ఆరవ సంతానం, తృతీయ పుత్రుడు 1939లో జన్మించాడు. అప్పుడే ద్వితీయ ప్రపంచ సంగ్రామం ఆరంభం కావడంచేత ఆ అబ్బాయికి 'సమరం' అని పేరు పెట్టారు. గోరా సకుటుంబంగా 1940 ఆగస్టు 10వ తేదీన ముదునూరు రావడంతో జీవితంలో నూతనాధ్యాయం ప్రారంభించారు. ముదునూరు గ్రామస్తులు గోరా కుటుంబానికి ప్రేమపూర్వకంగా - ఘనమైన స్వాగతం యిచ్చారు.

ముదునూరు రావటమంటే గోరా పూర్తిగా ప్రజలమీదనే ఆధారపడటం అన్నమాట. గోరాకు ఆస్తి సంపాదించాలనే కాంక్ష ఎప్పుడూ లేదు. కనుక ఉద్యోగ సమయంలో

సంపాదించింది ఎప్పటికప్పుడు కుటుంబ పోషణకు పోగా, మిగిలినది ప్రజోపయోగ కార్యాలలో వినియోగించారు. అందుచేత బందరు ఉద్యోగం రాజీనామా ఇచ్చేసరికి గోరాకు ఆస్తిగాని, అప్పుగానీ ఏమీలేదు. చూడబోతే ఆరుగురు సంతానం. అంత పెద్ద కుటుంబం ఎలా పోషింపబడుతుంది అని ఇతరులు కలతచెందారు గాని గోరాకి ఆ ఆలోచనే లేదు. మానవుని మంచితనంపై గోరాకి అచంచల విశ్వాసం, కార్యకర్తలో సేవాభావం, నిజాయితీ ఉంటే సమాజం పోషించకపోదు అని ఆయన నమ్మకం. ఆ విశ్వాసం, ఆ నమ్మకం వృథాపోలేదు. 1940 నుంచీ నేటివరకూ కూడా గోరా, వారి కుటుంబం ప్రజల సహాయ సానుభూతుల మీదనే ఆధారపడి ఉన్నారు. ఈ దారి అంతా పూలపాన్పు కాదు. మధ్యమధ్య కష్టాలను, భద్రతలేమిని ఆయన తీవ్రంగా ఎదుర్కోవలసి వచ్చింది. అయినా జంకలేదు. జీవితాంతం వెనుకంజ వేయలేదు. అస్థిరమైన ఆర్థిక అవకాశాలు ఆయనను మరింత గట్టిపరచాయి గాని సడలించలేకపోయాయి.

గోరా ముదునూరు రాగానే మొదట చేసిన పని సకుటుంబంగా గ్రామంలోని అందరి ఇండ్లకు వెళ్ళి పరిచయం చేసుకోవడం. వారు, వీరు అనే తేడా లేకుండా ప్రతి ఒక్క ఇంటికి వెళ్ళారు. దీనివల్ల గ్రామంలోని పురుషులలోనే కాక, స్త్రీలలో కూడా పెద్ద కదలిక వచ్చింది.

ఆ సంవత్సరమే వయోజన విద్యాలయం ఒకటి ప్రారంభించారు. ముదునూరు, చుట్టుప్రక్కల గ్రామాలకు చెందిన సుమారు 80 మంది యువకులు పదిమాసాలపాటు ఆ విద్యాలయంలో శిక్షణ పొందారు. వీరిలో హరిజనులు కూడా ఉన్నారు. తెలుగు వ్రాయడం, చదవడం మాత్రం వచ్చిన యువకులు పదిమాసాలలో భూగోళం, సివిక్సు, రాజకీయశాస్త్రం, ఆర్థిక శాస్త్రం, సాంఘిక శాస్త్రం, ప్రపంచ చరిత్ర, తర్క, తత్వ శాస్త్రాలు, ఖగోళ, రసాయన, పదార్థవిజ్ఞాన, వృక్ష, జంతుశాస్త్రాలు, శరీర విజ్ఞాన శాస్త్రం మొదలైన విషయాలలో కనీసం అప్పటి ఇంటర్‌మీడియెట్ స్థాయివరకూ జ్ఞానం సంపాదించ గలిగారు. నాస్తికత్వం కొరకు దాదాపు అన్ని విషయాలూ ఎం.ఏ. స్థాయివరకూ గోరా అధ్యయనం చేసి ఉండటం చేత పైన చెప్పిన విషయాలన్నీ గోరా తేలికగా బోధించగలిగారు. ఈ విషయాలతోపాటు వేదాలు, ఉపనిషత్తులు, భగవద్గీత, బైబిలు, కురాను మొదలైన మతగ్రంథాలపై నాస్తికదృక్పథంతో పరిశీలన కూడా బోధించారు. మార్క్సిజం, గాంధీయిజం గురించి ప్రత్యేక ఉపన్యాసాలు కూడా యిచ్చారు. ఈ విధంగా, గోరా ఆ విద్యాలయంలో వివిధ విషయాలలో మూలమైన ప్రాథమిక జ్ఞానం కలిగించి వారందరికీ తాత్విక భూమికను యిచ్చారు. విద్యాలయం రోజూ మధ్యాహ్నం 11 గంటల నుంచీ 2 గంటల వరకూ 3 గంటల కాలం సాగేది.

రోజూ తరగతి ముగించేటప్పుడు అందరూ ఐదు నిమిషాలు మౌనంగా నిలబడేవారు. ఆ మౌనంగా నిలబడటం క్రమశిక్షణను కలిగించేది. విద్యాలయంలోని

వారు ఒకరుగాని, ఇద్దరుగాని కలిసి మిగిలిన వారినందరినీ తమ యింటికి అల్పాహారానికి పిలిచేవారు. ఇలా ప్రతి ఆదివారం జరిగేది. దీనితో అందరి ఇండ్లకూ అందరూ వెళ్లడం జరిగేది. ఈ విధంగా పరస్పరం ఒకరి ఇంటికి మరొకరు వెళ్ళడం వల్ల రకరకాల కులాల కలయిక ఏర్పడింది. వయోజనులకు విషయజ్ఞానం బోధించుటలో ఈ విద్యాలయం గొప్ప విజయాన్ని సాధించింది.

ఒకప్రక్క పగలు సమయంలో ఈ విద్యాలయం నడుపుతూ రాత్రిపూట హరిజనవాడలో అక్షరాస్యతను కూడా నేర్పే వయోజన పాఠశాల నడిపారు. పెద్దలకు అక్షరజ్ఞానం లేకపోయినా లోకజ్ఞానం చాలా ఉంటుంది కనుక వారికి అక్షరాస్యత నేర్పినా చిన్న పిల్లలకు నేర్పినట్లు "అలక, పలక" వంటి మాటలతో నేర్పితే బాగుండదు. అందుచేత గోరా అక్షరాస్యత - విషయజ్ఞానం రెండూ కలిసి రావాలని ఎన్నో ప్రయోగాలు చేసి "మా పాఠాలు"* అనే పుస్తకాన్ని రూపొందించారు. ఈ పుస్తకాన్ని బోధించాలంటే ముందుగా ఉపాధ్యాయులు తర్ఫీదు పొందాలి. పుస్తకంలో ముందు ఉపాధ్యాయులకు కూడా గోరా సూచనలు వ్రాశారు.

ఈ పుస్తకంలో ప్రతీపదం ప్రయోజనాత్మకంగా కూర్చబడింది. "ఆఫ్రికా, నయాగారా, ఆరిస్టాటిలు, గెలీలియో, సోక్రటీసు, రష్యా, ఫ్రాన్సు, అబ్రహాం లింకను, గాంధీ, సూఫీయిజం" వంటి పదాలు ఎన్నో ఉన్నాయి. ప్రతీపదంతోనూ దానికి సంబంధించిన జ్ఞానాన్ని వివరించి చెప్పేవారు. రష్యా, ఫ్రాన్సు అనే పదాలతో ఆ దేశాల విప్లవాల చరిత్ర, అబ్రహాం లింకను అనగానే నీగ్రోవ్యాపారం, దానిని నిర్మూలించుటకు లింకను చేసిన కృషి, అమెరికా అంతర్యుద్ధం అంతా చెప్పేవారు. ఇలా చెప్పడానికి విధిగా గ్లోబు, దేశపటాలు, అవకాశం ఉంటే సైన్సు పరికరాలు వాడాలి. ఈ పుస్తకంలో "అంటరానితనం మంటకలపాలి" అని వ్రాసి, హరిజన వాడలలో రాత్రి పాఠశాలలు నడిపి గొప్ప సాంఘిక చైతన్యం తీసుకుని వచ్చారు.

నిరక్షరాస్యులగు వయోజనులకు అక్షరాస్యత చెప్పడంలో "మా పాఠాలు" రెండు భాగాలు పూర్తి అయ్యేసరికి దినపత్రిక చదవడమూ వచ్చేది. దానితో పత్రికను అర్థం చేసుకోగలిగే వివిధ విషయ పరిజ్ఞానమూ అలవడేది. తెలుగులో నిరక్షరాస్యత నిర్మూలన ఉద్యమంలో "మా పాఠాలు" పుస్తకానికి ఎంతో ప్రాధాన్యత వుంది. ముందుగా వ్రాతప్రతులు పెట్టుకుని చాలాచోట్ల బోధించి ఎప్పటికప్పుడు అవసరమైన మార్పులు - చేర్పులు చేసి ఆ తర్వాత ప్రచురించుట చేత ఈ పుస్తకం ఎంతో విలువను ఆర్జించుకుంది. ముదునూరుకు చెందిన ఉపాధ్యాయులు శ్రీనాగులపల్లి సీతారామయ్య గోరాతో పాటు ఎంతో ఓపికతో కృషిచేసి "మా పాఠాలు" రచనలో సహకరించారు. శ్రీ కాట్రగడ్డ రాజగోపాలరావు కృష్ణా జిల్లా యువజన సంఘం తరఫున ఈ పుస్తకాన్ని

---

* "ఆరు మాసాలలో అందరికి చదువు"గా పునర్ముద్రణ జరిగింది.

మొదట్లో ప్రచురించి ఆంధ్రదేశం అంతటా ప్రచారంలోనికి తీసుకువచ్చారు. పుస్తకానికి "మా పాఠాలు" అని పేరు పెట్టుటలో గోరా చూపిన ప్రత్యేకత చదివే వారిపై మానసిక ప్రభావం వేసింది.

ఒకప్రక్క వయోజన విద్య కార్యక్రమం తీసుకోగా, మరోప్రక్క అస్పృశ్యతా నిర్మూలన కార్యక్రమాన్ని కూడా చేపట్టారు. ముదునూరు గ్రామానికి తూర్పుగా 'మాదిగగూడెం' ఉంది. మాదిగగూడెం అనే పేరు కులాన్ని సూచిస్తోందని "తూర్పుపాలెం" గా మార్చారు. అలాగే వాయవ్యంగా "మాలపల్లె" ఉంది. అందులో "దూసరి" ఇంటిపేరుగల కుటుంబాలు చాలా వున్నాయి. దాన్నిబట్టి "దూసరిపాలెం" అని మార్చారు. గ్రామస్తులందరూ ఈ మార్పును ప్రేమాదరాలతో స్వీకరించారు. దీనితో ముదునూరు గ్రామంలో మాల, మాదిగలనడం చాలావరకు తగ్గిపోయింది.

ముదునూరులో అస్పృశ్యతా నిర్మూలన కొరకు గోరాగారు ప్రారంభించిన మరొక మార్పు "పౌర్ణమి విందులు" పేర సహపంక్తి భోజనాలు. నెలకొకసారి ప్రతీ పౌర్ణమి నాటి రాత్రి అందరూ సహపంక్తిన కూర్చొని భోజనం చేయడం. ఈ విందుల కార్యక్రమం దూసరిపాలెంలో ప్రారంభించబడింది. రాత్రి విందుకు రాదలుచుకున్నవారు ఉదయమే తమ తమ పేర్లు వ్రాయించి అణా, అణా* భోజనం ఖర్చులు ఇవ్వాలి. అంటే సమిష్టి భోజనానికి టికెట్టు కొనుక్కోవాలి. ఎవరికి కూడా ఉచిత ప్రవేశం లేదు. సాధారణంగా అన్నం, కూర, పులుసు, మజ్జిగ ఉండేవి. కూరగాయలు, మజ్జిగ, కట్టెపుల్లలు గ్రామంలో ప్రోగుచేసేవారు. అణా అణా వేసుకున్న దానితో బియ్యం, పప్పు, విస్తళ్ళు కొనేవారు. హరిజనవాడలో వారే వండి, వారే వడ్డించేవారు. 70 లేక 80 మంది వరకు సాధారణంగా సమిష్టి భోజనాలకు వచ్చేవారు. ఒకొక్కప్పుడు 100, 150 మంది కూడా అయ్యేవారు.

మొదటి విందు సందర్భంలో ముదునూరు కరణంగారి అబ్బాయి హరిజనులతో కలిసి భోజనం చేసినందుకుగాను వెలిపడడం కూడా జరిగింది. ఆధారపరాయణులైన తల్లి, భార్య సమిష్టి భోజనం నుంచి ఆయన ఇంటికి తిరిగిరాగా ఇంట్లోకి వచ్చుటకు వీలులేదని తలుపు వేసేశారు. మూడురోజుల వరకూ ఆయన మిత్రుల ఇంటిలో ఉన్న తర్వాత, గ్రామస్తులు కుటుంబీకులకు నచ్చజెప్పిన అనంతరం తిరిగి తన ఇంటిలో ప్రవేశించగలిగారు. పట్టణాలలో హోటళ్ళలో ఎవరో తెలియకుండా హరిజనుల ప్రక్కన కూర్చుని భోజనం చేయడం వేరు. స్వగ్రామంలో తమ గ్రామస్థులైన 'మాలమాదిగల' తో కలిసి "నేను అస్పృశ్యతను అంగీకరించను. సాంఘిక సమానత్వం కొరకు సహపంక్తి భోజనంలో పాల్గొంటున్నాను" అని చెప్పి బహిరంగంగా భోజనం చేయడం వేరు.

---

★ ఆ రోజుల్లో రూపాయికి **16** అణాలు. ఒక అణా అంటే ఇప్పటి **6** పైసలతో సమానం.

ఇలా బహిరంగంగా ప్రకటించి చేయుటవల్లనే మార్పు వస్తుంది. సమాజం ఆలోచిస్తుంది. కరణంగారి అబ్బాయి ముదునూరు సూర్యప్రకాశరావు ఇలా బహిరంగంగా చేయబట్టే వ్యతిరేకతను ఎదుర్కోవలసి వచ్చింది. ఈ విధంగా ఐదు సంవత్సరాల పాటు ప్రతీపౌర్ణమినాడూ జరిగిన సహపంక్తి భోజనాలు ఆ చుట్టు ప్రక్కల సాంఘికంగా అస్పృశ్యతా నిర్మూలన విషయంలో పెద్ద చైతన్యం కలిగించాయి.

కేవలం ముదనూరు గ్రామంలోనే సహపంక్తి భోజనాలు నిర్వహించడంకాక గోరా బహిరంగ కార్యక్రమం మీద ఏ గ్రామం వెళ్ళినప్పటికీ ఒకపూట హరిజనవాడలో సహపంక్తి భోజనం ఏర్పరచాలనే షరతు విధించేవారు. వివాహాలలో కూడా స్థానిక హరిజనులతో సహపంక్తి భోజనం పెడితేనే ఆ వివాహానికి వస్తామని గోరా సరస్వతి నియమం పెట్టుకున్నారు. ఈ నియమంవల్ల ఎంతోమంది సన్నిహిత మిత్రులు, బంధువుల ఇండ్లలో వివాహాలకు కూడా, వారు సహపంక్తి భోజనాన్ని ఏర్పాటు చేయలేకపోవుట చేత గోరా వెళ్ళలేదు. చాలామందికీ ఆయన దూరం కావలసి వచ్చింది. అయినా ఆ తుఫానులను గోరా ఎదుర్కొన్నారు.

గోరా సహచరులలోనే కొందరు తాము సహపంక్తి భోజనాలకు హాజరవుతూ, వాటిని ప్రోత్సహించికూడా, తీరా తమ వివాహమో, తమ పిల్లల వివాహాలో వస్తే కులానికి జంకో, కుటుంబీకుల వత్తిడికి లొంగో, సహపంక్తి భోజనాలు ఏర్పాటు చేయలేకపోయిన సందర్భాలూ ఉన్నాయి. నాస్తికుల్ని అని అనుకోగానే కనీసం సాంఘిక సమానత్వాన్నైనా పాటించాలనీ, తమ తమ ఇండ్లలో జరిగే శుభకార్యాలకు సహపంక్తి భోజనాలు ఏర్పాటు చేయాలనీ గోరా నొక్కిచెప్పేవారు. అగ్రవర్ణాలనబడేవారు 'అస్పృశ్యుల'తో కలవనట్లే, అస్పృశ్యుల్లో కూడా అంటరానితనం ఉంది. మాల మాదిగలు కలిసి భోజనం చేయరు. ఒకరి చేతినీరు మరొకరు త్రాగరు. మరల మాదిగలు డెక్కల, పంబ, మాస్టీను మొదలైన కులాలవారిని అంటరానివారుగా చూస్తారు. అందుచేత గోరా అగ్రవర్ణాలవారు మాలమాదిగలతో కలసి భోజనం చేయడంతో ఆగక, వర్ణవ్యవస్థలో అట్టడుగున ఉండే వ్యక్తి వరకూ సమానగౌరవం సహపంక్తి భోజనం అన్నారు.

అందుకే మాలల ఇండ్లలో వివాహాలకు మాదిగలను కూడా పిలవాలని, మాదిగల ఇండ్లలో వివాహాలకు డెక్కల, పంబ,మాస్టీను వారిని పిలవాలనీ గోరా షరతులు పెట్టేవారు. గోరాకు మానవులందరూ ఒకటే. గోరా అభిమానులు, సహచరులు తమ ఇండ్లలో వివాహాలకు గోరా రావాలని సమిష్టి భోజనాలు వివాహ విందులో ఏర్పాటు చేయగా, ఎదుటి పెళ్ళివారితో ఘర్షణలు జరిగిన సందర్భాలు కూడా లేకపోలేదు.

ఒకసారి ఒక సహపంక్తి భోజనం సందర్భంలో అందరూ కూర్చుని ఉన్నారు. ఇంతలో ఒక వ్యక్తి వచ్చి "బాబూ నేను కూడా రానా" అన్నాడు. వచ్చి పంక్తిలో

కూర్చోమని చెప్పాడు. గోరా, కాని ఇంతలో ఆ పంక్తిలో కూర్చున్న హరిజనులు "వాడు డెక్కలవాడు, వాడిసరసన మేము కూర్చోము" అని చివాలున లేచారు. గోరా వారిని వారించి సహపంక్తి భోజనాలు అంటూ లేకుండా మానవులందరూ సమానమని తెలుపుటకుగాని, కొన్ని కులాలను మాత్రమే కలుపుకొనుటకు కాదనీ; ఫలానావారు తమకంటే తక్కువ కులంవారు కనుక వారితో మేము కలిసి భోజనం చెయ్యము అని అంటే మీ కంటే ఎక్కువ కులాలవారు మీతో ఎందుకు కలిసి భోజనం చెయ్యాలి అని ఎవరైనా అడగవచ్చు అనీ నచ్చచెప్పారు. చివరకు తమ తొందరపాటుకు వారు సిగ్గుపడి అందరితోనూ కలవాలని అంగీకరించి, నవాగంతకుని సరసన కూర్చొని భోజనం చేశారు. ఈ విధంగా గోరా సహపంక్తి భోజనాల ద్వారా సమాజంలో సాంఘికంగా కులరీత్యా ఏర్పడిన అసమానతలను చిట్టచివరివరకూ ఛేదించగలిగారు.

ఈ సందర్భంలోనే మరొక సంఘటనకూడా ముఖ్యమైనది. హరిజనుల ఇండ్లలో పెళ్ళిళ్లకు పంద్రిమాంసం పెండితీరాలి అని నియమం ఉండేది. అది కులకట్టుబాటు. ఒక్కొక్క పంది ఆ రోజుల్లోనే 60, 80,100 రూపాయల వరకూ ఉండేది. అసలే ఆర్థికంగా వెనకబడిన హరిజనులను వివాహంలో పందినికోసితీరాలనే నిబంధన మరీ అప్పులపాలు చేసేది. వివాహనికి మూడు - నాలుగు వందల అప్పుచేస్తే ఆ రోజుల్లో జీవితాంతం అప్పుతీర్చినా వడ్డీయే గాని అసలు తీర్చలేకుండా కూడా ఉండేవారు. ఇది చూచిన గోరా చాలా ఆవేదన చెందారు. పందిని వివాహసమయంలో వాడితీరాలనే కట్టుబాటు మార్పిస్తే వారి ఆర్థిక దాస్యం తగ్గుతుందని అనుకున్నారు. అయితే ఎలావారికి నచ్చజెప్పడం? ఒకసారి ఒక హరిజనవాడలో వివాహానికి వెళ్ళినప్పుడు గోరా ఆ విషయం ప్రస్తావించి ఆర్థిక సాధకబాధకాలు వివరించారు. అప్పుడు వారిలో ఓ కులపెద్ద "పప్పు అన్నం తినే మీకు పందిమాంసం రుచి ఏమి తెలుసు" అన్నారు.

ఈ మాటలు గోరాకి బాణంవలె తగిలాయి. అయినా వారి తప్పేముంది ఆ మాటలనడంలో? వారి అనుమానాన్ని తీరిస్తే గాని వారికి నమ్మకం ఏర్పడదు. అందుచేత గోరా మారుమాటడకుండ వండి ఉన్న పందిమాంసం ముక్క ఒకటి తెప్పించుకుని అందరూ చూస్తూ ఉండగా నోట్లోపెట్టుకుని తినేసారు. అందరూ ఆశ్చర్యపోయారు. అప్పుడు గోరా చెప్పారు: ఒకరు తినే ఆహారాన్ని మనం ఎప్పుడూ ఏవగించుకోరాదు. బర్మాలో, చైనాలో కప్పలు ఊరగాయ వేసుకుంటారు. ఎందరో పాముల్ని తింటారు. ఆదివాసులు కోతి మాంసం తింటారు. మన దేశంలోనే ఈశాన్య సరిహద్దులలో బొద్దెంకలను వేయించుకుని వడియాలవలె తింటారు. ఆహారపు

అలవాట్లలో చాలా తేడాలు ఉన్నాయి. కాని వివాహాల్లో పందిని కోయవద్దని నేను చెబుతున్నది కేవలం ఆర్థిక దృష్టితో. పందిని కొనడం కొరకు మీరు అప్పులపాలవడం బాగులేదు". గోరా వివరణకంటే పందిమాంసం ముక్కను ఆయన అమాంతం తినడం అక్కడి వారిని సమ్మోహితులను చేసింది. గోరా పందిమాంసం తినుట అదే ప్రథమం. నాటినుంచీ ఆ ప్రాంతాల్లో హరిజనుల ఇండ్లలో పెండ్లి సందర్భంలో పందిమాంసం వండితీరాలి అనే కట్టుబాటు సడలిపోయింది. ప్రజలకు నచ్చచెప్పుటలో, సమస్యలు పరిష్కరించుటలో గోరా విధానం అది.

గోరా ముదునూరులో చేస్తున్న గ్రామసేవ, నిర్మాణ కార్యక్రమం గురించి తెలుసుకున్న బొంబాయి మిత్రులు కొంతమంది గోరాకు సహాయం చేయాలనుకున్నారు. అచటి హరిజనవాడల్లో ఉచితంగా యిచ్చుటకు కొన్ని మందులు పంపారు. అంతేకాకుండా వెయ్యిరూపాయల నగదుకూడా ఇచ్చారు. ఆ వెయ్యి రూపాయలు తనకు వ్యక్తిగతంగా అక్కరలేదనీ, పనికే వినియోగిస్తాననీ చెప్పారు గోరా.

హరిజనవాడల్లో దుకాణదారులు చిల్లరగా అమ్మేటప్పుడు హరిజనులను ఆర్థికంగా చాలా పీడిస్తున్నారు. ఈ విషయాన్ని అర్థం చేసుకున్న గోరా హరిజనవాడలో ఒక దుకాణం తెరిస్తే ఎలా ఉంటుందో చూద్దామనుకున్నారు. గుడివాడగ్గర గురివిందగుంట గ్రామ హరిజనవాడలో శ్రీ దోనె తాతయ్య సహకారంతో ఆ వెయ్యి రూపాయల విరాళాన్ని పెట్టుబడిగా పెట్టి దుకాణం తెరిచారు. అతి నిజాయితీగల కార్యకర్త అగు శ్రీ అర్జునరావుకు (వీరే తర్వాత గోరాగారికి పెద్ద అల్లుడు అయినారు) ఆ దుకాణం బాధ్యత అప్పగించారు. పెట్టుబడి విరాళంగా వచ్చింది కనుక ఖర్చులుమాత్రం వేసుకుని, లాభం అక్కరలేకుండా ఉండే విధానంలో ఆ దుకాణం నడపాలని గోరా అనుకున్నారు.

కాని ఒక్కసంవత్సరంలోనే ఆ ప్రయోగం విఫలమైంది. ఇందుకు ఏకైక కారణం తోటి హరిజనుల కష్టాలు తెలిసిన అర్జునరావు వారికి కొంత అరువు పెట్టక తప్పలేదు. తేలిక వాయిదాలలో ఈ అప్పు తీర్చుకోమని కోరారు. కాని అర్జునరావు చూపిన సానుభూతిని అవకాశంగా తీసుకుని అప్పులు తీర్చకుండా వాయిదాలు వేస్తూ వచ్చారు. మామూలు దుకాణాదారుని దుకాణంలో కంటే ఇందులో చాల తక్కువధరకు మంచిసరుకు లభించేది. ఈ దుకాణాన్ని నెమ్మదిగా హరిజనవాడ సహకార దుకాణంగా మార్చాలనే అభిప్రాయం కలగానే మిగిలిపోయింది. బాకీలు తీర్చనందున సంవత్సరంలో పెట్టుబడి హరించుకుపోగా, దుకాణం మూసివేయవలసి వచ్చింది. ఆ ప్రయత్నమే నెగ్గివుంటే మరికొన్ని హరిజనవాడలలో కూడా అలాంటి దుకాణాలను ప్రారంభించి, పెట్టుబడి విరాళాలుగా సేకరించి, స్థాపిద్దామనుకున్నారు. కాని అది జరగలేదు.

గోరా చేపట్టిన గ్రామసేవా కార్యక్రమాలలో మరొకటి గ్రామస్తులకు పాయిఖానాలు అలవాటు చేయుట. ఇప్పటికీ కూడా గ్రామాలలో పాయిఖానాలు తక్కువ. కాలవగట్లు, రోడ్లు అపరిశుభ్రం అగుటేకాక, మరుగులేని కారణంగా స్త్రీలు చీకటిపడేవరకూ బహిర్భూమికి వెళ్ళు అవకాశం లేనందున మనదేశంలో స్త్రీలకు ఉదరకోశ సంబంధమైన జబ్బులు ఎన్నో వస్తున్నాయి. అందుచేత పాయిఖానాలు అలవరిస్తే గ్రామం పరిశుభ్రంగా వుంటుంది. ప్రజలకు ఆరోగ్యమూ బాగుంటుంది. అంతేకాక మలమూత్రాదులను మంచి ఎరువుగా మార్చవచ్చు. దీనికిగాను ఆరోజులలో గోరా పాయిఖానాల గురించి బాగా ప్రచారం చేసి కట్టించేవారు. ఆయన ట్రెంచి లెట్రిన్సు'ని ప్రచారం చేసేవారు. ఒక అడుగు వెడల్పున రెండు – మూడడుగుల లోతులో, ఐదారడుగులు పొడుగునా గొయ్యి తియ్యటం, ఎప్పటికప్పుడు మలాన్ని మట్టితో కప్పడం, ఆ గొయ్యి నిండిపోగా ప్రక్కనే మరొకగొయ్యి తియ్యడం. ఈ రెండు గోతులను ఒకదాని తర్వాత మరొకటి వాడుతూ ఉంటే ఎప్పటికప్పుడు మలం మట్టిలో పూర్తిగా కలసిపోయి మంచి ఎరువౌతుంది. దానిని పొలాల్లో వాడుకోవచ్చు. ఆ పాయిఖానాలో వాసనరాదు. ఈగలు వుండవు. మొదట్లో గ్రామస్తులు మూఢనమ్మకంవల్ల తమ ఇంటి ఆవరణలో పాయిఖానా త్రవ్వుటకు అంగీకరించకపోయినా, గోరా ప్రచారం వల్ల పాయిఖానాల సదుపాయాలను గ్రహించి నెమ్మదిగా అలవర్చుకున్నారు. పాయిఖానాలను గోరా ఎంత విస్తృతంగా ప్రచారం చేశారంటే కొందరు కొందరు గోరాను 'పాయిఖానాల పంతులు' అని కూడా వాడేవారు.

గోరాతోపాటు వారి భార్య సరస్వతిగోరా కూడా గ్రామీణ సమస్యలను అర్థం చేసుకున్నారు. ముదునూరు గ్రామంలోని మహిళలను సమీకరించడం, దినపత్రిక చదివి చెప్పడం, గ్రహణాల వంటి సమయాలలో మూఢనమ్మకాలను వారు ఛేదించునట్లు చేయగలగడం వంటి కార్యక్రమాలు సరస్వతిగారు నిర్వహించేవారు.

ముదునూరు పరిసర గ్రామాలవారికి గోరా కుటుంబం ఆదర్శమైంది. వయోజనవిద్య, అస్పృశ్యతా నిర్మూలనకై సహపంక్తి భోజనాలు, గ్రామపరిశుభ్రత, మహిళాచైతన్యం, మూఢనమ్మకాలను ఛేదించుటవంటి కార్యక్రమాలతో యువకులలో గోరా అనతికాలంలోనే క్రొత్తదృష్టిని, ఉత్సాహాన్ని ప్రవేశ పెట్టగలిగారు. ఈ విధంగా తయారైన కార్యకర్తలు నూతన విప్లవానికి మూల స్థంభాలు అయినారు.



# "నాస్తికత్వం" ప్రచురణ : 1942 ఉద్యమం

గోరా ముదునూరు వచ్చినప్పటినుంచీ ఒకవైపు వయోజన విద్య, సహపంక్తి భోజనాలు, మూఢనమ్మకాలనిర్మూలన మొదలైన కార్యక్రమాల ద్వారా అసమానతలను తొలగించి సమానత్వాన్ని పెంపొందిస్తూ, నాస్తిక జీవితాచరణను రూపొందించుటకు కృషి చేయుచూ, మరొక వైపు నాస్తికత్వ తత్వమును గ్రంథరూపంలో ప్రజలముందుకు తీసుకువచ్చారు. అంతవరకూ కొన్ని వందల ఉపన్యాసాల ద్వారా నాస్తికత్వ ప్రచారం జరిగినప్పటికీ ఎవరైనా గోరా భావాలను లోతుగా అధ్యయనం చేయాలంటే లిఖితరూపంలో ప్రామాణిక గ్రంథం లేదు. బందరులో ఉండగా గోరా నాస్తికత్వం గురించి ఇంగ్లీషులో ప్రారంభించిన పుస్తకం పూర్తి కాకుండానే వారిపై కాలేజీ ద్వారా ఆంక్షలు విధింపబడడం, గోరా ఉద్యోగానికి రాజీనామా యివ్వడంతో అది వెలుగులోకి రాలేదు. ముదునూరు రావడంచేత నాస్తికత్వం గురించి పుస్తకం ఇంగ్లీషులో కంటే తెలుగులోనే రచించడం మంచిదని గోరా అభిప్రాయపడ్డారు.

ఈ విధంగా నాస్తికత్వాన్ని శాస్త్రీయపద్ధతిలో చారిత్రాత్మక పరిశీలనతో, తాత్త్విక వాదనలతో నిరూపిస్తూ వెలువడిన తొలిగ్రంథం తెలుగుభాషలో ప్రచురించబడింది. అంతకుముందు నాస్తికత్వం గురించి చార్వాకుడు, షెల్లీ, బ్రాడ్లా, బోధించినా, చార్వాకుడు ఆస్తిక విశ్వాసాలను ఖండించాడు; షెల్లీ నాస్తికతావశ్యకతను నొక్కిచెప్పాడు; ఛార్లెస్ బ్రాడ్లా క్రైస్తవమతాన్ని ఖండిస్తూ దేవుడనేది సత్యము కాదని, అది ఒక భావం మాత్రమేనని స్పష్టపరిచాడు. వారి కాలానికి, గోరాగారి కాలానికి మధ్య విజ్ఞానం అభివృద్ధి చెందింది. సంఘసంస్కరణ భావం ముందుకు సాగింది. తాత్విక చర్చలో సహనం హెచ్చింది. గోరా నాస్తికత్వాన్ని కేవలం ఆస్తిక వ్యతిరేకతగా మాత్రమేకాక,

ఒక నిర్దుష్ట తత్వశాస్త్రముగా, జీవిత విధానంగా సమాజంముందు పెట్టారు. “నాస్తికత్వము' లేక 'దేవుడు లేడు” అను పుస్తకం ఆ కృషిలో ప్రథమ సోపానము.

ఈ పుస్తకం నాలుగు భాగాలుగా విభజింపబడింది. మొదటి భాగము మానవుడు, రెండో భాగము ఆస్తికత్వము. మూడు భాగము నాగరికత, నాల్గవ భాగము నాస్తికత్వము. మానవ జీవితం సత్యము, సంఘము, సంతోషము అనే మూడు ఆధారాలపై వున్నదనీ, జంతువులకు మానవునకు గల తేడాలో మానవునికి సత్యము, సంఘం, సంతోషం ఎందుకు, ఎలా అవసరమైనాయో, ఆస్తికత్వంలో వీటిస్థానం ఏమిటో, నాస్తికత్వం ద్వారా ఆస్తిక విశ్వాసాల అవసరం లేకుండా మానవుడు ఈ మూడింటినీ సంతృప్తికరంగా ఎలా అలవర్చుకోగలడో వివరించారు. దేవుడు జీవుడు, పరలోకం అనే భావాలు మానవునిలో ఎలా ఉదయించి, రాను రాను ఎలా అభివృద్ధిచెందాయో; మొదట్లో ఈ భావాలు మానవుని జ్ఞానతృష్ణను తీర్చి సంతృప్తి కలిగించినా, అవి నిర్ధారణకు నిలవని వూహలు మాత్రమే అగుటచేత సమాజాన్ని ఎలా పతనం చేశాయో; ఆయా సమయాలలో ప్రవక్తలు, సంస్కర్తలు సమాజంలో నీతిని,ఈ సౌఖ్యాన్ని పెంపొందించుటకు దైవభావాన్ని ఎలా సంస్కరించాలో స్పష్టంగా చెబుతూ, ప్రపంచ నాగరికతలన్నిటినుంచీ గోరా ఉదాహరణలిచ్చారు. మిగిలిన మతాలకు, హిందూ మతానికీ గల తేడాను చెప్పి, ఈ తేడావల్ల హిందూ మతం తాత్వికంగా ఉదారంగా కనపడినా, జీవితాచరణలో అవినీతికి ఎలా ఎక్కువగా ఆశ్రయమిచ్చిందో స్పష్టంచేశారు. దైవం అనే భావానికి ఏ అర్థం చెప్పినా, అది ఏ విధంగా అబద్ధమో గోరా నిరూపించారు. ఆస్తిక విధానంపై ఆధారపడ్డ సామాజిక వ్యవస్థను మానవుని ఎలా బానిసగా చేస్తుందో, నాస్తిక విధానపు సామాజికవ్యవస్థ మానవునికి స్వేచ్ఛనిచ్చి, అతనిపనులకు అతని బాధ్యునిగాచేసి తద్వారా సంతోషాన్ని ఎలా సమకూరుస్తుందో చూపించారు. సంఘసంబంధాలలో ఆస్తిక విశ్వాసాలకు ప్రాబల్యం తగ్గి రాజకీయం ప్రధానమైనా, ఆస్తిక విశ్వాసాలు రాజకీయ విధానపు ప్రయోజనాన్ని వమ్ము చేస్తున్నాయనీ, కనుక రాజకీయ విధానంవల్ల సమాజం ప్రయోజనం పొందాలంటే నాస్తికత్వం అవసరమనీ గోరా ప్రతిపాదించారు. ఈ విధంగా నాస్తికత్వం గురించి ఈ పుస్తకం చాలా వరకూ సమగ్రంగా ఒక రూపకల్పనను ప్రజలకు అందించింది.

'దేవుడు' శబ్దాన్ని మామూలుగా పుంలింగంలో వాడడం అలవాటు. కాని దేవుడు అనేది ఒక ఊహమాత్రమే. అందుచే 'దేవుడు లేడు' అన అనరాదనీ 'దేవుడు లేదు' అని అనాలనీ గోరా తన పుస్తకమంతటా దేవుడు శబ్దాన్ని అప్రాణివాచకంగానే వాడారు. ఈ పుస్తకంద్వారా భావంలోనేకాక, భాషలోకూడా నూతనత్వం చూపి తరతరాలుగా పాతుకుపోయిన ఆస్తిక మౌఢ్యాన్ని సమ్మెటపెట్టి కొట్టినట్టు బ్రద్దలుచేశారు.

ముదునూరు గ్రామానికి చెందిన శ్రీ మొవ్వ శివరావు పెట్టుబడి పెట్టి దీనిని ప్రచురించారు. చాలామంది యువకులు ఆంధ్రదేశమంతటా సైకిళ్ళపై ఈ పుస్తకాలు కట్టుకుని గ్రామగ్రామాలు తిరిగి అమ్ముతూ ప్రచారం చేశారు. 1941 లో ఈ పుస్తకం తొలిముద్రణ రెండువేల కాపీలుకాగా, ఒక్క సంవత్సరంలోపలే రెండవముద్రణ వేయవలసి వచ్చింది. ఆనాడు ఆంధ్రదేశాన్ని భావచైతన్యంతో ముంచెత్తింది ఈ పుస్తకం. ముఖ్యంగా కృష్ణా, గుంటూరు, పశ్చిమ గోదావరి జిల్లాలలో ఎక్కడ చూచినా ఆ రోజులలో ఈ పుస్తకం గురించి చర్చలే. అజ్ఞాతంగా అభ్యుదయ భావాలను దాచి ఉంచుకున్న యువకులకు ఆస్తికత్వాన్ని ఎదిరించేందుకు ఈ పుస్తకం వాదనాబలాన్ని అందజేసింది.

తర్వాత 1942లో శ్రీ శోభనరావు వ్రాసిన "సత్యాన్వేషణము" నాటక ప్రదర్శనాన్ని నిషేధించడం, గోరా స్వాతంత్రోద్యమంలో పాల్గొని అరెస్టు కావడం జరిగినప్పుడు కొంతమంది భయపడి 'నాస్తికత్వము', 'మాపాతాలు' పుస్తకాల ప్రతులు తమవద్ద ఉంటే వాటిని తగులబెట్టారు కూడా. ఈ విధంగా గోరా మాట – చేతతోపాటు వ్రాత కూడా చాలా శక్తివంతమని తేలింది. 1952 లో 'నాస్తికత్వము'లో అదనంగా 'నాస్తికత్వ – రాజకీయాలు' అనే చిన్న అధ్యాయం చేర్చి మూడవ ముద్రణ వెలువడింది.

మూడవముద్రణ పీఠికలో గోరా ఇలా వ్రాశారు: "మానవ జీవితము పరాధీనమని ప్రబోధించుటచేతగదా ఆస్తిక విధానంలో మానవుడు నిర్వీర్యుడై, "ఇది నా కర్మ" అనుకుంటూ ధనికతత్వం, జాతి అహంకారములలోని కష్టనిష్ఠురములకు లొంగిపోతున్నాడు. అట్లుకాక, మానవ ప్రవృత్తిలోని స్వేచ్ఛను ప్రోత్సహించు నాస్తికదృక్పథమును అవలంబిస్తే బాధాకరమగు బానిసత్వము మీద మానవుడు తిరుగుబాటు చేస్తాడు. మరియు శక్తిసామర్థ్యములలో దాదాపు మానవులందరూ సమానులు కాబట్టి పరస్పర సానుభూతి, సహకారము, సహనము సంఘనిర్మాణ నియమములు కాబట్టీ, ఆర్థిక అవకాశాలలోగాని రాజకీయ హక్కులలోగాని, సాంఘిక గౌరవాలలోగాని ఎక్కువ తక్కువలు సమర్థనీయంకావు. అందుచేత నాస్తికత్వం వ్యాపించుటవలన ప్రజానీకంలో రాజకీయ చైతన్యం, సమదృష్టి పెరిగి ఆర్థిక సమానత్వం, ప్రజాస్వామికం, ప్రపంచశాంతికి అనువగు వాతావరణం, ప్రయత్నరూపం ఏర్పడుతవి. ఇదీ నాగరితాభివృద్ధికి నాస్తికత్వం పూర్ణరూపం ఇచ్చు తోడ్పాటు."

నాస్తికత్వం గురించి ఎన్నో ప్రచారసభలు జరిగాయి. ఆచరణలో మూఢనమ్మకాల నిర్మూలన, సాంఘిక సమానత్వం కార్యక్రమాలు అమలులోనికి వచ్చాయి. వీటి ఫలితంగా కొంతమంది తాము నాస్తికులమని ధైర్యంగా చెప్పుకోనారంభించారు.

ఇట్టివారందరూ సమావేశం జరిపితే నాస్తికత్వ పురోగమనానికి మరింత ప్రోత్సాహం లభిస్తుందని భావించి నాస్తికమిత్రులందరూ కలసి 1941 ఫిబ్రవరి 28న కృష్ణాజిల్లా కనుమూరులో ప్రథమ నాస్తిక మహాసభలు జరిపారు. ఈ సభలను శ్రీ కొల్లి రామకుమార వర్మ కన్వీనరుగా ఉండి ఏర్పాట్లు చేశారు. గోరా సభలకు అధ్యక్షత వహించారు. నాస్తికత్వం పేర మహాసభలు జరగటమే ఒక ప్రత్యేకత. ఆ సభలలో గోరా అధ్యక్షులుగాను, శ్రీ తుమ్మల గోపాలకృష్ణయ్య కార్యదర్శిగాను నాస్తిక సంఘం ఏర్పడింది. వీరిద్దరూ నాస్తిక ప్రచారంలో అప్పుడు చాలా గ్రామాలు పర్యటించాడు.

శ్రీ గోపాలకృష్ణయ్య గోరాకి పరిచయమగుట ఒక వింత సంఘటనతో కూడుకొని ఉంది. 1938లో కొడాలి గ్రామంలో నాస్తికత్వంమీద గోరా సభ జరిగినప్పుడు కొందరు "దేవుడు లేకపోతే మా దేవాలయంలోని విగ్రహాన్ని మీరు కదిలిస్తారా" అని గోరాను సవాల్ చేశారు. అందుకు గోరా సమాధానం చెబుతూ, ఒక పలుగు ఇస్తే తాను కదిలించుటకు ప్రయత్నం చేస్తాననీ, తన బలం చాలకపోతే ఒక్కడికి కదలకపోవచ్చుననీ అన్నారు. అప్పుడు సభలోనుంచి గోపాలకృష్ణయ్య లేచి తాను కూడా సహకరిస్తాననీ ఎందుకు కదలదో చూద్దామనీ అంటూ ముందుకు వచ్చారు. గోపాలకృష్ణయ్య మంచి బలశాలి. ఇది చూచి దేవాలయం అర్చకులు, ట్రస్టీలకు నిజంగా విగ్రహం త్రవ్వేస్తారని భయం వేసి ఆ సమస్యని అంతటితో ఆపుచేశారు. ఈ సంఘటనతో ప్రారంభమైన పరిచయం రాను రాను ఘనిష్టమైంది. గోపాలకృష్ణయ్య "మాంసభక్షణ పాపమా?" 'స్త్రీ స్వాతంత్ర్యం' మొదలైన పుస్తకాలు వ్రాశారు.

గోరాకి ముదునూరులో అతి సన్నిహితులైనవారిలో శ్రీ పువ్వల సూర్యప్రకాశరావు ఒకరు. వారు గోరా కంటే వయసులో పెద్దవారు. గొప్ప సంగీత విద్వాంసులు. సంగీతంలో దైవారాధనే హెచ్చు అవడం చేతా, కృతులన్నీ దేవునిగురించే ఉండడం చేతా, సూర్యప్రకాశరావు సంగీతసాధనలో భారతదేశమంతటా తీర్థయాత్ర స్థలాలన్నీ తిరిగారు. మఠాలు చూశారు. గురువులను కలుసుకుని వారి పాదసేవ చేసి చక్రాంకితాలు పొందారు. కులదృష్టితో ఇతరులు వారిని ఏవగించుకున్నా మత నమ్మికవల్ల ఆయన అభిమానపడలేదు. సంగీత కచ్చేరీలలో సమాన గౌరవం ఇచ్చినా సాంఘికంగా గౌరవమిచ్చుటలో సమాజం తేడా చూపేది. కులదృష్టితో త్యాగరాజోత్సవాలలో పాలుగొనే అర్హతలేదని నిరసింపబడుటతో సూర్యప్రకాశరావులో ఆందోళన, ఆవేదన ఎక్కువైనాయి. తాను కళావంతుల కులానికి చెందినా కళావంతుల సంస్కరణకై ఎంతో కృషి చేసిన వ్యక్తి, తాను గృహస్తుగా ఉండి తన చెల్లెళ్ళందరికి వివాహాలు చేశారు. అతినిష్టతో శాకాహారి అయి, కుటుంబాన్నంతనూ పూర్తి శాకాహారంలోనికి మార్చారు. అయినా సాంఘికంగా సమాన గౌరవం లభించలేదు.

గోరా ముదునూరు రావడంతో, వారితో వివిధ విషయాలపై చర్చించడంతో సూర్యప్రకాశరావులో అజ్ఞాతంగా రాజుకొంటున్న విప్లవదృష్టి జ్వాలయైంది. అంతవరకూ ప్రతీ సంవత్సరం దసరా ఉత్సవాలలో కొన్ని చోట్ల వాడుకగా ఫిడేలు వాయించేవారు. ఆ రీత్యా వచ్చేదే వారి కుటుంబ పోషణకు ప్రధాన ఆదాయం.

అయినప్పటికీ నాస్తికదృక్పథం ఆయనలో బలపడగానే సంగీత కళ గురించి తనకే అనుమానం కలిగింది. కళ పేరుతో దైవ విశ్వాసాన్ని త్యాగరాజకృతుల ద్వారా ప్రచారం చేయుట సమంజసమా? దైవనమ్మిక సమాజాభ్యుదయాన్ని అరికడుతుంది కనుక ఆర్థికంగా పెద్ద నష్టమే అయినా నవరాత్రులకు వెళ్ళరాదని సూర్యప్రకాశరావు నిర్ణయించుకొన్నారు. చాలామంది మిత్రులు సూర్యప్రకాశరావు నిర్ణయాన్ని వ్యతిరేకించారు. వ్యక్తి విశ్వాసాలకు కళల సంబంధం ఉండరాదనీ, కళను కళగానే తీసుకోవాలని వారు వాదించారు. ఈ వాదం సూర్యప్రకాశరావుకు కళ ప్రయోజనం మానవాభ్యుదయం తప్ప అన్యంకారాదనే వారి అభిప్రాయంతో సూర్యప్రకాశరావు ఏకీభవించారు. దీనితో మానవాభ్యుదయాన్ని అరికట్టి ఆస్తికరీతిలోనున్న కళను వారు అనుసరించుటకు నిరాకరించారు. అంతే ! ఫిడేలు వదలి కొడవలి పట్టాడు సంగీతం మాని సేద్యం ఆరంభించారు.

కులాలు – మతాలు పోవాలంటే వర్ణాంతర, మతాంతర వివాహాలు కావాలని గోరా చేస్తున్న ప్రచారం సూర్యప్రకాశరావుకి నచ్చింది. అప్పటికి యుక్తవయస్కురాలై పెండ్లి ఈడు వచ్చిన తన కుమార్తె సుశీలను సూర్యప్రకాశరావు సంప్రదించారు. వర్ణాంతర వివాహానికి ఆమె కూడా సుముఖత వెల్లడించింది. యోగ్యవరునికొరకు వెతకనారంభించారు. ముదునూరు గ్రామానికే చెందిన యువకులు శ్రీయలమంచిలి బుచ్చయ్య ముందుకువచ్చారు. బంధువులు, మిత్రులు మొదట ఈ వివాహానికి చాలా వ్యతిరేకించారు. వారందరికీ సూర్యప్రకాశరావు ఓపికగా నచ్చచెప్పగలిగారు. 1941 డిసెంబరులో కవిరాజు శ్రీ త్రిపురనేనిరామస్వామి ఆధ్వర్యాన గోరా నిర్వహణలో బుచ్చయ్య – సుశీల వివాహం జరిగింది. బుచ్చయ్య గోరా నడిపిన వయోజన విద్యా శిబిరంలో శిక్షణ పొందిన ఆదర్శయువకుడు. ముదునూరులో జరిగిన తొలి వర్ణాంతర వివాహం ఇది. ఈ విధంగా సూర్యప్రకాశరావు త్యాగంతో కూడిన ఆచరణద్వారా ఆదర్శాలకు వన్నెతెచ్చారు. (గోరా మరణానంతరం 1977లో సుశీల – బుచ్చయ్య గారికుమార్తె విజయలక్ష్మి వివాహం గోరా మనుమడు వజీరుతో జరిగింది.)

సూర్యప్రకాశరావు సంగీతంమాని సేద్యంలో ఆనందానుభూతిని పొందుతున్నా, గోరా నాస్తికరీత్యా కళలను ఎలా అభివృద్ధి పరచాలి అని ఆలోచించసాగారు. మానవుని ఔన్నత్యం సాంఘికంగా రసానుభూతిలోనూ ఉంటుందని అంగీకరించే గోరా

రసానుభూతిని కలిగించే లలితకళలను మానవజీవితంనుంచి తీసువేయలేరుగదా. సంగీత సాహిత్యాది లలితకళలు కళగా రసానుభూతినిచ్చినా, తమద్వారా భావప్రచారంకూడా చేస్తాయి. అందుచేత నాస్తికరీత్యా కళను పోషించాలంటే సాధనాన్ని నిరాకరించకుండా అది ప్రచారం చేస్తున్న భావాన్ని మార్చవచ్చు. ఈ ఉద్దేశంతో గోరా. సూర్య ప్రకాశరావు సంగీత శాస్త్రానుగుణంగా నాస్తిక భావాలతో కృతుల రచనకు పూనుకున్నారు. తెలుగు పండితులు శ్రీకాళహస్తీశ్వర శర్మ వీరికి తోడ్పడ్డారు. వీరు చాలా కృతులు నాస్తికభావాలతో తయారుచేసి, నాస్తికత్వం వ్యాప్తిలోనికి వస్తే సంస్కృతీ వికాసానికి, కళలప్రయోజనానికి ఆస్కారం ఉండదనే అపనిందను తొలగించారు. వీరు రచించిన కృతులలోనుండి మచ్చుకు రెండు:

## కాంభోజి - ఖండగతి

ప॥ ఉపదేశమైతే - ఉపకార మెవరికో॥
అ॥ అపచారములెన్నో - అధికమగూచుండ
జపమనే-నెపమున - జడునిగతినుంట ॥ఉ॥

ప॥ ఇరుగు పొరు-గుననే- ఎంతో దుఃఖముంటే
పరులకొఱ-కొకింత-పాటుపడక
పరమేదొ-గలదని-పరధ్యాన-ముగనుంట
పిరికితన-మా మరి-స్వార్థపరతయా ॥ఉ॥

## కళ్యాణి - రూపకతాళం

ప॥ సాహసించ-కెటులుదీరు-సందియంబులు॥
అ॥ ఊహలపై-ఊహబన్ని-ఊరుకున్నంతవరకు ॥సా॥
చ॥ ఆచరణలో-జూపని-యోచన వ్యర్థమని
సూచించె న-దేసుమా-నాస్తికత్వము ॥సా॥

* * *

గోరా ముదునూరు వచ్చిన ఒక సంవత్సరం వరకూ వారి కుటుంబ బాధ్యతను ఆర్థికంగా ఒకరిద్దరు వ్యక్తులే వేసుకున్నారు. కాని ఎంత కాలమని వారు పోషించగలరు? అంతేకాకుండా ఆ విధంగా ఉంటే క్రొత్త కార్యకర్తలు చేరి ఒక కేంద్రంగా ఏర్పడుటకు అవకాశమూలేదు. అందుచేత ఆర్థిక అవకాశాలు అనిశ్చితములైనా సాధారణ

ప్రజలమీదననే ఎక్కువగా ఆధారపడి, కార్యకర్తలు వచ్చి ఉండుటకు వీలుగా నాస్తికకేంద్రాన్ని స్థాపించాలని గోరా నిశ్చయానికి వచ్చారు. ముదునూరు గ్రామానికి ఉత్తరంగా పంటకాలవనానుకుని ఆరేడుగురు ఆసామీలకు చెందిన సుమారు రెండున్నర ఎకరాల దిబ్బను గోరా ఉన్నంతకాలం అందులో పాకలు వేసుకుని దానిని ఉపయోగించుకోమని గోరాగారికి యిచ్చారు. అందులో పాకలు వేయుటకు గ్రామస్తులు రకరకాలుగా సహాయపడ్డారు. ముఖ్యంగా శ్రీయుతులు కలపాల సూర్యప్రకాశరావు, నాగులపల్లి సీతారామయ్య, పువ్వల సూర్యప్రకాశరావు, పువ్వల నాగభూషణంగార్లు కేంద్రం నిర్మాణంలో హెచ్చుగా పాల్గొన్నారు. అంతవరకూ గ్రామంమధ్య ఒకరి ఇంట్లో ఉంటూవచ్చిన గోరా కుటుంబం 1942 జనవరిలో ఊరికి రెండు ఫర్లాంగులు దూరంగా నిర్మింపబడిన నాస్తిక కేంద్రంలోనికి మారారు.

బందరునుంచి ముదునూరు వచ్చేసరికే గోరా కుటుంబం తమ జీవితస్థాయిని ఎంతో తగ్గించుకుని చాలా త్యాగం చేశారు. మరల ఈ నూతన విధానంలో ప్రవేశించేసరికి ఇంకా ఎక్కువ త్యాగం అవసరమైంది. ఆహారంలో తగ్గించుకోవలసి వచ్చింది. ఈతాకు చాపమీద పడుకుని ముతక గొంగళీ కప్పుకోవలసి వచ్చింది. బట్టలు అతి తక్కువగా వాడుకోవలసి వచ్చింది. ఆర్థిక అవకాశాలు తక్కువవడంచేత ఐదేసి మైళ్ళు, పదేసి మైళ్లు బస్సులున్నా నడిచివెళ్ళవలసి వచ్చింది. ఇవి ఏవీ కూడా గోరా కుటుంబాన్ని చలింపజేయలేదు. హిమాలయంవంటి దృఢనిశ్చయాలు కలవారిని ఏ కష్టాలుమాత్రం కదిలించగలవు? అసలు వారు కష్టాలు అనుకుంటే గదా బాధపడటానికి.

ప్రతీకష్టం, ప్రతీ వ్యతిరేకత వారిని మరింత గట్టిపరిచింది, అది మహాపురుషుల లక్షణం. సాధారణ ప్రజలమీద గోరా ఆధారపడినప్పుడు గోరాకి అవసరమైనంతగా వారు ఇవ్వలేకపోయారు. అయితే వారు ఇచ్చినదానికి అనుగుణంగా గోరా సర్దుకున్నారు. అందుకే ఆయనలో ఎప్పుడూ అసంతృప్తిగాని, నిరాశగాని లేవు. దూసరిపాలెం హరిజనుల కూరగాయాలు కావిళ్ళ మీద అమ్ముకొనుటకు తీసుకు వెళుతూ తరచు తెల్లవారుఝామున గోరా కుటీరం మందు గుప్పెడుకాయలు తీసిపెట్టి పోతూఉండేవారు. వారి ఇట్టి ప్రేమాభిమానాలు గోరా కుటుంబాన్ని సదా ఆనందంలో ముంచెత్తేవి.

నాస్తిక కేంద్రంలో సభ్యుడుగా మొదటవచ్చి చేరినవారు శ్రీదాసు రామస్వామి. వీరిది గుడివాడదగ్గర నాగవరప్పాడు గ్రామం. 1941 లో చెన్నపురి ఆంధ్రమహాసభ రజతోత్సవాలు జరిగినప్పుడు ఒక రోజున నాస్తికత్వంపై గోరా ఉపన్యాసాన్ని కూడా

ఏర్పాటు చేశారు. ఆ రోజులలో మద్రాసులో బి.ఎస్ సి. చదువుకుంటున్న రామస్వామి ఆ ఉపన్యాసం విన్నారు. ఆ ఉపన్యాసం విన్న విద్యార్థులు కొంతమంది గోరాచే ఆకర్షింపడి, వారు ప్రత్యేకంగా గోరా ఉపన్యాసాలను మరికొన్ని చోట్ల కూడా ఏర్పాటుచేశారు. రామస్వామి వాటికికూడా హాజరైనారు. గోరా భావాలు, ముఖ్యంగా అస్పృశ్యతా నిర్మూలనకై ఆయన చేస్తున్న కృషి రామస్వామిని విశేషంగా ఆకర్షించాయి. రామస్వామి గోరాతో వ్యక్తిగతంగా కూడా చర్చించారు. ముదునూరు ఒకసారి రమ్మని రామస్వామిని గోరా ఆహ్వానించారు.

1942 మార్చితో రామస్వామి బి.యస్.సి. పూర్తయింది. మద్రాసు విశ్వవిద్యాలయమంతకూ ప్రథమశ్రేణిలో ప్రథములుగా ఉత్తీర్ణులై, రసాయనిక శాస్త్రం (కెమిస్ట్రీ)లో ఆయన స్వర్ణపతకం పొందారు. తర్వాత ఉన్నత విద్య నభ్యసించుటకు నిశ్చయించుకుని వేసవి శలవులలో ముదునూరు వచ్చి గోరాను కలిశారు. సమర్థులు, ఆదర్శాలుగల యువకులు ప్రభుత్వోద్యోగాలలో ఏమీచేయలేరనీ, వారు ప్రజలలో ఉండి పనిచేయాలనీ గోరావారికి చెప్పి ముదునూరులో ఉండి తనతో సహకరించవలసిందిగా కోరారు. రామస్వామి హృదయం కృతజ్ఞతతో నిండిపోయింది.

నాస్తికకేంద్రం వాతావరణం ఆయనకు బాగా నచ్చింది. సాంఘిక గౌరవం అక్కడ అందరికీ సమానం. ఎక్కువ తక్కువలు లేకుండా అన్ని పనులూ అందరూ చేస్తారు. మాటలు చెప్పేవారిని ఎందరినో రామస్వామి చూశారు. అయితే వాటిని ఆచరించాలంటే అందరూ జంకేవారే. గోరా ఆచరణ రామస్వామికి ఆదర్శప్రాయంగా కనబడి ఆకర్షించింది. రామస్వామిలోని సున్నితమైన ఆదర్శాలు, వాటిని సాధించాలనే ఆవేదన, అందుకు తగిన పట్టుదల గోరా అభిమానానికి పాత్రమైనాయి. తాను పై చదువులకు వెళ్ళకపోతే తప్పకుండా గోరా వద్దకే వస్తానని మాటయిచ్చారు రామస్వామి. తర్వాత రామస్వామి సేవాగ్రమం ఆశ్రమంవెళ్ళి గాంధీజీని కలుసుకున్నారు గోరా ఇచ్చిన సలహాయే గాంధీజీకూడా యిచ్చారు. దానిపై రామస్వామి ఉన్నతవిద్యకు పోరాదని నిశ్చయించుకున్నారు. హరిజనుడిగా తనకు ఐ.సి.యస్. సెలక్షన్‌కు అవకాశముండి దానిని వదులుకున్నారు. గాంధీజీ రామస్వామిని తనవద్ద ఉండమని కోరారు. అయినా తాను గోరాతో పనిచేయదలుచుకున్నానని చెప్పి ముదునూరు వచ్చేశారు.

ముదునూరు నాస్తిక కేంద్రానికి వచ్చిన రెండవవారు శ్రీ కానా, వీరిది తూర్పుగోదావరి జిల్లా అమలాపురం. కాకినాడలో గోరా తమ్ముడు శ్రీ సాంబశివరావు సహపాఠిగా ఉంటూ గోరాచే ఆకర్షింపబడ్డారు. వానపాముల గ్రామానికి చెందిన శ్రీ రావూరి అర్జునరావు కూడా వచ్చి కేంద్రంలో కార్యకర్తగా చేరారు. శ్రీ తుమ్మల గోపాలకృష్ణయ్య, వారి భార్య ధనలక్ష్మి కూడా వచ్చి గోరాగారితో కలసి పనిచేయసాగారు.

ఇలా కేంద్రం నూతన యువ కార్యకర్తలతో విశాలమౌతూ ఉంటే కొత్త కొత్త సమస్యలు కూడా బయలుదేరాయి. అంతవరకూ గ్రామానికి చెందిన మంగలే గోరా కుటుంబంలోని వారికి క్షౌరం చేసేవారు. గోరా కార్యక్రమాలను వారు హర్షించినప్పటికి ఇప్పుడు కేంద్రంలో అంటరానివారుగా భావింపబడేవారు కూడా వచ్చిచేరుటతో ఆ మంగలి గోరా కుటుంబానికి మాత్రమే తాను క్షౌరం చేస్తాననీ, మిగిలినవారికి చెయ్యననీ అన్నారు. అయితే ఎవరికీ చేయనక్కరలేదన్నారు గోరా. కేంద్రంలోని పురుషులందరూ దువ్వెన, కత్తెర తీసుకుని ఒకరికొకరు క్రాఫింగు కత్తిరించుకునేవారు. మొదట్లో క్రాఫింగులు రకరకాల రూపాలలో చూడగానే నవ్వు పుట్టించేవిగా ఉండేవి. దక్షిణాఫ్రికాలో గాంధీజీ స్వయంగా జుత్తు కత్తిరించుకుంటే 'ఎలుకలు కొరికాయా?' అని ఇతరులు హేళన చేసేవారు గదా. అలాగే వీరినీ కొంతమంది హేళన చేసేవారు. అయితే "సాంఘిక గౌరవాలలోని అసమానతలు తొలగించే కృషికి చిహ్నం మా క్రాఫింగు" అని గర్వంగా చెప్పుకునేవారు. మెట్లు మెట్లుగా కత్తిరించబడ్డ ఆ క్షౌరానికి తాము సిగ్గుపడక ఆత్మాభిమానం ప్రదర్శించి "ఈమారు మీరూ వచ్చి మా చేత చేయించుకోండి'' అంటూ హాస్యోక్తి విసరి ఎదుటివారి హేళన భావాన్ని త్రుంచివేసేవారు. ఇలాగే ఎదురయ్యే ప్రతీ సమస్యనూ అందరూ సమిష్టిగా కలసి పరిష్కరించుకునేవారు.

కేంద్రం పెద్దది అవుతున్నకొద్దీ ఆర్థిక సమస్య కూడా కొంత ఎదురైంది. దానితో కేంద్రంలోనివారు ఒక విద్యాలయాన్ని ఆదర్శయుతంగా నడపాలనుకున్నారు. బెనారస్ మెట్రిక్ పరీక్షకు ప్రైవేటుగా విద్యార్థులను తయారుచేయడం, ఈలోగా చిన్న తరగతులనుంచీ విద్యార్థులలో నూతనభావాలు ప్రవేశపెట్టడం ఆశయంగా విద్యాలయం నడపాలనుకున్నారు. కార్యకర్తలే ఉపాధ్యాయులు కనుక అంతా అనుకున్నట్లు నిర్వహించగలరని పిల్లల తల్లితండ్రులకూ నమ్మకం. 1942 జూన్‌లో సుమారు 80 మంది పిల్లలతో విద్యాలయం ప్రారంభించబడింది. శ్రీయుతులు గోరా, రామస్వామి, కానా, ముదునూరు సూర్యప్రకాశరావు, వారి సోదరుడు కృష్ణారావు. నాగులపల్లి సీతారామయ్య, తుమ్మల చల్లయ్య మొదలైనవారు ఉపాధ్యాయులు. చుట్టుప్రక్కల గ్రామాలనుంచి వచ్చిన పిల్లలకు హాస్టలువసతి ఉండేది. సరస్వతిగారు హాస్టలు బాధ్యతను నిర్వహించేవారు.

విద్యాలయం ప్రారంభించిన రెండునెలలకే గాంధీజీ తదితర జాతీయనాయకుల అరెస్టుతో 1942 ఉద్యమం ఆరంభమైంది. దేశమంతటా 'కరో యా మరో' Do or

die నినాదం ప్రతిధ్వనించింది. ఆసేతుహిమాచలం ఒక్కసారి కదిలింది. ముదునూరులో అన్నే అంజయ్యగారిని డిటెన్యూగా అరెస్టుచేసి తీసుకుపోయింది ప్రభుత్వం. ఇక గ్రామానికి సంబంధించి నిర్ణయాలు తీసుకోవలసిన బాధ్యత అంతా గోరా మీదనేపడింది. వెంటనే విద్యార్థుల తల్లితండ్రుల-సంరక్షణ సమావేశం జరిపి విద్యాలయం మూసివేయుటకు, ఉపాధ్యాయులంతా ఉద్యమంలో దూకుటకు నిశ్చయం జరిగింది.

ఒకవైపు శాంతియుత సత్యాగ్రహాన్ని నడపవలసిన బాధ్యతే కాకుండా, మరొకవైపు సోషలిస్టు భావాలుగలవారు, ప్రభుత్వ యంత్రాంగాన్ని స్థంభింప జేయుటకుగాను టెలిగ్రాఫ్, టెలిఫోన్లు, ఎలక్ట్రిక్‌వైర్లు, కత్తిరించడం, రైలుపట్టాలు తొలగించడంవంటి కార్యక్రమాలు తీసుకున్నందున వారికి రక్షణ కల్పించవలసివచ్చింది. ఆ రోజులలో కృష్ణా, గుంటూరు జిల్లాలలో ఈ కార్యక్రమాల నిర్వహణ కొరకు బొంబాయినుంచి వచ్చిన శ్రీరంగారావు కులకర్ణి ముదునూరునే ప్రధానకేంద్రం చేసుకున్నారు. గోరా సహచరులలో కొంతమంది ఈ రహస్య కార్యక్రమాలను కూడా సాగించారు. వాటిని శ్రీరామస్వామి నాయకత్వం వహించేవారు. మొత్తానికి 1942 ఉద్యమంలో ముదనూరు నిర్వహించిన పాత్ర చరిత్రలో శాశ్వతంగా నిలచిపోయింది. "ముదునూను బాచ్ అని ఆ రోజులలో కృష్ణాజిల్లా అంతటా వీరగాధలు చెప్పుకున్నారు. ఎన్నోసార్లు నాస్తిక కేంద్రంపై పోలీసుదాడులు జరిగాయి. ముదునూరు గ్రామంలో 'ప్యూనిటివ్‌పోలీసు'ను కూడా కొంతకాలం పెట్టారు. ముదునూరు గ్రామం తరఫున మొత్తం 22మంది అరెస్టయినారు. వీరిలో గోరా, సరస్వతి, గోరా చెల్లెలు రాచర్ల సామ్రాజ్యం, కుమార్తె మనోరమ, కుమారుడు లవణం, కేంద్రంలోని శ్రీయుతులు రామస్వామి, కానా, దోనే తాతయ్య, రావూరి అర్జునరావు, గ్రామానికి చెందిన శ్రీయుతులు ముదునూరు సూర్య ప్రకాశరావు, తుమ్మల చల్లయ్య, తుమ్మల కోటయ్య, పువ్వల సుబ్బారావు, లింగం లక్ష్మీనారాయణ, నాగులపల్లి సీతారామయ్య, కలపాల సూర్యప్రకాశరావు, తూర్పుపాలెంకు చెందిన శ్రీబేతపూడి జాన్, దూసరిపాలెంకు చెందిన శ్రీదూసరి రామయ్య మొదలైన వారున్నారు. వీరిలో కొందరు రెండేసి తడవలు కూడా శిక్షలు అనుభవించారు. గ్రామం అంతా ఒక్క కట్టుగా వీరివెనుక నిలిచింది.

సత్యాగ్రహులలో కొంతమంది తాము నాస్తికులము, తమకు కులం లేదు అని చెప్పినందుకు పోలీసులచే లాఠీదెబ్బలు కూడా తిన్నారు. వీరందరూ శిక్షలు విధింపబడి ఆలీపూరు క్యాంపు జైలులో ఉండేవారు. స్త్రీలు రాయవెల్లూరు జైలులో ఉంచబడ్డారు. సరస్వతి గారి వెంట జైలులో వారి ఏడవసంతానం (కుమారుడు) నియంత కూడా

ఉన్నాడు. 1941లో ప్రపంచం అంతా హిట్లర్, స్టాలిన్ ముస్సోలినీ, టోజోవంటి నియంతల హయాంలో ఉన్న సమయంలోనూ వ్యక్తిగత సత్యాగ్రహానికి గాంధీజీని నియంతగా కాంగ్రెసు ఏకగ్రీవంగా ఎన్నుకొనుట చేతనూ అప్పుడు పుట్టిన అబ్బాయికి గోరా 'నియంత' అని పేరు పెట్టారు. సరస్వతిగారు అరెస్టు అగునప్పటికి నియంత వయస్సు 18 మాసాలు. అందుచేత నియంతకూడా తల్లితోపాటు జైలులో ఉన్నాడు. శ్రీ లవణం అప్పటికి మైనురు అగుటచేత జైలు శిక్షలేకుండా పేము బెత్తముతో కొట్టి విడిచిపెట్టారు.

అలీపురం జైలులో నాస్తికులు తమ ఆచరణద్వారా ప్రత్యేకతను ఆర్జించుకున్నారు. గోరా రోజూ ఏదో ఒక బ్లాకులో నాస్తికత్వం ఉపన్యాసాలు ఇచ్చేవారు. కమ్యూనిజం గురించీ, గాంధీజం గురించీ, మూఢనమ్మకాలను వ్యతిరేకించు విధానాలు గురించీ గోష్ఠులు జరుపుతూ ఉండేవారు. దక్షిణభారతదేశం అంతటినుంచీ కార్యకర్తలు అలీపురం జైలులో ఉండుటచేత వారిలో చాలామంది గోరాచే సన్నిహితంగా ఆకర్షింపబడ్డారు. తర్వాత దక్షిణ భారతదేశంలో ఇతర ప్రాంతాలలో కూడా గోరా భావాలను వీరు ప్రచారం చేశారు. విచారణ సమయంలో సబ్‌జైలులో 4 మాసాలకుపైగా ఉన్నప్పుడు గోరాకు హృద్రోగం వచ్చింది. అందుచేత విచారణ చేసిన న్యాయమూర్తి గోరాకి తక్కువ కాలం శిక్ష విధించాడు. ఈ విధంగా కొద్దిమాసాలే ఉన్నప్పటికీ, అలీపురం జైలులోని రాజకీయ ఖైదీలపై తన వ్యక్తిత్వం ద్వారా చెరగని ముద్రవేసిన కొద్దిమందిలో గోరా ఒకరు.

అలీపురం జైలునుంచి విడుదల అయిన వెంటనే మరల కొంతకాలం గోరా డిటెన్యూగా ఉంచబడ్డారు. 1942 సంవత్సరాంతంలో గోరా విడుదలచేయబడ్డారు. అప్పుడు దేశమంతటా సత్యాగ్రహ తీరును నిర్వహించి నడుపుటకు ఏర్పడిన అఖిలభారత సత్యాగ్రహ కౌన్సిల్ సభ్యులుగా గోరా ఎన్నుకోబడి మద్రాసుపట్టణంలో సత్యాగ్రహం చేయుటకు కొందరు సత్యాగ్రహులను కృష్ణాజిల్లా నుంచి పంపించారు. అయితే ఈలోగా 1944 లో దేశమంతటా ఉద్యమ ఉధృతం చల్లబడింది. గాంధీజీ ఆగాఖాన్ భవనంనుంచి విడుదల చేయబడ్డారు. నాయకులు, సామాన్య కార్యకర్తలు కూడా నెమ్మది నెమ్మదిగా విడుదల చేయబడ్డారు. 1944 అక్టోబరు నాటికి గోరా సహచరులందరూ కూడా తిరిగి బయటకువచ్చి కలుసుకోగలిగారు.



# గాంధీజీతో పరిచయం

**1944** అక్టోబరులో గాంధీజీ సేవాగ్రాం ఆశ్రమంలో ఉండగా రామస్వామి గాంధీజీవద్దకు వెళ్ళారు. గత రెండున్నర సంవత్సరాలలోనూ గోరాతో ఉండి తాను చేసినపని గాంధీజీకి వివరించాడు. ఆ సమయంలోనే గాంధీజీకి రామస్వామికి నాస్తికత్వం మీద సంభాషణ జరిగింది. గోరా గురించీ, వారు చేస్తున్న పని గురించీ రామస్వామి గాంధీజీకి చెప్పారు. దానితో గాంధీజీ గోరాని కలుసుకొనగోరి తన తరఫున ఆశ్రమానికి రావలసిందిగా ఆహ్వానించమని రామస్వామితో చెప్పారు. రామస్వామి నుంచి ఈ విషయం తెలుపుతూ గోరాకి ఉత్తరం వచ్చింది.

అసలు గాంధీజీతో నాస్తికత్వం గురించి చర్చించాలని గోరా 1930 నుంచే ప్రయత్నించారు. 1930లో సబర్మతీ ఆశ్రమం (అహమ్మదాబాదు)లో ఉంటున్న గాంధీజీకి గోరా ఇలా చిన్న ఉత్తరం వ్రాశారు.

"మీరు 'దేవుడు' అనే మాటను ఉపయోగిస్తున్నారు. దాని భావమేమిటో, జీవితాచరణకు ఆ భావమునకు ఎంత వరకు పొత్తు కుదురుతుందో తెలుపగోరెదను."

దీనికి గాంధీజీ ఒక్క వాక్యంలో ఇలా జవాబిచ్చారు:

"దేవుడు మానవబుద్ధికి అతీతుడు."

ఈ సమాధానం గోరాని తృప్తిపరచలేదు. దేనిగురించి తాను ఆలోచిస్తున్నాడో, దేని ననుసరించి తన జీవితం మలచుకొనాలని ప్రయత్నిస్తున్నాడో అది తన బుద్ధికి అతీతం ఎలా అవుతుంది? అని గోరా ప్రశ్న. అయితే అప్పుడు ఉప్పు సత్యాగ్రహం అరంభమగుటచేత, గాంధీజీ నిర్బంధింపబడుటచేత ఈ విషయమై ఉత్తర ప్రత్యుత్తరాలు కొనసాగించుటకు అవకాశం లేకపోయింది.

తర్వాత మరల ముదునూరు వచ్చిన అనంతరం 1941లో గోరా గాంధీజీకి పెద్ద ఉత్తరం వ్రాశారు. అందు అస్పృశ్యతా నిర్మూలన గురించి, నాస్తికదృష్టితో తాను, తన సహచరులు చేస్తున్న కృషిని వివరించి, నాస్తికత్వం గురించి వ్యక్తిగతంగా సంభాషించుటకు తాను సేవాగ్రాం రాగలనని తెలిపారు. కాని దానికి గాంధీజీ ఇలా సమాధానం యిచ్చారు.

సేవాగ్రాం

వయా - వర్ధా., సి.పి. 11-9-1941

ప్రియమిత్రమా,

నాస్తికత్వమంటే తన ఉనికిని తాను నిరాకరించుకొనుటే. నాస్తికత్వ ప్రచారంలో ఎవరూ నెగ్గలేదు. మీకు కలిగిన సత్ఫలితానికి మీ చుట్టూ ఉన్న ప్రజలలో మీరు హృదయపూర్వకంగా చేసిన పనియే కారణం. ఇక్కడికి రావలసిందిగా మిమ్ములను ఆహ్వానించలేనందుకు విచారిస్తున్నాను. సంభాషణ కొరకు ప్రత్యేకించుటకు నాకు సమయంలేదు.

మీ

మో.క.గాంధీ.

గాంధీజీని కలుసుకొనుటకు గోరా ఎంత ప్రయత్నించినా గాంధీజీ అందుకు అవకాశం ఇవ్వలేదు. అంతేకాక, నాస్తికత్వం గురించి సామాన్య ప్రజలకున్న అభిప్రాయమే గాంధీజీకి కూడా ఉండెను. తాము పనిచేసుకుంటూపోతే తమ పనియే ఏదో ఒకనాడు గాంధీజీని ఆకర్షించకపోదని గోరా, వారి సహచరులు నాస్తిక దృష్టితో తమ పనిని కొనసాగించారు.

1944లో ఆ సమయం వచ్చింది. గాంధీజీయే స్వయంగా గోరాని సేవాగ్రాం రమ్మని ఆహ్వానించారు. 1944 నవంబరు చివరి వారంలో గోరా సేవాగ్రాం వెళ్ళారు. గోరాను గాంధీజీ కార్యదర్శి ప్యార్‌లాల్‌కీ, ఇతరులకూ రామస్వామి పరిచయం చేశారు. ఒక వారం రోజులలో గాంధీజీ - గోరా రెండుసార్లు కలుసుకుని ప్రాథమిక సంభాషణలు జరిపారు. ఒకరినొకరు అర్థంచేసుకున్నారు. ఆ రోజులు గాంధీజీకి

చాలా వత్తిడిగానున్న సమయం. జాతీయనాయకులు ఎందరో వచ్చి దేశసమస్యల గురించి గాంధీజీతో సంప్రదిస్తూ ఉండేవారు. గాంధీజీ గోరాతో తీరికగా మాట్లాడాలనుకున్నారు. గోరాని మరికొంతకాలం తన ఆశ్రమంలో ఉండవలసిందిగా కోరారు. కాని అందుకు సిద్ధపడి గోరా వెళ్ళకపోవడంచేత మళ్ళా వస్తానని వాగ్దానం చేసి గోరా శలవుతీసుకున్నారు.

తిరిగి 1945 జనవరి నెలలో గోరా సేవాగ్రాం ఆశ్రమం వెళ్ళారు. ఈ మారు కొంతకాలం ఉండుటకే వెళ్ళారు. అందుచేత గోరా ఆశ్రమంలో అతిథిగాకాక, ఒక కార్యకర్తగా, సభ్యునిగా అయ్యారు. ఆశ్రమంలోని పనులు పాకీపని నుంచి అన్ని పనులు వంతులుగా గోరా కూడా చేసేవారు. అయితే ఆశ్రమ ప్రార్థనకు మాత్రం హాజరయ్యేవారు కాదు. అలాగే రామస్వామి కూడా ప్రార్థనలో పాల్గొనేవారు కాదు.

గాంధీజీ గోరా కుటుంబాన్ని చూడగోరి సరస్వతిగారిని, పిల్లలను కూడా పిలిపించారు. గోరా సహచరులను కూడా తన ఆశ్రమానికి ఆహ్వానించారు. గోరా సహచరులు జట్లు జట్లుగా వచ్చి మూడు నాలుగురోజులు ఆశ్రమంలో ఉండి వెళ్ళేవారు. గాంధీజీ ప్రతిజట్టునూ కలుసుకుని వారితో కొద్దినిమిషాలు గడిపేవారు. గోరా సహచరులలో చాలామందికి ఇంగ్లీషుగాని హిందీకాని రానందున గాంధీజీకి - వారికి మధ్య మాటలకు అవకాశం ఉండేదికాదు. వచ్చీరాని హిందీలో ఎవరైనా మాట్లాడితే గాంధీజీ ఎంతో ఆనందించి వారితో కొద్దిసేపు ముచ్చటించేవారు. నాస్తికులగు వీరందరూ ఆశ్రమంలోవున్న ఆ కొద్దిరోజులలోనే తమ ప్రవర్తనద్వారా గాంధీజీని, ఆశ్రమవాసులను సమ్మోహితులను చేశారని చెప్పవచ్చు. తమ దీక్ష, సమానత్వభావం, కార్యవిధానం, దృఢనిశ్చయం, త్యాగదృష్టివల్ల వారు సేవాగ్రాంలో ప్రశంసాపాత్రులు, గౌరవభాజనులు అయ్యారు.

నిఘంటువులలో 'దుష్టత్వము' అని అర్థం చెప్పబడిన 'నాస్తికత్వం' శబ్దాన్ని తీసుకుని, సమాజంలో ఎప్పటికప్పుడు దూషణపదంగా వాడబడిన 'నాస్తికుడు' అనే శబ్దాన్ని సగర్వంగా స్వీకరించి, అందుకు తత్త్వశాస్త్రాన్ని కల్పించుటేకాక, నాస్తికత్వాన్ని ఒక ఉద్యమంగా నిర్మించి కొందరినైనా తాము నాస్తికులము అని చెప్పుకోగలిగేట్లు చేయగలిగారు గోరా. గోరా తాను నమ్మినదితాను ఆచరించుటే కాక, తన కుటుంబం అంతా దానిని అర్థం చేసుకుని ఆచరించగలిగేట్లు చేశారు. అంతేకాదు, ఎందరో సహచరులు దానిని స్వీకరించగలిగేట్లు చేశారు. ఈ ప్రత్యేకతను గాంధీజీ వీరందరినీ చూచి గమనించారు.

గాంధీజీ, గోరాకి నాస్తికత్వం గురించి దీర్ఘమైన చర్చ జరిగిన రోజున గాంధీజీ ఇలా ప్రశ్నించాడు: "మీరు నాస్తికత్వం కావలెనని ఎందుకంటున్నారు."

గోరా ఇలా సమాధానం యిచ్చారు:- "గడచిన సంవత్సరం నేను కలకత్తాలో ఉన్నాను. రోడ్డుప్రక్కన క్షామపీడితులైన నిరాశ్రయులు నడవలేక నడవలేక నడుస్తూ వుండటం చూశాను. వారిలో కొంతమంది వీధులలో యెక్కడపడితే అక్కడ రాలిపోయి చనిపోయారు. పండ్లు, మిఠాయిల అంగళ్ళ ప్రక్కన, దుకాణాలప్రక్కన వాటిని చూస్తూ చూస్తూ వారు చనిపోయారు. ఆకలిగొన్న కుక్కో, ఎద్దో అదే పరిస్థితులలో వుంటే ఆకలితో చనిపోతుందా? చావదు. తిట్టండి, కొట్టండి, దుకాణంపైబడే ప్రయత్నం అది మానదు. ఎలాగో ఒకలాగు ఆ పండ్లను మిఠాయిలను తిని తన ఆకలి తీర్చుకుంటుంది. అమిత ఆకలితో వున్న ఆ ప్రజలు అలా ఎందుకు చేయలేదు?

"పోలీసులకు వారు భయపడ్డారని నేను అనుకోలేను. లక్షల సంఖ్యలో వున్న ఆ నిర్వాసితులలో ఏ కొద్దిమంది దుకాణాలపై పడినా కలకత్తాలో వున్న పోలీసు బలగమంతా చేరికూడా వారిని ఆపలేకపోయేవారు. ఆకలితో చావటంకంటే వారు కనీసము జైలులోపడి కలో, అంబలో త్రాగి బ్రతకటం మేలు కాదా. కాని ఎందుకీ అనాధలు ప్రాణాలకు తెగించి దుకాణాలను కొల్లగొట్టలేదు? వారిలో ఒక్కడు కూడా మినహాయింపు లేకుండా అందరూ వట్టి పిరికిపందలేనా? లేక శాంతిభద్రతను భంగపరుచుటకు ఇష్టపడనంతటి ఉన్నత పౌరధర్మాన్ని గుర్తెరిగినవారా వారాంతా? కాదు వారు పౌరహక్కులు అంటే ఏమిటో ఎరగని అమాయకులైన సామాన్య ప్రజలు. తమ పౌరహక్కులు, బాధ్యతలు ఏ కొంచెం వారికి తెలిసి వున్నా, ఆసలు బెంగాలు క్షామమనేదే సంభవించి వుండేది కాదు.

"ఈ విషయాన్నే మరొక వైపునుండి చూద్దాం. తోటి మానవులు తమ కండ్లయెదుట ఆకలితో అసువులు విడుస్తుంటే చూచి ఊరుకో గలంతటి కఠినులా ఆ దుకాణదారులంతా? కాదు. వారు కరుణతో కన్నీరు విడిచారు, ఉదారంగా విరాళములిచ్చి అనాధులకు అంబలి సత్రములు నడిపారు. ప్రతిరోజూ నీతి శ్లోకములు వల్లించారు.

"ఆ అనాధులు పిరికిపందలు కానప్పుడు, ఆ దుకాణదారులు కఠినులు కాకున్నప్పుడు అంతమంది ఆకలితో ఎందుకు చనిపోయారు? వారి జీవిత తత్వమే ఇందుకు కారణమని నా అభిప్రాయం.

"ఆ అనాధులు, ఆ దుకాణదారులు ఇద్దరూ ఒకే జీవితతత్వాన్ని అనుసరిస్తున్నారు. 'ఇది నా కర్మ', 'అది అతని కర్మ' 'దేవుడు నన్నిలా పుట్టించాడు' 'అతనిని అలా పుట్టించాడు' అని ఎవరికివారు తమలో తాము అనుకున్నారు. వీరిరువురి జీవితత్వం ఒకటే కావటంచేత కొందరు కడుపునిండా తింటున్నా, మరికొందరు ఆకలితో

మరణిస్తున్నా, వారి సంబంధ బాంధవ్యాలలో ఎట్టి మార్పు రాలేదు. ఇటువంటి జీవిత తత్వమందు అనాధుల ప్రవర్తనకు, పైన చెప్పినరీతిగా పశువుల ప్రవర్తనకు తేడా వచ్చింది.

"బెంగాలు క్షామం గురించి నేను చెప్పిందే, అస్పృశ్యులకు తదితర హిందువులకు, తెల్లవారికి నల్లవారికి నడుమవున్న సంబంధాల విషయంలో కూడా వర్తిస్తుంది. ఈ సంబంధాలన్నీ పైన చెప్పిన జీవితతత్వాన్ని అనుసరించి వున్నవే.

"అయితే ఆ జీవిత తత్వాన్ని అనుసరించుటవల్ల కలిగే ఫలితమేమిటి? మనుష్యుడు పశువు కంటే హీనుడైపోయాడు. సుఖంగా బ్రతకటానికి బదులు నీచంగా మరణిస్తున్నాడు. అతనిలో అన్యాయాన్ని ఎదిరించేశక్తి సన్నగిలిపోయింది. అధిక సంఖ్యాకుల శల్యాలపై కొద్దిమంది సుఖాలు నిర్మింపబడుతున్నాయి. విశ్వ మానవసౌఖ్యం కోసం మనమెన్ని నీతిబోధలు చేస్తున్నా, మనకెన్ని మహదాశయాలున్నా, వాస్తవానికి జరుగుతున్నది ఈ దుర్భర విషయమే. నైతిక జీవితం కోసం, ఆదర్శాలకోసం మనం చేసే కృషినంతటినీ దేవుడు, కర్మలపై ఆధారపడిన ఈ జీవితత్వమే – మీ ఆస్తికత్వమే – నిష్ఫలం చేస్తూన్నదని నా విశ్వాసం.

"ఈ జీవితతత్వం మీదికి ఆకలిమంటలు విప్లవాన్ని లేవనెత్తుతున్నాయి. ఇంక ఈ జీవితతత్వం ఈ సాంఘిక అసమానతల ఉనికిని ఎంతోకాలం పదిలంగా నిలిపివుంచలేదు. ప్రేమ, శాంతుల బదులు ద్వేషం, యుద్ధం అప్పుడే చెలరేగ నారంభించాయి.

"నీతి వ్యాపించాలనీ, ఆదర్శాలు అభివృద్ధి చెందాలనీ నేను కోరుతాను. దేవునియందు, కర్మయందు విశ్వాసము తొలగిపోయి, తద్వారా ఆస్తిక జీవితత్వము మారినప్పుడే ఇది సాధ్యమౌతుంది. దీనినే నిర్మాణాత్మకమైన భాషలో చెప్పవలెనంటే మానవుడు దేవునిపై ఆధారపడడం మాని, తనకాళ్ళపై తాను నిలబడుటకుగాను నాస్తికత్వము కావలెనని నేను అంటున్నాను. మనుష్యునకు మనుష్యునకు నడుమ ఆర్థిక, సాంఘిక అసమానతలను నాస్తికత్వం అంగీకరించదు. కనుక నాస్తిక దృక్పథావలంబులలో బలమైన సాంఘికదృష్టి పెరుగుతుంది. ఏ విధమైన ఆయుధ బలం వల్ల కాక, అసంఖ్యాకులైన ఆస్తికుల మౌనాంగీకారము చేతనే ఇంతకాలం ఈ అసమానతలు నిలిచి ఉన్నాయి. దైవవిశ్వాసం పోయి మానవుడు తనకాళ్ళపై తాను నిలువ నారంభించినప్పుడు, మానవులలో తేడాలకంటే పోలికలే ఎక్కువగా కనబడుటేకాక, తేడాలు సోదర భావంతో తుడిచిపెట్టుకుని పోతాయి. కనుక సమస్త మానవులలో ఏకత్వము, సమానత్వము ఏర్పడతాయి.

"దేవుడే సత్యమైతే నేను దానిని తొలగించలేను. కాని అది వాస్తవం కాదు. దేవుడనేది మానవుడు కల్పించిన ఒక అబద్ధము. చాలా అబద్ధాలవలెనే గతకాలంలో అదికూడా కొంతవరకూ ప్రయోజనకరంగా ఉండింది. కాని, అన్ని అబద్ధాలవలెనే ఇది కూడా రానురాను జీవితాన్ని కల్మషం చేసివైచింది. కనుక మానవసంఘంలో అవినీతి కడిగివేయబడి, నీతి పెరగవలెనంటే దైవవిశ్వాసం పోవాలి. పోక తప్పదు.

"మానవులను ఆత్మవిశ్వాస పూర్ణులుగా చేయుటకు, సాంఘిక-ఆర్థిక సమానతలు అహింసాయుతంగా నెలకొల్పుటకు నేను నాస్తికత్వం కావలెనంటున్నాను. బాపూజీ నేనెక్కడ పొరబడ్డానో చెప్పండి." అని గోరా ముగించారు.

గోరా ఇచ్చిన ఈ దీర్ఘ వివరణలో మాటలతో కూడిన వాదన కాదు మనకు కనబడేది. ఆవేదనతో స్పందించిన ఆయన హృదయం జీవితతత్వం అనే నదిలో ప్రవహించింది. గాంధీజీ ఇదంతా శ్రద్ధగా, నిదానంగా విని ఇలా అన్నారు.: "ఔను, మీ మాటలలో నాకొక ఆదర్శం కనబడుతోంది. నా ఆస్తికత్వం ఒప్పు అని కాని, మీ నాస్తికత్వం తప్పు అని కానీ నేను చెప్పజాలను. మనం సత్యాన్వేషులము. తప్పుత్రోవను వెళుతున్నామని తెలియగానే మనం మార్చుకుంటాము. నా జీవితంలో నేనీవిధంగా ఎన్నోసార్లు మార్చుకున్నాను. మీరు గట్టి కార్యకర్తలనే సంగతి నాకు కనబడుతున్నది. మీరు అంధవిశ్వాసులు కారు. తప్పు త్రోవను పోతున్నట్లు తెలుసుకోగానే మార్చుకుంటారు. మీలో అంధవిశ్వాసం లేనంతవరకూ భయం ఏమీ లేదు. సరియైన విధానము మీదో, నాదో ఫలితాలే ఋజువుపరుస్తాయి. అప్పుడు నేను మీ మార్గాన్ని అనుసరించవచ్చు. మీరు నా మార్గాన్ని అనుసరించవచ్చు. లేదా ఇరువురం కలసి మరొక మార్గాన్ని అనుసరించవచ్చు. అందుచేత మీ పనిలో ముందుకు సాగి నడవండి. మీ విధానం నాకు వ్యతిరేకమైనప్పటికీ నేను మీకు తోడ్పడుతాను."

ఈ సంభాషణ తర్వాత గాంధీజీ-గోరా మరింత సన్నిహితమయ్యారు. తరచు గోరా సేవాగ్రాం వచ్చి వెళుతూ ఉండేవారు. గోరా గాంధీజీ పరివారంలో ఒకరయ్యారు.

గోరా నాస్తికునిగా సాంఘిక సమానత్వంకొరకు అస్పృశ్యతా నిర్మూలనకు చేస్తున్న కృషి అంతవరకూ సహపంక్తి భోజనాలవరకు పరిమితంగా ఉండెను. కులాలు పోవాలంటే వర్ణాంతర వివాహాలు కావాలని గోరా ప్రచారం చేస్తూ వచ్చారు. గోరాలోని ప్రత్యేకత ఆయన ఏది చెబుతారో అది ఆచరించి చూపుతారు. చెప్పిందిచేయడం, చేసింది చెప్పడం-గోరా దృష్టిలో ఇదేనీతి. చేత జోడింపబడని మాట అవినీతిని ప్రోత్సహిస్తుందని ఆయన అంటారు. ఆచరణలేని ప్రబోధం బాధ్యతారాహిత్యానికి చిహ్నం. సరస్వతిగారు మతచిహ్నాలయిన బొట్టు,గాజులు, తాళిబొట్టు తీసివేశారు.

మాంసాహారం తప్పుకాదని చూపుటకు కుటుంబంలోని అందరూ అలవాటురీత్యా శాకాహారులైనా మాంసం తిని చూపించారు.

ఇప్పుడు గోరా పెద్దకుమార్తెకు పెండ్లిఈడు వచ్చింది. అంటరానితనం పోవాలంటే కలిసి మెలిసి భోజనం చేస్తే చాలదు. కలిసి మెలిసి వివాహాలుకూడా చేసుకోవాలని చెప్పే గోరాకుటుంబం ఈ విషయంలోనూ ముందు నిలిచింది. సిద్ధాంతరీత్యా ఒక హరిజనుని వివాహమాడుట ఇష్టమేనా అని తన పెద్దకుమార్తె మనోరమను సంప్రదించారు. ఆమె అంగీకారం తెలిపింది. గోరా, సరస్వతి సంతోషించారు. ఇక వరుని కొరకు చూశారు.

సమాజం దృష్టిలో వ్యవసాయకూలీ కొడుకు నిర్ధనుడు, విద్యాహీనుడు, కాని గోరాకి నచ్చింది అతనిలోని మార్పుకై ఆవేదన, కార్యదీక్ష, మూడు నాలుగు సంవత్సరాలుగా అర్జునరావుని గోరా కుటుంబం ఎరుగును. అర్జునరావుతో ఈ విషయమై ప్రస్తావించగా ఆయన నిశ్చేష్టుడైపోయారు. కలో, నిజమోకూడా ఆయనకు అర్థం కాలేదు. అర్జునరావు తండ్రి ఎక్కడో మాలపల్లిలో ఒక మూల గుడిసెలో ఉంటూ ఇంత అంబలిత్రాగి బ్రతికే తనకు గోరాతో వియ్యమా అని నమ్మలేకపోయారు. గోరా ఈ నిర్ణయాన్ని బయటపెట్టగానే బంధువులు, మిత్రులు గోరాకి పిచ్చిఎత్తిందన్నారు. బంగారంవంటి పిల్ల జీవితాన్ని పాడుచేస్తావా? అని నిందించారు. పిల్లలమీద నీకు హక్కులేదు, మేము తీసుకుపోయి పెంచి పెళ్ళిళ్ళు చేస్తా అని బెదిరించారు కొందరు చుట్టాలు. మీ ఆయనకు బుద్ధిలేకపోతే నీకైనా బుద్ధివుండొద్దమ్మా? అని సరస్వతిగారిని నిందించారు మరికొందరు. నాకీ పెళ్లివొద్దు, నా కిష్టంలేదు అని చెప్పవే. మీ నాన్న అమ్మా ఏమిచేస్తారోచూస్తాం అని మనోరమను నిలదీవారు ఇంకొందరు. సరస్వతిగారి తల్లి, గోరా తల్లితండ్రులు తీవ్రంగా వ్యతిరేకించారు. ఉరుములు, మెరుపులు, పిడుగులు, తీవ్రమైన గాలివాన, అయినా తట్టుకుంది గోరా కుటుంబం. తట్టుకోవడమే కాదు, తన నిశ్చయంనుంచి వీసమంతైనా చలించలేదు. కఠోరదీక్ష. చివరకు వ్యతిరేకత తేలిపోయింది. 'మొండివాళ్ళు' అని సమాధానం చెప్పుకున్నారు.

గోరా తన కుమార్తె వివాహం గురించి చేసుకున్న నిర్ణయం గాంధీజీకి తెలిపారు. సరిగా అంతకు కొద్దినెలల క్రితమే గాంధీజీ సేవాగ్రాంలో హరిజన సేవక్‌సంఘం కార్యకర్తల సమావేశంలో మాట్లాడుతూ, సంఘం కార్యకలాపాలయెడల తీవ్రమైన అసంతృప్తిని తెలియజేసి మీలో ఎవరైనా మీ అమ్మాయినో, అబ్బాయినో హరిజనులకిచ్చి వివాహం చేయుటకు సిద్ధంగా ఉన్నారా?" అని సవాల్ చేశారు. ఒక్కరుకూడా గాంధీజీకి హామీనివ్వలేకపోయారు. అందుచేత గోరా సమాచారముగా వివాహవిషయం తెలిపేసరికి

ఈ వివాహం తానే జరుపుతానంటూ ముందుకు వచ్చారు గాంధీజీ. ఈ విషయమై మాట్లాడుటకు గాంధీజీ హిందీ ప్రచార సభ రజత జయంతి ఉత్సవాలకు అధ్యక్షత వహించుటకు 1946 ఫిబ్రవరిలో మద్రాసు వచ్చినప్పుడు మనోరమ, అర్జునరావులను తీసుకుని గోరా మద్రాసు వెళ్లి గాంధీజీకి పరిచయం చేశారు. గాంధీజీ ఈ వివాహం జరుపుటకు గోరాగారంగీకరించలేదు. ఎందుకంటే గాంధీజీ దేవునిపేర వివాహం చేయిస్తారు. మరి గోరాయే కాక వధూవరులూ నాస్తికులే. వీరికి దేవునిలో నమ్మకంలేదు. ఈ వివాహం విషయంలో 'దైవసాక్షిగా' అనుటకు బదులు 'సత్యసాక్షిగా' అని అంటానని, వివాహపుతంతులో ఎక్కడా దైవసంబంధమైన శబ్దం రానివ్వనని గాంధీజీ గోరాకి హామీ యిచ్చినమీదట, గాంధీజీ ఈ వివాహం జరిపించుటకు గోరా అంగీకరించారు. అయితే మనోరమకు 17 సంవత్సరాలే కనుక రెండు సంవత్సరాల వరకూ వివాహం వాయిదా వేద్దామనీ, ఈలోగా అర్జునరావు సేవాగ్రాంలో ఆశ్రమంలో ఉండి హిందీ, నిర్మాణకార్యక్రమాలు మొదలైనవి నేర్చుకొని విషయాలు తెలుసుకొంటారనీ గాంధీజీ సూచించారు. అందుకు గోరా అంగీకరించారు. ఈ విధంగా అర్జునరావు సేవాగ్రాం ఆశ్రమంలో ఉండుటకు వెళ్ళారు.

* * *

ఆగాఖాన్ భవనంలో బందీగా ఉన్నప్పుడు కస్తూర్బాగాంధీ చనిపోయింది. ఆమె జ్ఞాపకార్థం కస్తూరిబా జాతీయస్మారకనిధి వసూలు చేయబడింది. ఆ మొత్తాన్ని దేశమంతటా గ్రామీణస్త్రీల అభివృద్ధికై వినియోగించాలని గాంధీజీ నిశ్చయించారు. 1945లో రాష్ట్రాలలోను, జిల్లాలలోను కూడా కస్తూర్బా స్మారకనిధి కమిటీలు ఏర్పడ్డాయి. తమతమ ప్రాంతాలలో ఎలాంటి పనులకు ఈ ధనం వినియోగించాలి, ఏ ఏ గ్రామాలలో కస్తూరిబా స్మారకనిధి కార్యక్షేత్రాలు నెలకొల్పాలి. మొదలైన విషయాల గురించి రాష్ట్ర, జిల్లా శాఖలనుంచి సూచనలు కోరబడినవి, కృష్ణాజిల్లా శాఖవారు ఒక కేంద్రం గోరా నిర్వహణలో ముదునూరులో ఏర్పరచాలనీ, అయితే గోరా నాస్తికులు కనుక గాంధీజీ ఆమోదిస్తే ముదునూరుకు కేంద్రం అవ్వవచ్చుననీ సూచించారు. నిర్ణయబాధ్యత గాంధీజీపై పెట్టబడటంతో రాష్ట్రకమిటీ, కేంద్రకమిటీ ఆ కాగితాన్ని తిన్నగా గాంధీజీవద్దకు పంపాయి.

ఆ రోజులలో గోరా సేవాగ్రామంలోనే ఉన్నారు. గాంధీజీ గోరాను పిలిచి "ఇలా వచ్చింది, ముదునూరులో కేంద్రం నిర్వహిస్తావా?" అని అడిగారు. నిర్ణయం మీకు వదిలారుగదా అని గోరా అన్నారు. "నా నిర్ణయం అయిపోయింది. కేంద్రం నీకు మంజూరుచేశాను. రెండురోజులలో పనిచేసే పద్ధతి గురించి ఒక నోట్ వ్రాసియివ్వు"

అన్నారు గాంధీజీ. గోరాకి ఆశ్చర్యం వేసింది. వెంటనే ఆచార్య కాకా కలేల్కర్, శ్రీ ఆర్యనాయకం, శ్రీకృష్ణదాస్ జాజూగార్లను సంప్రదించి ఒక నోట్ తయారుచేసి గాంధీజీకి సమర్పించారు. గాంధీజీ దానిని ఆమోదించారు.

కార్యకర్తలను ఎలాంటివారిని ఎంచుకోవాలి అనే విషయమై గోరా గాంధీజీ సలహాను కోరారు. అప్పుడు గాంధీజీ మూడు అర్హతలు చెప్పారు. (1) 40 సంవత్సరాల వయస్సు దాటిన స్త్రీలు అయిఉండాలి (2) వారు చదువుకున్నవారు కారాదు. (3) హరిజనవాడలకు వెళ్ళి వారితో కలిసిమెలిసి ఉంటూ భోజనం చేయాలి. గాంధీజీ ఈ అర్హతలు సూచించుటలో ఎంతో దూరదృష్టిని చూపారు. వయస్సు ఉంటేనేగాని అనుభవం ఉండదు. చదువుకున్నవారైతే సాధారణంగా గ్రామీణపరిస్థితులలో పనిచేయుటకు వెనకాడం. అంతేకాక అలాంటివారితో గ్రామీణ మహిళలు, గ్రామీణ మహిళలతో అలాంటివారు చనువుగా ఉండలేరు. ఇక గ్రామాలు సాంఘికంగా అభివృద్ధి చెందాలంటే గ్రామీణ స్త్రీలలో అంటరానితనం తొలగించుటకు తీవ్రకృషి జరగాలి. గాంధీజీ సూచించిన అర్హతలుగల శ్రీమతి పిల్లలమర్రి అనంతలక్ష్మిని, శ్రీమతి శింగరాజు శకుంతలమ్మని కార్యకర్తలుగా గోరా ఎన్నుకున్నారు.

1945లోనే ముదురూరులో కస్తూరిబా స్మారకనిధి కేంద్రం ప్రారంభించబడింది. భారతదేశం మొత్తం మీద అదే మొదటి కస్తూర్బా కేంద్రం. అప్పటికి ఇంకా కస్తూర్బా జాతీయస్మారకనిధి కార్యకర్తల శిక్షణ కేంద్రాలు కూడా స్థాపించబడలేదు. ముదునూరు కేంద్రం గాంధీజీ కేంద్రమనీ, అనంతలక్ష్మి, శకుంతలమ్మ గాంధీజీ వర్కర్లనీ ఆనాడు ప్రసిద్ధిచెందారు. అనంతలక్ష్మి - శకుంతలమ్మలు తమ పనిద్వారా గాంధీ, గోరాల ఆశలను పూర్తిగా సఫలం చేశారు.

* * *

1940 రాంఘర్ కాంగ్రెసు మహాసభలో మౌలానా అబుల్ కలాం ఆజాద్ అధ్యక్షులుగా ఎన్నుకోబడ్డారు. తర్వాత పోరాట సమయమంతా ఆయనే కాంగ్రెసుకు అధ్యక్షులుగా ఉన్నారు. వరసగా ఆరు సంవత్సరాలు ఆజాద్ అధ్యక్షులుగా ఉన్న తర్వాత 1946లో జవహర్‌లాల్ నెహ్రూ కాంగ్రెసు అధ్యక్షులుగా ఎన్నుకోబడ్డారు. అప్పుడు మృదులాసారాబాయి, బి.వి. కేస్కర్ కాంగ్రెసు కార్యదర్శులుగా నియమింపబడ్డారు. పోరాటాల అనంతరం కాంగ్రెసు కొంత దెబ్బతింది. తిరిగి దానిని సంఘటితపరచవలసిన అవసరం వచ్చింది. అందుకు గోరా ఆర్గనైజరుగా తీసుకోబడినారంటే ఆశ్చర్యం ఏముంది? మొదట నెహ్రూ అధ్యక్షులుగా ఉన్నప్పుడు, ఆ తర్వాత 1946 చివర ఆచార్య కృపలానీ అధ్యక్షులుగా ఎన్నికైన తర్వాతకూడా

గోరా అఖిలభారత కాంగ్రెసు ఆర్గనైజరుగా అలహాబాదు, ఢిల్లీలో పనిచేశారు. శ్రీ కృపలానీ అధ్యక్షులుగా ఉన్నప్పుడు శ్రీ శంకరరావుదేవ్, ఆచార్య జుగుల్ కిశోర్ కార్యదర్శులుగా ఉండేవారు.

అఖిలభారత కాంగ్రెసు ఆర్గనైజరుగా ఢిల్లీప్రాంతీయ కాంగ్రెసును సుసంఘటితం చేసేపనిని గోరా తీసుకున్నారు. అప్పుడు ఢిల్లీ ప్రాంతీయ కాంగ్రెసు సంఘం క్రింద ఉన్న ప్రదేశమంతా గోరా సైకిలుమీద పర్యటించి దాదాపు అందరు సామాన్య కార్యకర్తలను కూడా వ్యక్తిగతంగా కలుసుకుని కాంగ్రెసు సంస్థను గట్టిపరిచారు.

అవి హిందూ-మహమ్మదీయ తగాదాలు తీవ్రంగా ఉన్న రోజులు. అలాంటి సమయంలో ఒక మహమ్మదీయ మిత్రుడు గోరా, సరస్వతిగార్లను ఢిల్లీలో తన ఇంటికి భోజనానికి ఆహ్వానించాడు. భోజనంలో గొడ్డుమాంసం వడ్డించారు. గోరా, సరస్వతిగార్లు మాట్లాడకుండా అది తిన్నారు. ఆ వెంటనే సరస్వతిగారు "మరి మీరు పంది మాంసం తింటారా?" అని అడిగారు ఆయన్ను, గడ్డంనెరసి వృద్ధుడైన ఆయన ముఖం ఎఱ్ఱగా కందిపోయింది. అసహనంతో పాటు పశ్చాత్తాపం కూడా అందులో ఉంది. కొద్దిసేపు ఆయన నిదానంగా ఆలోచించి "ఈమారు ఎవరైనా పెడితే తింటానని అనాలి" అన్నారు మెల్లగా, లేకపోతే తమకు గొడ్డుమాంసం ఎందుకు పెట్టారని సరస్వతిగారు అడగవచ్చునుగదా, హిందువులకు గోమాంసం తినుట ఎంతపాపమో, మహమ్మదీయులకు పందిమాంసం తినుట అంతపాపం. బహుశః మరెవరైనా మరో పరిస్థితిలో ఆ ప్రశ్నవేసి ఉంటే అక్కడ దెబ్బలాట జరిగేదే. కాని ముందుగా తమకు వడ్డించిన గొడ్డుమాంసం తిని ఆ తర్వాత ఆ ప్రశ్న వేయుటతో ఆ మహమ్మదీయుడు సిగ్గుపడి పందిమాంసం తనకు వడ్డిస్తే తినవలసి ఉంటుందని అనక తప్పలేదు. మనదేశంలో హిందూ ముస్లిం భేదం సమసిపోవాలంటే ప్రతి ఒక్కరూ ఒకచేత్తో చిన్న పందిమాంసం ముక్క మరొక చేతితో చిన్న గొడ్డుమాంసం ముక్క పట్టుకుని బహిరంగంగా రెండూ తినాలని గోరా అన్నారు. నాస్తికదృష్టితో అది ఆయన విధానం.

అప్పటికి ఉత్తర హిందూస్థానంలో 'హిందూ చా' 'ముస్లిం చా' అనీ, 'హిందూ పానీ', 'ముస్లిం పానీ' అని విడివిడిగా టీ, మంచినీళ్ళు ఇచ్చేరోజులు. హిందూ-ముస్లిం తగాదాలు ప్రారంభం కాగానే పది పందులను చంపి ముస్లిం ప్రాంతాలలో హిందువులు పారేసేవారు. అలాగే పది ఆవులను చంపి హిందూ ప్రాంతాల్లో ముస్లింలు పడేసేవారు. రెండు రకాల మతమౌఢ్యానికి జవాబుగా గోరా రెండు మాంసాలను తిన్నారు.

ఈ సంఘటనను పండిత సుందరలాల్ ఒకసారి గాంధీజీకి చెప్పారట. అప్పుడు గాంధీజీ "అది గోరా విధానం. గోరా నాస్తికుడు. అందరూ నాస్తికులవడం ద్వారా

మత విద్వేషాలు సమసిపోయేట్లయితే అందరూ నాస్తికత్వాన్ని స్వీకరించుటే.........."
అని అన్నారట.

ఆ రోజులలో గాంధీజీ ఢిల్లీలో భంగీకాలనీలో ఉండేవారు. ఒక వైపు హిందూ-ముస్లిం మతకల్లోలాల సమస్య, మరొకవైపు త్వరలో రానున్న స్వాతంత్ర్యాన్ని రూపొందించే సమస్య. వీటితో సలహాలు, సంప్రదింపులకొరకు, విధివిరామం లేకుండా మహానాయకులు మొదలు సామాన్య కార్యకర్తల వరకూ నిరంతరం ప్రవాహం వలె వస్తూ ఉండేవారు. అప్పుడప్పుడు గోరాకూడా గాంధీజీని కలుసుకొనుటకు వెళుతూ ఉండేవారు. అప్పుడు గాంధీజీ నాస్తికత్వం గురించి కూడా ప్రస్తావించి మాట్లాడుతూ ఉండేవారు. అలాంటి సంభాషణలలో ఒకసారి గాంధీజీ ఇలా అన్నారు: "చాలాకాలం మీరు నాస్తికత్వాన్ని ఆచరించి చూచారు. ఇప్పుడు "నాస్తికత్వం' అనే మాటను వదిలి పెట్టండి. ఇది మీ పనికి సహాయపడదు."

గాంధీజీ ఇలా అనటం గోరాకు ఆశ్చర్యం కలిగించింది. గోరా ఇలా సమాధానమిచ్చారు. "నాస్తికత్వం" అనే శబ్దం దూషణ శబ్దమని నాకు పూర్తిగా తెలుసును. 'నాస్తికత్వం' అనేమాటకు ఆక్స్‌ఫర్డ్ నిఘంటువులో 'నిరీశ్వరవాద' మనీ, నిరీశ్వరవాదానికి ఒక అర్థం 'దుష్టత్వ' మని వ్రాసి ఉంది. నాస్తికత్వమనేమాట ఎంతగా నిందించబడుతున్నదో నేనెరుగుదును బాపూ. కాని, మానవునిలో పూర్తి ఆత్మవిశ్వాసాన్ని, సంపూర్ణమైన సాంఘికదృష్టిని తేగలిగింది నాస్తికత్వమనేమాట ఒక్కటే. కనుక దానిని బుద్ధిపూర్వకంగా నేను తీసుకున్నాను. నాగరికతలోని అభ్యుదయకర విధానాలకు నాస్తికత్వం ప్రాతినిధ్యం వహిస్తున్నదని నా అభిప్రాయము. ఇంతవరకూ నాస్తికత్వం గురించి నేననుకుంటున్న వేరు వేరు విషయాలు మీ ఎదుట పెట్టనేలేదు. అట్టి అవకాశం కొరకు ఎదురు చూస్తున్నాను. నా అభిప్రాయాలను పుస్తకరూపంలో వెలువరించాలనుకుంటున్నాను."

ఇది విని గాంధీజీ ఆదరంతో ఇలా అన్నారు. 'మీ పుస్తకం వ్రాతప్రతిని నేను చూస్తాను ఈసారి నేను సేవాగ్రాం వెళ్ళినప్పుడు నా వద్దకురండి. మీ అభిప్రాయాల గురించి మాట్లాడుటకు అక్కడ మనకు తగిన అవకాశం ఉంటుంది."

కాని ఆ అవకాశం ఎప్పుడూ రానేలేదు. గాంధీజీ తిరిగి సేవాగ్రాం వెళ్ళనేలేదు. 1948 జనవరి 30న ఢిల్లీలోనే గాంధీజీ హత్యకావింపబడ్డారు.

నాస్తికత్వం గురించి తిరిగి చర్చించుటకు అవకాశం రానట్లే మనోరమ-అర్జునరావుల వివాహం కూడా గాంధీజీ జరపుటకు వీలుపడలేదు. ఈ వివాహం 1948 ఏప్రిల్‌లో జరుపుదామని గాంధీజీ గోరాకు వ్రాశారు. కాని ఆయన

హత్యానంతరం 1948 మార్చి 13న సేవాగ్రాం ఆశ్రమంలో మనోరమ-అర్జునరావుల వివాహం జరిగింది. గాంధీజీ వాగ్దానం ప్రకారం దైవసంబంధమైన ప్రమేయం ఏమీ రాకుండా ఆశ్రమవాసులు శ్రద్ధతీసుకున్నారు. శ్రీఠక్కర్‌బాపా ఆధ్వర్యంలో, గాంధీజీ సూచించినట్లు ప్రభాకర్‌జీ వివాహ కార్యక్రమాన్ని నిర్వహించారు. ప్రభాకర్‌జీ అనంతపురం జిల్లాకు చెందినవారు. అప్పటికి 12 సంవత్సరాలుగా సేవాగ్రాం ఆశ్రమంలో ఉంటున్నారు. అంటరానితనం నిర్మూలనకుగాను హరిజనులు హరిజనేతరులమధ్య జరిగే వివాహాలు మాత్రమే తన ఆశ్రమంలో జరుపుటకు అనుమతిస్తానని 1945లో గాంధీజీ నిర్ణయించిన అనంతరం అట్టి వివాహం అదే ప్రథమం. వివాహానికి వచ్చి వధూవరులను అభినందించినవారిలో జవహర్‌లాల్‌నెహ్రూ, జయప్రకాశ్‌నారాయణ్, ఆచార్య కృపలానీ మొదలైనవారున్నారు.

గాంధీజీతో గోరాకు గల పరిచయాన్నీ, నాస్తికత్వంపై వారిద్దరకూ జరిగిన సంభాషణలను వివరిస్తూ ఇంగ్లీషులో గోరా "An Atheist with Gandhi" అని ఒక పుస్తకం వ్రాశారు దీనికి శ్రీకిశోరీలాల్ మశ్రువాలా పెద్దభూమిక వ్రాశారు. ఈ పుస్తకాన్నీ, దీని హిందీ, గుజరాతీ అనువాదాలనూ గాంధీసాహిత్యాన్ని ప్రచురించే అహమ్మదాబాదులోని నవజీవన కార్యాలయంవారు వెలువరించారు. గాంధీజీ మరణం వల్ల మొత్తం ప్రపంచానికే తీరని నష్టం కలిగింది; నాస్తికత్వం కూడా నష్టపోయింది అని గోరాగారు ఈ పుస్తకంలో పేర్కొన్నారు. నిజమే, ఆ తర్వాత నాస్తికత్వం గురించి గాంధీజీతో గోరా ఇంకా వివరంగా చర్చించి ఉంటే ఎలా ఉండేదో?



# విజయవాడ రాక : 'సంఘం' పత్రిక

**1946**లో దేశమంతటా ఎన్నికలు జరిగాయి. ఆ ఎన్నికలలో గోరా కృష్ణాజిల్లా అంతా పర్యటించి కాంగ్రెసు తరఫున ప్రచారం చేశారు. జిల్లాలో ఎన్నోచోట్ల కాంగ్రెసు కార్యకర్తలకు నాలుగైదు రోజులు శిబిరాలు నడిపి ఎన్నికల ప్రచారంలో ఉపన్యసించుటకు, ప్రజలకు విషయాలు నచ్చచెప్పుటకు వీలుగా కార్యకర్తల రాజకీయ పరిజ్ఞానం పెంపొందించడంలో తోడ్పడ్డారు.

అప్పటికే దేశవిభజనకు, ఇండియా - పాకిస్తాన్లు విడివిడిగా స్వాతంత్ర్యం పొందుటకు నిశ్చయమైపోయింది. గోరా నాస్తికదృక్పథం ప్రచారానికిగాను తెలుగులో ఒక వారపత్రిక ప్రారంభిచాలనుకున్నారు. అప్పటికి ముదునూరు గ్రామం, రైలు, బస్సు, టెలిగ్రాఫ్ సౌకర్యాలు ఏమీలేని మారుమూల గ్రామం. వర్షాకాలంలో కంకరరోడ్డు లేక, బయట ప్రపంచంతో సంబంధం తెగిపోతుంది. అలాంటి గ్రామంలో వారపత్రికను, దానిని అచ్చువేయుటకు ప్రెస్సును నడపాలంటే కష్టం. అందుచేత ముదునూరు సహచరుల అనుమతితోనే గోరా తన మకామును ఏదేనా పట్టణమునకు దగ్గరగా రాకపోకల సౌకర్యంగల గ్రామానికి మార్చాలని నిర్ణయించుకున్నారు. అయితే ముదునూరులో వలెనే ఆ గ్రామంలో కూడా గ్రామస్తుల పూర్తి సహకారం లభించాలి. గోరా చాలా చోట్ల ఈ విషయం ప్రస్తావించనారంభించారు. అలాగే ఎన్నికల ప్రచార సందర్భంలో విజయవాడకు మూడుమైళ్ళ దూరంలో ఉన్న పటమట గ్రామంలో జరిగిన కార్యకర్తల శిబిరంలో కూడా ఈ విషయం ప్రస్తావించారు. అప్పుడు పటమట గ్రామ పెద్దలు, కార్యకర్తలు గోరాని తమ గ్రామం రావలసినదిగా ఆహ్వానించారు.

పటమట పంచాయతీబోర్డు ప్రసిడెంటు శ్రీ చెన్నుపాటిరామకోటయ్య, ఆంధ్రప్రదేశ్ గ్రంధాలయ సంఘ కార్యాలయాన్ని పెదపాలెంనుంచి పటమటలంకకు మార్చిన ఆ సంఘం కార్యదర్శి శ్రీ పాతూరి నాగభూషణం, విజయవాడకు చెందిన డాక్టరు టి.వి.యస్. చలపతిరావు మొదలైనవారు ఒక ఆహ్వానసంఘంగా ఏర్పడి గోరా కుటుంబాన్ని, వారితో కలసి పనిచేస్తున్న కార్యకర్తలను పటమట రావలసినదిగా ఆహ్వానించి అందుకు కావలసిన ఏర్పాట్లు చేశారు. ఈ విధంగా ఆరు సంవత్సరాలు ముదునూరులో ఉన్న తర్వాత 1947 ఏప్రిల్ లో గోరా తమ కార్యస్థానము పటమటకు మార్చారు. ముదునూరు గ్రామస్తులకు అసలు గోరా తమ గ్రామం విడిచివెళ్ళుట ఇష్టంలేదు. కాని గోరా చేపట్టిన నాస్తికోద్యమ విస్తరణరీత్యా వారికి వీడ్కోలు ఇవ్వక తప్పలేదు. గోరా పనిచేసిన ఆరు సంవత్సరాలలోను ముదునూరు గ్రామం సాంఘిక, రాజకీయ చైతన్యరీత్యా ఎంతగానో మారిపోయింది. ఎందరో నూతన కార్యకర్తలు తయారైనారు. ముదునూరులో గడిపిన ఆరు సంవత్సరాలు గోరా ప్రజాసేవ జీవితానికి పునాదిరాళ్ళు. ముదునూరు గ్రామచరిత్రలో ఆ అర్థపుష్కరకాలం సువర్ణాక్షరాలలో లిఖింపబడిన అధ్యాయం.

పటమట రాగానే ముందు గోరా ఒక మామిడి తోటలోనికి ఆహ్వానింపబడ్డారు. అక్కడ పాకలు వేసుకుని వయోజనవిద్య రాత్రి పాఠశాలలు, సహపంక్తి భోజనాలు మొదలైన కార్యక్రమాలు ప్రారంభించారు. ఆ స్థలంలోనికి వచ్చి ఒక సంవత్సరం అయ్యేసరికి గోరా పెద్దకుమార్తె వివాహం సేవాగ్రాంలో జరిగింది. కబుర్లు కమ్మగా వినుటకు అలవాటు పడిన సమాజానికి చేతలు చేదుగా ఉంటాయి. అందుకే, 'అహం బ్రహ్మాస్మి', 'సోహం' అని తత్వబోధలు చేసిన హిందూ సమాజంలోనే అమానుషమైన అస్పృశ్యత వేళ్లూని వటవృక్షంలా విస్తరించింది. రత్నగర్భ అని పొగడుకునే భారతదేశం భయంకరమైన దారిద్ర్యానికి లోనైంది. ఇదంతా ఆచరణను వదలి కేవలం ఆదర్శాలు వల్లించిన దుష్ఫలితమే. దీనిని చూచిన గోరాకు "మాటలుకాదు, చేతలు ముఖ్యం." "నువ్వు ఏమి చెబుతున్నావో అదికాదు సమాజాన్ని ప్రభావితం చేసేది, మార్చేది; నువ్వు ఏమిచేస్తున్నావో అది" అని గోరా అంటారు.

అందుకే అంటరానితనం నిర్మూలన కావాలంటే హరిజన సవర్ణ వివాహాలు విరివిగా జరగాలని గోరా మాటలద్వారా చెప్పినంతకాలం అందరూ హర్షించారు. కాని తన కుమార్తె వివాహాన్ని అట్టి ఆదర్శంతో జరిపించేసరికి వ్యతిరేకతలను ఎదుర్కోవలసి వచ్చింది. 'ఏదో ఆయన మాట్లాడుతున్నంతకాలం బాగుంది. అంతేగాని, దానిని ఆచరిస్తే చిక్కురాదూ? ఇవాళ తనకూతురును మాలవాళ్ళకిచ్చి పెళ్ళిచేశారు.

రేపు మన పిల్లల్ని కూడా అలాగే ఇమ్మనడూ? ఇదెలా సహిస్తాం?" అని బహిరంగంగా అన్నవారు ఎందరో ఉన్నారు. ఈ వ్యతిరేకతల ఫలితమే గోరా అంతవరకూ ఉంటూ వచ్చిన మామిడి తోపును ఖాళీచేసి వెళ్ళవలసినదిగా కోరుతూ కోర్టులో కేసు వేశారు. ఆ స్థలం యజమానులు. "మీరు పిలిచి ఉండమంటే ఉన్నాను, పొమ్మంటే పోతాను. ఈమాత్రానికి కేసులు కూడా ఎందుకు?" అన్నారు గోరా. నిజమే. చెట్లమీద గూళ్లు కట్టుకుని ఎన్నో పిట్టలుంటున్నాయి. అలాగే ఏ చెట్టుక్రిందనో కాపురముండుటకు సిద్ధపడ్డ గోరాని ఎవరేమి చేయగలరు? కాని ఇంతలోనే శ్రీ చెన్నుపాటి రామకోటయ్య తమ పొలంలో వచ్చిఉండవలసినదిగా ఆహ్వానించారు. 1948లో నాస్తిక కేంద్రాన్ని రామకోటయ్య, వారి సోదరులు శ్రీ చెన్నుపాటి శేషగిరిరావు స్థలంలోనికి తరలించారు. ఇప్పటికీ కూడా అదే స్థలంలో నాస్తికకేంద్రం వుంది.

1947లో మన స్వతంత్రులమైనాము. అయినా స్వదేశ సంస్థానాలు పెద్ద సమస్యగా మారాయి. సంస్థానాలలో సాగిన ప్రజోద్యమాలవల్లను, సంస్థానాధీశుల వివేకంవల్లను, వల్లభభాయిపటేల్ రాజనీతి కుశలతవల్లనూ చాలా సంస్థానాలు ఏ విధమైన ఇబ్బందీలేకుండా భారతదేశంలో లీనమైపోయాయి. చిన్న సంస్థానమైన జునాగఢ్, పెద్ద సంస్థానమైన హైద్రబాదు కొంత గొడవచేశాయి. హైద్రాబాదులో స్టేట్ కాంగ్రెస్ బాధ్యతాయుత ప్రభుత్వానికి, భారతదేశంలో లీనంకావడానికి తీవ్రమైన పోరాటం సాగించింది. ఈ పోరాటానికి అన్ని విధాలా సహకరించుటకుగాను ఆ అయ్యదేవర కాళేశ్వరరావు అధ్యక్షతను ఆంధ్రలో ఏర్పడిన కమిటీకి గోరా ఒక కార్యదర్శి. ఆ పోరాటంలో తెలంగాణాలో కృషిచేస్తున్న కార్యకర్తలకు అండగా ఉండి తోడ్పడుటకుగాను స్టేటులోనికి కొంతమంది గట్టివర్కర్లను పంపవలసి వచ్చింది. గోరా తానె వెళ్ళుటకు అవకాశము లేకపోవుటచేత, గత ఐదారు సంవత్సరాలుగా తనకు కుడిభుజంగా ఉండి పనిచేస్తున్న శ్రీ కానాను పంపించారు.

కానా తెలంగాణా కార్యకర్తల ప్రేమాభిమానాలను చూరగొనడమే కాకుండా నాస్తికత్వాన్ని కూడా ప్రచారం చేశారు. దీనితో కొంతమంది కార్యకర్తలు నాస్తిక దృక్పథంవైపు సహజంగానే మొగ్గారు. పోలీసుయాక్షన్ జరిగి హైదరాబాదు స్టేటు భారతదేశంలో విలీనం చేయబడిన తర్వాత కానా తెలంగాణా మిత్రుల సహకారముతో సూర్యాపేటలో ఒక నాస్తిక కేంద్రాన్ని నెలకొల్పారు. ఈ కేంద్రం నల్లగొండ, ఖమ్మం, వరంగల్ జిల్లాలలో నాస్తికత్వాన్ని ప్రచారం చేయుటలోను, 'సంఘం' పత్రికను అందించుటలోనూ విరివిగా తోడ్పడింది.

1949 జనవరి 30 'సంఘం' పత్రిక తొలి సంచిక వెలువడింది. గోరా సంపాదకులు, 'సంఘం' అచ్చువేయుటకుగాను పటమట నాస్తిక కేంద్రంలో ఒక చిన్న ప్రెస్‌ను కూడా నెలకొల్పారు. మిత్రులనుంచి, అభిమానులనుంచి సేకరించిన విరాళాలతోనే ఈ ప్రెస్ నెలకొల్పబడింది. అంతకుముందు ఒక సంవత్సరకాలం మద్రాసులో ప్రెస్సుపనియందు శిక్షణపొంది వచ్చిన గోరా జ్యేష్టకుమారుడు శ్రీలవణం ప్రెస్సు. 'సంఘం' పత్రికల నిర్వహణ బాధ్యతను తీసుకున్నారు. ప్రెస్సులో జీతగాండ్రు ఎవరూలేరు. గోరా సంతానంలోని పెద్దపిల్లలు, తోటి కార్యకర్తలు కలసి అక్షరాలు కూర్చుట నుంచి అచ్చువేయుట, బైండింగు మొదలైన పనులన్నీ చేసేవారు.

'సంఘం' నాస్తికపత్రిక, నాస్తిక దృష్టితో అన్ని సమస్యలు సమగ్రంగా చర్చించాలని 'సంఘం' ప్రారంభించబడింది. తొలి సంపాదకీయంలోనే ఈ విషయం స్పష్టం చేయబడింది. 'సంఘం' నాస్తిక వారపత్రిక తొలిసంచిక సంపాదకీయం ఇలా వ్రాయబడింది.

## నాస్తికదృష్టి

"నమస్కారం

"పత్రికా ప్రపంచములోనికి "సంఘం" ప్రవేశించడం ఇదే ప్రథమం.

"ప్రతీ పత్రికకు ఏదో ఒక ప్రత్యేక దృష్టి ఉంటుంది. 'సంఘం' దృష్టి నాస్తికత్వం.

"నాస్తికత్వం అంటే ఏమిటి? నాస్తికత్వం యొక్క ఉపయోగం ఏమిటి? అను విషయాల గురించి "సంఘం" అంతకంతకు విశదపరుచును. ప్రస్తుతం కొన్ని ఉపయోగాలు మాత్రం స్పష్టం.

"కులాలు, మతాలు, జాతులపేరిట ప్రజలమధ్య వైషమ్యాలు, పోరాటాలు పెరుగుచున్నవి. నాస్తికదృష్టి అనుసరించగానే ఇట్టి తేడాలకు తావుండదు. దేవుడు, కర్మ అను నమ్మకాలు తొలిగిపోతే ఇక హిందువుడూ లేడు, మహమ్మదీయుడూ లేడు. క్రైస్తవుడూ లేడు, యూదుడూలేడు. అందరూ మానవులే అగుదురు. దృష్టిలో ఇట్టి మార్పువలన సోదరభావం పెంపొందగలదు.

"గాంధీతత్వమునకు, నాస్తికత్వమునకు ఇది ముఖ్యమైన భేదము. తేడాలు తేడాలుగానే ఉంచి వాటిమధ్య సామరస్యమునకై గాంధీతత్వము ప్రయత్నించును. తేడాలు తేడాలుగా ఉన్నచో ఒకప్పుడు కాకపోయినా ఇంకొకప్పుడైనా కుల మతోద్రేకాలు పెరుగుటకు అవకాశం కలదు. కాబట్టి జాతి, కుల, మత తేడాలను నిర్మూలించి, సహజమానవత్వమును నాస్తికత్వం నిరూపించును.

"మరియు సంఘం నిర్మాణములో రాజకీయములకు ప్రాముఖ్యత కలదు. రాజకీయములలో ప్రజాస్వామిక విధానం ముందుకు వచ్చుచున్నది. ప్రతీ పౌరుడు తన ఓటును సక్రమంగా వినియోగించి, ప్రభుత్వమును మాట మాటకీ అజమాయిషీ తీసుకుంటేనే ప్రజాస్వామికం సక్రమంగా నడుచును. ప్రజ అశ్రద్ధ వహించినచో ప్రజాస్వామికము ముఠారాజకీయముగా పొడైపోవును.

"ఈనాడు ప్రజ రాజకీయములో తగు శ్రద్ధ తీసుకొనుట లేదు. వారి కష్టసుఖములకూ, ఆర్థిక రాజకీయ విధానములకు గల సంబంధము వారు గుర్తించుటకు బదులు, తమ కష్టసుఖములు దైవ కల్పితములనో, కర్మ ఫలితములనో నమ్ముచున్నారు. ఈ నమ్మకం ప్రజలలో విరివిగా ఉండుట చేతనే ప్రజాస్వామికము సరియైనదారులలో నడచుట లేదు. అందుచేతనే తాత్కాలికముగానైనను నియంతృత్వం అవసరమని కమ్యూనిజం నిరూపించుచున్నది.

"నియంతృత్వము మానవ స్వేచ్ఛకు ఆటంకం. అందు హింసతో కూడిన నిర్బంధము కూడా ఉండును. ఎప్పటికైనా నియంతృత్వం ప్రజాస్వామికంగా మారవలెనంటే, ప్రజల దృష్టి పరలోకం నుండి యదార్థమునకు మరలించవలసి యున్నది. అప్పుడైనను నాస్తికత్వం అవసరం కాగలదు. అందుచేత ఎంత వేగముగా నాస్తికత్వం అవలంబిస్తే అంత సులభముగా ముఠా రాజకీయములను, నియంతృత్వములను తప్పించుకొనగలము. ప్రజాస్వామికమునకు నాస్తికదృష్టి తప్పనిసరి. గాంధీతత్వం, కమ్యూనిజం కూడా నాస్తికత్వమును అనుసరించుటలేదు. అందుచేత ఆర్థిక, నైతిక కార్యక్రమములలో తగు ఫలితము గాంధీ విధానమునకు లభించుట లేదు. పార్టీ నియంతృత్వమునూ, హింసా కాండనూ కమ్యూనిజం అవలంబించవలసి వచ్చుచున్నది. కమ్యూనిజంలోని సమానత్వం అద్భుతము, గాంధీయిజంలోని అహింస అమోఘము. ఈ రెంటినీ కలిపి, వీటి ఏకాశయమగు శాంతి, సమానతలను చేకూర్చగలిగినది నాస్తికత్వము. ఇట్టి కార్యమును సాధించగలుగుటకు నాస్తికత్వములో ఒక ప్రత్యేక సౌకర్యమున్నది. అది సంఘ దృష్టి.

ఇంతవరకు నాగరికతా చరిత్రలో స్థిరమైన సంఘదృష్టి ఏర్పడలేదు. సంఘమనగా ప్రజల సమూహం కాదు. వారి వారి మధ్య ప్రేమ, సత్యవర్తనము, సోదరభావం ఉన్ననాడే సంఘం కాగలదు. అస్తికత్వము కూడా ప్రేమను, సోదరభావమును కోరును. కాని ప్రేమను సంఘావసరంగా గుర్తించక, ప్రేమను మోక్షసాధనముగా అస్తికత్వము నిరూపించినది. అందుచేత వేరువిధంగా మోక్షము తెచ్చుకోగలిగినచో, ప్రేమ అనవసరమగుచున్నది గదా. ఈ లోపము వలన అస్తికత్వం ఎంత ఎలుగెత్తి చాటినను

ప్రేమ సోదర భావములను స్థాపించలేకపోయినది. ఆస్తిక దృష్టిని అనుసరించు గాంధీయిజంలోని సంఘీభావము సేవాదృష్టి వరకు రాగలిగినది గాని సమానత్వమును తేలేకపోయినది. సేవాదృష్టిలో అసమానతలు అట్లే ఉండును. అధిక అవకాశాలు కలవారు ఇతరులకు సహాయము చేయుదురు. వారు ఒకవేళ వారి విధులను చేయలేకపోతే వారిని దండించు విధానం లేదు. అందుచేత పేదల జీవితములు ధనికుల దయాధర్మముల మీద ఆధారపడి యుండునేగాని, "గౌరవమైన జీవితం నా జన్మహక్కు" అని ఏ పేదవాడును అనలేదు; అట్టి హక్కు ధనికులకే గలదు. ఇట్టి అసమానస్థితి సంఘ నిర్మాణమునకు విరుద్ధము.

## అసమానస్థితి

"సంఘ నిర్మాణమునకు అత్యవసరమగు సమానత్వమును కమ్యూనిజం కోరును. కాని సమానత్వమునకు కావలసిన పరిస్థితులను పార్టీ నియంతృత్వముద్వారా నిర్మించి, ఆ పరిస్థితులను బట్టి సమానత్వమును ప్రజలపైన నిర్బంధించును. మానవుల భావాలు మారనంతకాలము ఒక పరిస్థితులవల్ల ఏర్పడిన సమానత్వం, ఇంకొక పరిస్థితులవల్ల మారవచ్చును. అందుచేత సమానత్వమును స్థిరముగా ఏర్పర్చి సంఘమును నిర్దోషముగా చేయవలెనంటే మానువుని భావములోనే సంఘదృష్టి ఏర్పడవలెను. దీనిని నాస్తికత్వమే సాధించగలదు.

"నాస్తికదృష్టివలన పరలోకము, దానికి సంబంధించిన నమ్మకములు తొలిగిపోయి ప్రేమ, సత్యసంధత, సోదరత్వము సంఘావసరములుగా గుర్తింపబడును. ఇట్టి యదార్థదృష్టికి ప్రజాస్వామికపు భావములు తోడై నాస్తిక దృక్పథమువలన స్థిరమగు సంఘ దృష్టి ఏర్పడుచున్నది. సంఘావసరములగు సమానత, సత్యము అహింస, స్వేచ్ఛ – వీనికి సంబంధించి ఆర్థిక, రాజకీయ, నైతిక నియమములూ, సంస్థలూ, కళలు ఏర్పడును. ఇట్టి గట్టి సంఘదృష్టివలన నాస్తికత్వము శాంతియుతముగా సమానత్వమును స్థాపించగలదు."

"సంఘం" తొలిసంచికలో వ్రాసిన సంపాదకీయం చాలా స్పష్టముగా ఉంది. ఆర్థిక, సాంఘిక, రాజకీయ, తాత్విక, వైజ్ఞానిక విషయాలెన్నిటినో 'సంఘం' నాస్తికదృష్టితో పరిశీలించింది. 'సృష్టిరహస్యం', 'దేవుని పుట్టుపూర్వోత్తరాలు' విషయాలనుంచి, కాలేకడుపుకు రెండు ముద్దలకూడు, సాంఘిక తిరస్కృతులకు సమానగౌరవం ఎలా లభించగలదు అనే విషయాలవరకూ ప్రతి ఒక్కటీ "సంఘం"లో స్థానం సంపాదించుకుంది. దాదాపు 'సంఘం' సంపుటాలలో ప్రస్తావించబడని

సంగతిలేదు. ఒక్కమాటలో 'సంఘం' నాస్తిక విజ్ఞానకోశము, 'సంఘం' ప్రధాన రచయితలు గోరా, లవణం, ఇతర కార్యకర్తలు కూడా చాలా మంది తమ తమ భావాలు, అనుభవాలు 'సంఘ' ద్వారా ప్రజలకు తెలిపారు. 'సంఘం' రచయితలెవరూ సరదాకొరకో, స్వీయ సంతృప్తికొరకో వ్రాయలేదు. ప్రతీ రచయిత ప్రతీ రచనను ఒక ఉద్దేశ్యంతో వ్రాశారు. ఆ ఉద్దేశంలో ఏకొంతైనా తాను ఆచరించాడు. ఇది 'సంఘం' ప్రత్యేకత. అందుకే "సంఘం" ఎంతోమందిలో జిజ్ఞాసను, తత్వ శోధననూ పురిగొల్పితే, మరెంతమందినో కార్యకర్తలుగా తయారుచేసింది.

1941లో ప్రచురించిన "నాస్తికత్వమూ పుస్తకములో నాస్తికత్వమును స్థూలంగా ప్రతిపాదించగా, "సంఘం" పత్రికలో నాస్తికత్వాన్ని వివిధ కోణాలనుంచి, వివిధ రంగాలు, వివిధ విషయాల సందర్భంతో సూక్ష్మంగా చర్చించి వివరించారు.

గోరా రచించిన "దేవుని పుట్టుపూర్వోత్తరాలు", "సృష్టి రహస్యం", రాజ్యము - రాజకీయము", "డబ్బు....డబ్బు... డబ్బు...", "నేను నాస్తికుణ్ణి", "నాస్తికదృష్టిలో" మొదలైన వ్యాసావళులు, శ్రీమతి సరస్వతి వ్రాసిన "స్వీయ జీవిత కథా చిత్రణ, " శ్రీ ఊట్ల కొండయ్య వ్రాసిన "మనలో ఉండవలసిన మర్యాదలు," శ్రీ లవణంగారు వ్రాసిన "నాస్తికత్వం అంటే - " అనే వ్యాసావళులు ప్రత్యేకంగా పేర్కొనదగినవి. నాస్తికత్వం గురించి షెల్లీ, బ్రాడ్లా, రస్సెల్ మొదలైనవారి అభిప్రాయాలనూ ప్రచురించారు. "సంఘం" పత్రికలో ప్రశ్నోత్తరాలది అగ్రస్థానం. "మనుష్యులు నగ్నంగా ఎందుకు ఉండకూడదు?" అనే ప్రశ్న దగ్గరనుంచీ పాఠకులు పంపే రకరకాలైన ప్రశ్నలకు గోరా చాలా చక్కగా సమాధానాలిచ్చారు. ఈ సమాధాలాన్నీ ఎంతో వివరంగా హుందాగా సీరియస్‌గా ఉంటాయి. కొన్ని వందల ప్రశ్నలకు ఇలా సమాధానాలు ఇవ్వబడ్డాయి. "సంఘం" లో ప్రశ్నోత్తరాలు శీర్షిక చదువుతున్నప్పుడు తన పత్రికలలో గాంధీజీ నిర్వహించిన 'Question Box' శీర్షిక తలుపుకు వస్తుంది. "సంఘం" సంపాదకీయాలు సామయిక సమస్యలను చర్చించినా వాటివెనుకనున్న మూలసమస్యలను, పునాది విషయాలను తీసుకున్నాయి. నాస్తికదృష్టితో రాజకీయవిధానం పార్టీలులేని ప్రజాస్వామ్యంగా ఉండగలదనీ, ఆర్థిక విధానం వికేంద్రీకరణతో కూడిన గ్రామ కాగలదనీ సంపాదకీయాలలో సవివరంగా చర్చించారు.

'సంఘం' ప్రతీ అన్యాయాన్నీ అతి తీవ్రంగా ఖండించింది. ఎవరిలో మంచి ఉన్నా ప్రశంసించింది. ఒక పక్క కమ్యూనిష్టుల విధానాలను విమర్శిస్తూనే, మరియొక్క ప్రక్క వారి త్యాగాన్నీ, సదాశయాన్ని శ్లాఘించింది. అలాగే అన్ని సందర్భాలలోనూ, కాటూరు-ఎలమర్రు గ్రామాలలో ప్రజలను నగ్నంగా చేసి నడిబజారులలో ఊరేగింపజేసిన పోలీసు కుకృత్యాలను ఎంత తీవ్రంగా గర్హించిందో అంత తీవ్రంగానూ

మంత్రుల అధిక జీతభత్యాలను, ఆడంబరాలను, పార్టీతత్వాన్ని నిరసించింది. అలాగే ఆస్తికత్వం పేరుతో జరిగే మోసాలను బట్టబయలుచేసి ఖండించింది. కేవలం విమర్శలతో 'సంఘం' ఊరుకోలేదు. నిర్మాణాత్మకమైన సూచనలు చేసింది.

'సంఘం' పత్రిక నాస్తిక తత్వశాస్త్రాన్నీ, నాస్తికదృక్పథాన్నీ, ప్రచారం చేయుటేకాక, కుల-మతరహిత సమాజనిర్మాణానికి ఒక సాంఘిక ఉద్యమాన్నీ, ప్రజాస్వామ్యం సక్రమంగా నెరవేరాలంటే పౌరచైతన్యం అభివృద్ధికావాలనే రాజకీయ ఉద్యమాన్ని నిర్మించింది. మరోమాటలో చెప్పాలంటే సాంఘిక, రాజకీయరంగాలలోనికి నాస్తిక దృక్పథాన్ని ప్రభావయుతంగా ప్రవేశపెట్టింది.

1953 వరకూ 5 సంవత్సరాలు "సంఘం" పత్రిక నడచిన తర్వాత 'సంఘం' ప్రచారం చేసిన విషయాలు ఉద్యమరూపం తీసుకుంటున్నప్పుడు గోరా పూర్తిగా కార్యక్రమాలకే తన సమయాన్ని వినియోగించుటకు వీలుగా 'సంఘం' పత్రిక నిలిపివేయబడింది. అయితే, ఆ ఉద్యమ ప్రచారానికిగాను 'ఆర్థికసమత' అను వారపత్రిక శ్రీయుతులు లవణం, జొన్నలగడ్డ రామలింగయ్య, యం.వి. సుబ్బారెడ్డి సంపాదకవర్గంగా ప్రారంభింపబడింది. 'ఆర్థిక సమత' కూడా చాలావరకూ 'సంఘం' వేసిన బాటలలోనే సాగింది. 1953 నుంచి ఐదు సంవత్సరాల కాలం 1958 వరకూ 'ఆర్థికసమత' నడిచింది. శ్రీ లవణంకూడా దేశవ్యాపిత పర్యటనలు, కార్యక్రమాలు తీసుకొనుటతో 'ఆర్థికసమత'ను 1958లో నిలుపుచేశారు. 'ఆర్థికసమత' ప్రధానంగా రాజకీయ కార్యక్రమాల ఆచరణను ప్రచారం చేసిందని చెప్పవచ్చు.

"సంఘం", "ఆర్థికసమత" రెండు కూడా తెలుగు పత్రికలే అయిపోవడంతో నాస్తికత్వం, గోరాభావాలు దేశమంతటా వ్యాపించుటకు అవకాశం లేకపోయింది. ఆ లోటును తీర్చుటకు పటమట నాస్తికకేంద్రం నుంచి "ఇన్‌సాన్" అనేపేరుతో హిందీలో ఒక మాసపత్రికను 1957 నవంబరునుంచి మూడున్నర సంవత్సరాలపాటు "సంఘం" పంథాలోనే నడిపారు. ఈ హిందీ పత్రికకు శ్రీ లవణం, శ్రీ నాగేశ్వర్ సంపాదకులు. ఉత్తర భారతదేశంలో నాస్తికభావాలవ్యాప్తికి "ఇన్‌సాన్" గణనీయమైన కృషి చేసింది. అయితే విజయవాడనుంచి హిందీలో పత్రిక నడపడం ఆర్థికంగా చాలా నష్టం కలిగించగా 'ఇన్‌సాన్' ప్రచురణ నిలిపివేయవలసివచ్చింది.

"సంఘం" పత్రిక సాధించిన విజయాలలో చెప్పుకోదగిన మరొక విజయం 1951 జూన్‌లో కడపజిల్లా ప్రొద్దుటూరులో "సంఘం" పాఠక సమితి ఏర్పడటం. "సంఘం" పాఠకులు సమితిగా ఏర్పడి పత్రిక ప్రచారాన్నే కాక, సహపంక్తి భోజనాలు వంటి కార్యక్రమాలను కూడా నిర్వహించారు. అంతేకాక, ఈ పాఠక సమితి

నాస్తికోద్యమానికి, నాస్తిక దృష్టితో సాగుచున్న సాంఘిక, రాజకీయ కార్యక్రమాలకు బలమైన దన్నుగా నిలిచింది. 'ఆర్థికసమత' పత్రిక ఆగిపోయింది. తర్వాత తెలుగులో మరల పత్రిక కావాలనే పట్టుదలతో ఈ సమితిలోని మిత్రులు ఆర్థిక బాధ్యతను వహించి, ప్రొద్దుటూరు నుంచి "సంఘం" ప్రచురణను 1960 నవంబరునుంచి శ్రీలవణం సంపాదకులుగాను, శ్రీ.సి. రంగప్ప ప్రచురణకర్తగానూ తిరిగి ప్రారంభించారు. శ్రీ లవణం 1966లో అమెరికావెళ్ళిన అనంతరం నాలుగు సంచికలు తెచ్చి ఆపైన నిలిపివేశారు. "దేవుని పుట్టుపూరోత్తరాలు" పుస్తకం తొలి ముద్రణను ప్రొద్దుటూరు "సంఘం" పాఠకసమితివారే ప్రచురించారు.

ఈ విధంగా ఎన్నో నిర్బంధాలు, బహిష్కరణలు మధ్య గోరాలో వుదయించి, పెరిగిన నాస్తికభావాలు పూర్తిగా సమాజం ముందుకు వచ్చుటకు "సంఘం" పత్రిక సాధనమైంది.

# ఆర్థికసమతా ఉద్యమం

గాంధీజీ నాయకత్వంలో బ్రిటీషు సామ్రాజ్యవాదంతో పోరాడి 1947 ఆగష్టు 15న మనం స్వతంత్రుల మైనప్పుడు దేశప్రజలందరూ ఎంతో ఆశతో ఎదురు చూచారు/ ఫలితాల కొరకు. ప్రపంచమంతా భారతదేశంనుంచి నూతననాయకత్వాన్ని ఆశించింది. దేశవిభజనవల్ల స్వాతంత్ర్యం తనతోపాటు ఎన్నో సమస్యలు తీసుకొనివచ్చినమాట వాస్తవమే. అయినా జాతీయనాయకులు ప్రజల ఆశలకు విరుద్ధంగా సంకుచిత పార్టీతత్వంలోనికి, ధనికతత్వపు ఆడంబరాలలోనికి దిగజారిపోవడం జాతి అభ్యుదయానికి పెద్ద ఆటంకమైనది.

స్వతంత్ర భారత ప్రభుత్వములో మంత్రులు ఎలా ఉండాలి? గవర్నర్లు ఎలా ఉండాలి? ప్రభుత్వం ఎలా వ్యవహరించాలి? ఓటర్లు జాగరూకతతో ఎలా మెలగాలి అనే విషయమై గాంధీజీ ముందునుంచే హెచ్చరించారు. మంత్రులు, గవర్నర్లు ప్రజల సేవకులనే విషయాన్ని మరువరాదనీ, ప్రజాసేవకులుగా వారు ప్రజలకు సన్నిహితులుగా ఉండుటకుగాను సామాన్యమైన చిన్న ఇండ్లలోనే నివసించాలనీ, నెలకు రూ.500 కంటే ఎక్కువ తీసుకోరాదనీ, మరీ అవసరం అయితే తప్ప కార్లు వాడరాదనీ, గాంధీజీ సూచించారు. వైస్రాయి భవనాన్ని ఒక వ్యక్తి నివాసంగా చేయవద్దనీ, ప్రజలందరికీ ఉపయోగపడే సార్వజనిక సంస్థకు నిలయం చేయమని గాంధీజీ కోరారు. దేశానికి స్వరాజ్యం రావడంతో కేవలం రాజకీయ సమానత్వం మాత్రమే సాధించామనీ, ఇంకా సాంఘిక-ఆర్థిక సమానత్వాలు సాధించాలనీ అందుకుగాను మరింత అధికంగా త్యాగాలు చేయాలనీ గాంధీజీ ఉద్బోధించారు. రాజకీయ స్వాతంత్ర్యం సంపాదించుటతో కాంగ్రెసు అవసరం తీరిపోయిందనీ, కనుక దానిని రద్దుచేయమనీ గాంధీజీ స్పష్టంగా

వ్రాశారు. గాంధీజీ అనుయాయులుగా ప్రభుత్వంలోనికి వచ్చినవారు ఇవి ఏవీ చేయలేదు. సరిగదా, అన్నీ విరుద్ధంగా చేశారు.

స్వాతంత్ర్యం వచ్చిన ఆరునెలలలోపలే మతదురహంకారం గాంధీజీని పొట్టబెట్టుకుంటే, అలాకాక గాంధీజీ జీవించిఉంటే ఈ సమస్యలను ఎలా పరిష్కరించి ఉండేవారు అనేది ఇప్పుడు మనం ఊహించలేము.

గాంధీజీ హత్యానంతరం ఒకటిమాత్రం జరిగింది. దేశ స్వాతంత్ర్యం కొరకు ఐక్యంగా కలిసి కృషి చేసినవారు ప్రభుత్వాధికారంలోనికి వెళ్ళినవారికి, నిర్మాణ కార్యక్రమంలో సంబంధం లేకుండానూ, నిర్మాణ కార్యక్రమంలో ఉన్నవారికి రాజకీయదృష్టి లేకుండానూ చీలిపోయారు. దీనితో రాజకీయాధికారంలో ఉన్నవారు నిర్మాణ కార్యకర్తలకు గ్రాంట్ల రూపంలో ఆర్థికసహాయం చేయడం మినహా, ఇద్దరిమధ్యా మరే సంబంధాలు లేకుండా పోయాయి. రాను రాను రాజకీయాలలో ఉన్నవారికి పార్టీతత్వం ప్రబలిపోయింది. 1948 మార్చిలోనే నిర్మాణకార్యకర్తలు సమావేశమై 'సర్వోదయ సమాజ్' ను ఏర్పర్చి ప్రతీ సంవత్సరం ఒకసారి కలుసుకుంటున్నా, ఒకరి కష్టసుఖాలు మరొకరు వినడంకంటే మరేమీలేదు.

దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తరువాత అంతవరకూ జాతీయ సంస్థగా ఉన్న కాంగ్రెసు పార్టీగా మారిపోవడంతో గోరా కాంగ్రెసులో పావలాసభ్యత్వాన్ని కూడా వదులుకున్నారు. గోరా ప్రముఖ నిర్మాణ కార్యకర్తగా గుర్తింపబడినప్పటికీ, ఇతర నిర్మాణ కార్యకర్తలు రాజకీయ దృష్టినివదులుకున్నారు; గోరా రాజకీయదృష్టిని మరింతతీవ్రం చేసుకున్నారు. "ప్రజాప్రతినిధులు తమ కర్తవ్యాన్ని నెరవేర్చునట్లు చూచుటే ప్రజాస్వామ్యంలో ప్రజల ప్రథమ కర్తవ్యము" అనేది గోరా రాజకీయదృష్టి.

గోరా ఈ విషయమై ఆలోచించసాగారు. హింసాయుతంగా స్వాతంత్ర్యం పొందిన దేశాలలో హింసాయుత సమరంవల్ల పాతవ్యవస్థ సమూలంగా నాశనమైపోతుంది. అంతేకాకుండా హింసలో ద్వేషం ఉండడం వల్ల పాత వ్యవస్థలో బాధ్యులైన వారిని చంపివేయడమో, నిర్బంధించి శిక్షించడమో జరుగుతుంది. కనుక వ్యవస్థను తిరిగి సరిక్రొత్తగా తమభావాలకు, ఆశయాలకు అనుగుణంగా నిర్మించుకుంటారు. ఫ్రాన్సులో అంతే జరిగింది రష్యా, చైనాలలో అంతే జరిగింది. సైనికవిప్లవాలు జరిగినచోట్ల అలాగే చేశారు. కాని అహింసాయుతంగా మనం స్వరాజ్యం సంపాదించుకొనుటతో పరిపాలనా యంత్రాంగం, పరిపాలకుల అవకాశాలు యదాతథంగా సంక్రమించాయి. అందుచేత వాటిని బుద్ధిపూర్వకంగా మార్చవలసిన బాధ్యత కాంగ్రెసు నాయకులపై ఉండెను. గాంధీజీ తాను చేసిన సూచనలలో ఈ విషయాన్నే నొక్కిచెప్పారు. కాని

అధికారంలోనికి వెళ్ళినవారు దీనిని పూర్తిగా విస్మరించారు. సామ్రాజ్యవాదులు విడిచి వెళ్ళిన బూట్లల్లో వీరు తమ కాళ్ళు పెట్టారు. పాతవైస్రాయి భవనాన్ని రాష్ట్రపతి భవనం అని పేరుమార్చి అందు స్వతంత్ర భారత రాష్ట్రపతి నివాసముంటున్నారు. ఆ బ్రిటీష్ సామ్రాజ్యవాదుల కాలంనాటిఆడంబరాలు, అలవాట్లు రాష్ట్రపతి భవనాన్ని, రాష్ట్రపతిని అంటుకుని అలాగే ఉన్నాయి. ఇదేవిధంగా బ్రిటీష్‌కాలపు గవర్నర్ల నివాసాలలో ఆ ఆడంబరాలు, ఆ రక్షణ ఏర్పాట్లు, ప్రజలకు దూరంగా ఉండే ఈ విధానాల్లోనే నేటి మన గవర్నర్లూ ఉంటున్నారు. అలాగే మంత్రులూను, ప్రజలను కొల్లగొట్టి తమ డాబు-దర్పాలను ప్రదర్శించి, ఆడంబరాలు, ఆర్భాటాలు, పోలీసుల రక్షణలూ పెట్టుకుని బ్రిటీష్ ప్రభుత్వకాలపు పాలకులు ప్రజలకు దూరంగా ఉండటంలోనే ఘనతను ఆపాదించుకున్నారు. యథాతథంగా వచ్చిన ఆ ఉక్కుచట్రాన్ని స్వీకరించి, దానిని మార్చకుండా అందులో భాగమైపోయి వాటిని అనుభవిస్తున్న నేటి పరిపాలకులు మాటలలోనే స్వరాజ్యం, ప్రజారాజ్యం గాని, చేతలలో ధనికతత్వపు విధానాలలో కొట్టుకుపోతున్నారు. అలాంటప్పుడు ప్రజల సమస్యలు ఎలా పరిష్కారమౌతాయి? చైతన్యవంతులైన పౌరులు ఈ విషయాలను ప్రజలముందు పెట్టాలి. బ్రిటిష్ పాలకును ఈ దేశంనుంచి వెళ్ళగొట్టుటకు సత్యాగ్రహం చేసినట్లే, బ్రిటిష్‌కాలపునాటి విధానాలను, ఆడంబరాలను కూడా వెళ్ళగొట్టుటకు అవసరమైతే సత్యాగ్రహం సాగించాలి.

ఒకప్రక్క గోరా ఇలా ఆలోచిస్తూ రెండవప్రక్క రాజకీయ స్వాతంత్ర్యం ఆర్థిక సమానత్వానికి దారితీయాలని తీవ్రంగా ప్రచారం ప్రారంభించారు. అలా జరగకపోతే వచ్చిన రాజకీయ స్వాతంత్ర్యాన్ని కొద్దిమంది ముఠాదారులు తమగుప్పిట్లో పెట్టుకుని దేశంలోని ఆర్థికావశాలను తామే వినియోగించుకుంటారు. అప్పుడు స్వాతంత్ర్యం వచ్చిందన్న మాటేగాని ఎక్కువమందిని కొద్దిమంది ఆర్థికంగా దోచుకోవడం ఆగదు. దారిద్ర్యం తొలగదు, సిగ్గుచేటైన విషయం ఏమంటే ఆర్థిక సమానత్వం కావాలన్న ప్రతిఒక్కరినీ కాంగ్రెసువారు ఆనాడు కమ్యూనిస్టులనడం ప్రారంభించారు. ఒక్క కమ్యూనిస్టులే ఆర్థిక సమానతను కోరుతున్నట్లు,? కాంగ్రెసువారు ఆర్థిక అసమానతలు నిలుపదలచినట్లూ, గాంధేయ ఆర్థికశాస్త్రవేత్త శ్రీ.జె.సి. కుమారప్పనే కమ్యూనిస్టు అని చిత్రించుటకు ప్రయత్నించిన అభివృద్ధినిరోధక కాంగ్రెసువాదులు, బాహాటంగా గోరాగారిని కమ్యూనిష్టులు అని ప్రచారం చేశారంటే ఆశ్చర్యమేముంది? 1950-51 లో కమ్యూనిష్టులు అజ్ఞాతవాసంగా ఉంటున్న రోజులలో పోలీసులు నాస్తికకేంద్రాన్ని, 'సంఘం' కార్యాలయాన్ని రెండుసార్లు సోదాచేశారు. రహస్యానికి తావులేని గోరావద్ద ఏమి దొరుకుతుంది.

1949 నుంచీ కూడా గోరా గాంధీజీ 'నిర్మాణ కార్యక్రమము'లో '13వ సూత్రంగా ఆర్థికసమానత గురించి ఏమి వ్రాశారో కాంగ్రెసువాదులకు, దేశప్రజలకు కూడా జ్ఞాపకంచేయ నారంభిచారు. 1941లోనే గాంధీజీ 'నిర్మాణ కార్యక్రమం' పుస్తకాన్ని రచించారు. అప్పుడు అందు 13 అంశాలు వ్రాశారు మత సామరస్యం, అస్పృశ్యతా నిర్మూలన, మద్యపాన నిషేధం, ఖాదీ, ఇతర గ్రామపరిశ్రమలు, గ్రామ పారిశుధ్యం, నవీనవిద్య, వయోజన విద్య, స్త్రీలు, ఆరోగ్య నియమాల శిక్షణ, ప్రాంతీయ భాషలు రాష్ట్రభాష, ఆర్థిక సమానత.

13వ అంశమగు 'ఆర్థిక సమానత' శీర్షిక క్రింద మొదటి పేరాలో గాంధీజీ ఇలా వ్రాశారు "అహింసాయుత స్వరాజ్యమునకు ఆర్థిక సమానత మూల సూత్రము. ఆర్థిక సమానతకై కృషిచేయుట అనగా యజమానులకు కూలీలకు మధ్యగల నిరంతర పోరాటాన్ని నిర్మూలించుట. ఒక వైపు దేశముయొక్క ఆర్థిక సంపదను గుప్పిట్లో పెట్టుకున్న కొద్దిమంది ధనికులను క్రిందకు దింపి, మరి యొకవైపు అర్ధాకలితో వస్త్రవిహీనులైవున్న లక్షలాది ప్రజలను పైకిలేవనెత్తుటే ఆర్థిక సమానత యొక్క అర్థం. ఆకలితో అలమటించే ప్రజానీకానికి, ధనికులకు మధ్య పెద్దతేడా ఉన్నంతవరకూ అహింసతో కూడుకున్న ప్రభుత్వం ఏర్పడుట నిస్సందేహంగా అసాధ్యమైన విషయం. ధనికులూ పేదలూ సమాన ఆధిక్యతలు అనుభవించు స్వతంత్ర భారతదేశంలో ఢిల్లీలోని రాజభవనములకు, వాటి ప్రక్కనే ఉన్న పేదల కూలిపోయే గుడిశెలకు మధ్యగల తేడా ఒక్క నిముషమైనను నిలువలేదు. ధనమును, దానివల్లవచ్చు ఆధిక్యతలను ఐచ్ఛికంగా వదలివేసి, సామాజిక సౌఖ్యంలో సమభాగులు కాకపోతే, దౌర్జన్యం, రక్తపాతంతో కూడిన విప్లవం ఏదో ఒక రోజున తప్పదు."

ఇది గాంధీజీ 1941లో వ్రాశారు. గాంధీజీ ఆశించిన స్వతంత్ర భారతదేశం అది. ఐచ్ఛికంగా ధనాన్ని, ఆధిక్యతలనూ వదులుకోమన్నారాయన. కాని మంత్రులు, గవర్నర్లు, రాష్ట్రపతి అయినవారు సామ్రాజ్యవాద విధానాలనుకూడా ఐచ్ఛికంగా వదులుకోలేదు. అహింసాయుత స్వరాజ్యమునకు ఆర్థికసమానత మూల సూత్రము అని కూడా ఆయన చెప్పారు.

(1941 లో వ్రాసిన 13 అంశాలకు అదనంగా రైతులు, కార్మికులు, ఆదివాసులు, కుష్ఠురోగులసేవ, విద్యార్థులు, 5 అంశాలను చేర్చి మొత్తం 18 అంశాలుగా 1945లో 'నిర్మాణ కార్యక్రమం' పుస్తకాన్ని ప్రచురించారు)

భారతదేశం మొత్తం మీద గాంధీజీనిర్మాణ కార్యక్రమంలోని 13వ సూత్రమగు ఆర్థిక సమానతను విరివిగా ప్రచారం చేసింది గోరాయే. అంతేకాదు, ఆర్థిక సమానత

ఆవశ్యకతను నొక్కిచెబుతూ, మంత్రులు ఐచ్ఛికంగా తమ జీతభత్యాలు, ఆడంబరాలు తగ్గించుకోవాలని కోరుతూ ఉద్యమం కొనసాగించుటకుగాను గోరా నెలకొల్పిన సమాజానికి "గాంధీ సంఘం" అనే పేరు పెట్టారు. 1951 మార్చి 3,4 తేదీలలో కృష్ణాజిల్లా గుడివాడ పట్టణంలో గోరా అధ్యక్షతన గాంధీ సంఘం మహాసభలు జరిగాయి. ఆంధ్రదేశంలోని పలుప్రాంతాలనుంచేకాక తమిళనాడు నుంచి కూడా ఈ సభలకు ప్రతినిధులు వచ్చారు.

ఈ సభలలో గోరా ఇచ్చిన అధ్యక్షోపన్యాసము కారుచీకటిలో కాంతిరేఖవలె నైరాశ్యంతో ఉన్న కార్యకర్తలకు ఒక వెలుగుబాటను, నూతన మార్గాన్ని చూపింది. ఆ ఉపన్యాసంలో గోరా వయోజనవోటు హక్కును రాజ్యాంగంలో రూపొందించుట ద్వారా రాజకీయసమానత్వం సాధించామనీ, దీనిని ఆధారం చేసుకుని ఆర్థిక సమానత్వం సాధించాలనీ, అందరికీ కూడు-గుడ్డ- వృత్తినిచ్చే ప్రభుత్వ విధానాన్ని ఏర్పరచాలనీ, నియంతృత్వం లేదా వర్గసంఘర్షణద్వారా దీనిని ఏర్పరిస్తే వచ్చే నష్టాలను వివరించి అహింసాయుతంగానే ఏర్పరచాలనీ, శాశ్వతంగా ఆర్థిక సమానత సాధనకు గ్రామరాజ్య విధానం అమలుజరపాలనీ, అయితే ఆ దృష్టితో ప్రభుత్వం పనిచేయాలంటే ప్రజాస్వామ్యంలో శాసన సభ్యులపై వత్తిడి తేవాలని సూచించారు. ఆ ఉపన్యాసంలో చివర పేర్కొన్న విషయానికి చెందిన భాగాలు ఇలా ఉన్నాయి:

"ఆర్థిక సమానత్వము, రాజకీయ చైతన్యము, ప్రజాస్వామిక విధానముల యొక్క విశిష్టతను మనము గ్రహించినట్లయితే ప్రభుత్వం ద్వారా ప్రజాస్వామిక విధానంతో ఆర్థిక సమానతను సాధించుటకు మన కార్యక్రమం ఏమిటి?

"ప్రజాస్వామిక మనగా ఐదేళ్ళకొకసారి వచ్చు ఎన్నికలకై వేచియుండుటకాదు. ఎన్నికల వలన ప్రతినిధులుగా ఉన్న వ్యక్తులు మారవచ్చు. అంతమాత్రమున ప్రభుత్వం మారదు. ప్రభుత్వవిధానం మారవలెనంటే శాసనసభ్యులు దీక్షతో కృషిచేయవలెను. మనం ఒకసారి ఎన్నుకుని మరల మన ప్రతినిధుల యెడల శ్రద్ధ తీసుకొనకపోతే మన ప్రతినిధులు స్వార్థంలోనికి దిగజారిపోవుటకు అవకాశములు హెచ్చుగా ఉండును. అందులోనూ, వ్యక్తిగత ఆస్తులు, ఆర్థిక అసమానతలుఉన్న ఈ రోజులలో మన ప్రతినిధులగు శాసనసభ్యులు బాధ్యతారహితులగుటకు వ్యామోహములు హెచ్చుగా ఉండును. వారిని ఒకమాటు ఎన్నుకొని మళ్ళా ఎన్నికల వరకూ మనం వదిలిపెడితే అది మనదేతప్పు. మన ప్రజాస్వామిక హక్కులను మనం జారవిడచినవారం అగుదుము.

"అట్లుకాక, మనం ప్రజాస్వామికమును సక్రమంగా అమలుజరుపుకోవలెనంటే మనం ఎన్నికల వరకూ ఆగనవసరంలేదు. మనము ఆర్థిక సమానత్వము కావలెనని ప్రణాళికను తయారుచేసి ప్రతి నియోజకవర్గములోను బహిరంగ సమావేశములు జరిపి, ఆ సభలకు ఆయా శాసనసభ్యులను ఆహ్వానించి మన అవసరములను వారికి తెలియజెప్పి వాటికి తగు శాసనములు చేయమని మనం వారిని కోరవలెను. ఇది మన కార్యక్రమం.

"మనం ఎన్నికల వరకు ఆగనక్కరలేదు. ఎన్నికలు ఎప్పుడు జరిగినాసరే, అందులో ఎవరు ఎన్నుకోబడినాసరే, ఎప్పటికప్పుడు మన ప్రతినిధిగా శాసనసభలో ఉన్నవారు నెరవేర్చవలసిన ప్రణాళిక మాత్రం ఇది. ఏ శాసనసభ్యుడైనా ప్రజలను నిర్లక్ష్యం చేయలేడు. అందరు శాసనసభ్యులు అందరి ప్రజలను నిర్లక్ష్యం చేయలేడు. అందరు శాసనసభ్యులు అందరి ప్రజలకు ప్రాతినిధ్యం వహించి ఉన్నారు. మంత్రులు కూడా మన ప్రతినిధులే. మన సమిష్టి కోర్కెలను వారు మన్నించితీరవలెను. మనకు ఏ కష్టము వచ్చినను ధనికలు, పేదలు అంటూ మనలో మనం తగాయిదాలు పడినా, ఈ కులం-ఆ కులం, ఈ వృత్తి, ఆ వృత్తి అంటూ పోటీలు పడినా ఏమీ కార్యంలేదు. లంచగొండులు-పక్షపాతులు అంటూ ఉద్యోగస్తులను నిందించినా కార్యంలేదు. ధనికులు, పేదలు, ప్రభుత్వ ఉద్యోగస్తులు - అందరియొక్క ప్రవర్తనా పద్ధతి నిర్ణయించేది విధానం. ఆ ప్రభుత్వ విధానాన్ని తీర్చిదిద్దేది శాసనసభ్యులు. ఆ శాసనసభ్యులకు ప్రణాళికలిచ్చి అమలు జరిపించుకునే హక్కు మనకుంది. అందుచేత మనం శాసనసభ్యులమీద వత్తిడితెస్తే లంచగొండితనం, బ్లాక్‌మార్కెట్ ఆహారకొరత-అన్ని సమస్యలూ ఒక్కసారి తీరిపోతాయి. మనకు ఏ సమస్య వచ్చినా శాసనసభ్యులపై వత్తిడి తేవలసిందే. అసలు కీలకం అంతా అక్కడ ఉంది.

"ఇంత వరకూ శాసనసభ్యులను ముట్టుకోకుండా మనలో మనం తగాయిదాలు పెట్టుకున్నాం. కనుక శాసనసభ్యులు, మంత్రులు విలాసాలవైపు పోతున్నారు. ముఠా రాజకీయాలను ప్రవేశపెట్టి పదవులకై పోటీపడుతున్నారు. మన వత్తిడి వారిమీద లేదు కనుక ఆ పదవులు బాధ్యతలేని అధికారాలుగా పరిణమిస్తున్నాయి. పరిపాలన సక్రమంగా జరగక చాలా అవకతవకలు దేశంలో ఏర్పడుతున్నాయి. వీటిని సరిదిద్దాలంటే శాసనసభ్యుల మీద వత్తిడి ఒక్కటే సరియైన మార్గము. అది మన కర్తవ్యము. మన హక్కు.

"గాంధీ సంఘం" మహాసభలు చేసిన తీర్మానాలలో ఒకటి ప్రజా ప్రతినిధులందరూ (మంత్రులతోసహా) తమ జీతభత్యాలు సామాన్యుని సగటు ఆదాయంతో సరిపోయేటట్లు

తగ్గించుకుని, వారు రైలులో మూడవ తరగతిలోనే* ప్రయాణం చేయాలనీ కోరింది. ఈ త్యాగం ప్రభుత్వ విధానంలో ప్రజాప్రతినిధులు ప్రవేశపెట్టబోవు మార్పులకు సూచన కాగలదు.

తమిళనాడులోనూ, మహారాష్ట్రలోనూ, ఉత్తరప్రదేశ్‌లోనూ గాంధీ సంఘం శాఖలు ఏర్పడ్డాయి. ఆర్థిక సమానత్వమునకై ప్రభుత్వము కృషి చేయుననుటకు సూచనగా మంత్రులు, శాసనసభ్యులు జీతభత్యములు తగ్గించుకొనాలనీ, మూడవ తరగతిలోనే ప్రయాణంచేయాలనీ ప్రచారం కొనసాగించారు.

ఇంతలో 1952 లో మొదటి జనరల్ ఎన్నికలువచ్చాయి. "శాసన సభ్యులు త్యాగం చెయ్యాలని మీరంటున్నారుగాని, మీరే ఎన్నికైతే అలా చేయగలరా? అని ప్రజలు అడగడం సహజం. అందుచేత విజయవాడ పార్లమెంటరీ నియోజకవర్గం నుంచి గోరా గాంధీ సంఘం ఆశయాదర్శాలతో పార్లమెంటుకు పోటీ చేశారు. అలాగే సూర్యాపేట అసెంబ్లీ నియోజకవర్గం నుంచి హైద్రాబాద్ అసెంబ్లీకి శ్రీ రెడ్డి పెదవెంకటరెడ్డి (రెవె) పోటీచేశారు. వీరు ఎన్నికల ప్రచారవిధానాలలో విప్లవం తీసుకువచ్చారు. ప్రజాప్రతినిధిగా ఎన్నికగుటకు ఎక్కువడబ్బు ఖర్చుపెటితే, అతను ఎన్నికైతే ప్రజా ప్రతినిధిగా వచ్చే అధికారాలను దుర్వినియోగం చేసి తాను ఖర్చుచేసిన ధనం సంపాదించుకొనుటకు ప్రయత్నం చేస్తాడు. అందుచేత ఎన్నికలలో అభ్యర్థులచే డబ్బు ఖర్చు పెట్టనివ్వరాదు అని గోరా అన్నారు. ఒక దప్పు తీసుకుని కొందరు కార్యకర్తలతో గోరా నియోజకవర్గంలో కాలినడకన పర్యటించారు. దానివల్ల కొన్ని గ్రామాలు మాత్రమే వెళ్ళగలిగారు.

ప్రతీచోటా ప్రజాస్వామ్యంలో వోటరు కర్తవ్యాన్నీ బాధ్యతనీ వివరించి చెప్పేవారు. ఎవరునెగ్గినా వారిపై ప్రజలు అదుపు పెట్టాలన్నారు. ఎన్నికల సభలలో అభ్యర్థులను ప్రశ్నలే వేసి సమాధానాలు పొందాలన్నారు. తన సభలలో గోరా సభికులను ప్రశ్నలు వేయమని, సమాధానాలు చెప్పేవారు. ప్రతీసభలోనూ తన ఎన్నికల ఖర్చులకు గాను అణా, బేడ, పావలా, అర్ధరూపాయి, యిలా ప్రజల నుంచి విరాళాలు వసూలు చేసేవారు. తమ ప్రచారాన్ని అతి నిరాడంబరంగా, ఆదర్శవంతంగా చేయుటేకాక కామన్ ప్లాట్ ఫారంలు కూడా ఏర్పరిచారు. అంటే అభ్యర్థులందరూ ఒకే వేదిక మీద నుంచి తమ ప్రణాళికను, విషయాలను ప్రజలకు తెలియజెప్పడం, ప్రజల ప్రశ్నలకు

---

★ **ఆ రోజుల్లో మొదటితరగతి, రెండవ తరగతి, మూడవ తరగతి అని రైళ్లల్లో మూడు తరగతులుండేవి.**

అభ్యర్థులు జవాబులు చెప్పాలి. వీటిని మంగళగిరి, జగ్గయ్యపేట, సూర్యాపేటల్లో ఏర్పరిచారు.

గోరాగాని, వెంకటరెడ్డిగాని నెగ్గలేదు. ఎనిమిదిమంది అభ్యర్థులలో గోరా ఐదవవానిగా వోట్లు సంపాదించారు. అయితే గోరా ప్రజాస్వామ్యంలో ఎన్నికలలో అభ్యర్థులు ఆదర్శయుతంగా ఎలా ఉండాలి అనేది నిరూపించి చూపారు. ఈ విధంగా వందల కొద్దీ కార్యకర్తలు "ఏమైనా, ఏలాగైనా నెగ్గాలి" అనే వ్యామోహం లేకుండా ఎన్నికలలో పాల్గొంటే ప్రజల దృష్టి మార్చగలరు. గోరా డప్పు వేసుకుని ఎన్నికల ప్రచారానికి వెళ్ళడం గురించి నేటికి కూడా గ్రామాల్లో చెప్పుకుంటారు. ఎన్నికల్లో ఆదర్శయుతంగా కార్యకర్తలు పాల్గోని ప్రస్తుత విధానాన్ని మార్చకపోతే సంఘవ్యతిరేకశక్తులే రాజ్యం చేస్తాయి. అది నేడు నగ్నంగా కనబడుతోంది. 1952లో జరిగిన తొలి సాధారణ ఎన్నికలలోనే ఈ విషయాన్ని గుర్తించి గోరా తగు మార్గాన్ని చూపారు.

గుడివాడలో గాంధీ సంఘం మహాసభలు జరిగిన తర్వాత 1952 మే 30, 31 తేదీలలో పటమట నాస్తిక కేంద్రంలో గాంధీ సంఘం రెండవ మహాసభలు జరిగాయి. ఈ 14 మాసాలలోనూ దేశమంతటా గాంధీ సంఘం ఆశయాలు, కార్యక్రమాలు ప్రచారమై యుండట చేత ఈమారు సభలకు ఆంధ్రదేశం నుండే కాక తమిళనాడు, కేరళ, మహారాష్ట్ర, మధ్యప్రదేశ్, గుజరాత్, ఉత్తరప్రదేశ్, బెంగాలు ప్రాంతాల నుండి కూడా ప్రతినిధులు వచ్చారు.

దాదాపు 300 మంది ప్రతినిధులు వచ్చిన ఈ సభలకు శ్రీ జే.సి. కుమారప్ప అధ్యక్షత వహించారు. వచ్చిన వారిలో శ్రీయుతులు జి. రామచంద్రన్, టి. సెల్వరాజ్, మత్తయ్య, ప్రొఫెసర్ టి.కె. బంగ్, హెచ్.డి. కతానే, ప్రొఫెసర్ హరేకర్, సదాశివ గద్రే, వసంతనార్గోల్కర్, భవానీప్రసాద్ ఛటర్జీ, బాబ్ చిట్విల్లర్, శ్రీమతి జేరీ కృపలానీ, శ్రీయుతులు అయ్యదేవర కాళేశ్వరరావు, చెరుకువాడ వెంకట నరసింహం, వావిలాల గోపాలకృష్ణయ్య, కోదాటి నారాయణరావు మొదలైన వారు ఉన్నారు. గోరా సభా కార్యక్రమాలను నిర్వహించారు.

ఈ సభలలో దేశం ఆహారవిషయంలో స్వయంపోషకం కావాలంటే భూపునర్విభజన జరగాలనీ, పెద్ద భూస్వాముల నుంచి భూములు తీసుకునేటప్పుడు నష్టపరిహారం ఇవ్వరాదనీ, వీలైనంత త్వరలో ఇది జరగకపోతే ప్రభుత్వము పైనా భూస్వాములపైనా అహింసాయుతమైన వత్తిడి తీసుకుని రావాలని నిర్మాణ కార్యకర్తలకు,

సర్వోదయ సమాజానికి విజ్ఞప్తి చేశారు. మరో తీర్మానంలో దేశంలో అన్ని రంగాలలోనూ కనీస ఆదాయం రూ. 100 లుగానూ, గరిష్ట ఆదాయం అంతకు పదింతలుగానూ నిర్ణయించి ఆర్థిక అసమానతలు తగ్గించాలని కోరారు. 1953 మార్చి నెలాఖరుకు ఈ విషయమై ఏమీ జరగకపోతే సత్యాగ్రహం ప్రారంభించాలని నిర్ణయించారు. మూడవ తీర్మానంలో స్వదేశీని ప్రోత్సహించకపోతే దేశ ఆర్థిక వ్యవస్థలో తీవ్రపరిణామాలు తప్పవని ప్రభుత్వాన్ని హెచ్చరించారు. గాంధీసంఘం అనే పేరుకంటే ఆర్థిక సమతా ఉద్యమం పేరు ఉచితంగా ఉండగలదని నిశ్చయించి అఖిలభారత స్థాయిలో కుమారప్ప అధ్యక్షులుగా, గోరా కార్యదర్శిగా ఆర్థిక సమతామండలి నిర్మాణం జరిగింది.

1946 నుంచీ ప్రతీ సంవత్సరం సర్వోదయ సమాజ సభలకు గోరా హాజరవుతున్నారు. 1951 ఏప్రిల్‌లో హైద్రాబాదు వద్ద శివరాంపల్లిలో జరిగిన సర్వోదయ సమాజ సభల అనంతరం వినోబా తెలంగాణా పర్యటిస్తుండగా ఏప్రిల్ 18న పోచంపల్లిలో భూదాన ఉద్యమం ఆరంభమైంది. 1952 వరకూ వినోభా ఒక్కరే దానిని సాగించారు. 1952 లో కాశీవద్ద సేవాపురిలో జరిగిన సర్వోదయ సమాజ సభలలో దేశంలోని నిర్మాణ కార్యకర్తలకు ప్రతినిధి సంస్థ అయిన సర్వసేవా సంఘం భూదాన కార్యక్రమాన్ని చేపట్టి, అన్ని రాష్ట్రాలలో శాఖలు ఏర్పరిచి, వాటిద్వారా ఈ కార్యక్రమాన్ని కొనసాగించుటకు నిశ్చయమైంది. ఆంధ్రలో ఈ బాధ్యతను తీసుకోవలసినదిగా గోరాను కోరారు. కాని గోరా భూదాన కార్యక్రమంలో అప్పటికింకా సత్యాగ్రహాన్ని అంగీకరించకపోవుటచేతా, కేవలం దానదృష్టినే ప్రబోధించుటచేతా తానీ కార్యక్రమాన్ని చేపట్టజాలనని చెప్పారు. అయితే ఆంధ్రకు యోగ్యులైన వ్యక్తిని చూచి బాధ్యత అప్పగించేవరకూ తాను తాత్కాలిక కన్వీనరుగా ఉండగలనన్నారు. సేవాపురి సభల నుంచి తిరిగివచ్చి ఆంధ్రలోని నిర్మాణ కార్యకర్తలను సంప్రదించి శ్రీ ఎర్నేని సుబ్రహ్మణ్యంను ఆంధ్రలో భూదాన కన్వీనరుగా ఉండమని కోరారు. ఆయన అంగీకరించుటతో మే 30, 31 పటమటలో జరిగిన సభల సందర్భంలోనే సర్వసేవా సంఘం కార్యదర్శి శ్రీ శంకరరావుని ఆహ్వానించి, వారి సమక్షంలో తాను తాత్కాలికంగా తీసుకున్న బాధ్యతను గోరా శ్రీ సుబ్రహ్మణ్యంకి అప్పగించారు.

1952 మేలో జరిగిన సభల అనంతరం గోరా అవిభాజ్య మద్రాసు రాష్ట్రంలోని మంత్రులను, శాసనసభ్యులను కలుసుకుని ప్రజాప్రతినిధులు త్యాగం చేయవలసిన అవసరాన్ని వివరించారు. ఇలా ఒకప్రక్క ప్రజాప్రతినిధులను కలుసుకొని వివరించుటతోనూ మరొకప్రక్క ఈ విషయాలపై ప్రజలలో తీవ్రంగా ప్రచారం చేయుటతోనూ ఆ సంవత్సరం గడిచింది. అప్పుడు ఆంధ్రనుంచి మద్రాసు శాసనసభలో

సభ్యులుగా ఉన్న శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య, శ్రీ యం.వి. సుబ్బారెడ్డి గోరాతో ఏకీభవించి తామలా చేయగలమని చెప్పారు.

1953 మే 23, 24, 25 తేదీలలో తిరిగి పటమటలోనే ఆర్థిక సమతా ఉద్యమ మహాసభలు జరిగాయి. అందు ప్రజా ప్రతినిధులు, ముఖ్యంగా మంత్రులపై ప్రజావత్తిడి కార్యక్రమం ఆగస్టు 9 నుంచీ ప్రారంభించాలని నిర్ణయించారు. మంత్రులు తమ జీతభత్యాలు తగ్గించుకోవాలనీ, రైలులో మూడవ తరగతిలో ప్రయాణం చేయాలనీ ఎక్కడికక్కడ ప్రజలు డిమాండు చేయాలనీ విజయవాడ రైల్వేస్టేషను నుంచి మంత్రులు ప్రయాణించేటప్పుడు వారు మూడవ తరగతిలో ప్రయాణం చేయాలని కోరుతూ, మొదటి తరగతిలో ప్రయాణం చేసే కంపార్టుమెంటును పికెట్ చెయ్యాలనీ నిర్ణయించారు. ఈ సభలకు శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య, శ్రీ యం. వి. సుబ్బారెడ్డి హాజరై శాసనసభ్యులుగా తాము మూడవ తరగతి ప్రయాణపు ఖర్చులే తీసుకుంటామని ప్రతిజ్ఞ తీసుకున్నారు. తర్వాత వారు అలాగే చేశారు.

ఆగస్టు 9న రాష్ట్రంలో ఆర్థిక సమతా ఉద్యమకార్యకర్తలు, అభిమానులు ఉన్నచోట్ల సభలు జరిగాయి. మంత్రులపై ప్రజావత్తిడి అనే కార్యక్రమాన్ని విశదీకరించారు. విజయవాడలో నాటి నుంచి రోజూ "అందరికీ కూటికి హామీ" అని వ్రాయబడిన బ్యానరు, వివిధ రాజకీయ పార్టీల జండాలను ఒక కట్టగా కట్టి జండాల కట్టను తీసుకుని గోరా నాయకత్వంలో కార్యకర్తలు ఊరేగింపు జరుపుతూ రోడ్లు మూలల్లో ఎక్కడికక్కడ సభలు జరిపారు. వాటిలో ప్రజాస్వామ్యంలో ప్రజలు తమ ప్రతినిధులపై అజమాయిషీ చేయవలసిన అవసరాన్ని వివరించేవారు. ప్రజలందరూ కూడు గుడ్డా నిచ్చే వృత్తిని కల్పించవలసిన బాధ్యత గల మంత్రులు, అసలు విషయాన్ని వదిలి, అధిక జీతభత్యాలు, ఆడంబరాల్తో విలాసమయ జీవితాన్ని గడుపుతూ తమ పార్టీ, ముఠా ప్రయోజనాలకు గాను అధికారాన్ని దుర్వినియోగం చేయుటను విమర్శించేవారు. రాజకీయ పార్టీలన్నిటి ఆశయమూ అందరికీ కూడూ - గుడ్డా కల్పించుటే అయినప్పుడు ప్రజాప్రతినిధులు అందరూ కలిసి కృషిచేయకుండా పార్టీలుగా చీలిపోయి ఎవరికివారు అధికారానికై పోటీపడుట తప్పు అనీ, అందరూ కలిసి కృషి చేయాలని తెలుపుటకు అన్ని జండాలకట్ట ఒక చిహ్నం. ఇదంతా అందరికీ కొత్తగా ఉండేది. పార్టీ రాజకీయాలనే రాజకీయాలనుకునేవారికి పార్టీ రాజకీయాలు ప్రజాస్వామ్యంలో తగవని గోరా అంటే ఆశ్చర్యమే మరి. అందులోనూ అన్ని జండాలు కట్టగా కట్టి, ఆయా జండాలకు ప్రాతినిధ్యం వహించేవారిని కూడా కలిసి కట్టుగా కృషిచేయమని కోరుతున్నారు. గోరా తమ దళంతో ఈ విధంగా ఒక నెలరోజులు

విజయవాడలోని ప్రతీపేటా తిరిగి మూల, మూలల్లో కూడా ఉపన్యాసాలిచ్చారు. ఎన్నికలలో డప్పు వేసుకుని తిరిగినట్లే, జండాల కట్ట పుచ్చుకుని ప్రచారం చేయుట ప్రజలలో తీవ్రమైన ఆసక్తినీ, సంచలనాన్నీ కలిగించింది.

ఇంతలో 1953 అక్టోబరు 1న అవిభాజ్య మద్రాసు రాష్ట్రం నుండి విడిపోయి ప్రత్యేక ఆంధ్రరాష్ట్రం కర్నూలు రాజధానిగా ఏర్పడింది. ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రావతరణ ఆర్థిక సమతా ఉద్యమాభివృద్ధికి దోహదం చేసింది. ఎందుకంటే మంత్రులూ, గవర్నర్లూ తరచూ విజయవాడ మీదగానే వస్తూపోతూ ఉండాలి గదా.

1953 నవంబరు 5న ఆంధ్రరాష్ట్రం తొలిగవర్నరు తొలిగా విజయవాడ రానున్నారని తెలియగానే గోరా గవర్నరుకు ఒక ఉత్తరం వ్రాస్తూ విజయవాడ పేదలపేటలు కూడా దర్శించమని కోరారు. కాని దానికి గవర్నరు జవాబు కూడా యివ్వలేదు. గవర్నరు రాక అంటే ఎంత పటాటోపం ఉంటుందో అందరూ ఎరిగినదే. రోడ్లమీద జనాన్ని కూడా నడవనివ్వరు. స్వతంత్ర భారతదేశంలో ఒక్క ప్రక్క ప్రజలు కూడు – గుడ్డ లేక అలమటిస్తుంటే ఈ ఆడంబరాలు, ఆర్భాటాలు, వీటిపై ప్రజాధనం దుర్వినియోగం సహించరానిదని, గోరా తమ సహచరులతో గవర్నరు ప్రవర్తనకు అసమ్మతిగా నల్లజండాల ప్రదర్శన జరుప ప్రయత్నించారు. వీరందరూ అరెస్టు చేయబడి గవర్నరు విజయవాడ వదిలిన తర్వాత విడుదల చేయబడ్డారు. మరల గవర్నరు 9-12-53న విజయవాడ వచ్చారు. అప్పుడుకూడా గోరాగారు పేదలపేటలు చూడవలసినదిగా కోరుతూ ముందుగానే గవర్నరుకు ఉత్తరం వ్రాశారు. కాని గవర్నరు ఏమీ పట్టించుకోలేదు.

బార్ అసోసియేషన్స్, వర్తకసంఘాలు, మునిసిపల్ కౌన్సిళ్ళు, రోటరీక్లబ్బులు ధనికులు ఇచ్చే విందులకు హాజరయ్యే గవర్నరు కేవలం ధనికుల కొరకేనా? ప్రభుత్వం అందరికీ చెందినప్పుడు గవర్నరు కూడా అందరికీ చెందవద్దా? కాని కేవలం ధనికుల విందులు కుడుస్తూ పేదల పేటలు చూడ నిరాకరించే గవర్నరు పోకడ బ్రిటీషు సామ్రాజ్యవాద గవర్నరు పోకడకంటే ఏమి భిన్నంగా ఉంది? స్వాతంత్ర్యం వచ్చి అప్పటికి ఆరు సంవత్సరాలు దాటినప్పటికీ, స్వయంగా పేదల గుడిసెల వద్దకు వెళ్ళి తానై వారిని కలుసుకోవలసిన గవర్నరు ఇతరులు సూచించి, కోరినా నిరాకరిస్తున్నారంటే ఎంత సిగ్గుచేటు? అందుకే గోరా వారి సహచరులు మళ్ళా నల్లజండాలతో గవర్నరు మకాం చేసినచోటుకు వెళ్ళారు. పోలీసులు అడ్డగించగా రోడ్డుమీదనే బైఠాయించారు. పోలీసులు గోరా, సరస్వతిగార్లతో సహా కార్యకర్తలనందర్నీ

రోడ్డుమీద నుంచి రెండు ఫర్లాంగుల దూరం కాళ్ళూ – చేతులు పుచ్చుకుని బరబర ఈడ్చేశారు. సరస్వతిగార్ని అద్దెకు తెచ్చిన ఆడకూలీలచే ఈడ్పించారు. ఈ దృశ్యాన్ని వందలాది జనం చూచారు. తమ కళ్ళను తాము నమ్మలేకపోయారు. శరీరం గగుర్పొడిచింది వారికి.

గవర్నరు కారు రాగా ఆ జనం త్రోసుకుని మీద పడ్డారు. 'పేదలపేటలు చూడని గవర్నరు వెనక్కిపో,' 'పోలీసులను అడ్డం పెట్టుకునే గవర్నరు పిరికిపంద' అంటూ నినాదాలు చేశారు. అతికష్టం మీద పోలీసులు వారిని వెనక్కు నెట్టారు. "పోనీ పేదల పేటలు చూచుటకు ఇష్టంలేకపోతే కనీసం, మీ కొరకు రోడ్డు కిరుప్రక్కలా నించుని అహర్నిశలు అవస్థపడే పోలీసువారి లైన్సు అయినా దర్శించి వారి కష్టసుఖాలు విచారించ" మని గోరా బహిరంగ ప్రకటన చేశారు. అందుకు కూడా గవర్నరు అంగీకరించలేదు. స్వతంత్ర భారతదేశంలో పదవిలో నున్న వారి అహంకారం.

గవర్నరు పేదల పేటలు కూడా చూచి ఈ ప్రభుత్వం వారి కొరకు కూడా ఉందనే భావం పేదలకు కలుగజేయాలని సూచించినప్పుడు, మొదట్లో ఎందరో 'గవర్నరేమిటి? పేదలపేటలు చూడడమేమిటి?' అని ఆశ్చర్యాన్ని కనబర్చారు. కాని గవర్నరు విజయవాడ వచ్చిన రెండుసార్లూ గోరా ఈ సూచన చేయడం, గవర్నరు నిరాకరించడం, పోలీసులు అమానుషంగా రోడ్డుమీద స్త్రీ కార్యకర్తలను సహితం ఈడ్వడం ఇదంతా ప్రజలను ఆలోచింపజేసింది. ప్రజాస్వామ్యంలో ప్రభుత్వం అందరికీ చెందినప్పుడు గవర్నరు పేదల పేటలకు ఎందుకు వెళ్ళిచూడదు? కార్యకర్తలు కోరినదానిలో తప్పు ఏమయింది? అని ప్రజలు ప్రశ్నించసాగారు. అందుకే మూడవసారి 1954 జనవరి 17న గవర్నరు విజయవాడ వచ్చినప్పుడు గోరా వెనుక వేలాది జన బలం ఏర్పడింది. అప్పుడు గవర్నరు అంగీకరించి జనవరి 20వ తేదీన పేదల పేటలకు వెళ్ళి చూచారు. తర్వాత చాలా పట్టణాలలో గవర్నరు పేదల పేటలు దర్శించి వారి స్థితిగతులు తెలుసుకున్నారు. అయితే బలానికే గాని లొంగని మనస్తత్వం మన పాలకులలో ఎలా ఉచితానుచిత జ్ఞానాన్ని కూడా చంపివేసిందో తెలుపుటకు ఇది ఒక ఉదాహరణ.

గవర్నరుకంటే మన మంత్రులు ఏమీ తక్కువ స్థితిలో లేరు. మంత్రులు విజయవాడ వచ్చినప్పుడల్లా గోరా, వారి సహచరులు స్టేషనకు వెళ్ళేవారు. కాని తరచు వీరిని ప్లాట్‌ఫారం మీదివరకూ వెళ్ళనివ్వకుండానే పోలీసులు అడ్డివేసేవారు. అయినా ప్లాట్‌ఫారం మీద ఉద్యమ అభిమానులు కొందరు ప్రజల మంత్రి కంపార్టుమెంటుకు ఎదురుగా నిలుచుని మంత్రులు మూడవ తరగతిలో ప్రయాణం చెయ్యాలనీ, పోలీసులను అడ్డంపెట్టుకుని మొదటితరగతిలో ప్రయాణం చేయుట పిరికితనమనీ

నినాదాలిచ్చేవారు. కార్యకర్తలను ప్లాట్‌ఫారం మీదికి రానివ్వకుండా పోలీసులు వారిని ఎక్కడో దూరంగా ఆపినా కూడా, ఒక మంత్రికి చిన్నగా ప్లాట్ ఫారంమీదకు వచ్చి మొదటితరగతిలో ఎక్కే ధైర్యం లేకపోయింది. అందుచేత ఆయన వెనుకనుంచి పట్టాలు దాటి వచ్చి ప్లాట్‌ఫారం మీదకు రాకుండానే వెనకనుంచి ఎక్కారు. ఒకసారి, ముగ్గురు మంత్రులు ఒకేరోజున ఒకే రైలులో వెళ్ళారు. అప్పుడు కార్యకర్తలను దూరంగా ఆపకుండా ప్లాట్‌ఫారం మీదకు రానిచ్చారు. దానితో ఎంత పోలీసు బలాన్ని పెట్టుకున్నా మంత్రులు మొదటి తరగతిలో ఎక్కడం దాదాపు అసంభవంకాగా కార్యకర్తలను రైల్వే పోలీస్ స్టేషన్‌లో నిర్బంధించారు. అప్పుడు లవణంను ఒక చిన్న టీ దుకాణంలో నిర్బంధించి పెట్టి పోలీసులు బూటుకాళ్ళతో తొక్కారు. దాని ఫలితంగా లవణంకు కాళ్ళ నరాలు పట్లు తప్పి నెలరోజులు మంచం మీద ఉండవలసి వచ్చింది. ఈ విధంగా స్వయంగా త్యాగం చేసి ప్రజలకు ఆదర్శప్రాయంగా ఉండవలసిన మంత్రులు, ఇతరులు త్యాగం చేయమని కోరగా వారిని నిర్బంధించి పోలీసులను అడ్డంపెట్టుకుని ఆడంబర జీవిత విధానంలో ప్రజలను దూరంగా తాము ఉండటం ఏమి నీతి?

'యధారాజా తథా ప్రజా' అన్నట్లే నేడు 'యధామంత్రీ తథా ప్రజా' అయింది. అందుచేత మంత్రుల ఆడంబరాల దృష్టిని తమ ఆచరణలో పోషిస్తుండుట చేతనే, ప్రజలలో కూడా ఆడంబరాల దృష్టి అధికమైపోయింది. సంపాదన తక్కువ. ఆడంబరం ఎక్కువ అయ్యేసరికి లంచగొండితనం, అవినీతి దేశంలో పెరిగిపోయింది. మరొక ప్రక్క తన ముఠావారని, తమ పార్టీవారని అవినీతి పరులకు రక్షణ కల్పించుటచేత ఆశ్రిత పక్షపాతం వల్ల కూడా దేశంలో అవినీతి పెరిగిపోయింది. అందుకే దేశంలో ఏ మార్పు కావాలన్నా ముందుగా మంత్రుల ప్రవర్తనలో మార్పు రావాలని గోరా అంటున్నారు.

ఒక ప్రక్కన పోరాటరూపం ఇలా కొనసాగుతూ ఉండగా, మరోప్రక్క శాసన సభారంగంలో కూడా ఆర్థిక సమతా ఉద్యమం ఘన విజయం సాధించింది. శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య, శ్రీ యం.వి. సుబ్బారెడ్డి తాము త్యాగంతో ప్రారంభించారు. కనుక ఆ నైతికబలంతో మంత్రుల జీతభత్యాల బిల్లు చర్చకు వచ్చినప్పుడు మంత్రుల జీతాలను వెయ్యిరూపాయల నుండి 500 రూపాయలకు తగ్గించాలని ఒక సవరణ ప్రతిపాదించారు. 1953 డిసెంబరు 1న అసెంబ్లీలో వోటు తీసుకొనబడగా ఈ సవరణ నెగ్గింది. ప్రతిపక్షాలన్నీ ఐక్యంగా ఈ సవరణను బలపర్చాయి. ఈ సమయంలో ప్రదర్శింపబడిన ఐక్యత ప్రశంసార్హం.

తమ జీతాలను తగ్గించే సవరణ నెగ్గిందనేసరికి మంత్రులకు గంగవెర్రులెత్తాయి. దానిని హుందాగా స్వీకరించుటకు బదులు గవర్నరుచే ఆమోదమివ్వకుండా చేసి

పునఃపరిశీలనకు గాను తిరిగి అసెంబ్లీకి వచ్చేట్లు చేశారు. తిరిగి ఆ బిల్లును పునఃపరిశీలన చేయమని అసెంబ్లీని కోరుతూ అప్పటి ఆర్థికమంత్రి "500 రూపాయల జీతంతో మంత్రి తన హోదాకు తగిన ప్రతిష్ఠతో జీవితం గడపడం అసాధ్యం" అన్నారు. అంటే మన మంత్రులు హోదాను, ప్రతిష్ఠను ధనంతో కొలుస్తున్నారు. అందుకే నీతి, నిజాయితీలకు వారు ప్రాముఖ్యత ఇవ్వనికారణంగా దేశంలో కూడా నీతి, నిజాయితీలకు ప్రాధాన్యత తగ్గి ప్రతిష్ఠ పేరున ధన సంపాదనకు పోటీ పెరిగింది. మంత్రులు రెండవసారి అసెంబ్లీలో మంత్రుల వేతనాల అసలు తీర్మానాన్ని, అంటే సవరణలేకుండా, నెగ్గించుకుని తమ జీతాలు వెయ్యి రూపాయలు అలాగే ఉంచుకున్నారు. అసెంబ్లీలో జీతాల తగ్గింపు సవరణ ఆమోదింపబడిన మరుక్షణం నుంచే ఆ సవరణ వమ్ముచేయుటకు మంత్రులు కృషిచేశారు. మరేబిల్లు విషయంలోనూ మంత్రులు అంత శ్రద్ధ తీసుకొనలేదు. దీన్నిబట్టి మంత్రులు తమ జీతభత్యాలకు, పదవితో వచ్చే అవకాశాల కొరకే శ్రద్ధ వహిస్తున్నారు గాని, ప్రజల ఆర్థిక సమస్యల పరిష్కారానికి తగు శ్రద్ధ చూపుట లేదని స్పష్టం అగుచున్నది.

ఈ సందర్భంలోనే మరొక విషయం చెప్పవలసి ఉంది. శాసనసభ్యులు తాము ఏ త్యాగాన్నీ ప్రదర్శించుటకు ముందుకు రాలేదు.

శాసనసభ్యులకు మూడవతరగతి ప్రయాణపు ఖర్చులే ఇవ్వాలని శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య సవరణ ప్రవేశపెట్టగా వావిలాల, సుబ్బారెడ్డి మినహా మరెవరూ అనుకూలంగా ఓటు చేయలేదు. దీన్నిబట్టి ప్రతిపక్షాల శాసనసభ్యులు మంత్రుల జీతాలు తగ్గించుటలో చూపిన శ్రద్ధ తమ విషయంలో త్యాగానికి చూపలేదు. అందుకే మంత్రులు తిరిగి తమ జీతాలు ఎప్పటిరీతి చేసుకున్నప్పుడు వావిలాల, సుబ్బారెడ్డి మినహా మరెవరికీ దానిని విమర్శించే హక్కు నైతికంగా లేకపోయింది.

అదే రోజులలో కర్నూలు జిల్లా కరివెనలో ఈనాంభూములలో సాగుదార్ల హక్కులకై పి.యస్.పి. వారు సత్యాగ్రహం ప్రారంభించి అందు వారు అందరి సహకారాన్నీ అర్థించారు. గోరా ఆ సత్యాగ్రహాన్ని పూర్తిగా బలపరచడమేకాక సరస్వతిగారు ఆ సత్యాగ్రహంలో స్త్రీల జట్టుకు నాయకత్వం వహించి 6 నెలలు జైలుశిక్ష అనుభవించారు.

అలా ఉద్యమం ముందుకు సాగుతూ ఉండగా 1954 నాటికి శ్రీయుతులు సి.వి.కె. రావు, కొల్లిపాటి పట్టాభిరామయ్య కూడా శాసనసభ్యులుగా త్యాగంతో మూడవతరగతి ప్రయాణపు ఖర్చులనే తీసుకొనుటకు నిర్ణయించి ఆదర్శంగా ముందుకు వచ్చారు. దీనితో ఉద్యమాన్ని ఇంకా విస్తృతం చేయుటకు అందరూ సంయుక్తంగా

పూనుకుని కాకినాడలో 1954 ఆగస్టు 21, 22 తేదీలలో ఐక్య ప్రజా ఉద్యమ మహాసభలు జరిపారు. ఈ సభలకు గోరా అధ్యక్షత వహించారు. ఈ ఐక్య ప్రజా ఉద్యమ వేదిక వివిధ రాజకీయభావాలు కలిగినవారు కూడా కార్యక్రమాలలో ఐక్యంగా కలిసి కృషిచేయుటకు చక్కని వాతావరణాన్ని నిర్మించింది. 1955లో ఆంధ్ర అసెంబ్లీ రద్దుకాగా జరిగిన మధ్యంతరపు ఎన్నికలలో నిరాడంబరత ధ్యేయంగా కొందరు కార్యకర్తలు పోటీచేశారు. వారందరి తరఫునా గోరా ప్రచారం చేశారు.

1952లో అఖిలభారత స్థాయిలో ఏర్పడిన ఆర్థికసమతా మండలి శ్రీ కుమారప్పకు పక్షవాతం రావడం వల్లనూ, కొంతమంది ముఖ్యులు భూదాన ఉద్యమాన్ని తమ తమ రాష్ట్రాలలో నిర్మాణం చేయుటయందు నిమగ్నులగుటచేతనూ హెచ్చుగా ముందుకు సాగలేదు. గోరా ప్రతీ సంవత్సరం సర్వోదయ సమ్మేళనానికి హాజరవుతూ, రాజకీయ దృక్పథం గురించి, దానిననుసరించి తాము తీసుకున్న కార్యక్రమాల గురించి వివరిస్తూ ఉండేవారు. 1953–55 మధ్య వినోభా తన భూదాన పర్యటనలో బీహారు రాష్ట్రంలో ఉన్నప్పుడు ఆ ఉద్యమంలో జయప్రకాశ్‌నారాయణ్, రాజకీయ దృష్టిగల ప్రజాసోషలిస్టు పార్టీ కార్యకర్తలు అధికంగా పాల్గొనుటచే కొంత విప్లవాత్మక పరిణామం కలిగింది. బీహార్‌లో కౌలుదార్లను భూముల నుంచి భూస్వాములు తొలగించగా భూదాన కార్యకర్తలు దీనికి వ్యతిరేకంగా పెద్దపెట్టున సత్యాగ్రహాలు జరిపారు. 1955 అక్టోబరులో తన ఒరిస్సా పర్యటనానంతరం వినోభా ఆంధ్ర రానున్నారు. ఆ సమయంలో సేవాగ్రాంకు చెందిన ప్రభాకర్‌జీ, గోరా భూదాన ఉద్యమంలో చేరి సహకరించాలనీ, తన కార్యక్రమాలకు భూదాన కార్యకర్తలలో అధికభాగం సన్నిహితంగా ఉంటారు కనుక గోరా వారితో కలిసి పనిచేస్తూ నిర్మాణ కార్యక్రమం, రాజకీయ కార్యక్రమం జంటగా సాగుటకు తోడ్పడవచ్చునని సూచించారు. గోరా వినోభాను కలుసుకుని సంభాషించారు. ఆ తర్వాత 1955 మేలో భూదాన ఉద్యమంతో సహకరించి పనిచేయుటకు గోరాగారు నిశ్చయించుకున్నారు.

1955 జూలైలో ఏలూరులో ఐక్య ప్రజాఉద్యమ కార్యకర్తలు సమావేశమై భూదాన ఉద్యమంతో సహకరించదలచిన వారు సహకరించవచ్చునని, అందుకు అభ్యంతరము లేదని ఒక తీర్మానం చేశారు. ఈ నిర్ణయం గోరా దేశవ్యాపితంగా తన భావాలు స్పష్టంచేయుటకు నాంది అయింది.



# సర్వోదయ ఉద్యమం, దేశవ్యాప్త పర్యటన

**1955** మేలో భూదానోద్యమంతో సహకరించుటకు నిర్ణయించిన వెంటనే గోరా తన సహచరుల సమావేశం పటమటలో ఏర్పరిచారు. భూదాన ఉద్యమాన్ని నడుపుతున్న సర్వసేవా సంఘం కార్యదర్శి శ్రీ వల్లభస్వామి, బీహార్‌లో భూదానంలో విశేషంగా పనిచేసిన డాక్టర్ ఓం ప్రకాశ్ గుప్త, సేవాగ్రాం ఆశ్రమం వదిలి ఆంధ్రలో భూదాన కార్యక్రమంలో పనిచేయటకు వచ్చిన ప్రభాకర్‌జీ, అప్పుడు ఆంధ్రప్రదేశ్ భూదాన సమితి కార్యదర్శిగా ఉన్న శ్రీ ఎర్నేని సుబ్రహ్మణ్యం, అప్పటికి భూదాన కార్యక్రమంలో పనిచేస్తున్న మరికొందరు కార్యకర్తలు కూడా ఈ సమావేశంలో పాల్గొన్నారు. వివిధ విషయాలపై కలసి పనిచేయుటకు ఎలా వీలుంటుందోనని వివరంగా ఈ సమావేశంలో చర్చించారు. ఈ చర్చల సందర్భంలో అంతవరకూ పనిచేస్తున్న వారు కనపరచిన వైఖవరివల్ల కొంత ఉద్రిక్తత కూడా వచ్చింది. గోరా నిగ్రహంతో ఉదారంగా ఉండి సర్దటం చేత తాత్కాలికంగా కొంత తగ్గింది. కాని తర్వాత ఆ వ్యతిరేకత తీవ్రరూపాలను దాల్చింది. ఆ సమావేశంలో సామరస్యపూర్వక వైఖరిలేని కారణంగా గోరా సహచరులలో కొంతమంది భూదాన కార్యక్రమంలో ఎక్కువ శ్రద్ధ తీసుకొనకుండా దూరంగా తటస్థంగా ఉండిపోయారు.

ఒరిస్సాలోని కోరాపుట్ జిల్లాలో ఒక ప్రాంతం నుంచి మరొక ప్రాంతం వెళుతూ 1955 ఆగస్టు 7, 8, 9, తేదీలు ఆచార్య వినోభా శ్రీకాకుళం జిల్లాలోని పార్వతీపురం తాలూకాలో నుంచి వెళ్ళవలసి వచ్చింది. అప్పుడు వినోభా కార్యక్రమం, మకాముల ఏర్పాట్లలో ప్రధాన బాధ్యతను గోరా తీసుకున్నారు. వినోబా హిందీ ఉపన్యాసాలను తెలుగులోనికి ఆ మూడురోజులు శ్రీ లవణం గారు అనువదించారు.

ఆ రోజుల్లో వినోభా తన బహిరంగసభల్లో సభా ప్రారంభానికి ముందు సుమారు 40 నిమిషాలు ప్రార్థన చేసేవారు. అందు భజనగీతాలు, రామధున్ మొదలైనవి ఉండేవి. లవణం ముందుగానే వినోభాకు చెప్పారు. తాను నాస్తికుణ్ణి కనుక ప్రార్థనలో పాల్గొననని, అయితే ప్రార్థన ముందు చెప్పేదానిని అనువదించి, ప్రార్థన సమయంలో వేదికమీద నుంచి దిగిపోయి, ప్రార్థనానంతరం వేదిక మీదకు వచ్చి ఉపన్యాసాన్ని అనువదిస్తాననీ, అందుకు వినోభా అంగీకరించారు. గోరా కుటుంబం గురించి వినోభాకు తెలియనిదేముంది? గాంధీజీ ఆశ్రమంలో కూడా గోరా ప్రార్థనకు వెళ్ళేవారు కాదు. లవణం ప్రార్థనలో పాల్గొనకపోవడం ఆంధ్రలోని భూదాన కార్యకర్తల్లో కొందరికి నచ్చలేదు. దీనితో భూదానోద్యమం ఆధ్యాత్మిక ఉద్యమమనీ, అందులో నాస్తికులకు స్థానం లేదని వారు అభిప్రాయపడసాగారు.

1955 అక్టోబరు 1వ తేదీన వినోభా పాదయాత్ర ఆంధ్రలో ఆరంభమైంది. అప్పుడు నాస్తికులు కనుక గోరా, లవణం, వినోభా పాదయాత్రలో ఉండరాదనే వాదం మరీ తీవ్రంగా తలెత్తింది. ఇదిలా ఉండగా అంతవరకూ రోజూ సాయంత్రం బహిరంగసభల్లో 40 నిమిషాల భజనలతో చేసే ప్రార్థనకు వినోభా మానివేసి, అక్టోబరు 1 నుంచి 5 నిమిషాల మౌనాన్ని ప్రవేశపెట్టారు. దీనిలో ఎక్కడా దైవ ప్రసక్తి లేదు. బయటకు చెప్పకపోయినా, ఈ మార్పు లవణం కొరకే చేశారనేది అందరికీ అర్థమైన విషయం. దీనితో నాస్తికులు జేరి భూదాన ఉద్యమాన్ని ప్రభావితం చేస్తున్నారని గోరా, లవణంపై కొంత వ్యతిరేకత వచ్చింది. ఐనా వినోభా వీటికి జంకలేదు. ప్రభుత్వంలో ప్రధాన పదవిని నిర్వహించిన ఒకరు, గోరా, లవణం తన జిల్లాలోనికి రావడానికి వీలులేదని వినోభాబాకు సూచించారు. ఆయన ఆ జిల్లాలో వినోభాయాత్ర ఏర్పాట్లను చూస్తున్న ముఖ్యుడు. "ఈ ఉద్యమంలో అందరికీ స్థానం ఉంది. ఫలానావారు ఉండకూడదు అని అనుటకు ఎవరికీ హక్కులేదు" అని వినోభా సమాధానం చెప్పారు. ఆంధ్రదేశంలో వినోభా పర్యటించిన పది మాసాలూ లవణం వినోబా ఉపన్యాసాలను తెలుగులో అనువదించారు. గోరా వినోబాతో ఆంధ్ర పర్యటనలో ఉన్నారు. అప్పుడప్పుడు నాస్తికత్వంపై వినోబా - గోరాగార్ల మధ్య చర్చలు కూడా జరిగేవి.

వినోబా పర్యటనలో పాల్గొనుటకు గాను దేశంలో అన్ని రాష్ట్రాల నుంచి, విదేశాలనుంచీ కూడా వచ్చేవారు. వారు గోరాతో కూడా చర్చిస్తూ ఉండేవారు. ఈ విధంగా గోరా గురించి లోగడ వినియున్నవారికి ప్రత్యక్ష పరిచయం కూడా కలిగేది.

తన పర్యటనలో వినోబా విజయవాడ వచ్చినప్పుడు ప్రత్యేకంగా పటమట నాస్తికకేంద్రాన్ని దర్శించారు. అక్కడ అనుకోకుండా ఆయన మాట్లాడారు. హృదయం

నుంచి వెలువడిన భావోద్వేగం ఆ ఉపన్యాసమైంది. ప్రజాసేవ బ్రహ్మచారిగా ఉండి చేయాలా? గృహస్తుడు కూడా చేయవచ్చా? అయితే దేనికి విలువ అన్నప్పుడు గృహస్తుని సేవకే ఎక్కువ విలువ అని వినోబా చెప్పి, తాను బ్రహ్మచారిననీ; గోరా తొమ్మిది మంది సంతానంతో కుటుంబాన్ని అంతనూ వెంటతీసుకొని సేవచేస్తున్నారని కనుక గోరా గొప్పతనాన్ని తాను మాటలలో వర్ణించలేననీ అన్నారు.

గోరా భూదానోద్యంలో చేరగా ఆంధ్రలో కొంతమంది వ్యతిరేకించినా, తమ తమ రాష్ట్రాలు పర్యటించవలసినది వివిధ రాష్ట్రాల కార్యకర్తలు గోరాను ఆహ్వానించసాగారు. గ్రామరాజ్యం గురించి, ప్రజాప్రతినిధులపై ప్రజావత్తిడి గురించీ, నాస్తికత్వం గురించీ తాను మాట్లాడుతానని గోరా ముందుగానే స్పష్టం చేశారు. 1956 నుంచే ఈ పర్యటనలు ఆరంభమయ్యాయి. గోరా వెళ్ళిన చోటల్లా తన భావాలు స్పష్టంగా చెప్పారు. తనతో జండాలకట్ట కూడా తీసుకుని వెళ్ళి ప్రతిచోటా ప్రజలకు చూపి పార్టీ రాహిత్యం గురించి నచ్చజెప్పేవారు. ప్రత్యేకంగా ఎన్నోచోట్ల నాస్తికత్వం గురించి ఉపన్యాసాలు ఏర్పరిచేవారు.

గోరఖ్‌పూర్‌లో మాట్లాడుతూ నాస్తికత్వం, అరాజకత ప్రగతి రథానికి రెండు చక్రాలవంటివన్నారు. అనార్కిజం (ఎనార్కీ) మానవుని ప్రభుత్వ బంధనాలనుంచి ముక్తం చేస్తుందనీ, నాస్తికత భావదాస్యం నుంచీ, దైవపరాధీనతనుంచీ మానవునికి విముక్తి కలిగిస్తుందనీ అన్నారు. కాశీలో గోరా "సర్వోదయం-నాస్తికత్వం" అనే విషయమై మాట్లాడగా స్థానిక హిందీ దినపత్రికలు "ఆస్తికనగరి కాశీలో నాస్తికుని ఉపన్యాసము" అని శీర్షిక పెట్టాయి. అహమ్మదాబాదులో మాట్లాడుతూ నాస్తికత్వ వ్యాప్తిద్వారానే ప్రజాస్వామ్యం అభివృద్ధి చెందుతుంది అన్నారు. బడుగుదేశాలలో యుద్ధం సమస్య పరిష్కారం కావాలన్నా, రాజకీయ అధికారాన్ని, ఆర్థిక అవకాశాలను వికేంద్రీకృతం చేసే గ్రామరాజ్య విధానం అమలులోనికి రావాలన్నారు. ఆధునిక నాగరికతకు గాంధీ ప్రసాదించిన మహత్తర ఆయుధం సత్యాగ్రహమనీ, సమస్యలు పరిష్కరించుటకు సత్యాగ్రహం హింసను అహింసాయుత ప్రత్యామ్నాయమనీ చెప్పారు. ఏక ప్రపంచ భావన, నిర్మాణ కార్యక్రమం, సత్యాగ్రహం ఈ మూడు సర్వోదయ సమాజానికి మూల స్థంభాలన్నారు. ప్రజాస్వామ్యంలో ప్రజలు తమ ప్రతినిధులపై నిరంతరం జాగురూకతతో అజమాయిషీ తీసుకోవాలన్నారు.

ఈ విధంగా దేశమంతటా గోరావాణి ప్రతిధ్వనించింది. ఈ పర్యటనలన్నిటిలో తరచు గోరా వెంట లవణం కూడా ఉండేవారు. సౌరాష్ట్ర, బీహార్‌లలో గోరాతో సరస్వతిగారు కూడా పర్యటించారు. గోరా తన పర్యటనల్లో మారుమూల కుగ్రామాలకు

కూడా వెళ్ళారు. ఝాన్సీజిల్లాలో ఒంటెల మీద కూడా ప్రయాణం చేసి వెళ్ళారు. గోరా విప్లవ ప్రబోధం సర్వోదయ కార్యకర్తలకు, ప్రజలకు నూతన ఉత్సాహాన్ని కలిగించింది. సర్వోదయోద్యమానికి బలం చేకూర్చింది. ఆ రోజులలోనే గోరా ఇంగ్లీషులో 'Why Gramraj?' అనే పుస్తకాన్ని గ్రామరాజ్యం యొక్క ఆర్థిక, రాజకీయ వ్యవస్థలను వివరిస్తూ వ్రాశారు. ఈ పుస్తకం హిందీ లోనికి కూడా అనువదింపబడి ప్రచురితమైంది.

1957 వరకూ భూదాన ఉద్యమం ఒక పంథాలో సాగింది. కాని ఆ తర్వాత గ్రామదాన కార్యక్రమాలను ప్రభుత్వ సమాజ వికాస కార్యక్రమాలతో జోడించారు. గోరా, మరి కొంతమంది ఈ నిర్ణయం యొక్క ఔచిత్యాన్ని తీవ్రంగా ప్రశ్నించారు. భూదాన, గ్రామదాన, గ్రామనిర్మాణ కార్యక్రమాలు కేవలం నిర్మాణ కార్యక్రమాలనీ, వీటికితోడు రాజకీయ కార్యక్రమమగు సత్యాగ్రహం జోడించకపోతే విప్లవాత్మక పరిణామాలు రావనీ గోరా అభిప్రాయం. స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత వచ్చిన రాజకీయాధికారాన్ని నిర్మాణ కార్యక్రమాలతో జోడించి సక్రమంగా వినియోగించుకోవాలనీ, లేకపోతే స్వాతంత్ర్యం సంపాదించుకోవడంలో అర్థంలేదనీ, నిర్మాణకార్యక్రమం రాజకీయాధికారానికి లోబడి ప్రభావరహితంగా తయారవుతుందనీ గోరా కార్యకర్తల సమావేశాల్లోనూ, బహిరంగ వేదికల మీద నుంచి స్పష్టంగా హెచ్చరించారు. రాజకీయదృష్టి అంటే తామే అధికారం చేపట్టాలనే తాపత్రయం కాదనీ, అధికారంలో ఎవరున్నా ప్రజాప్రతినిధులు ప్రజల సమస్యలు పరిష్కరించేటట్లు చేయాలనీ గోరా వివరించారు.

నేడు ప్రజా ప్రతినిధులు, ముఖ్యంగా మంత్రులు ఆడంబర జీవిత విధానంలోనూ, సంకుచిత పార్టీ ముఠా తత్వాలలోనూ పడి రాజకీయ అధికారాన్ని దుర్వినియోగం చేస్తున్నారు. శాసనాలు చేసే అధికారం ప్రజాప్రతినిధులకే ఉంది కనుక, ప్రతినిధుల ప్రవర్తన వారు చేసే శాసనాలలో ప్రతిబింబించక తప్పదు. ప్రజాప్రతినిధుల ఆడంబర తత్వం, పార్టీ-ముఠా తత్వాల ప్రభావం అందరికీ వర్తించే శాసనాలపై పడుటచేత ఆ శాసనాల వల్ల ప్రజల సమస్యలు పరిష్కారం కావటంలేదు సరిగదా, ప్రజలు మరింత ఇబ్బందుల పాలవుతున్నారు. గనుక ప్రభుత్వం ప్రజా దృష్టితో పనిచేయాలంటే ప్రజాప్రతినిధుల ఆడంబరాలను, పార్టీ తత్వాన్ని తొలగించాలి. ఈ విధంగా గోరా రాజకీయదృష్టి అంటే ఏమిటో విశదీకరించారు.

ఈ దృష్టినంతనూ ప్రజల ముందుకు తీసుకువచ్చుటకూ, కార్యకర్తలకు వివరించుటకూ దేశవ్యాప్త పర్యటనలే కాక ప్రతీసంవత్సరం సభలు కూడా జరిపారు. భూదానోద్యమంలో చేరిన తర్వాత తొలిగా 1957 ఏప్రిల్ పటమటలో గ్రామరాజ్య సభలు జరిగాయి. వీటిని శ్రీ జయప్రకాష్ నారాయణ్ ప్రారంభించారు. 1958

నవంబరులో జరిగిన గ్రామరాజ్య సభలను ప్రముఖ నిర్మాణ కార్యకర్త శ్రీ అన్నా సాహెబ్ సహస్రబుద్ధే ప్రారంభించారు. 1958 సెప్టెంబరులో అలహాబాదులో జరిగిన ఒక సెమినార్‌లో గోరా పార్టీ రహిత రాజకీయాలు అనే విషయానికి స్పష్టమైన రూపం యిస్తూ ప్రసంగించారు.

ఇలా ఒక ప్రక్క విషయాలు స్పష్టంగా ప్రచారం చేస్తూ, రెండో ప్రక్క కార్యాచరణకు పూనుకోవాలని నిర్ణయించారు. 1959 లలిత్‌పూర్‌లో గ్రామరాజ్య సభలు జరిగాయి. ఝూన్సీ జిల్లా భూదాన సమితి కన్వీనర్ శ్రీ లోకేంద్రసింహ్, శ్రీ లవణం సభల ఏర్పాట్లు బాధ్యత తీసుకున్నారు. లలితపూర్ మునిసిపల్ ఛైర్మన్ డాక్టర్ శాదీలాల్ దూబే ఆహ్వాన సంఘం అధ్యక్షులుగా ఉండి సత్యాగ్రహావశ్యకతను తమ స్వాగతోపన్యాసంలో నొక్కిచెప్పారు. గోరా అధ్యక్షతన జరిగిన ఈ సభలలో గ్రామరాజ్య స్థాపనకు వాతావరణం కల్పించుటకుగాను ప్రజా ప్రతినిధుల పార్టీతత్వం, ఆడంబరాలను నిరసిస్తూ సత్యాగ్రహం చేయాలని తీర్మానించారు. కలకత్తానుంచి పాల్గొన్న శ్రీ బాలకృష్ణ మెహతా, ఇటావా నుంచి వచ్చిన శ్రీ మహావీరసింహ్, శ్రీ లోకేంద్రసింహ్ ప్రజాప్రతినిధుల పార్టీతత్వం, ఆడంబరాలకు వ్యతిరేకంగా జరిగే సత్యాగ్రహంలో పూర్తిగా దిగి పనిచేయుటకు నిశ్చయించుకున్నారు.

ఈ విధంగా మూడు సంవత్సరాలు కాశ్మీర్ మినహా దేశంలోని అన్ని రాష్ట్రాలు పర్యటించి గోరా సర్వోదయ కార్యక్రమాలలో రాజకీయ దృష్టిని అధికార పూర్వకంగా ప్రవేశపెట్టలేకపోయినా, రాజకీయ కార్యక్రమానికి చాలావరకు సానుభూతినీ, కొంతమంది సహకారాన్ని సంపాదించగలిగారు. అయితే ఇందుకు వ్యతిరేకత కూడా కొంత రాకపోలేదు.



# మంత్రులు మన నౌఖర్లు

లలితపూర్ సమావేశాల తర్వాత, ప్రజాప్రతినిధుల పార్టీ తత్వానికి వ్యతిరేకంగా జరిపే సత్యాగ్రహాన్ని ఆంధ్రప్రదేశ్‌లోనే ప్రారంభించాలని గోరా అనుకున్నారు. మన రాజ్యాంగం ఎక్కడా పార్టీలను గుర్తించకపోయినా, పెరటిదారిని పార్టీలు ప్రభుత్వంలోనికి ప్రవేశించాయి. ఇందులో మొదటిది ఎన్నికల సమయంలో పార్టీలను ప్రత్యేకంగా గుర్తించి వాటికి విడిగా ఎన్నికల చిహ్నాలు రిజర్వు చెయ్యడం, దీనివల్ల పార్టీ ఎన్నికల చిహ్నాలు కొన్ని సంవత్సరాల ముందునుంచే నిర్ణయమై, ప్రజలలో ప్రచారమై ఉంటున్నాయి. ఈ విధంగా పార్టీ అభ్యర్థులకు తమతమ చిహ్నాల ట్రేడు మార్కువలె అయిపోయి లాభకరంగా ఉన్నాయి. ఇండిపెండెంటు అభ్యర్థులకు కేవలం చిహ్నాలు కేటాయించడంచేత ప్రచారం చేసుకొనుటకు తగిన అవకాశం లేకపోలేదు. ప్రభుత్వం దృష్టిలో ఎన్నికలలో పాల్గొనే అభ్యర్థులందరూ సమానంగా ఉండవలసి ఉన్నప్పటికీ, ఎన్నికల చిహ్నాలు పార్టీలకు ప్రత్యేకంగా కేటాయించుటచేత పార్టీ అభ్యర్థులకు- ఇండిపెండెంటు అభ్యర్థులకు మధ్య విచక్షణ చూపబడుతూంది. ఇది చాలా అన్యాయం. ఈ విషయాన్ని గోరా ఎన్నికల కమీషన్ దృష్టికి తెచ్చారు. ఇట్టి విచక్షణ చూపుటకు కారణాలు ఏమిటో తెలుపమని గోరా ఎన్నికల కమీషనర్‌కు ఉత్తరం వ్రాశారు. ఎన్నికల కమీషనర్ కారణాలను చెప్పకుండా, ఇలా విచక్షణ చేయుటకు సంతృప్తికరమైన కారణాలు తమకు ఉన్నాయి. అని మాత్రం వ్రాసి ఊరుకున్నారు. దీన్నిబట్టి ఎన్నికల కమీషన్ పార్టీ అభ్యర్థుల యెడల ఎంత పక్షపాతంతో వ్యవహరిస్తున్నదో తెలుస్తుంది. పార్టీలకు ఎన్నికల చిహ్నాలు కేటాయించకుండా, అందరు అభ్యర్థులను ఇండిపెండెంట్లుగానే గుర్తించి అందరికీ ఒకేసారి గుర్తులు కేటాయించాలని గోరా

అంటారు. ఎన్నికల చిహ్నాలు ముందునుంచీ ఎవరికీ రిజర్వు చేయబడరాదని గోరా వాదన.

ఎన్నికలు అయిపోయిన తర్వాత శాసన సభ్యులు అసెంబ్లీలలో పార్టీబాక్సులో ఏ పార్టీవారందరూ ఆ పార్టీ గుంపుగా కూర్చుంటున్నారు. స్పీకరు శాసనసభ్యులకు శాసనసభలో సీట్లు కేటాయించాలనే ఉందిగాని, పార్టీ గుంపులుగా కేటాయించాలని ఎక్కడాలేదు. రాజ్యాంగంలో ఎక్కడా గుర్తింపబడని పార్టీలను ఎన్నికల గుర్తులు విషయంలో వలెనే శాసనసభలో సీట్లు కేటాయింపులో కూడా పరోక్షంగా గుర్తించడం జరుగుతోంది. ఈ విధంగా శాసన సభలలో పార్టీలను గుర్తించుటచేత ప్రజాప్రతినిధులుగా ప్రజలందరూ ప్రాతినిధ్యం వహించవలసిన శాసనసభ్యులు ప్రజలలో ఒక భాగం మాత్రమే అగు పార్టీల ప్రతినిధులుగా మారిపోతున్నారు. ఈ పార్టీల ప్రతినిధులుగా మారిన శాసనసభ్యులు ప్రభుత్వ పక్షమనీ, ప్రతిపక్షమనీ చీలిపోయి ప్రభుత్వ ప్రతిపక్షాల వాగ్యుద్ధ భూమిగా శాసనసభలు మారిపోయాయి. మరల శాసనసభలలో పార్టీ హ్విప్పులను గుర్తించుటద్వారా శాసనసభ్యులు పార్టీ హ్విప్పులకు బానిసలైపోయారు. అంటే శాసనసభలో వచ్చే విషయాల గురించి ముందుగానే పార్టీలు సమావేశమై తమ వైఖరిని నిర్ణయిస్తాయి. ఆ నిర్ణయానికి అనుకూలంగానే ఆయా పార్టీల శాసనసభ్యులు ఓటు వేసితీరాలి. దీనితో శాసనసభ్యులకు ఆలోచించవలసిన పని కూడా లేదు. హ్విప్పు పార్టీ నిర్ణయాన్ని బట్టి ఎలా వోటు వేయమంటే అలా ఓటు వేయడమే.

ఈ హ్విప్పు ఆచారంవల్ల సభ్యులకు శాససభలో స్వేచ్ఛ లేక, విషయాల మంచిచెడ్డల పరిశీలన ననుసరించి కాక కేవలం పార్టీల బలాబలాలబట్టి మాత్రమే నిర్ణయాలు జరుగుతున్నాయి. మెజారిటీ సభ్యులు ప్రభుత్వపక్షమనీ, మైనారిటీ సభ్యులు ప్రతిపక్షమనీ విడిపోవుటచేత ఎప్పుడూ మెజారిటీపార్టీ మాటే నెగ్గుతుంది. ప్రతిపక్షం చెప్పిన విషయం ఎప్పుడూ వోడిపోతుంది. సంఖ్యాబలంతో తమ పార్టీ ప్రవేశపెట్టే బిల్లు ఎలాగూ నెగ్గుతుంది కనుక తాను విషయం తెలుసుకోనక్కరలేదు. తన పార్టీ హ్విప్పు చెప్పినప్పుడు చెయ్యి ఎత్తితే చాలు అనుకుంటాడు ప్రభుత్వ పక్షసభ్యుడు. తాను ఎంత మాట్లాడినా, ఏమిచేసినా తన సూచన శాసనసభలో ఆమోదింపబడదని ప్రతిపక్ష సభ్యునకు తెలుసు. దీని వల్ల ఏ విషయమైనా మంచి చెడ్డలతో నిమిత్తం లేకుండా ప్రభుత్వ పక్షం ప్రవేశపెడితే నెగ్గుతుంది. ప్రతిపక్షం ప్రవేశపెడితే ఓడిపోతుంది. అనేది సర్వసాధారణంగా పూర్వనిర్ణయం. దీనివల్ల శాసనసభ్యులకు తమ జీతభత్యాలు తీసుకోవడం, వరకేగాని, అసెంబ్లీ కార్యక్రమాలలో శ్రద్ధలేదు. అందుకే శాసనసభలలో ఎప్పుడూ 6వ వంతు సభ్యులు కూడా ఉండరు. 10వ వంతు కోరం అయితే, నూటికి

పదిమంది కూడా శాసనసభలో హాజరుకాక చర్చలు వాయిదాపడుతున్నాయి. ఈ విధంగా పార్టీ తత్వంతో కూడిన శాసనసభలు ఒక ఫార్సుగా, ప్రజా ధన దుర్వినియోగ సాధనంగా అయిపోయాయని గోరా ఆందోళన పడ్డారు. దీనిని సరిదిద్దాలంటే శాసనసభలలో పార్టీలకు గుర్తింపు ఉండరాదనీ, అంటే పార్టీబ్లాకులు, హ్విప్పులు రద్దుకావాలని గోరా వాదన. శాసనసభ్యులకు వోటు స్వేచ్ఛ ఉంటే ఓటు తీసుకునేవరకూ నిర్ణయం ఎటు ఉంటుందో తెలియదు. కనుక హ్విప్పు పద్ధతిని రద్దు చేస్తే శాసనసభ్యులు శాసనసభా కార్యక్రమాలలో శ్రద్ధ తీసుకుంటారు.

ఈ విషయాన్ని ప్రజలదృష్టికి తెచ్చుటకుగాను, హైద్రాబాదులోని ఆంధ్రప్రదేశ్ శాసనసభ స్పీకరుకు పార్టీబ్లాకులు, హ్విప్పులు రద్దు చేయమని కోరుతూ, అలా రద్దుచేయని పక్షంలో శాసనసభ ముందు సత్యాగ్రహం చేయవలసి ఉంటుందని తెలియజేస్తూ గోరా ఒక ఉత్తరం వ్రాశారు. 1960 జనవరి 26న విజయవాడ నుంచి తన సహచరులతో కాలినడకన బయలుదేరి కృష్ణా, నల్లగొండ, హైద్రాబాదు జిల్లాలో 34 రోజులు 252 మైళ్ళు పాదయాత్రచేసి 43 గ్రామాలలో ప్రచారం జరిపి ఫిబ్రవరి 28న హైద్రాబాద్ చేరుకున్నారు. హైద్రాబాదు చేరగానే గోరా శాసనసభ స్పీకరుకు మరొక ఉత్తరం వ్రాసి తాము మార్చి 8వ తేదీన ఉదయం శాసనసభ ముందు సత్యాగ్రహం చేయ సంకల్పించామని తెలిపారు. ఫిబ్రవరి 28 నుంచి మార్చి 8 వరకూ గోరాదళం రాజధానిలో పలుచోట్ల సభలు జరిపి తామెందుకు సత్యాగ్రహం చేస్తున్నదీ వివరించారు. పాదయాత్ర ఏర్పాట్లలో ఎక్కువగా శ్రీ కానా సహకరించగా, హైద్రాబాదు పట్టణంలో ఏర్పాటు చేయుటలో అప్పటి శాసనసభ్యులు శ్రీ వందేమాతరం రామచంద్రరావు, స్థానిక సర్వోదయ కార్యకర్తలు సహకరించారు. గోరా దళం హైద్రాబాదు చేరిన తర్వాత అప్పటి శాసనసభ్యులు శ్రీయుతులు వావిలాల గోపాలకృష్ణయ్య, వందేమాతరం రామచంద్రరావు, బస్వా మానయ్య సత్యాగ్రహ ఉద్దేశ్యాలను, కోర్కెలను సమర్థిస్తూ ఒక ప్రకటన చేశారు.

1960 మార్చి 8వ తేదీ ఉదయం నిర్ణయించిన ప్రకారం గోరా, వారి సహచరులగు శ్రీయుతులు జొన్నలగడ్డ రామలింగయ్య, వెదరి రంగన్న, బి.సి. హెచ్. రంగారెడ్డి, జాస్తి వెంకట్రామయ్య, గోపిరెడ్డి, లక్ష్మారెడ్డి మొదలైనవారు తమ శిబిరం నుంచి బయలుదేరి శాసనసభ వద్దకు వెళుతూ ఉండగా అసెంబ్లీ భవనానికి అరమైలు దూరంలో వీరందరినీ పోలీసులు అరెస్టు చేశారు.

ఆ దినం అసెంబ్లీలో ప్రశ్నోత్తరాల అనంతరం స్పీకరు శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు గోరా తనకు వ్రాసిన ఉత్తరం గురించి ప్రస్తావించి, బ్రిటీష్ పార్లమెంటరీ సాంప్రదాయాలను మనం అనుసరిస్తున్నామనీ, వీటిలో మార్పులు చేయాలంటే ముందు

కేంద్రశాసనసభయగు పార్లమెంటు అనుసరిస్తేగాని అసెంబ్లీలు అనుసరించజాలవనీ, అంతేగాక పార్టీలకు గల గుర్తింపును అసెంబ్లీల నుంచి తొలగించాలంటే రాజ్యాంగాన్ని సవరించవలసి ఉంటుందని తన అభిప్రాయమనీ తెలిపారు. గోరాను, వారి సహచరులను పోలీసులు అరెస్టు చేశారనే సమాచారం సభకు అందజేసి, గోరా ఆంధ్రదేశంలో ఒక గొప్ప వ్యక్తి అనీ, వారు చేసే సూచనలను అర్థం చేసుకొనుటకు ప్రయత్నించాలనీ, అందుచేత నాటి అసెంబ్లీ సమావేశం ముగియగానే సత్యాగ్రహులు విడుదల చేయబడగలరని తాను ఆశిస్తున్నానని స్పీకరు అన్నారు.

దీని పై ఆ దినం సాయంత్రం సత్యాగ్రహులు విడుదల చేయబడ్డారు. కొంతమంది శాసనసభ్యులు, పురప్రముఖులు విడుదల అనంతరం గోరాను కలుసుకున్నారు. గోరా, కొంతమంది కార్యకర్తలు మర్నాడు తిరిగి సత్యాగ్రహం కొనసాగించాలని అభిప్రాయపడ్డారు. కాని గోరాను కలుసుకున్న మిత్రులు శాసనసభలో జరిగినదంతా గోరాకు తెలిపి, ఈ విషయం ప్రభుత్వస్థాయి వరకూ వచ్చింది కనుక, ప్రస్తుతానికి సత్యాగ్రహం విరమించి స్పీకరు చెప్పిన విషయాలపై ప్రజలకు స్పష్టం చేయడం మంచిదని సలహా యిచ్చారు. మరికొంతబలం సంపాదించిన తర్వాత ఈ మారు పార్లమెంటువద్దనే సత్యాగ్రహం చేయవచ్చునని వారు సూచించారు. దీనితో అప్పుడు సత్యాగ్రహం మర్నాడు కొనసాగించకుండా ఉండుటకు నిర్ణయించారు. మొత్తం సత్యాగ్రహానికీ, ఏర్పాట్లకూ శ్రీ లవణం బాధ్యత తీసుకుని నిర్వహించారు.

ఆ తర్వాత గోరా స్పీకరును కలుసుకుని రాజ్యాంగాన్ని సవరించవలసిన అవసరంలేదనే తన అభిప్రాయాన్ని వివరించి పార్టీ బ్లాకులు, హ్విప్పులు ఆచారంగా వస్తున్నవేగాని వీటికి రాజ్యాంగ ఆమోదం లేదని తెలిపారు.

కొద్ది రోజుల అనంతరం హైద్రాబాదులో పార్టీబ్లాకులు హ్విప్పులు, రద్దు గురించి చర్చించుటకు ఒక సమావేశం ఏర్పాటు చేశారు. అందు కొంతమంది శాసనసభ్యులు, న్యాయవాదులు కూడా పాల్గొన్నారు. గోరా విషయాన్ని ప్రతిపాదించిన తర్వాత చర్చ జరిగింది. ఈ చర్చవల్ల రాజ్యాంగ సంబంధమైన మార్పు అవసరం లేదని చాలావరకూ తేలింది. ఒకవేళ రాజ్యాంగ సంబంధమైన మార్పు అవసరమైనా ప్రజాహితదృష్టితో చేయాలని గోరాగారు అన్నారు.

1960 మార్చి చివరలో సేవాగ్రాంలో జరిగిన సర్వోదయ సమ్మేళనంలో పాల్గొని గోరా సత్యాగ్రహ అనుభవాలు వివరించారు. ఆ ఉపన్యాసంలోనే "అసెంబ్లీ నుంచి 4 ఫర్లాంగుల దూరంలో మమ్ము ఆపారు. అది నాలుగు ఫర్లాంగులే అయినా, ఆ దూరం దాటి అసెంబ్లీ వరకూ చేరుటకు కొన్ని సంవత్సరాలు పట్టవచ్చునని నాకు తెలుసు. ఈ 4 ఫర్లాంగులలో ఎన్ని అడ్డంకులు ఎదురౌతాయని నాకు తెలుసు. అయినా

ప్రజాప్రతినిధుల పార్టీతత్వం, ఆడంబరాలు ప్రజాక్షేమానికి హానికరం కనుక అవి పోవలసిందే. అంతవరకూ అందుకై కృషి సాగవలసిందే. ఎంత ఎక్కువమంది పూనుకుంటే అంత త్వరగా ఆ 4 ఫర్లాంగులూ దాటగలుగుతాము." అని గోరా అన్నారు.

ప్రజాప్రతినిధుల పార్టీతత్వం ప్రజలకు ఎలా హానికరంగా ఉందో, దాని నిర్మూలనకు సత్యాగ్రహం ఎలా అవసరమో తెలుపుటకుగాను 1960 ఆగష్టు 20, 21,22 తేదీలలో హైద్రాబాదులో పార్టీరహిత ప్రజాస్వామ్య మహాసభలు జరిగాయి. ఈ సభలను శ్రీ జయప్రకాశ్ నారాయణ్ ప్రారంభించగా, గోరా అధ్యక్షత వహించారు. పార్టీలు ప్రజాస్వామ్యాన్ని వమ్ము చేస్తున్నాయనే విషయాన్ని ప్రముఖంగా పైకి తీసుకువచ్చుటకు ఈ సభలు చాలా తోడ్పడ్డాయి.

1960 అక్టోబరు చివరి వారంలో రాయపూరులో అఖిల భారత కాంగ్రెసు సంఘం సమావేశం జరిగింది. ఆ సమయంలో రాయపూరు సర్వోదయ కార్యకర్తలు దేశంలో పెరిగిపోతున్న అవినీతి, ప్రజల కష్టాలు, పార్టీ-ముఠా తత్వాలు గురించి అధికారంలో ఉన్న కాంగ్రెసు వారు ఆలోచించాలనీ, వారి దృష్టి ఆకర్షించుటకుగాను మూడు రోజులు రాయపూరులో ఎ.ఐ.సి.సి. సభలకు ఎదురుగా సమూహ ఉపవాసం జరుప నిశ్చయించారు. ఈ కార్యక్రమానికీ నాయకత్వం వహించవలసినదిగా కార్యకర్తలు గోరాను ఆహ్వానించారు. అప్పుడు గోరా, సరస్వతిగార్లు, నాగపూరుకు చెందిన వయోవృద్ధులు, ప్రముఖ నాయకులు అయిన మహాత్మా భగవాన్‌దీన్ ఆ ఉపవాస కార్యక్రమంలో పాల్గొన్నారు. ఎ.ఐ.సి.సి. సమయంలో ఇలాంటి కార్యక్రమాన్ని ఏర్పరచటమంటే ఎంతో వ్యతిరేకతను ఎదుర్కోవలసి వుంటుంది. అందులోను సర్వోదయ అగ్రనాయకులు ఈ కార్యక్రమాన్ని ఆమోదించలేదు. అయినా ఈ వ్యతిరేకతలన్నీ తట్టుకుని 72 మంది కార్యకర్తలు అందులో పాల్గొనగా చివరిరోజున వందలాది వచ్చిచేరారు. ఆ సమయంలో పాల్గొన్న వారందరూ దేశ స్థితిగతులను చర్చించి ప్రజాసమస్యల పరిష్కారానికి ప్రజలలో పార్టీరహిత సత్యాగ్రహ చైతన్యం పెంపొందించుటకు, అందుకు అనువగు కార్యక్రమాలు తీసుకొనుటకు "సత్యాగ్రహ సమాజ్"ను గోరా అధ్యక్షులుగా, ఉపవాస కార్యక్రమాన్ని విజయవంతంగా నిర్వహించిన శ్రీ విష్ణుశరణ్, శ్రీహరిప్రసాద్ వారీ కార్యదర్శులుగా ఏర్పరిచారు.

హైదరాబాదు శాసనసభ ముందు సత్యాగ్రహం చేయుటకు గోరా జరిపిన కృషి, అరెస్టు వివరాలు పత్రికలలో చదివిన శ్రీ శివమూర్తి స్వామి పార్టీ రహిత ప్రజాస్వామ్యమందు తనకు కూడా ఆసక్తి ఉండుటచేత వెంటనే హైద్రాబాదు వెళ్ళి గోరాగార్ని కలుసుకున్నారు. శ్రీ శివమూర్తి స్వామిగారు కర్ణాటక లోకసేవక సంఘం

కార్యదర్శి 1952లో ఇండిపెండెంటుగా లోకసభకు ఎన్నికయ్యారు. 1957లో ఓడిపోయారు. కర్నాటక ప్రాంతంలో వారికి మంచి పలుకుబడి ఉంది. ఆయన గోరాగారితో కలుసుకుని చర్చించారు. 1961లో సత్యాగ్రహ సమాజ్ సభలు జరుపుదామనుకోగానే హుబ్లీలో ఆ సభలు జరపమని శ్రీ శివమూర్తిస్వామి ఆహ్వానించారు. 1961 జూలై 20న హుబ్లీలో గోరా అధ్యక్షతను సత్యాగ్రహ సమాజ్ సభలు జరిగాయి. శ్రీయుతులు మహావీర్‌సింహ్, విష్ణుశరణ్, హరిప్రసాద్ తివారీ, లవణం, యస్.ఆర్.సుబ్రమ్మణ్యం, ఐ.కె. కుమారన్ మొదలైనవారు ఆ సభలలో పాల్గొన్నారు. ఆ సభలలోనే సేవాగ్రాం నుంచి ఢిల్లీలోని ప్రధాన మంత్రి నివాసానికి గోరా నాయకత్వాన ప్రజాప్రతినిధుల పార్టీ రాహిత్యం, నిరాడంబరతలకై ఒక సత్యాగ్రహ పాదయాత్రను సాగించాలని నిర్ణయించారు.

సేవాగ్రాం నుంచి 1961 అక్టోబరు 8న ఢిల్లీ సత్యాగ్రహ పాదయాత్ర ప్రారంభించాలని నిర్ణయించి సెప్టెంబరు మొదటివారంలో గోరా ప్రధాన మంత్రి నెహ్రూకు ఒక ఉత్తరం వ్రాశారు. అందులో దేశ ప్రజలు నెహ్రూను జాతీయనాయకునిగా భావిస్తున్నారనీ, కాని ఆయన కాంగ్రెసుపార్టీకి కట్టుబడిపోయి సంకుచితంగా అయిపోయారనీ, కనుక సంకుచితపార్టీ పరిధినుంచి విశాల జాతీయ ప్రాంగణంలోనికి రావాలని కోరారు. ప్రభుత్వంలోని ఆడంబర దృష్టి, పార్టీతత్వం ప్రజలలో కూడా, ముఠాతత్వాన్నీ, ఆడంబరప్రీతిని పెంచి అవినీతికి దోహదం చేస్తోందనీ, కనుక సామాన్య ప్రజలకు మార్గదర్శకులుగా ఉండుటకుగాను ప్రజాప్రతినిధులు ఇతరులకంటే ఎక్కువ నిరాడంబరంగానూ, త్యాగమయంగానూ ఉండాలంటూ ప్రధానమంత్రిగా నెహ్రూను పార్లమెంటుసభ్యుల క్వార్టర్సులోనికి మారమని కోరారు. ప్రభుత్వం ప్రజలందరికీ చెందాలి కనుక, పార్టీ బ్లాకులు–విప్పులు అందుకు ఆటంకంగా ఉన్నాయనీ, వాటిని రద్దుచేయాలనీ గోరాగారు ఆ ఉత్తరంలో కోరారు. అక్టోబరు 8న సేవాగ్రాం నుంచి పాదయాత్రగా బయలుదేరి సుమారు వెయ్యిమైళ్ళ దూరం దారిపొడుగునా ప్రచారం చేసుకుంటూ 62 జనవరిలో ఢిల్లీ చేరగలమని తెలిపారు.

1962 అక్టోబరు 8వ తేదీ సేవాగ్రాం ఆశ్రమంలో బాపూకుటీరం ముందు చిన్న వీడ్కోలు సభ జరిగింది. ఆశ్రమవాసులగు శ్రీ చమన్‌లాల్, శ్రీ మున్నాలాల్‌గార్లు గోరా త్యాగాన్ని, పట్టుదలనూ కొనియాడి, దేశంలో సమూలంగా మార్పు రావాలనీ అందుకై గోరా చేస్తున్న కృషి జయప్రదం కావాలనీ శుభాకాంక్షలు తెలిపారు. గోరా మాట్లాడుతూ స్వాతంత్ర్యానంతరం ప్రజలలో మరింత బానిసభావం పెరిగి జడత్వం హెచ్చిందనీ, ఇందుకు ప్రజాప్రతినిధులు ప్రజాసేవ అనే తమ కర్తవ్యాన్ని మరచి

పార్టీతత్వాలు,ఆడంబరాలలో పడ్డారనీ, తిరిగి సత్యాగ్రహ శక్తిని పెంపొందించుట ద్వారానే పౌరులలో ఆత్మవిశ్వాసాన్ని పెంచి చైతన్యవంతులుగా చేయగలమని అన్నారు. స్వాతంత్ర్యానంతరం దేశంలో పార్టీలపరంగా చాలా సత్యాగ్రహాలు జరిగాయనీ, కాని అవి పార్టీదృష్టితో పార్టీలజెండాలతో జరిగాయానీ, పార్టీదృష్టి ఎప్పుడూ అధికారంలో ఉన్న వారిని దింపి తాము అధికారాన్ని చేపట్టాలనే ప్రయత్నిస్తుందనీ, కాని తమ సత్యాగ్రహం సత్యాగ్రహాన్ని పార్టీ దృష్టి నుంచి వేరుచేస్తోందనీ చెప్పారు. ఈ తేడా తెలుపుటకే అన్ని జండాలు కట్టగా కట్టామనీ, జండాలు పార్టీలకు ప్రాతినిధ్యం వహిస్తే ఏపార్టీలోనూ లేని అసంఖ్యాకమైన ప్రజలకు ప్రాతినిధ్యంకొరకు ఏ జండాలేని కర్రను ఈ కట్టలో చేర్చామనీ వివరించారు. ఈ సత్యాగ్రహ పాదయాత్రను సేవాగ్రాంలోని గాంధీజీ కుటీరం నుంచి ప్రారంభించుటకు అనుమతించడమేకాక, ఎంతో ప్రోత్సాహమిచ్చిన ఆశ్రమవాసులందరికీ గోరా కృతజ్ఞతలు తెలిపారు. వారిచ్చిన ప్రోత్సాహంతో సత్యాగ్రహుల బలం పదిరెట్లు పెరిగిందని గోరా అన్నారు.

గోరా దళం సేవాగ్రాం నుంచి బయలుదేరిన రోజున ఆ తర్వాత వారం వరకూ కూడా విపరీతమైన వర్షం. సేవాగ్రాం నుంచి బయలుదేరినప్పుడు మైసూరు, మహారాష్ట్ర, మధ్యప్రదేశ్, ఉత్తర ప్రదేశ్, బీహార్, ఆంధ్రప్రదేశ్‌లకు చెందిన 14 మంది ఉన్నారు. వీరిలో శ్రీమతి సరస్వతి, శ్రీ లవణం కూడా ఉన్నారు.

సాధారణంగా ఎప్పుడూ సేవాగ్రాం ఆశ్రమం, తదితర సంస్థలవారు తాము విరాళాలు పుచ్చుకోవడమేగాని ఇతరులకు ఇవ్వడం జరగదు. కాని ఈ యాత్ర విషయంలో తారుమారు అయింది. ఆంధ్రలో గోరా వసూలుచేసిన 300 రూపాయలు కార్యకర్తలు సేవాగ్రాం వెళ్ళుటకు, ఉద్యమ ఉద్దేశాలు తెలిపే కరపత్రాలు అచ్చువేయుటకు సరిపోయింది. చేతిలో పైసా లేకుండా వెయ్యిమైళ్ళు యాత్రకు 14 మంది సహచరులను వెంటతీసుకుని బయలుదేరటం మొండిసాహసం అనిపించింది అందరికీ. సేవాగ్రాంలోని కార్యకర్తలు సంప్రదించుకొని 50 రూపాయలు విరాళాలు తమలో తాము వేసుకుని సత్యాగ్రహదళం సేవాగ్రాం నుంచి బయలుదేరేముందు సమర్పించారు. సేవాగ్రాం నుంచి వీడ్కోలు చెప్పినవారిలో ఆర్యనాయకం, శ్రీ అన్నాసాహెబ్ సహస్రబుద్ధే కూడా ఉన్నారు.

సేవాగ్రాం ఆశ్రమం నుంచి ఈ యాత్ర ప్రారంభించుటకు అనుమతించరాదనీ, ఎందుకంటే ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఇది ఉందనీ కొంతమంది వాదించారు. కానీ వారి ప్రయత్నం ఫలించలేదు.

యాత్ర ముందుకు సాగింది. "మంత్రీ హమారే నౌకర్ హైం, జనతా ఉస్‌కీ మాలిక్ హై" అని హిందీలో వ్రాసిన బానరు, జండాలకట్ట ప్రజలకు చాలా ప్రత్యేకంగా

కనిపించాయి. మంత్రులు మన నౌకర్లా ! ప్రజలం వారి యజమానులమా! ఆశ్చర్యం! గోరా నచ్చజెప్పేవారు : – "అవును, పోలాలలో పనిచేసే వ్యవసాయ కూలీలు, తట్టలు నెత్తినపెట్టుకుని ఇంటింటికీ తిరిగి పాలు, పెరుగు, కూరలు అమ్ముకునే స్త్రీలు, వీధి అరుగుమీద పిల్లలకు పాఠాలు చెప్పే బడిపంతుళ్ళు, రిక్షాలు లాగేవారు, కార్ఖానాలలో పనిచేసే కార్మికులు, తిండికి కటకటపడే నిరుద్యోగులు, మీరు-నేను-మనమంతా పౌరులం, వోటర్లం, యజమానులం, ఈ ప్రతినిధుల మంత్రులు మన నౌకర్లు ప్రజలందరూ కూడూ, గుడ్డ, విద్యావసతీ, వృత్తీ, కల్పించమని వీరిని మనం నియమించుకున్నాం. మనమిచ్చే వోటువల్లనే వీరికి అధికారం, మనమిచ్చే పన్నే ప్రభుత్వానికి డబ్బు. మనం వోటివ్వకపోతే, పన్నివ్వకపోతే వీరు లేరు. వీరి అధికారమూ లేదు. వీరివద్ద డబ్బూ ఉండదు. ఈ మంత్రులు లేకపోయినా ప్రజలమగు మనం ఉంటాం. కాని మనం ఉండకపోతే, ఈ మంత్రులు ఉండరు. ఈ విధంగా మంత్రులమీద మనం ఆధారపడిలేము మంత్రులు మనమీద ఆధారపడివున్నారు. అయినా నేడు వ్యవహారం తలక్రిందులుగా ఉంది. యజమానులు తిండీ బట్టకు కరువై నీడలేక రోడ్లుప్రక్కన పస్తులుంటే నౌకర్లు విందులతో, విలాసాలతో, అధిక జీతభత్యాలతో ఆడంబరాల మధ్య పెద్ద పెద్ద భవంతులలో కులుకుతున్నారు. యజమానికి రైలులో కాలుపెట్టి నిలుచొనుటకు మూడవతరగతిలో చోటులేదు. కాని నౌకర్లు మొదటి తరగతిలో కాళ్ళుజాపి నిద్రపోతున్నారు. నేడు నౌకరుగా ఉండుటకు పోటీలుపడుతున్నారు. ప్రజాసేవకు సాధనంగా ఉండవలసిన ప్రజాప్రాతినిధ్యం లాభసాటి వ్యాపారంగా మారింది. వేలూ, లక్షలూ ఎన్నికలలో పెట్టుబడి పెడుతున్నారు. మరి వ్యాపారంలో లాభం అర్జించుకోరూ? దీనితో యజమానులను కొల్లగొట్టి నౌకర్లు బాగుపడుతున్నారు. యజమానుల జీవితం దుర్భరమైంది. దీనికంతకూ కారణం మనం యజమానులమని, మంత్రులు మన నౌకర్లను నెత్తిమీదకెక్కించుకోకుండా నౌకర్లుగానే చూడాలి. అదుపులో పెట్టాలి. వారిపై అజమాయిషీ ఉండాలి. మనం వారిపై అజమాయిషీ చేయడంలేదు కనుక వారు తామే యజమానులమని విర్రవీగుతూ అసలు యజమానినే 'నువ్వెవరవు?' అంటున్నారు. గట్టిగా అడిగితే నౌకర్లు యజమానులను జైల్లోపెడుతున్నారు. యజమానులపై లాఠీలు ప్రయోగిస్తున్నారు. తుపాకులు కాలుస్తున్నారు. ఇంకా సహిద్దామా? మనం నిద్ర మేలుకొవాలి. నేను యజమానిని, మీరు మంత్రులు-మా నౌకర్లు, ఏమిటీ ఘోరం? అని అడగాలి. అడిగితేగాని అమ్మఅయినా అన్నం పెట్టదు. అందుచేత అడగాలి. అడిగి నౌకర్లను దారిలో పెట్టాలి. మనం పదిమంది నౌకర్లను పెట్టుకుంటే వారు తమలో తాము పార్టీలు-ముఠాలు పెట్టుకుని కొట్లాడుకుని, కాట్లాడుకొని ఒకర్ని మరొకరు

నిందించుకొంటూ తమ పని చేయకుండా జీతభత్యాలు తీసుకుంటున్నారు. ఇదంతా మనం నిలదీసి అడగాలి. మీలో మీరు పార్టీ తగాదాలు, ముఠా తగాదాలు మానండి; వినోదాలు, విలాసాలు, ఆడంబరాలు వదలండి; చెయ్యవలసిన పని చెయ్యండి అని మనం నౌకర్లకు చెప్పాలి. ఇది చెప్పుటకే మేము ఢిల్లీ వెళుతున్నాం. మీరు ఆలోచించండి, కదలండి" అనేవారు గోరా అరటిపండు వొలిచి నోట్లోపెట్టినట్లు.

ఇంకా కొంచెం ముందుకు వెళ్ళి గోరా ఇలా చెప్పేవారు. "దైవభావాన్ని, కర్మను, నుదిటివ్రాతను మనం ఊహించుకున్నాము కాని వాటికి బానిసలమనుకున్నాము. వీటిద్వారా అసమానతలు పోషించుకుని కష్టాలపాలయ్యాము. సాంఘిక కట్టుబాట్లను మనమే ఏర్పరచుకున్నాం. కాని 'సంఘం' ఏమంటుందో" అని భయపడి ఇబ్బందులు పడ్డాము. ఆర్థిక విధానాలు మనమే ఏర్పరచుకున్నాం. కాని వాటికి లొంగిపోయి దరిద్రులమైనాము. ప్రజా ప్రతినిధులను మనమే ఎన్నుకున్నాము. ప్రభుత్వాన్ని మనమే నిర్మించుకున్నాము. కాని వారిని అదుపులో పెట్టక బాధల్లో నుంచి బయట పడలేకున్నాము. మనలోని బానిసభావమే వీటన్నిటికీ కారణం, దాస్యపు ప్రవృత్తిని విడనాడాలి. మానవుడే దైవాన్ని ఊహించాడు. ఆర్థిక సాంఘిక కట్టుబాట్లు ఏర్పరచుకున్నాడు. ప్రభుత్వాన్ని నిర్మించుకున్నాడు. తన సౌఖ్యానికి సమిష్టి సౌఖ్యానికి అడ్డం వచ్చినప్పుడు మానవుడు వీటిని మార్చుకోవాలి. మార్చుకోగలడు. ఇదే నాస్తిక దృష్టి" అని గోరా వివరించేవారు.

మహారాష్ట్ర, మధ్యప్రదేశ్, ఉత్తరప్రదేశ్, పంజాబ్, ఢిల్లీ రాష్ట్రాలలో పర్థా, నాగపూరు, శివనీ, జబల్‌పూర్, దామో, సాగర్, ఝాన్సీ, దతియా, గ్వాలియర్, భిండ్, ఇటావా, ఆగ్రా, మధురా, గుడ్‌గాం జిల్లాలగుండా 99 రోజులు వెయ్యిమైళ్ళకు పైగా పాదయాత్ర సలిపి 1962 జనవరి 14న ఢిల్లీ చేరారు. కుండపోతగా కురిసిన వర్షంగాని, ఎముకలు కొరికిన చలిగాని వీరిని ఆపలేకపోయింది. ఆ సంవత్సరం చలి చాలా తీవ్రంగా ఉంది. వింధ్య, సాత్పురా పర్వత పంక్తులను, మధ్యప్రదేశ్‌లోని దట్టమైన అడవులను, బందిపోటు దొంగలకు ఆవాసములైన చంబల్ చరియలను, నర్మద, యమునా నదులను దాటుకుంటూ ముందుకు సాగారు. దారిపొడుగునా ఎక్కడికక్కడ ఆహ్వాన సంఘాలూ ఏర్పడి అఖండమైన స్వాగతం యిచ్చాయి. స్థానిక పత్రికలన్నీ చాలా తోడ్పడ్డాయి. అన్ని పార్టీల కార్యకర్తలూ సహకరించారు. మరి జండాలు అన్నీ ఉన్నాయిగా - ప్రతీచోటా తృణమో, ఫణమో విరాళమూయిచ్చారు. అయినా అపస్వరాలూ లేకపోలేదు. ఒక గ్రామంలో ఆ గ్రామపెద్ద జమీందారు. గోరా పార్టీలు పోవాలంటున్నారు కనుక తమ గ్రామానికి రావటానికి వీలు లేదన్నాడు. వస్తే పిట్టకూడా కనబడదు, అడుక్కున్నా, ఒక్కముద్ద అయినా దొరకదన్నాడు. అయినా వెళ్ళారు.

తీరా వెళితే భోజనం పెట్టకుండా ఎలా ఉంటారు? కాని మీటింగుకు తన గ్రామస్తులెవరూ వెళ్ళరాదని కట్టడిచేశాడు. ఒకరిద్దరు తన మనుష్యులను మాత్రం పంపాడు. పొరుగూళ్ళనుంచి వచ్చిన వారితోనే మీటింగు జరిగింది. మీటింగుకు వచ్చిన ఒకరిద్దరు జమీందారు మనుషులు, గోరా ఉపన్యాసానంతరం ప్రశ్నలన్నిటికీ సమాధానం చెప్పడంచేత మారిపోయారు.

మరొకచోట "మంత్రులు మన నౌకర్లు, ప్రజలు వారి యజమానులు" అనే బానరు చూచి భయపడి వండిన అన్నం కూడా పెట్టలేదు. అప్పుడు ఆ గ్రామంలోని హైస్కూలు ఉపాధ్యాయులు, విద్యార్థులు చందాలు వేసుకుని విడిగా వండించి పెట్టారు. ఈ రెండు సంఘటనలు కార్యకర్తల ఉత్సాహాన్ని, పట్టుదలను మరింత పెంచాయి. దారిపొడుగునా దళంలో కార్యకర్తలు చేరుతూవచ్చారు. యాత్ర ఏర్పాట్లకు శ్రీయుతులు ఠాకూర్‌దాస్ బంగ్, వసంతరావుగాడే, రాజారాంఫూల్‌బానే, గణేశ్ ప్రసాద్ నాయక్', లోకేంద్రసింహ్, హేమదేవశర్మ, చరణ్‌సింహ్, భగవత్‌సింహ్, మహావీరసింహ్, బ్రజగ్రామ సేవామండల్ కార్యకర్తలు బాధ్యత తీసుకుని చేశారు. ఢిల్లీ ఏర్పాట్లను శ్రీ బాలకృష్ణ మెహతా, సి.ఎ. మీనన్ చూచారు. ఢిల్లీలో శ్రీమతి రామేశ్వరీ నెహ్రూ అధ్యక్షురాలిగా ప్రసిద్ధ హిందీ రచయిత, సంపాదకుడు శ్రీ సత్యదేవ విద్యాలంకార్ కార్యదర్శిగా, పండిట్ సుందర్‌లాల్, అరుణా అసఫ్ అలీ మొదలైనవారు సభ్యులుగా ఒక ఆహ్వాన సంఘం ఏర్పడింది.

1962 జనవరి 14న ఢిల్లీ చేరగానే రాజ్‌ఘాట్ గాంధీజీ సమాధి వద్ద విపరీతమైన చలిలో కూడా వందలాది జనం చేరి సత్యాగ్రహదళానికి స్వాగతం చెప్పారు. రాజఘాట్ వద్ద జరిగిన సభలో గోరా ప్రసంగిస్తూ "గాంధీజీ ఆశలు, ఆశయాలు గాంధీజీతోపాటు సమాధిగతం అయిపోలేదని నిరూపించుదాం. స్వరాజ్యం సురాజ్యంగా మారుటకు ప్రభుత్వం ప్రజలకు సన్నిహితంగా రావాలని గాంధీజీ ఆశించారు. అందుకు అడ్డుపడుతున్న ఆడంబరాలు, పార్టీతత్వాలు తొలగించుటలో గాంధీజీ అనుయాయులుగా ఉండిన ప్రజాప్రతినిధుల సహకారాన్ని అభ్యర్థిస్తున్నాము. ఒకవేళ వారు తోడ్పడలేకపోతే సత్యాగ్రహశక్తిని ప్రజలు విస్మరించరాదు." అని అన్నారు.

ఢిల్లీలో 18 తేదీవరకూ సభలూ, సమావేశాలు జరిపి బాగా ప్రచారం చేశారు. ఈ లోగా ప్రధాని నెహ్రూకు తాము ఢిల్లీ వచ్చినట్లు తెలుపుతూ 18వ తేదీ ఉదయం 9 గంటలకు వారి అధికార నివాసానికి వస్తున్నామని జాబు వ్రాశారు. అలాగే మొత్తం 38 మంది కార్యకర్తలు "జనప్రతినిధియోంసే - పార్టీతోడో, షాన్ ఫౌకత్ ఛోడో" అని హిందీలో వ్రాసిన బానరు పట్టుకుని ప్రధాని నివాసానికి చేరారు. ప్రధానిని కలుసుకొనగోరారు. కాని ప్రధాని నిరాకరించారు. దానితో తాము తిన్నగా భవనంలోనికి

వెళుతున్నామని ప్రకటించారు. కార్యకర్తలు గేటువైపు వెళుతుండగా పోలీసులు గేటుతలుపులు మూసివేశారు. కార్యకర్తలు గేటుముందు అలాగే బైఠాయించారు. ప్రధానమంత్రి నివాసం ముఖద్వారం రాకపోకలకు వీలు లేకుండా బంద్ అయిపోయింది. అలా సుమారు రెండు గంటలసేపు బైఠాయింపు సత్యాగ్రహం కొనసాగిన తర్వాత ప్రధానమంత్రి ప్రధాన అంతరంగిక కార్యదర్శి వచ్చి సత్యాగ్రహులతో మాట్లాడి, మర్నాడు ఉదయం ప్రధానమంత్రితో సమావేశం నిశ్చయించిన తర్వాత ఆ రోజుకు సత్యాగ్రహం నిలుపుచేశారు. మర్నాడు గోరా, శ్రీ మహావీర సింహ్ సత్యాగ్రహుల తరపున వెళ్ళి నెహ్రూతో మాట్లాడారు. నెహ్రూ వీరి వాదనసంతా అంగీకరించారు. అయితే బ్రిటీషు విధానాలను స్వీకరించి అనుసరిస్తున్నమాట యదార్థమేననీ, ప్రజాఉద్యమాల ద్వారానే వాటిని మార్చగలమని తన అభిప్రాయమని గోరాకు చెప్పారు. ఆ తర్వాత సత్యాగ్రహులు సమావేశమై వెయ్యిమైళ్లు పాదయాత్ర ప్రచారం, ప్రధాని బసముందు సత్యాగ్రహం, తర్వాత ప్రధానితో మాట్లాడడం – వీటన్నిటివల్లా విషయాలను ప్రభుత్వదృష్టికి తెచ్చామనీ, ప్రజలలో సంచలనాన్ని కలిగించి సానుభూతిని సంపాదించామనీ, ప్రస్తుతానికి సత్యాగ్రహం ఆపి నెలరోజులలో జరగనున్న ఎన్నికల సమయంలో అభ్యర్థులను ప్రశ్నించే కార్యక్రమం పెట్టుకోవాలనీ, ఎన్నికల అనంతరం కార్యకర్తల శిబిరం ఒకటి ఢిల్లీకీ దగ్గరలో నిర్వహించాలనీ నిశ్చయించారు. ఢిల్లీ సత్యాగ్రహంలో మహారాష్ట్ర, మధ్యప్రదేశ్, ఉత్తరప్రదేశ్, రాజస్థాన్, పంజాబ్, బీహార్, ఢిల్లీ, ఆంధ్రప్రదేశ్ ప్రాంతాలకుచెందిన కార్యకర్తలు పాల్గొన్నారు. ప్రధాని ఇంటిముందు జరిగిన ఈ సత్యాగ్రహం దేశమంతటా కార్యకర్తలలో నూతనోత్సాహాన్ని నింపింది.

ఎన్నికల సమయంలో అభ్యర్థులను రెండు ప్రశ్నలు వేయమని కార్యకర్తలు విరివిగా ప్రచారం చేశారు. 1. మీరు ప్రజా ప్రతినిధులుగా వ్యవహరిస్తారా? పార్టీ ప్రతినిధులుగా వ్యవహరిస్తారా? 2. ఎన్నికైతే మీరు ఎంత జీతభత్యాలు తీసుకుంటారు. ఢిల్లీ చుట్టుప్రక్కల ప్రశ్నల కార్యక్రమం ఉద్యమంగా రూపొంది ప్రజలలో చాలా రాజకీయ చైతన్యాన్ని కలిగించింది.

1962 ఎన్నికలలో కర్నాటక రాష్ట్రంలోని కొప్పల్ నియోజకవర్గం నుంచి శ్రీ శివమూర్తి స్వామి పార్టీరహిత ప్రజాస్వామ్యం సిద్ధాంతంపై లోకసభకు పోటీ చేసి గెలుపొందారు. శ్రీ శివమూర్తి స్వామి విజయం ఉద్యమానికి మంచిబలం చేకూర్చింది. ఆ తర్వాత లోక్‌సభలో ఆయన అవకాశం వచ్చినప్పుడల్లా పార్టీరహితం ఆవశ్యకతను ప్రస్తావిస్తూ ఉండేవారు.

ఎన్నికల అనంతరం 1962 మార్చి నెలాఖరున ఢిల్లీ దగ్గరగా జియాబాద్‌లో కార్యకర్తల శిబిరం జరిగింది. వివిధ రాష్ట్రాల కార్యకర్తలు పాల్గొన్నారు. పార్టీరహితం, నిరాడంబరత గురించి కార్యకర్తలకు ఈ శిబిరం తాత్వికభూమిని అందచేసింది. శిబిరం తర్వాత గోరా, లవణంగార్లు ఉత్తరప్రదేశ్, మధ్యప్రదేశ్‌లలో 20 జిల్లాలు పర్యటించి పార్టీరహిత ప్రజాస్వామ్యం, ప్రజాప్రతినిధుల నిరాడంబరత గురించి తీవ్రంగా ప్రచారం చేశారు.

ఒక ప్రక్కన ఈ కార్యక్రమాలు జరుగుతుండగా 1961లో గోరా ఇంగ్లీషులో పార్టీరహిత ప్రజాస్వామ్యం గురించి ఒక పుస్తకం వ్రాశారు. గోరా ఇలా పుస్తకం వ్రాస్తున్నారని తెలియగానే దక్షిణ భారతదేశంలోని ఒక ప్రచురణకర్త ఆ పుస్తకం ప్రచురణకు తనకు ఇవ్వమని కోరారు. తీరా వ్రాతప్రతి పూర్తి చేసి పంపగా అందులో ప్రజాస్వామ్యాభివృద్ధికి నాస్తికత్వం అవసరమని వ్రాసి వుందనీ, ఆ భాగం తీసివేస్తే అప్పుడు తానది ప్రచురించగలననీ అన్నారు. కాని గోరా అందుకు నిరాకరించారు. చివరకు సత్యాగ్రహ సమాజ్ వారు ఆ పుస్తకాన్ని యథాతథంగా ప్రచురించారు. దీని హిందీ అనువాదం కూడా ప్రచురింపబడింది.

1962 జూన్‌లో కలకత్తాలో గోరా గారి అధ్యక్షతన పార్టీరహిత ప్రజాస్వామ్య సభలు జరిగాయి. వీటిని శ్రీ చారుచంద్ర భండారీ ప్రారంభించారు. ఈ సభలలో లోక్‌సభ సభ్యులు శివమూర్తిస్వామి, పండిట్ సుందర్‌లాల్, నిర్మల్‌కుమార్ భట్టాచార్య, మహావీర్‌సింహ్, విష్ణుశరణ్, లవణం మొదలైనవారు పాల్గొన్నారు. సభలను శ్రీయుతులు భవానీ ప్రసాద్ ఛటర్జీ గణేశ్‌మల్‌బైద్, సుదన్ భట్టాచార్య, బాలకృష్ణ మెహతా నిర్వహించారు. ఈ సభలలో గోరా తమ ఉపన్యాసంలో ప్రస్తుత స్థితి నుంచి పార్టీ రహితంగా ప్రజాస్వామిక ప్రభుత్వాలను మార్చుటకు మన దేశంలో 5 మార్పులు రావాలని సూచించారు.

1. ఎన్నికల సమయంలో పార్టీలకు ప్రత్యేకంగా గుర్తులు రిజర్వు చేయరాదు. అభ్యర్థులందర్నీ సమానంగా గుర్తించి, అందరికీ ఒకేసారి, ఒకే విధానంలో గుర్తులు కేటాయించాలి.

2. ఎన్నికల అనంతరం శాసన సభలలోను, పార్లమెంటులోను సభ్యులు పార్టీబ్లాకులుగా కూర్చునే పద్ధతిని రద్దుచేయాలి. సభ్యులు తమతమ నియోజకవర్గాల వరసలో కూర్చోవాలి.

3. ముఖ్యమంత్రిగాని, ప్రధానమంత్రిగాని శాసనసభలోని లేదా పార్లమెంటులోని సభ్యులందరూ కలిసి "రిపీటెడ్ బాలట్" పద్ధతి ప్రకారం ఎన్నుకోవాలి. అంటే నలుగురు

పోటీ చేశారనుకోండి. ముందు అందరూ నలుగురికీ వోటు వేస్తారు. అందరిలోకి తక్కువ వచ్చినవారిని తొలగించి తిరిగి అందరూ ముగ్గురికీ వేస్తారు. మరల వీరిలో తక్కువ వచ్చిన వారిని తొలగించి ఇద్దరికి వేస్తారు. ఈ విధంగా నెగ్గిన వారికి శాసనసభలో సగంకంటే హెచ్చు సభ్యుల బలం లభిస్తుంది.

4. తీర్మాలనాలపై వోటింగు సమయంలో 'హ్విప్పు' లను తొలగించాలి. సభ్యులకు విషయాలపై అభిప్రాయాలు వ్యక్తపరచుటకుగాని, ఓటు వేయుటకుగాని పూర్తి స్వేచ్ఛ ఉండాలి.

5. ఏ తీర్మానాన్ని అయినాసరే నిరాకరించుటకు, సవరించుటకు, ఆమోదించుటకు శాసనసభ్యులకు పూర్తిస్వేచ్ఛ ఉండాలి. మంత్రులు ప్రవేశపెట్టిన తీర్మానాలు సవరింపబడినా, నిరాకరింపబడినా అది మంత్రులపై అవిశ్వాసంగా పరిగణించరాదు. మంత్రులను తొలగించాలంటే అందుకు ప్రత్యేకంగా అవిశ్వాస తీర్మానము తీసుకురావాలి.

పై ఐదు మార్పులకు రాజ్యాంగాన్ని సవరించవలసిన అవసరం లేదనీ, ఇవి కేవలం ఆచారాలుగా వస్తున్న విషయాలనీ కనుక ఆచారాలను మారిస్తే సరిపోతుందనీ గోరా అంటారు. ఈ ఐదు మార్పులతో ప్రభుత్వంలోంచి పార్టీ తత్వంపోయి స్థిరంగా ఉంటుందని గోరా చెబుతారు.

పార్టీరహిత ప్రజాస్వామ్యం గురించి ఒక స్పష్టమైన అవగాహన మనదేశంలో ఇంకా ఏర్పడలేదు. అంతేకాక పాశ్చాత్య ప్రజాస్వామ్యాల ప్రభావం మన దేశంమీద ఎక్కువగా ఉండటంచేత ప్రజాస్వామ్యం అంటే పార్టీలేనని చాలామంది అనుకొంటూ ఉంటారు. అందుచేత పార్టీరహిత ప్రజాస్వామ్యం గురించి ప్రచారం చేస్తూన్నా, ఆడంబర వ్యతిరేక కార్యక్రమాలకు ఎక్కువ విలువ ఇస్తూ ఉంటే ప్రజలలోనికి చొచ్చుకొని వెళ్ళుటకు వీలుంటుంది. 1962-63 సంవత్సరాలు భారతదేశంమంతా తిరిగి పార్టీరహిత ప్రజాస్వామ్యం, నిరాడంబరతత్వం గురించి ప్రచారం చేసిన తర్వాత 1963 సెప్టెంబర్‌లో అప్పటి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డిగారి అధికారనివాసం ముందు అయిదురోజులు సత్యాగ్రహం చేశారు. సత్యాగ్రహంలో గోరాగారితోపాటు శ్రీమతులు సరస్వతీగోరా, సింగరాజు శకుంతలమ్మ కె. సామ్రాజ్యం, శ్రీయుతులు గుళ్ళపల్లి రాంబ్రహ్మం, కానా, పత్తి శేషయ్య, పరచూరి వెంకటరత్నం, వెదిరె రంగన్నగారలు పాల్గొన్నారు. ఈ సత్యాగ్రహం ఆంధ్రప్రదేశంలో పెద్ద సంచలనాన్ని కలిగించింది. పత్రికలు కూడా చాలా ప్రాముఖ్యత యిచ్చాయి. గోరా సత్యాగ్రహాన్ని సమర్థిస్తూ చాలాచోట్ల తీర్మానాలు చేశారు. ఈ వాతావరణాన్ని ముఖ్యమంత్రి కూడా గమనించారు.

తాను సిద్ధాంతరీత్యా గోరాగారితో ఏకీభవిస్తున్నాననీ, అయితే ఆచరించుటకు ఒక అఖిలభారత పథకం రూపొందిస్తే బాగుంటుందని, ఈ సందర్భంలో తొలిగా దక్షిణాది నాలుగు రాష్ట్రాల ముఖ్యమంత్రులు వినోబావద్ద సమావేశమై ఒక నిర్ణయానికి వస్తే బాగుండగలదని, అందుచేత గోరాగారు తమ సత్యాగ్రహాన్ని విరమించాలని ముఖ్యమంత్రి శ్రీ సంజీవరెడ్డి విజ్ఞప్తిచేశారు. దీనిపై గోరా సత్యాగ్రహాన్ని విరమించి సంప్రదింపులు ప్రారంభించారు. శ్రీ కామరాజ్‌నాడార్, శ్రీనిజలింగప్పలతో ఉత్తరప్రత్యుత్తరాలు జరిగాయి. శ్రీ వినోబాభావేతో శ్రీ సంజీవ రెడ్డి స్వయంగా కొన్ని సంప్రదింపులు జరిపారు. కాని తాను ఇందులో ఉండవలసిన అవసరం లేదని, తన ప్రసక్తి అనవసరమని వినోబా భావించారు. ఆ తర్వాత ఈ ప్రయత్నాలు కొంత వెనుకబడ్డాయి. ఈ లోగా సంజీవరెడ్డి ముఖ్యమంత్రి పదవినుంచి రాజీనామా చేయటం, శ్రీ బ్రహ్మానందరెడ్డి ముఖ్యమంత్రి కావడం జరిగింది. శ్రీ గోరా బ్రహ్మానందరెడ్డిగారితో ఉత్తరప్రత్యుత్తరాలు జరిపారు. కాని తగిన ఫలితం లేకపోయింది. అప్పుడు ముందుగా నోటీసు ఇచ్చి 1964 సెప్టెంబరులో ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ బ్రహ్మానందరెడ్డిగారి అధికార నివాసం "ఫెయిర్‌లాన్స్" ముందు సత్యాగ్రహం చేశారు. ఇందులో గోరా, శ్రీమతి సరస్వతిగోరా, లవణంగార్లతోపాటు కానా, పత్తి శేషయ్య మొదలైనవారు పాల్గొన్నారు.

నిరాడంబరతను ప్రభుత్వం సూత్రప్రాయంగా అంగీకరించినప్పటికీ దాన్ని ఎలాగ అమలు జరపాలి? అనే విషయంలో ముందుకు వచ్చుటకు ముఖ్యమంత్రి ఏమీ శ్రద్ధ చూపకపోవటంచేత ఈ సత్యాగ్రహం అవసరమైంది. సత్యాగ్రహ సమయంలో పెద్ద వర్షాలు పడ్డాయి. అయినా అంత వర్షంలోను సత్యాగ్రహులు దీక్షతో రాత్రింబవళ్ళు నిలబడటం ఒకప్రక్క ప్రజలలో సానుభూతిని పెంచితే మరొకప్రక్క ముఖ్యమంత్రి శ్రీ బ్రహ్మానందరెడ్డిగారు ఆత్మవిమర్శ చేసుకోవటానికి తోడ్పడింది. దానిపై సంభాషణలకు ఆహ్వానించారు.

అప్పటికే సత్యాగ్రహం చేసే చోట రోజూ జరిపే మీటింగులలో గోరా, లవణంగార్లు కొన్ని సూచనలు చేశారు. అందులో ఒక సూచన ఆ సంవత్సరము రాష్ట్రములో తీవ్రంగా కరువు పరిస్థితులు ఏర్పడి ఉండటం చేత ఆడంబరాన్ని సూచించే పూలమొక్కలకు కాక సామాన్య ప్రజల ఆకలి తీర్చుటకు సంసిద్ధతను తెలిపే చిహ్నాముగా కూరగాయలు, పండ్లు మంత్రుల గృహాలలో పెంచాలనేది ఒకటి. ఈ సూచన ముఖ్యమంత్రి బ్రహ్మానందరెడ్డిగారిని ఆకర్షించింది. అందుచేత తాను ఈ సూచనను వెంటనే అమలు పరచగలనని సత్యాగ్రహాన్ని విరమించవలసినదని, సత్యాగ్రహ అనంతరం విరమణ

సంప్రదింపుల ద్వారా మరికొన్ని కార్యక్రమాలు చేపట్టగలనని ఆయన మాట ఇచ్చారు. ఈ విధంగా ఏడురోజుల అనంతరం సత్యాగ్రహాన్ని విరమించటం జరిగింది.

ఆ తరువాత జరిగిన సంప్రదింపులలో మూడు విషయాలు ముందుకు వచ్చాయి. ముఖ్యమంత్రి, మంత్రులు తమ భవనాల చుట్టూ వుండే తోటలలో అధికభాగం పూలమొక్కలను తీసివేసి కూరగాయలను పెంచాలి. దీని ద్వారా రాష్ట్రంలో ఇతరులు కూడా కూరగాయలు పెంచుటకు, తద్వారా ఆహారకొరత తీర్చుటకు వాతావరణం కలిగించే వీలు ఏర్పడుతుంది. రెండవ విషయం, రాష్ట్రంలో తీవ్రమైన కరువు పరిస్థితులు వున్న దృష్ట్యా మంత్రులు విందులు ఇవ్వరాదని, విందులకు హాజరుకారాదని నిర్ణయం చేసుకోవాలి. మూడవది, త్వరలో విజయవాడలో పూలమొక్కలకి బదులు కూరగాయలు పెంచుటకుగాను ఒక మహాసభ ఏర్పాటు చేయాలని, అందులో ముఖ్యమంత్రి పాల్గొనాలని, ఆహార కొరత తగ్గించుటకు గాను పెరటితోటల పెంపకాన్ని రాష్ట్రప్రభుత్వం ఉద్యమముగా తీసుకొని ప్రోత్సహించాలని.

వీటికి అనుకూలంగా ముఖ్యమంత్రి బ్రహ్మానందరెడ్డిగారు వెంటనే ముందుగా తన భవనం చుట్టూ వుండే తోటలో అధికభాగం పూలమొక్కలను తీసివేసి కూరగాయల మొక్కలనే వేశారు. మంత్రులుగాని, ప్రభుత్వాధికారులగానీ అనవసరంగా విందులు ఇవ్వరాదని, అవసరమైన పరిస్థితులలో 30 మంది కంటే ఎక్కువ అతిథులను పిలవరాదని నిర్ణయం చేశారు. వ్యవసాయశాఖ ద్వారా రాష్ట్రం మొత్తం మీద పెరటితోటల పెంపకానికి బృహత్పథకము తయారుచేశారు.

1965 నవంబరు 6వ తారీకున విజయవాడలోని టి.వి. రాఘవయ్య పార్కులో పెద్దపెట్టున కూరగాయల దినోత్సవము ఏర్పాటు చేయబడింది. కృష్ణాజిల్లా వెజిటెబుల్ గ్రోయర్స్‌కో ఆపరేటివ్ మార్కెటింగ్ సొసైటీ, నాస్తిక కేంద్రము సంయుక్తముగా దీనిని ఏర్పాటు చేశాయి. ప్రభుత్వం పూర్తిసహకారాన్ని ఇచ్చింది. సభావేదిక, ప్రాంగణము అంతా కూరగాయలతో అలంకరించారు. మొక్కల కుండీలలో టోమాటో, వంగ, మిరప మొక్కలను ముందునుంచి పెంచి వేదిక చుట్టూ పెట్టారు. సభకు వచ్చిన వారందరికి ఒక్కొక్క దొండకాయ చేతికి ఇవ్వటం జరిగింది. కృష్ణాజిల్లాలోని ఒక సామాన్యరైతు శ్రీ గుళ్ళపల్లి రామబ్రహ్మంగారు అధ్యక్షత వహించారు. “పూలమొక్కల బదులు కూరగాయలు పెంచండి” అనే బేనరు సభాస్థలి వెనుక పెద్దగా వ్రాయబడింది. ముఖ్యమంత్రి బ్రహ్మానందరెడ్డిగారు అత్యవసరంగా ఢిల్లీ వెళ్ళవలసి రావటం చేత ఆయన తరఫున వ్యవసాయశాఖామంత్రి శ్రీ ఎ.సి. సుబ్బారెడ్డిగారిని ఈ మహాసభలకు పంపారు. వక్తలందరికీ సభలో కూరగాయల దండలు వేయటం జరిగింది.

ఈ మహాసభ ఆంధ్రదేశంలో ఒక నూతన చైతన్యాన్ని తీసుకువచ్చిందనటంలో సందేహంలేదు. ఆ తర్వాత నాస్తిక కేంద్రం తరఫున జరిగే ప్రతి వివాహంలోనూ వధూవరులచేత కూరగాయల దండలు మార్పించడం ఒక కార్యక్రమం అయినది. సభలు, సమావేశాలలో కూడా అలంకరణకు కూరగాయలే వాడనారంభించారు. గోరాగారు ప్రారంభించిన ఈ కూరగాయల ఉద్యమం ప్రపంచ దృష్టిని ఆకర్షించింది.

ఈ కూరగాయల ఉద్యమం వెనుక మరొక దృష్టి కూడా ఉన్నట్లు కనబడుతుంది. శ్రీ లవణం తరచు తన ఉపన్యాసాలలో కూరగాయల ఉద్యమాన్ని కులరహిత సమాజ నిర్మాణంతో ముడిపెట్టి చెబుతున్నారు. హిందూ సమాజంలో కులవ్యవస్థ శ్రమవిభజనతో వచ్చినట్లుగా చెబుతారు. శ్రమ విభజన బట్టి బ్రాహ్మణులు పురోహితులుగాను, గురువులుగాను ఉంటున్నారు. పౌరోహిత్యంలోను, చదువు చెప్పటంలోను కూడా ప్రత్యేకంగా శరీరశ్రమతో అవసరం లేదు. ఆ తరువాత వైశ్యులు వ్యాపార, వర్తకాలు చేస్తూ ఆస్తులకు యజమానులుగా వుంటున్నారు. అందులోనూ శరీరశ్రమకు స్థానంలేదు. ఆ పైన క్షత్రియుల విషయం తీసుకుంటే రాజ్యపాలనకు కాకపోయినా యుద్ధ వీరులుగా శ్రమశక్తి అవసరం ఉంది. అయితే క్షత్రియుల శ్రమశక్తి సంహారక శ్రమశక్తే కాని, ఉత్పాదక శ్రమశక్తి కాదు.

ఇక ఉత్పాదక శ్రమ శక్తి అంతా శూద్రులు, పంచముల ద్వారానే జరుగుతుంది. పంటలు పండించినా, ఇళ్ళు నిర్మించినా, బట్టలు తయారుచేసినా, చెప్పులు కుట్టినా, కమ్మరం, కుమ్మరం, వడ్రంగం వంటి వృత్తులు తీసుకున్నా ఇది చేసేవారందరూ ఈ శ్రమ విభజన సిద్ధాంతంవల్ల శూద్రులు గానూ, పంచములుగానూ పరిగణింపబడుతున్నారు.

కులవ్యవస్థ శ్రమవిభజన ద్వారా మొదట్లో ప్రారంభమైనా, అది పుట్టుకతో వచ్చేదిగా తయారయింది. మరొకప్రక్క ఈ కులవ్యవస్థలో శూద్రులు, పంచములు తక్కువ కులాలవారుగా చూపబడుతున్నారు. దీనివలన ఉత్పాదక శ్రమశక్తికి విలువ తగ్గింది. అనుత్పాదక శ్రమశక్తి అగ్రకులాలనబడేవారి సరదాగా మారింది. బస్తాలు మోస్తే తప్పు, వెయిట్ లిఫ్టింగ్ గొప్పది అయింది. కూరగాయలు పెంచితే వ్యవసాయం, పూలమొక్కలు పెంచితే సరదాతో కూడిన తోటపని అయింది. అందుచేత కులరహిత సమాజనిర్మాణానికి తక్కువ కులాలనబడేవారికి కూడా సమాన గౌరవం, సమాన గుర్తింపు తేవటం అవసరం. అలా తీసుకురావాలంటే వారు జేసే పనులకు వృత్తులకు కూడా గౌరవం రావాలి. ఆ గౌరవం రావాలంటే ఆ వృత్తులకు ఆధారమైన ఉత్పాదక శ్రమ శక్తి గౌరవింపబడాలి. కూరగాయలు ఉత్పాదక శ్రమశక్తికి నిదర్శనం, ఉపయోగాత్మక విలువలకు ప్రతినిధి. అందుచేత కూరగాయలకు గౌరవం ఇవ్వడమంటే ఒక ప్రక్క అందరికీ ఆహారం కావాలనే విషయం గుర్తించటం, మరో ప్రక్క ఉత్పాదక

శ్రమ శక్తికి గౌరవాన్నిచ్చి కులరహిత సమాజనిర్మాణానికి తోడ్పడటం. ఈ విధంగా పూలమొక్కల బదులు కూరగాయలు పెంచాలనటం, కూరగాయల దండలు, కూరగాయలతో అలంకరణ విలువలలో సమానత్వంవైపు అభివృద్ధికి సూచన. ఈ విధంగా గోరా ప్రారంభించిన కూరగాయల ఉద్యమం పైకి తేలికగా కనబడినా, లోతుకు వెడుతున్నకొలదీ కొన్ని ముఖ్యమైన మూల విషయాలను ముందుకు తెస్తుంది.

దీనివలనే గోరాగారు జరిపిన చివరి పెద్ద సత్యాగ్రహం కూరగాయల ఉద్యమానికి చెందిన సత్యాగ్రహం అయింది.

1968 మార్చి నెలలో హైదరాబాద్‌లో ఓటర్లవారం జరిపారు. పౌరులుగా ఓటర్ల బాధ్యతలను, వివిధ రంగాలలో వారు నిర్వహించవలసిన పాత్రను ప్రజలకు నచ్చచెప్పటానికి ఇందులో ప్రయత్నం జరిగింది. వారం రోజులు హైదరాబాదు నగరమంతా తిరిగి మీటింగులు జరిపి ప్రచారం చేశారు. పబ్లిక్ పార్కులలో కొంత భాగమైనా పూలమొక్కలు తీసి కూరగాయలు పెంచాలని ఈ ఉద్యమం కోరింది. అందుకు ప్రభుత్వం నిరాకరించటంతో, అప్పటి ముఖ్యమంత్రితో జరిగిన ఉత్తర ప్రత్యుత్తరాల వలన ఫలితం లేకపోవటంతో సత్యాగ్రహానికి దిగవలసి వచ్చింది. రాష్ట్ర అసెంబ్లీకి ఎదురుగా వున్న ఒక పార్కులో కొన్ని పూలమొక్కలను తీసి టమాటో, వంగ, క్యాబేజీ, మిరప, అరటి, కొబ్బరి మొక్కలను గోరా, సరస్వతిగార్ల నాయకత్వంలో కొంతమంది కార్యకర్తలు నాటారు. దీనిపై ప్రభుత్వం శ్రీ యుతులు గోరా, లవణం, చక్రపాణి సత్యనారాయణ గుత్తి కొండరామబ్రహ్మం, కె.వెంకట నరసయ్య, యాసా మధు, ఎస్.జీసస్, సి. మల్లారెడ్డి, సి.హెచ్. ప్రకాష్, యమ్. లక్ష్మయ్య, శ్రీయుతులు సరస్వతీగోరా, సుమతి గార్లను 1968 ఫిబ్రవరి 13వ తేదీన అరెస్టు చేశారు.

ప్రభుత్వం ఆస్తి అయిన పూలమొక్కలను ధ్వంసం చేశారని వీరిపై నేరారోపణ జరిగింది. ఆ ఛార్జీషీటు యదార్థాలను స్పష్టంగా ప్రతిబింబించటానికి ప్రయత్నం చేసింది. అందరికి ఆహారం కావాలనే ఉద్దేశ్యంతో అధిక ఆహారోత్పత్తికిగాను పూల మొక్కలను తీసివేసి వాటిస్థానంలో కూరగాయల మొక్కలు నాటారు అన్ని ఛార్జిషీటులో పేర్కొనటం జరిగింది.

ఒక నెలరోజుల వరకు కేసు విచారణ తీసుకోకుండా వాయిదా వేస్తూ వచ్చారు. వ్యక్తిగత పూచీమీద వదిలిపెడతామని అన్నప్పటికీ సత్యాగ్రహులెవ్వరూ కూడా బెయిల్ తీసుకోవటానికి యిష్టపడలేదు. మరొకప్రక్క అదే సమయంలో అసెంబ్లీ సమావేశాలు జరుగుతూ ఉండటం చేత గోరా తదితరుల నిర్బంధం అసెంబ్లీలో కూడా చర్చకు వచ్చింది. పత్రికలలో కూడా ఈ విషయం చర్చించబడింది. "అధికాహారోత్పత్తికిగాను పూల మొక్కలు తీసివేసి ఆహారాన్ని ఇచ్చే కూరగాయలూ పండించమనటం నేరమా?"

అనే విషయం తల ఎత్తింది. "మ్రింగ మెతుకు లేదు - మీసాలకు సంపెంగనూనె" అనే సామెత చందంగా ప్రభుత్వ వ్యవహారం వుందని విమర్శలు బయలుదేరాయి. వీటన్నిటితో గోరాను వారి సహచరులను ఈ విషయం మీద నిర్బంధించటం నైతికంగా సమర్థనీయం కాకపోయింది. నెలరోజులకు పైగా వీరు జైలులో ఉన్న తరువాత ప్రభుత్వం బేషరతుగా నేరారోపణను, కేసును ఉపసంహరించుకొని అందరినీ విడుదలచేసింది. ఇది ఉద్యమానికి నైతికవిజయం చేకూర్చిపెట్టింది.

గోరా తీసుకున్న సత్యాగ్రహాలు, ఉద్యమాలు మన ఆలోచనలో, నిత్యజీవితంలో సంఘదృష్టిని, నైతిక విలువలను పెంచుటకు ఉద్దేశింపబడినవి. ప్రధానంగా అవి మార్గాన్ని నిర్దేశించేవి. సమాజంలో పాక్షిక మతాతత్వాలు, అవినీతి, స్వార్థం పెరిగిపోతున్న సమయంలో, అసలు వీటికి ఎవరూ ఎదరు నిలబడటానికి ముందుకు రానటువంటి సమయంలో గోరా ఒక్కరు నిలబడటం విశేషం. గోరా కార్యక్రమాల నుండి పెద్ద పెద్ద ఫలితాలు వెంటనే రావాలని ఆశించటం పొరపాటు. గోరా ఉద్యమాల లక్ష్యం సామాజిక విలువలతో మార్పు సాధించడం. తరతరాలుగా పాతుకుపోయిన పాతవిలువలను మార్పు చెయ్యడానికి గోరా ప్రయత్నించినప్పుడు ఈ కార్యక్రమాలు కొత్తగా కనబడటం సహజం. అయితే, అవి ప్రజల దృక్పథంలో మార్పు తీసుకురావడానికి మార్గదర్శకమయ్యాయి.

ఈ కారణం చేతనే ఆయన పార్టీరహిత ఉద్యమంగానీ, ఆడంబర రహిత ఉద్యమంగానీ, కూరగాయల ఉద్యమంగానీ ఎన్నికలలో పార్టీ రహిత సిద్ధాంతంపై పాల్గొనడంగానీ - వీటన్నిటికీ ఒంటరిగా నిలబడే ధైర్యం కావాలి. ఈ సామాజిక వ్యవస్థలో వచ్చే తాత్కాలిక లాభాలను వదులుకునే త్యాగదృష్టి కావాలి. ఈ విధానాలు సమాజాభివృద్ధికి అవసరమనీ, ముందు ముందు సమాజంలో ఈ విలువలకు గుర్తింపు రాబోతున్నదని ఆశతో కూడిన ఉత్సాహం కావాలి. ఈ ఉద్యమాలను వీటికి సంకేతంగానే చూడాలిగాని, పెద్ద పెద్ద విజయాలు సాధించారా, లేదా? అని కాదు.

సమకాలీన సమాజంలో అందరూ పోతున్నదారి కాక, ఆదర్శాలతో, త్యాగంతో, పట్టుదలతో నడచిన కొత్తదారులుగా గోరా సాధించిన ఉద్యమాలు చూడబడతాయి అనడంలో సందేహం లేదు.

ఇవి ప్రజాస్వామ్య అభివృద్ధిని సూచించే కార్యక్రమాలు. ప్రజాస్వామ్యంలో వ్యక్తికి రావలసిన విలువకోసం, గౌరవకోసం పోరాడిన ఉద్యమాలు. వ్యవస్థల ద్వారా వ్యక్తియొక్క వ్యక్తిత్వాన్ని అణచివేస్తున్న సమయంలో వ్యవస్థలను వ్యతిరేకించి ఏకాకిగానైనా నిలద్రొక్కుకున్న ఉద్యమాలు. అందుకే అవి సాధించిన ఫలితాలుగాక, అవి సాగించబడటమే వాటి ప్రత్యేకత.



# ఎన్నికలు

**1952**లో మొట్టమొదటి ఎన్నికలు స్వతంత్ర భారతదేశంలో జరిగినప్పుడు గోరా విజయవాడ నియోజకవర్గంనుండి పార్లమెంటుకు పోటీ చేశారు. ఆ తరువాత ఉద్యమాలు నడిపారు. గాని ఎన్నికలలో పాల్గొనలేదు. అయితే 1952లో పార్టీరహిత ప్రజాస్వామ్యం స్పష్టంగా రూపొందలేదు. 1967లో జనరల్ ఎన్నికలు వచ్చినప్పుడు పార్టీరహిత ప్రజాస్వామిక సిద్ధాంతపై రాష్ట్ర అసెంబ్లీకి కొంతమందైనా పోటీచేయటం మంచిదనే అభిప్రాయం కలిగింది. విజయవాడ నుండి గోరా, కూచినపూడి నుండి పరుచూరి వెంకటరత్నం, నల్లగొండ నుండి కె. మురళీధరరావు రాష్ట్ర అసెంబ్లీకి పోటీచేశారు. పార్లమెంటుకి ఒంగోలు నియోజకవర్గం నుండి శ్రీయం.వి. రామమూర్తిగారు పోటీ చేశారు. వీరిలో ఎవరూ నెగ్గలేదు. వీరిలో ఎవరు ఏ పార్టీలో చేరుతామన్నా ఆ పార్టీలవారు ఆహ్వానించి వుండేవారు. కాని పార్టీరహిత సిద్ధాంతానికి కట్టుబడి ప్రజలలో నూతన చైతన్యం తీసుకొని రావటమే ధ్యేయంగా వీరు ఎన్నికలలో పాల్గొన్నారు.

ఇదే విధంగా 1972లో అసెంబ్లీ ఎన్నికలు వచ్చినప్పుడు విజయవాడ నుండి శ్రీ లవణం, రేపల్లె నుండి శ్రీ వేణుగోపాల్, నల్లగొండ నుండి కె. మురళీధర్ ఎన్నికల్లో పాల్గొన్నారు. ఈ మారు కూడా ఎవరూ నెగ్గకపోయినా ప్రజలలో లోగడకంటే ఎక్కువ చైతన్యం వచ్చింది.

ఎన్నికలలో అధిక ఖర్చులు అవినీతికి ప్రారంభం. కనుక వీరందరు అతి తక్కువ ఖర్చుతో తమ ఎన్నికలను నిర్వహించుకున్నారు. 1967లో గోరాగారు పోటీ చేసినప్పుడు ఆంధ్రప్రదేశ్ హైకోర్టులో ఎన్నికల చిహ్నాల కేటాయింపు విషయమై పార్టీ అభ్యర్థులు

కానివారికి అన్యాయం జరుగుతోందని గోరా కేసు వేశారు. ఈ కేసును కొట్టివేసినప్పటికీ ఎన్నికలలో పాల్గొనే అభ్యర్థులందరిని ఎన్నికల కమీషన్ సమానముగా చూడటంలేదనే విషయం స్పష్టంగా బయటపడింది. ఎన్నికలలో పార్టీలకు ముందుగా గుర్తులు కేటాయించటం ద్వారా పార్టీ అభ్యర్థులు ముందు నుండి తమ గుర్తును ప్రచారం చేసుకోగలుగుతున్నారని, ఇతర అభ్యర్థులకు కేవలం 20 రోజుల వ్యవధి మాత్రమే గుర్తులు ప్రచారం చేసుకొనుటకు లభిస్తుందని గోరా ఈ దరఖాస్తులో పేర్కొన్నారు. ఇది వివక్షత చూపటమనీ, అన్యాయమనీ వారి వాదన.

ఏది ఏమైనా ఎన్నికల ద్వారా తమ భావాలు ప్రచారం చేసుకొనుటకు గోరాకి మంచి అవకాశం లభించింది. అంతేకాక, భారతదేశంలో మొట్టమొదటిసారిగా అభ్యర్థులు అందరినీ ఒకే వేదికమీద నుండి మాట్లాడించే "కామన్ ప్లాటుఫారం" పద్ధతి ప్రారంభించిన ఘనత కూడా గోరాగారిదే. ఈ విధంగా ఎన్నికల విధానంలో కూడా మార్పులకు గోరా ప్రయత్నం చేశారు.



# ప్రపంచ పర్యటనలు

నాస్తికత్వం గురించి, గోరా చేస్తున్న కార్యక్రమాల గురించి తెలుసు కొనుటకుగాను మనకు స్వాతంత్ర్యం వచ్చినప్పటినుండి వివిధ దేశాలకు చెందినవారు నాస్తికకేంద్రానికి రావటం ప్రారంభించారు. ఉత్తర, ప్రత్యుత్తరాలద్వారా కూడా ఇతర దేశాలలోని నాస్తికులు, హేతువాదులు, మానవతావాదులు, సమాజంలో మార్పులకోసం పనిచేసేవారు, ఈ ఉద్యమాల అభిమానులతో నాస్తికకేంద్రానికి సంబంధాలు ఏర్పడ్డాయి. నాస్తిక కేంద్రం చేసే కార్యక్రమాలను అధ్యయనం చేయుటకొరకు రాబర్ట్ బ్లాక్ ఉడ్, బాబ్ లిట్‌విల్లర్, జార్జ్‌విల్లబీ అమెరికానుండి వచ్చి కొంత కాలం నాస్తిక కేంద్రంలో వున్నారు.

ఆ తరువాత స్వీడన్‌కు చెందిన బ్యార్న్ మెర్కర్, జపానుకు చెందిన సుఏకో కొయనాగి, తాకేషి గెంబా, ఆస్ట్రేలియాకు చెందిన రోజ్ మేరీ, ఇంగ్లండుకు చెందిన జాయ్ గ్రూప్ నాస్తిక కేంద్రంలో కొన్ని రోజులు వుండి ఇక్కడి తమ అనుభవాలను, తమతమ దేశాలలోని పత్రికలలో వ్రాయటం ద్వారానూ, తిరిగి వెళ్ళిన తరువాత అచ్చట ఉపన్యాసాలు చెప్పటం ద్వారానూ అక్కడి వారికి తెలియజేశారు. ఈ విధంగా 1966 వరకు ఇతర దేశాల నుండి ఎంతో మంది నాస్తిక కేంద్రానికి వచ్చి వెళ్ళినా, నాస్తిక కేంద్రానికి చెందిన వ్యక్తి విదేశాలకు వెళ్ళే అవకాశం 1966లో గానీ లభించలేదు. 1966లో అమెరికాలోని నీగ్రోల సమాన హక్కుల పోరాటాన్ని, యుద్ధ వ్యతిరేక శాంతి ఉద్యమాన్ని, యువతీ యువకుల ఉద్యమాలను పరిశీలించుటకు శ్రీ లవణంకి ఒక స్కాలర్‌షిప్పు లభించింది. ఈ అవకాశాన్ని తీసుకొని శ్రీలవణం అమెరికాలోని నాస్తిక హేతువాద, మానవతావాద, లౌకికవాద సంస్థలతో కూడా

పరిచయం చేసుకొని సంబంధాలను పెంచుకున్నారు. అంతేకాక నాస్తికత్వంపైన, నాస్తిక కేంద్రం చేస్తున్న కృషిపైన అమెరికాలో ఉపన్యాసాలు, రేడియో ఇంటర్వ్యూలు ఇచ్చారు. 1967 ఏప్రిలో ఫిడెల్ఫియాలో జరిగిన, అమెరికన్ హ్యూమనిస్టు అసోసియేషన్ మహాసభలలో ప్రత్యేక అతిథిగా పాల్గొన్నారు. ఆ తరువాత అమెరికాలోని పలు ప్రాంతాలలో హ్యూమనిస్టు సంఘాల ఆహ్వానంపై ఉపన్యాసాలిచ్చారు. అమెరికా నుండి తిరిగి వస్తూ కెనడా, జపాన్, దక్షిణ కొరియా, హాంగ్‌కాంగ్, థాయిలెండ్, సింగపూర్‌లలో హ్యూమనిస్టు సంఘాలను నాస్తికులను కలుసుకొన్నారు. యూరప్‌లోనూ, ఆస్ట్రేలియాలోనూ ఉండే హ్యూమనిస్టు, రేషనలిస్టు సంఘాలతోనూ, నాస్తికులతోనూ పరోక్ష పరిచయాలు కూడా పొందారు.

1969 జనవరిలో "ది ఎథీస్టు" ఇంగ్లీషు మాసపత్రికను ప్రారంభించటం వలన కూడా అంతర్జాతీయ సంబంధాలు పెరిగాయి. 1969-70లలో బ్రిటీష్ నాస్తికురాలు జిల్ డేమర్స్ 6నెలల పాటు నాస్తిక కేంద్రంలో ఉండి అంతర్జాతీయ సంబంధాలకు తోడ్పడ్డారు. 1970 జనవరిలో నాస్తిక కేంద్రంలో జరిగిన నాస్తిక సభలలో జిల్ డేమర్స్ మాత్రమేకాక, ఇంగ్లండుకు చెందిన బార్బబీ మార్టిన్, అమెరికాకు చెందిన జాన్ యంగ్ కూడా పాల్గొన్నారు. ఆ మహాసభలు జరుగుతున్న సమయంలోనే 1974 ఆగస్టునెలలో అమెరికాలోని బోస్టన్‌లో జరుగనున్న ఇంటర్ నేషనల్ హ్యూమనిస్టు అండ్ ఎథికల్ యూనియన్ మహాసభలో పాల్గొనవలసిందిగా గోరాను ప్రత్యేకంగా ఆహ్వానించారు.

బోస్టన్ మహాసభకు గోరా ఆహ్వానింపబడ్డారని తెలియగానే ప్రపంచంలోని పలుదేశాల హ్యూమనిస్టు, రేషనలిస్టు సంఘాలు తమ దేశాలు కూడా పర్యటించవలసినదిగా గోరాను ఆహ్వానించాయి. ఆంధ్రదేశంలోని అభిమానులు గోరా ప్రపంచ పర్యటనకు విమానం టిక్కెట్టుకు విరాళాలు వసూలుచేసి ఇచ్చారు.

ఈ విధంగా 1970 జూన్ నెలలో భారతదేశం నుండి బయలుదేరి నాలుగు నెలలకు పైగా గోరా ఇటలీ, పశ్చిమ జర్మనీ, స్వీడన్, నార్వే, డెన్మార్క్, హాలెండ్, బెల్జియం, ఫ్రాన్స్, ఇంగ్లండ్, ఐర్లెండ్, అమెరికా, కెనడా, హవాయి, ఫిజీ, న్యూజిలాండ్, ఆస్ట్రేలియా, ఇండోనేషియా, సింగపూర్, మలేషియా, శ్రీలంక దేశాలు పర్యటించి అచ్చటి హేతువాద మానవతావాద సంఘాలను, నాస్తికులను కలుసుకున్నారు. నాస్తికత్వం ఆవశ్యకతపై ఉపన్యాసాలిచ్చారు. అంతర్జాతీయ హ్యూమనిస్టు మహాసభలలో చాలా మంది గోరాచే ఆకర్షింపబడ్డారు. గోరా పర్యటనకు ఆయాదేశాల పత్రికలు,

రేడియో, టెలివిజన్‌లు ప్రాముఖ్యతనిచ్చాయి. ఒక నాస్తికుడు నాస్తిక ప్రచారంలో ప్రపంచ పర్యటన చేయటం అదే మొదటిసారి. అంతకు ముందు నాస్తికులు యూరప్, అమెరికాలు దాటి ఇతర చోట్లకు పోలేదు.

గోరా ప్రభావంతో లారీ బుల్లక్ ఆస్ట్రేలియాలోను, మేడలిన్ ముర్రే ఓహైర్ అమెరికాలోనూ గోరా సమక్షంలో నాస్తిక సంఘాలు స్థాపించారు. అమెరికాలో అంతకుముందు "అమెరికన్ అసోసియేషన్ ఫర్ ఎడ్వాన్స్‌మెంట్ ఆఫ్ ఎథీజమ్" అనే సంస్థ ఉండేది. కాని 1960 నాటికి ఆ సంస్థ చితికిపోయింది. అందుచేత శ్రీమతి ఓహైర్ కొత్తగా అమెరికన్ నాస్తిక సంఘాన్ని ప్రారంభించారు.

గోరా జరిపిన ఈ ప్రపంచ పర్యటన చాలా విజయవంతమైంది. ఆ సందర్భంలోనే ప్రపంచ నాస్తిక మహాసభలు జరపాలనే సూచన వచ్చింది. గోరా, శ్రీమతి ఓహైర్‌లు కన్వీనర్లుగా విజయవాడలో ప్రపంచ నాస్తిక సభలు 1971 డిసెంబర్‌లో జరపాలని నిర్ణయించారు. కాని 1971 లో తూర్పు పాకిస్తాన్ సంఘర్షణలో భారతదేశంలో పరిస్థితి కొంత చికాకుగా ఉన్నందున ఈ సభలు 1972 డిసెంబరుకి వాయిదా వేయటం జరిగింది.

ఈ విధంగా ప్రథమ ప్రపంచ నాస్తికసభలు 1972 డిసెంబర్‌లో విజయవాడ నాస్తిక కేంద్రంలో జరిగాయి. అయితే సరిగ్గా అదే సమయంలో ప్రత్యేక ఆంధ్ర ఉద్యమం ఉధృతరూపం తీసుకోవటంతో చాలామంది ప్రతినిధులు విజయవాడ రాలేకపోయారు. అమెరికానుండి వచ్చిన మార్గరెట్ రీష్, ఎడ్విన్ లిడిన్ మాత్రం విజయవాడ చేరుకోగలిగారు. శ్రీమతి ఓహైర్‌కు వీసా లభించకపోవటంలో ఆమె ఈ సభలకు రాలేకపోయారు. ఇన్ని అవాంతరాల మధ్య ప్రథమ ప్రపంచ నాస్తికసభలు విజయవాడలో జరిగాయి. ఈ సభల రిపోర్టు ప్రపంచంలోని నాస్తిక, హేతువాద పత్రికలు ప్రముఖంగా ప్రచురిస్తాయి. ప్రపంచ నాస్తికోద్యమ చరిత్రలో ఈ మహాసభలు ఒక విశిష్ట స్థానాన్ని పొందాయి.



# పంది - గోమాంస కార్యక్రమం

**1972** భారత స్వాతంత్ర్య రజతోత్సవ సంవత్సరం కూడా, ఈ సందర్భంలో హిందూ ముస్లింల తగాదాతో స్వాతంత్ర్యం సంపాదించిన భారతదేశంలో మానవతా దృష్టిని మరింతగా పెంపొందించుటకుగాను పంది మాంస, గోమాంస కార్యక్రమాన్ని గోరా తలపెట్టారు. ఆహార విషయాలను కూడా కులమత తత్వాలకు ముడిపెట్టి విధి నిషేధాలు ఏర్పరచటం మానవుని ప్రాథమిక స్వేచ్ఛకే భంగకరం. మానవునికి తన యిష్టం వచ్చిన ఆహారం తాను తీసుకొనుటకు స్వేచ్ఛ ఉండాలి. కాని హిందువులు గొడ్డు మాంసం తినరాదని నిషేధం వుంది. ఈ నిషేధాలు ఆహార స్వేచ్ఛకు వ్యతిరేకం. అందుచేత స్వాతంత్ర్య రజతోత్సవ సందర్భంలో 1972 ఆగస్టు 15వ తేదీన నాస్తిక కేంద్రంలో గోమాంసం, పంది మాంసం చిన్న చిన్న ముక్కలు తీసుకొని రెంటినీ ఒక్కసారిగా కలిపి తినే కార్యక్రమం గోరా రూపొందించారు. ఆహార విషయాలలో విధి నిషేధాలు వుండరాదనీ ఏ ఆహారమైనా, ఎవరైనా స్వేచ్ఛగా తినవచ్చుననీ భావించేవారు ఇందులో పాల్గొనవచ్చునని గోరా ఆహ్వానించారు.

ఈ కార్యక్రమానికి సనాతన హిందువులనుండి పెద్ద వ్యతిరేకత వచ్చింది. ముఖ్యంగా పూరీ శంకరాచార్యులవారు ఆదిలో దీనిని గట్టిగా వ్యతిరేకించారు. ఈ కార్యక్రమాన్ని నిషేధించవలసిందిగా ముఖ్యమంత్రికి, ప్రధాన మంత్రికి, ప్రెసిడెంట్‌కి విజ్ఞప్తులు ఇచ్చారు. రెండువేలమంది భక్తులతో తాను వచ్చి ఈ కార్యక్రమాన్ని ఆపనున్నానని పూరీ శంకరాచార్యులు ప్రకటించారు. దీనికి ప్రతిగా తమిళనాడు నుండి పెరియార్ ఇ.వి.రామస్వామి అనుయాయులు ఒక ప్రకటన చేస్తూ గోరాను సమర్థిస్తూ తాము 20 వేల మందిమి రాగలమన్నారు. మరొక ప్రక్క కృష్ణా జిల్లాలోని హరిజన క్రైస్తవులు పూరీ శంకరాచార్యుల ప్రకటన తమను అవమానపరుస్తుందనీ,

హిందువులలో తాము మాత్రమే గొడ్డు మాంసం తింటున్నామనీ, అందుచేత తమకు గౌరవం కల్పిస్తున్న గోరా కార్యక్రమాన్ని తాము సమర్థిస్తున్నామని ప్రకటన చేశారు.

ఈ వాతావరణం మధ్య భారత ప్రభుత్వం కార్యక్రమం యొక్క రూపురేఖలు స్పష్టంగా పరిశీలించి గోరా జరుపుతున్న దాని చట్టానికి వ్యతిరేకంగా ఏమీ లేదని నిర్ధారించుకున్నది. దీనివలన ఈ కార్యక్రమాన్ని నిషేధించే ప్రశ్న లేకపోగా దీనిని వ్యతిరేకించే ప్రదర్శనలనే ప్రభుత్వం విషేధించవలసిన అవసరం కలిగింది.

1972 ఆగష్టు 15వ తేదీన నాస్తిక కేంద్రం చుట్టూ ప్రభుత్వం 144వ సెక్షన్ విధించి, గట్టి పోలీసు బందోబస్తు చేసింది. ఉన్నతాధికారులు ఎప్పటికప్పుడు పరిస్థితి సమీక్షించుకున్నారు. శంకరాచార్యులుగానీ, వారి శిష్యబృందంగానీ రాలేదు. 5,6గురు ఈ కార్యక్రమాన్ని వ్యతిరేకిస్తూ నినాదాలు చేస్తూ వచ్చారు. వారిని పోలీసులు కస్టడీలోకి తీసుకొని తరువాత విడుదల చేశారు. 200 మందికి పైగా హిందూ, క్రైస్తవ, మహమ్మదీయ కుటుంబాలకు చెందిన వారు ఆంధ్రప్రదేశ్ నలుమూలల నుండి వచ్చి ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. ఈ కార్యక్రమం ప్రభావం దేశమంతటా కనిపించింది. సనాతన మత ఛాందసులు (వినోబాతో సహా) దీనిని వ్యతిరేకిస్తే, మరొకప్రక్క మార్పును కోరేవారు దేశం మొత్తం మీద నుండి అన్ని మతాలకు చెందినవారు కార్యక్రమాన్ని సమర్థిస్తూ ఉత్తరాలు వ్రాశారు. ఈ కార్యక్రమం అంతర్జాతీయ దృష్టిని కూడా ఆకర్షించింది. ఒక ప్రక్క వర్ణాంతర, మతాంతర వివాహాలు మానవులకు జీవిత భాగస్వామిని ఎన్నుకునే స్వేచ్ఛను ఇస్తే, మరొకప్రక్క పంది - గోమాంస కార్యక్రమం ఆహార స్వేచ్ఛకు ప్రతినిధి అయింది.

1970-74 మధ్య ఇంకా ఎక్కువమంది విదేశీయులు నాస్తికకేంద్రం గురించి తెలుసుకొనుటకు వచ్చారు. నాస్తికకేంద్రం కార్యక్రమాలు ప్రపంచమంతా ప్రచారం పొందుతున్నాయి. 1974 ఆగష్టులో హాలెండులోని ఆమ్‌స్టర్‌డామ్‌లో అంతర్జాతీయ హ్యూమనిస్టు మహాసభలు జరిగాయి. మరల గోరాను ప్రత్యేక అతిథిగా ఆహ్వానించారు. ఈమారు యూరప్ పర్యటనలో సోవియట్ యూనియన్ కూడా రావలసిందిగా సోవియట్ యూనియన్‌లోని విదేశాల స్నేహ సంబంధ సంఘం గోరాను ఆహ్వానించింది. 1974లో యూరప్‌లోని వివిధ దేశాలే కాక, సోవియట్ యూనియన్, ఈజిప్టు కూడా గోరా పర్యటించారు. 1976లో ఆఫ్రికా దేశాలు పర్యటించవలసిందిగా గోరాను కోరటం జరిగింది. కాని ఆఫ్రికాదేశాల పర్యటనకాకుండానే గోరా మరణించటం జరిగింది. అయితే గోరా ప్రపంచ పర్యటనలు, విదేశ సంబంధాలు ప్రపంచ నాస్తికోద్యమ నిర్మాణానికి గట్టి పునాదులు వేశాయి.



# నాస్తికత్వం సంపూర్ణరూపం

"వాడు నాస్తికుడు. వాడికి దేవుడూ లేదు, దయ్యమూ లేదు" అని దూషణపదంగా ఉపయోగింపబడుతూ వస్తున్న నాస్తికపదానికి గోరా తన ప్రచార ప్రబోధాల ద్వారా అంతకంటే ఎక్కువగా తన ఆచరణద్వారా ప్రతిష్టను తీసుకువచ్చారు. ఎవరైనా తాను నాస్తికుణ్ణి అని ధైర్యంగా, బహిరంగంగా, సగౌరవంగా చెప్పుకో గలిగేటట్లు చేశారు.

ఇలా ఆధునిక నాస్తికోద్యమ నిర్మాత అయిన గోరాని ఒక తీవ్రమైన సమస్య ఎదుర్కొంది. నాస్తికత్వ అభివృద్ధిని ఏ రూపంలో మలచినట్లయితే నాస్తికోద్యమానికి మంచి భవిష్యత్తు ఉంటుంది? అత్యధికంగా ఫలితాలు సాధించగలుగుతుంది. నాస్తికత్వం పేర కొన్ని సంస్థలు నెలకొల్పటమా? లేక నాస్తికత్వాన్ని బహుజనాలలో కొద్ది కొద్దిగానైనా ప్రవేశింపజేసి ఒక జీవితవిధానంగా, ఆచరణను ప్రభావితంచేసే ఆదర్శయుత ఉద్యమంగా నిర్మించుటా? రెండు విధానాలలోను కొన్ని కొన్ని అవకాశాలూ ఉన్నాయి. సాధక బాధకాలూ వున్నాయి.

నాస్తికత్వం పేరున సంస్థలు ఏర్పరచి, నియమావళులు రచించి, కట్టుదిట్టాలతో నిర్మాణం చేసినట్లయితే ఆ సంస్థలలో ఉండే కార్యకర్తలు "ఇది నాది" అని అనుకుని శ్రద్ధగా పనిచేయుటకూ, సమాజంలో "అదిగో నాస్తికత్వం పేరుతో ఫలానా ఫలానా సంస్థలున్నాయి" అని చూపించుటకూ అవకాశం ఉంటుంది. ఈ అవకాశంతో వచ్చే లాభాలు కూడా చాలా ఉన్నాయి. త్వరత్వరగా పదిమందిని ఉత్సాహపరచి సంస్థలను అభివృద్ధి చేసి కార్యకర్తల సంఖ్య పెంచవచ్చును. ఈ కార్యకర్తలతో ప్రదర్శనయోగ్యంగా

ఉండే కొన్ని కొన్ని పెద్ద పెద్ద కార్యాలు సాధించి చూపవచ్చు. అయితే ఈ విధానంలో ఒక పెద్ద నష్టం కూడా ఉంది. సంస్థలలో చేరిన వ్యక్తులు మొదట్లో ఆదర్శయుతంగా ఉండినా తర్వాత నిహితస్వార్థాలు (వెస్టెడ్ ఇంటరెస్ట్సు) ఏర్పడి తమ తమ సంఘాల, సంస్థలపేర్లకు అధిక ప్రాధాన్యతలిచ్చి, తను గుప్పిట్లో ఆ సంస్థలను పెట్టుకొని కొత్తవారిని రానివ్వకుండా, ముఠాలు కట్టి అసలు ఆదర్శాలకే తిలోదకాలిచ్చే ప్రమాదమూ ఉంది. అలాగే సంస్థలలో హెచ్చుగా బంధించకుండా, నాస్తికత్వాన్ని ఒక విప్లవ సాధనమగు ఉద్యమంగా అభివృద్ధి చేయుటలోను లాభనష్టాలు రెండు వున్నాయి. ఈ విధానం వల్ల ఇది తమ బాధ్యత అని హెచ్చుమంది భావించకపోవచ్చు. దీనివల్ల వెంటనే ప్రదర్శనగా చూపదగు ఘనకార్యాల సాధనకు అవకాశం తక్కువగా ఉంటుంది. అభివృద్ధి నెమ్మదిగా జరుగుతుంది. కాని దీనివల్ల వచ్చేలాభం పెద్దది. ఎవరు ఎంత వరకూ శ్రద్ధగా, ఉత్సాహంగా, నిజాయితీలో పనిచేస్తారో అంత వరకూ స్థానం ఉంటుంది. ఎప్పుడైతే పనిచేయరో వారికి ప్రాధాన్యత తగ్గిపోతుంది. కొత్తవారికి ఎప్పుడూ అవకాశం వుంటుంది. నిహిత స్వార్థాలు ఏర్పడుటకుగాని, కొందరు తమ గుప్పిట్లో పెట్టుకొనుటకుగాను ఏమీ ఉండదు. ఇలాంటి విధానంలో కార్యకర్తలు తమ ఆచరణద్వారా స్వశక్తితో పైకిరావలసి ఉంటుంది. నెమ్మదిగా అభివృద్ధి జరిగినా ఎక్కువమందిలో ప్రవేశించుటకు అవకాశం ఉంటుంది.

ప్రారంభంలో నాస్తికత్వం ప్రచారదశే కనుక నిర్మాణం విషయం అంతగా రాలేదు. 1941 ఫిబ్రవరిలో కనుమూరులో ప్రథమ నాస్తిక మహాసభలు జరిగినప్పుడు గోరా అధ్యక్షులుగాను, శ్రీ తుమ్మల గోపాల కృష్ణయ్య కార్యదర్శిగాను నాస్తికసంఘం ఏర్పడిందంటే నాస్తికత్వాన్ని విస్తృతంగా ప్రచారం చేయుటకే అది ఉద్దేశింపబడింది. వారిద్దరూ కలసి కృష్ణా, గుంటూరు జిల్లాలో ఎక్కువగా పర్యటించారుకూడా. ఆ తర్వాత శ్రీ నాగులపల్లి సీతారామయ్యగారు కార్యదర్శిగా ముదునూరులో ఏర్పడిన నాస్తిక సంఘం ఉద్దేశమూ అదే.

1941 తర్వాత 'సంఘం' ప్రారంభించిన అనంతరం 1949 మార్చి6న పటమటలోని నాస్తికకేంద్రంలో నాస్తికుల సమావేశం జరిగింది. ఆ తర్వాత 1951 జూన్ 5,6 తేదీలలో నూజివీడులోను, 1956 అక్టోబరు 20, 21 తేదీలలో సూర్యాపేటలోనూ నాస్తికుల సభలు జరిగాయి. 1957 జనవరి 27 నుండి ఫిబ్రవరి 3 వరకూ వారంరోజులు కడపజిల్లా ప్రొద్దుటూరులో నాస్తికకార్యకర్తల శిబిరం జరిగింది. 1959 అక్టోబరు 29 నుంచి నవంబరు 1 వరకూ 4 రోజులు వరంగల్ జిల్లా లక్కవరంలో నాస్తికుల సమావేశం జరిగింది.

ఒకప్రక్క నాస్తికత్వాన్ని ఉద్యమరూపంలో నిర్మిస్తున్నా, మరోప్రక్క కొందరు సభ్యులతో నాస్తికసంఘాన్ని కూడా నిర్మించ ప్రయత్నించారు. 1951 జూన్ 5-6 లలో నూజివీడులో జరిగిన సమావేశంలో అంతవరకూ నాస్తికత్వం అభివృద్ధికి జరిగిన కృషిని సమీక్షించి, 'నాస్తిక సంఘం'ను ఏర్పరిచారు. అప్పుడు ఈ సంఘంలో 25గురు ప్రాథమిక సభ్యులుగా చేరారు. ఆ సంఘానికి శ్రీయుతులు కానా, సుగం గార్లను కార్యదర్శులుగా, శ్రీయుతులు మేరుగు, లవణం, మల్లెల నాగయ్య, పందిరి గురువు, శ్రీమతి సరస్వతిగార్లు సభ్యులుగా ఒక కార్యనిర్వాహక వర్గాన్ని ఎన్నుకున్నారు. ఈ సమావేశంలో నాస్తిక సంఘానికి ఒక నియమావళిని కూడా రచించి ఆమోదించారు.

తొలిసారిగా రచింపబడిన ఆ నాస్తికసంఘం నియమావళి అవశ్యకత ఆశయం గురించి ఇలా వ్రాయబడింది:

## ఆవశ్యకత

దాదాపు 20 సంవత్సరాల నుండీ నాస్తిక ప్రచారం సాగిస్తున్నప్పటికీ, గత ఐదేండ్లవరకూ ఆస్తిక వ్యతిరేకభాగమే (నిరీశ్వరవాదమే) హెచ్చుగా నుండెను. ఆ పిదప అది ఒక నిర్మాణాత్మక జీవిత విధానముగా రూపొంది, ఆర్థిక రాజకీయ, నైతిక, కళారంగములలో విశిష్టమైన కార్యక్రమాలను ఏర్పరచుకొనుచు విస్తృతమగుచున్నది. 'సంఘం' పత్రిక ద్వారా వివిధ ప్రదేశాలలో నాస్తిక ప్రచారం విరివిగా సాగుచున్నది. ఇప్పటి వరకు అక్కడక్కడ వ్యక్తిగతంగా కృషి చేస్తున్న నాస్తికులను సంఘటితపరచి కార్యక్రమాలను ఏకోన్ముఖంగా కొనసాగించుటకుగాను నాస్తిక సంఘం నిర్మాణావశ్యకత ఏర్పడింది.

## ఆశయం

వాస్తవికత, సంఘదృష్టి, వ్యక్తిత్వము (వా.స.వ్య)- వీటి చైతన్యసమ్మేళనంతో జీవితవిధానమును ఏర్పరుచుట, మరియు వా.స.వ్య సూత్రము ననుసరించి సభ్యులు తమ నిత్యజీవిత సమస్యలను పరిష్కరించుకొనుటకు ఆ జీవిత విధానమును ప్రచారము చేయుటకు తగు సలహాలను, సహాయములను ఇచ్చుట నాస్తిక సంఘము యొక్క ఆశయము.

## వివరణ

సత్యాసత్య వివేచనమందు యదార్థములతో పోల్చి ఎప్పటికప్పుడు నిర్ధారణ చేసికొనుటే వాస్తవికత. ఇందు మూఢవిశ్వాసములకు, సిద్ధాంతములయెడ దురభిమానములకు తావు లేదు. పరలోక ప్రతిపాదన నిర్ధారణకు నిలువదు గనుక దానిని వాస్తవికత తిరస్కరించును.

సంఘదృష్టి అనగా ప్రతివ్యక్తి ఇతరులను తనతో సమంగా చూచుకొనుట. ఆర్థిక అవకాశములలోగాని, సంఘ మర్యాదలలో గాని ఎక్కువ తక్కువకు సంఘదృష్టిలో తావులేదు. జాతి కుల మత వర్గ భేదములు సంఘదృష్టిలో సమసిపోవును.

వాస్తవిక జ్ఞానమును సంపాదించుటకూ, సౌఖ్యాభివృద్ధితో జీవించుటకూ చేయు ప్రయత్నములలో మానవుడు సర్వస్వతంత్రుడని గుర్తించుటయే వ్యక్తిత్వము. వాస్తవికత, సంఘదృష్టులకు అనుగుణంగా వ్యక్తిత్వం వికసించుచుండును. వ్యక్తిత్వమందు ఆత్మవిశ్వాసము అపరిమితముగా నుండును. దైవనమ్మిక పూర్వ జన్మ సిద్ధాంతం, పరిస్థితులపై ఆధారం, రాజకీయ నియంతృత్వము వ్యక్తిత్వమునకు లోపము తెచ్చును. అందుచేత అవి వాస్తవికములుకావని తిరస్కరించుటయేకాక, వ్యక్తిత్వదృష్ట్యాట వాటియందు విశ్వాసముంచుట కూడా హానికరము.

'నాస్తికసంఘం' అంటూ ఏర్పడడమే ఒక పెద్ద ప్రత్యేకత. ఈ సంఘం తర్వాత ముందుకు త్రోసుకువచ్చి పనిచేయలేక పోయింది. అది సహజం కూడా. ఎందుకంటే నాస్తికుడు అని అనుకోగానే చాలా బాధ్యతలు మీద పడిపోతాయి. ఈ సంఘం హెచ్చుగా సాధించలేక పోయినా, నాస్తికాభివృద్ధికై జరిగిన కృషిలో ప్రధాన ఘట్టంగా భవిష్యత్తుకు మార్గదర్శిగా ఉంటుంది.

నాస్తికులు కొద్దిమందే ఉన్నారు. వారికి అవకాశాలూ తక్కువ. నాస్తికత్వాన్ని జీవిత విధానంగా రూపొందించాలని ఆర్థిక, సాంఘిక, రాజకీయ రంగాలలో నాస్తిక దృక్పథాన్ని, పెంపొందించాలని కృషి చేసేటప్పుడు అందరూ ఒకే కార్యక్రమం తీసుకోవాలన్నా సాధ్యపడదు. అందుచేత నాస్తికులు తమ తమ శక్తిని బట్టి, అవకాశాలబట్టి నాస్తికదృష్టితో ఏ కార్యక్రమాలు తీసుకోగలరో అవే తీసుకుని కృషి చేయాలనుకున్నారు. కొందరు సహపంక్తి భోజనాలు కార్యక్రమం వరకే తీసుకోగలిగితే, మరి కొందరు రాజకీయ దృక్పథం మార్పుకు సత్యాగ్రహాలవరకూ తీసుకున్నారు. కొందరు నాస్తికసాహిత్యాన్ని చదవడం, ప్రచారం చేయడం వరకే తీసుకుంటే మరికొందరు నాస్తికత్వాన్ని జీవితంలోని అన్ని రంగాలకు విస్తరింపజేయుటకు కృషి చేస్తున్నారు. ఇలా నాస్తికులు అందరూ తమ తమ అవకాశాలు, శక్తినిబట్టి నాస్తికత్వాభివృద్ధికి తోడ్పడుతున్నారు.

1960 నుండి 70 వరకు ఒక దశాబ్దం ఆర్థిక రాజకీయ కార్యక్రమాలపై గోరా కేంద్రీకరించారు. అపుడు ఎక్కువ సభలు సత్యాగ్రహాలు జరిపారు. నాస్తికదృష్టితో రాజకీయ, ఆర్థిక సమస్యలను ఎలా పరిశీలించవచ్చునో, పరిష్కారాలు ఎలా ఆలోచించవచ్చునో సమాజం ముందు పెట్టారు. ఈ కార్యక్రమాల ద్వారా నాస్తికోద్యమానికి చాలామంది కొత్త కార్యకర్తలు కూడా వచ్చారు. అంతేకాక ఈ

దశాబ్దంలో నాస్తికకేంద్రం ప్రపంచవ్యాప్తంగా ప్రచారమైనది. ప్రపంచములోని పలు ప్రాంతాల నుండి సమాజపరివర్తనా రంగంలో పనిచేసే కార్యకర్తలు, నాస్తికాభిమానులు నాస్తిక కేంద్రానికి వచ్చి వివిధ విషయాలు లోతుగా అధ్యయనం చేశారు.

అనుభవాలతో 1970 జనవరిలో విజయవాడ నాస్తిక కేంద్రంలో జరిగిన నాస్తిక మహాసభలు, 1972 డిసెంబరులో నాస్తికకేంద్రంలో జరిగిన ప్రథమ ప్రపంచ నాస్తికసభలు, గోరా విదేశ పర్యటనలు, గోరా రచించిన 'పాజిటివ్ ఎథీజం' – ఇవన్నీ నాస్తికోద్యమ అభివృద్ధికి దోహదం చేశాయి.

1970 తరువాతనే నాస్తికత్వం పేరుమీద ఇతరులు కూడా సంఘాలు ఏర్పరచటం ప్రారంభమైంది.

ప్రస్తుతం సమాజంలోని అనుభవాలరీత్యా చూస్తే నాస్తికత్వాన్ని సంస్థల రూపంలో నిర్మించి అభివృద్ధి చేయడంకంటే, నెమ్మదిగా అయినా ఉద్యమరూపంలోనే అభివృద్ధి చేయుట మంచిదని గోరా అభిప్రాయము. సంస్థల రూపంలో నాస్తికాభివృద్ధికి ప్రయత్నిస్తే నాస్తికత్వం సాంఘిక, ఆర్థిక, రాజకీయ, రంగాలలోనికి విస్తరించుటలో ఆటంకాలు ఏర్పడతాయని గోరా భావన. అంతేకాక ఆ దారిన వెళితే నిరీశ్వరవాదానికే హెచ్చు ప్రాధాన్యత ఏర్పడి ఆచరణభాగం విస్మరింపబడవచ్చునని ఆయన అనుభవంలో కనబడిన విషయం. గోరా ఆచరణకు ప్రాధాన్యత ఇచ్చి జీవితంలోని అన్ని రంగాలలోను నాస్తిక దృక్పథం పెంపొందించి సమూలమైన విప్లవం తేవాలని ప్రయత్నించారు.

తాత్వికంగా ఆస్తికులు సృష్టిలో మానవుడు ఒక భాగమని అంటారు. అంటే విశ్వంనుంచి ఆరంభమై వ్యక్తి వద్దకు వస్తుంది. ఆస్తిక తత్వశాస్త్రం దీనిలో వ్యక్తి విశ్వాసానికి, సృష్టికి బానిస అయిపోతాడు. అందుకే ఆస్తిక రాజకీయ విధానాలలో, సాంఘికరీతులలో, ఆర్థిక వ్యవస్థలోకూడా వ్యక్తి ప్రభుత్వానికో, సమాజ కట్టుబాట్లకో, పెట్టుబడికో దాసుడు చేయబడ్డాడు కాని గోరా ప్రతిపాదించిన నాస్తిక తత్వశాస్త్రం వ్యక్తితో ఆరంభమై విశ్వానికి వెళుతుంది. దీనివల్ల ఆర్థిక, సాంఘిక, రాజకీయ వ్యవస్థలలో వ్యక్తియొక్క వ్యక్తిత్వానికి ప్రాధాన్యతవస్తుంది. ఈ వ్యక్తిత్వ ప్రాధాన్యతే గతికి, ప్రగతికి ఆధారం, మూలం. విశ్వంనుంచి వ్యక్తికి వచ్చిన తత్వశాస్త్రంలో ఊహనుంచి యదార్థానికి ప్రయాణించుటవల్ల భావనకు ప్రాధాన్యతవచ్చి ఆచరణ వెనుకబడింది. కాని వ్యక్తి నుంచి విశ్వానికి అనే నాస్తిక తత్వశాస్త్రం వ్యక్తితో ప్రారంభమగుటతో సజీవమగు జీవితానికి–ఆచరణకు–ప్రాధాన్యత పెరిగింది. గోరా జీవితమంతటా ఈ ప్రత్యేకతే కనబడుతుంది. ఈ ప్రత్యేకతవల్లనే గోరా నాస్తికత్వానికి సమగ్రరూపం ఆచరణద్వారా యివ్వగలిగారు. ఆస్తికత్వం అంటే మానవునిలోని పరాధీన

ప్రవృత్తి వికాసమనీ, నాస్తికత్వమంటే స్వేచ్ఛాప్రవృత్తి వికాసమనీ గోరా నిర్వచించారు. పరాధీన ప్రవృత్తి వికాసమనీ, నాస్తికత్వమంటే స్వేచ్ఛాప్రవృత్తి వికాసమనీ గోరా నిర్వచించారు. పరాధీనతలో వ్యక్తికి బాధ్యతలేదు. దైవంమీదనో, కర్మమీదనో, పరిస్థితులమీదనో ప్రభుత్వం మీదనో బాధ్యతమోపి వ్యక్తి తప్పుకుంటాడు. అందుకే ఆస్తికరీతిలో అవినీతికి అవకాశాలు హెచ్చు. దీనిని సరిచేసి నీతి పెంపొందించుటకే ఎప్పటికప్పుడు ప్రవక్తలు సమకాలీన దైవానికి ప్రాధాన్యత తగ్గించి, ఆచరణను ప్రముఖం చేసి నూతన దైవ విశ్వాసాన్ని నెలకొల్పారు. ఎప్పటికప్పుడు నీతిని పెంచుటకు పాతదైవానికి కొత్త దైవానికి జరిగిన సంఘర్షణే మతాలలో వచ్చిన మార్పులు అని గోరా అంటారు.

నాస్తికత్వంలో నీతి సంఘావసరం. వ్యక్తులు సమిష్టిగా సంఘంగా కలిసి ఉండాలంటే నీతి కావాలి. కనుక నాస్తిక జీవితవిధానంలో సహజంగానే నీతి అభివృద్ధి చెందుతుంది. సమాజంలో సౌఖ్యం పెరుగుతుంది.

ఈ విధంగా మానవుడు వ్యక్తిత్వంతో స్వేచ్ఛను, బాధ్యతను కలిగి నీతివంతునిగా ఉండి సౌఖ్యం పెంచగలగటం నాస్తిక విధానంలోనే సాధ్యమనీ, జీవితంలోని అన్ని రంగాలలోనూ అట్టి కృషి నాస్తికత్వం సంపూర్ణరూపమనీ గోరా అంటారు.



# గోరా కుటుంబం

సాధారణంగా కార్యకర్తలు తమవరకూ మారుతారు గాని తమ కుటుంబాలను కూడా మార్చడం అరుదు. కాని గోరా విషయంలో – ఆయనకు, ఆయన కుటుంబానికి మధ్య రక్తసంబంధం కంటే భావసంబంధమే ఎక్కువా అన్నట్లు ఉంటుంది. సాధారణంగా కార్యకర్తలు పూర్తిగా ప్రజాసేవలోనికి దూకేవారు. ఆస్తిపాస్తులు కుటుంబానికి వదలిపెట్టి తాము మాత్రం కార్యక్షేత్రంలోనికి దూకుతారు. అంటే ఆస్తిబాధ్యతలు వదులుకున్న వారు కుటుంబ బాధ్యతలు కూడా వదులుకున్నారు. మరోప్రక్క కుటుంబం బాధ్యతలు ఉంచుకున్న కార్యకర్తలు ఆస్తిసంపాదన, ఆస్తి నిర్వహణ బాధ్యతలుకూడా ఉంచుకున్నారు. కాని గోరా విషయంలో ఇది పూర్తిగా తారుమారు అయింది. గోరా కుటుంబబాధ్యతలను ఉంచుకున్నారు. కాని ఆస్తి సంపాదన ఏమీ పెట్టుకోలేదు. గోరా ఆయన కుటుంబం సంబంధాల గురించి తెలుసుకునేటప్పుడు ఇది చాలా ప్రధానమైన విషయం. ఈ సందర్భంలో గోరా ఏ కార్యకర్తా సాహసించని గొప్ప ప్రయోగం చేశారని అంగీకరించక తప్పదు. అందుకే గాంధీజీ ఎప్పుడూ "నీ ఈ ప్రయోగం ఫలితం ఎలా ఉంటుందో నాకు చూడాలని ఉంది" అనేవారట.

గోరా 15 సంవత్సరాలు లెక్చరర్‌గా పనిచేయుటచేత, చాలా చిన్న వయస్సులోనే హెడ్‌ఆఫ్‌ది డిపార్టుమెంటు అగుటచేత, తనకువచ్చే జీతాన్ని ఆయన దాచుకుని ఉంటే మంచి ఆస్తినే చేసుకోగలిగి ఉండేవారు. కాని ఆయన అలా చేయకుండా తన సంపాదనను సమాజోపయోగ కార్యాలలోనే ఖర్చు చేశారు. ఆస్తి సంపాదనలో గోరా శ్రద్ధచూపలేదంటే, పోనీ ఆయన ఆదర్శవాది అనుకుందాం. మరి ఆయన భార్య సరస్వతి కూడా గోరాకి ఎప్పుడూ అడ్డుచెప్పలేదు.

గోరాకు మొత్తం మానవసమాజమంతా ఆయన కుటుంబమే. తోటికార్యకర్తలందరూ ఆయన పరివారమే. అయినా మనం ఇక్కడవారి భార్యపిల్లల గురించి ముచ్చటించుకొందాము. గోరాకు తొమ్మిదిమంది సంతానము. నలుగురు కుమారులు, ఐదుగురు కుమార్తెలు. పెద్దకుమార్తె మనోరమ. పెద్దకుమారుడు ఉప్పుసత్యాగ్రహ సమయంలో పుట్టినందున లవణం. రెండవ కుమార్తె గాంధీ-ఇర్విన్ ఒడంబడిక సమయంలో జన్మించగా మైత్రి. మూడవ కుమార్తె విద్యారంగాన్ని వదలివేద్దామనుకున్నా తిరిగి ప్రవేశించు సమయంలో పుట్టినందున విద్య. రెండవ కుమారుడు 1937 ఎన్నికలలో కాంగ్రెసు విజయం సాధించినందుకు చిహ్నంగా విజయం. మూడవ కుమారుడు 1939లో ద్వితీయ ప్రపంచ యుద్ధంఆరంభమైనప్పుడు జన్మించగా సమరం. 1941లో ప్రపంచమంతా నియంతల హయాంలో ఉండెను. హిట్లర్, ముస్సోలినీ, టోజో, స్టాలిన్ మొదలైనవారు. వారియుగంలో పుట్టిన నాలుగవ కుమారుడు నియంత. 1944 అక్టోబరు నాటికి దేశంలో జాతీయనాయకులందరూ విడుదలైనారు. వాతావరణంలో పెద్దమార్పు వచ్చింది. భారతదేశ రాజకీయాంశంపై బానిసత్వపు చీకటి రాత్రిని అంతం చేస్తూ స్వాతంత్ర్యభానుని ఉష్ణకాంతుల ఆగమనసూచనగా తొలికోడి కూయనారంభించింది. అందుకే అప్పుడు పుట్టిన నాల్గవ కుమార్తె మారు. తర్వాత 1947లో జన్మించిన 5వ కుమార్తె తొమ్మిదవ సంతానం కాగా నౌ. ఇలా గోరాకి తొమ్మిదిమంది బిడ్డలు.

'మీకెంత ఆస్తి'? అని ఎవరైనా అడిగితే తొమ్మిదిమంది సంతానం అని ఛలోక్తిగా గోరా సమాధానం చెప్పేవారు. కాని ఇది ఛలోక్తి మాత్రమే కాదు. నిజంగా గోరాకు తన సంతానం ఆస్తికంటే కూడా ఎక్కువ. ఎందుచేతనంటే గోరా సంతానం అంతా, తమ తల్లి వలెనే తాము కూడా గోరా నడుస్తున్న నూతనమార్గాన్ని స్వీకరించారు. గోరా చేసిన ప్రయోగాలన్నింటినీ ఆమోదించడమే కాకుండా పూర్తిగా సహకరించి ప్రోత్సహించారు. పోనీ బాల్యంలో తండ్రి ప్రభావంచేత ఆ భావాలకు అంగీకరించక తప్పలేదు అనుకుంటే, వయస్సువచ్చి స్వతంత్రంగా జీవించుటకు శక్తి వచ్చినా కూడా తమ తండ్రి భావాలను అనుసరిస్తున్నారంటే, గోరాను అర్థం చేసుకునే సహకరిస్తున్నారనక తప్పదు. భారతదేశంలోని ఏ నాయకునకూ కూడా తమ తమ కుటుంబాలనుంచి గోరాకి లభించినంతగా సహకారం లభించలేదంటే అత్యోక్తి కాదు. ఒకసారి సౌరాష్ట్ర పర్యటనలో కార్యకర్తలకు గోరా తన వెంటనున్న సరస్వతిని పరిచయం చేస్తూ "సాధారణంగా భార్యను అర్థాంగి అంటారు. కాని ఈమె నాకు పౌనాంగి" అన్నారు. (పౌనా అంటే 3/4 అని అర్థం). గోరా ఈ ఛలోక్తి సార్థకమైనదే.

గోరా పెద్ద కుమారుడు శ్రీ లవణం వివాహం, మనోరమ వివాహంవలనే, సేవాగ్రాం గాంధీజీ ఆశ్రమంలో 1960 జనవరిలో జాషువాకవి గారి కనిష్టకుమార్తె హేమలతతో జరిగింది. ఈ వివాహం ద్వారా జాషువా గోరాగార్లు వియ్యమందడం ఆంధ్రదేశ సాంఘిక చరిత్రలో గొప్ప ఘట్టమని చెప్పవచ్చు. సమాజంలో తిరస్కరింపబడి, అసహ్యించుకొనబడే అట్టడుగు వ్యవస్థలో జన్మించిన జాషువా ప్రతీ అడ్డుగోడను పగులగొడుతూ 'నవయుగ కవి చక్రవర్తి' అయి 'గబ్బిలము' ద్వారా తన హృదయావేదనను సమాజమంతటా వ్యాపింపజేశారు. మరొక ప్రక్క గోరా మన సామాజిక వ్యవస్థలో శిఖరంపై జన్మించారు. నదీప్రవాహం కొండలలో ఆరంభమైనా సముద్రానికి ఉరకలతో పరుగెత్తినట్లుగా, గోరా అడ్డు వచ్చిన కట్టలను త్రెంచుకుని బండలనుసైతం దొర్లించుకుంటూ మానవమాత్రుల సముద్రం వైపు ప్రవహించారు. ఈ ఇద్దరి సంగమం మన సాంఘిక చరిత్రలో అద్భుతంగా నిలచిపోక ఏమౌతుంది ?

గోరాకు తన ఇతర సంతానంతో ఉన్న సంబంధానికి లవణంతో ఉన్న సంబంధానికి కొంత తేడా ఉంది. లవణం బాల్యం నుండి అన్ని రంగాలలోనూ, అన్ని సందర్భాలలోనూ గోరాను అనుసరించారు. ఏడెనిమిది సంవత్సరాల బాలుడుగా ఉన్నప్పటి నుంచీ స్వాములవార్లతో గోరా జరిపిన నాస్తికత్వం చర్చలకు తండ్రిగారి వెంట వెళుతూ ఉండేవారు. 1940లో గోరా బందరుకాలేజీ ఉద్యోగానికి రాజీనామా యిచ్చినప్పుడు తొమ్మిదేళ్ళ లవణం, తాను ఎప్పుడూ కూడా ఈ విద్యాలయాలకు వెళ్ళననీ, డిగ్రీలు తీసుకోననీ ప్రతిజ్ఞ చేశారు. నాటికీ-నేటికీ లవణం ఏ స్కూలులోను చదువలేదు. ఏ డిగ్రీ పుచ్చుకోలేదు. గోరా సన్నిధే ఆయన విద్యాలయంగా, అనుభవమే విద్యగా శిక్షణపొందారు. తెలుగు, హిందీ, ఇంగ్లీషు భాషలను క్షుణ్ణంగా నేర్చుకున్నారు. 1942 ఉద్యమంలో సత్యాగ్రహం చేశారు. కాని మైనరు అగుటచే పోలీసులు బెత్తందెబ్బలు కొట్టి పోలీసు కస్టడీ నుంచి వదలివేశారు. తర్వాత 'సంఘం' పత్రిక ప్రారంభించి ప్రెస్సు, పత్రికల నిర్వహణ బాధ్యతను వహించారు. గోరా తీసుకున్న ప్రతీ కార్యక్రమంలోనూ లవణం ముందు నిలిచారు. 1955-56లో ఆంధ్రలో వినోబా పర్యటించినప్పుడు పదిమాసాలు వినోబా హిందీ ఉపన్యాసాలను తెలుగులోనికి అనువదించి గొప్ప అనువాదకునిగా కీర్తి సంపాదించుకున్నారు. తర్వాత ఆంధ్రలో 1957లో జయప్రకాశ్ నారాయణ్ పర్యటించినప్పుడు వెంట వుండి ఆయన ఉపన్యాసాలను అనువదించారు.

ఉత్తర హిందూస్తానంలో గోరా పర్యటనలలో గోరా ఇంగ్లీషు, తెలుగు ఉపన్యాసాలను హిందీలోనికి అనువదించారు. 1963-64లో ఢిల్లీ-పెకింగు

అంతర్జాతీయ మైత్రీ యాత్రలో పాల్గొన్నప్పుడు విదేశీయుల ఇంగ్లీషు ఉపన్యాసాలను హిందీ ప్రాంతాలలో హిందీలోనికి అనువదించారు. 1961 లో పశ్చిమ గోదావరి జిల్లాలో జరిగిన అఖిల భారత సర్వోదయ సమ్మేళనంలో అన్ని ఉపన్యాసాలను మొత్తం 4 రోజులు లవణంగారు ఒక్కరే అనువాదంచేసి కొత్త రికార్డును స్థాపించారు. ఈ విధంగా సాటిలేని అనువాదకునిగా స్వదేశీయుల విదేశీయుల ప్రసంశలను అందుకున్నారు. హిందీమాతృభాష గల రాష్ట్రాలలో హిందీలోనికి అనువాదం చేసి పట్నాలలోని మేధావులు, పండితులు, సాహితీవేత్తలను, మారుమూల కుగ్రామాలలోని సాధారణ ప్రజానీకాన్ని తన ప్రతిభచే సమానంగా మెప్పించగలిగారు. లవణం ఎంత గొప్ప అనువాదకుడో అంత చక్కని వక్త, రచయిత. వీటిన్నిటినీ మించిన ఆయన పట్టుదల, త్యాగముగల కార్యకర్త. మానవమాత్రునిగా ప్రతిఒక్కరితో కలిసిపోతారు. ఒకప్రక్క సహనం, సోదరభావంతో ఎదుటివారి అభిప్రాయాలను అర్థం చేసుకొనుటకు ప్రయత్నిస్తారు. మరొకప్రక్క ఎంతటి వ్యతిరేక వాతావరణమైనా తన అభిప్రాయాలను ఢంకామీద దెబ్బకొట్టి చాటుకుంటూ పోతారు. తాను నమ్మిన విషయాలను ఆచరించుటకు నిమిషమైనా వెనుదీయరు. చిన్న చిన్న వివరాలలో ఎంతైనా సర్దుకుంటారు గాని ప్రధాన విషయాలలో ఒక్క వీసమైనా తొలగరు. ఇన్ని గుణాలు ఉండుటచేతనే శ్రీ లవణం, గోరా భావాలకు ప్రామాణిక వ్యాఖ్యాతగా, ప్రతినిధిగా దేశమంతటా గుర్తింపబడ్డారు. 1962 డిశంబరులో మద్రాసులో అహింసపై జరిగిన ఒక అంతర్జాతీయ యువజన గోష్టిలో భారత ప్రతినిధిగా పాల్గొని ప్రధాన వక్తగా వ్యవహరించి భారత - చైనా వివాదం, కాశ్మీర్ సమస్యవంటి విషయాలను సైతం అతి నిగ్రహంతో, ధారళంగా చర్చించి, ప్రతినిధులలో ఆవేశాలనూ ఉద్రేకాలను శాంతపరచి ప్రశంసలందుకున్నారు.

1965-66 లో శ్రీ లవణం అఖిలభారత సర్వసేవాసంఘానికి సహాయ కార్యదర్శిగా పనిచేసి, ఒరిస్సాలోని కోరాపుట్, గంజాం జిల్లాల గ్రామదాన గ్రామాల అభివృద్ధిలో విశేషంగా పాల్గొన్నారు. 1966-67 లో అమెరికా, జపాన్, ఇతర తూర్పు ఆసియా దేశాల పర్యటన ద్వారా ప్రపంచ నాస్తికోద్యమ నిర్మాణానికి కృషి ప్రారంభించారు. ఆ తరువాత గోరా ప్రపంచపర్యటనలోను ప్రథమ ప్రపంచ నాస్తికసభలు ఆర్గనైజ్ చేయటంలోను తోడ్పడ్డారు.

శ్రీమతి హేమలత లవణంతోపాటు నాస్తికోద్యమంలోను, సాంఘిక పరివర్తనారంగంలోను పూర్తిగా తోడ్పడుతూ గోరా కుటుంబంలో పూర్తిగా కలిసిపోయారు. 1974 నుండి లవణం దంపతులు మాజీనేరస్త జాతులకు చెందిన నేరస్తుల సంస్కరణోద్యమాన్ని గట్టిగా చేపట్టారు.

గోరా తన కుటుంబంలో ప్రత్యేకంగా కుమార్తెల చదువులు ఎక్కువ ప్రోత్సహించారు, మైత్రి సైకాలజీలో ఎం.ఎ., విద్య సోషియాలజీలో బి.ఎ., మారు బి.యస్.సి.యం.బి.బి.ఎస్., నౌ బి.యస్.సి. అనంతరం అమెరికాలోని పెండల్‌హిల్‌లో సమాజ పరివర్తనా శాస్త్రం గురించి చదువుకున్నారు. మిగిలిన కుమారులు కూడా చదువుల్లో వెనుకబడలేదు. విజయం రాజకీయశాస్త్రం లో యం.ఎ. పి.హెచ్.డి., సమరం యం.బి.బి.యస్., నియంత యం.ఎస్‌సి,టెక్నాలజి. పిల్లల వివాహాలన్నీ సాంఘికంగా ఏదో ఒక సంస్కరణను సూచిస్తూ జరిగాయి. పిల్లలేకాక మనుమలు మనుమరాండ్రు కూడా ఉన్నత విద్యనభ్యసించి కలసి కట్టుగావుంటూ నాస్తికోద్యమం అభివృద్ధికి తోడ్పడుతున్నారు.

గోరాగారి సంఘ సంస్కరణ ప్రభావం వారి అక్క చెల్లెళ్ళ కుటుంబాలపై కూడా పడింది. గోరా అక్కగారగు కృష్ణవేణి మనుమరాలు సులోచన వివాహం, పెద్దచెల్లెలు సుందరి పెద్దకుమార్తె విజయలక్ష్మి వివాహం, మూడవ చెల్లెలు సౌభాగ్యం రెండవకుమార్తె సుమతి, నాల్గవ కుమార్తె సుగుణ, ఐదవకుమార్తె రాజ్యలక్ష్మిల వివాహం వర్ణాంతర వివాహాలు.

నాస్తిక దృక్పథాన్ని వివిధ రంగాలలో ఆచరించుటలో కుటుంబం అంతా గోరాతో పూర్తిగా సహకరించింది. తొలిరోజుల్లో నాస్తిక జీవితవిధానంలో కుటుంబం అంతా పూర్తిగా మారిన మరొక కుటుంబం నూజివీడు నివాసులైన శ్రీ చక్రపాణి సత్యనారాయణ-చంద్రమ్మగార్లు, వారికుటుంబము, చంద్రమ్మగారు సరస్వతిగారి వలెనే హిందూమత చిహ్నాలను, తాళిబొట్టును కూడా విసర్జించారు. తమ పిల్లలకు వర్ణాంతర వివాహాలు చేశారు. ఎన్ని కష్టాలు, ఇబ్బందులు వచ్చినా ఎదుర్కొంటూ ముందుకు సాగుతున్నారు.

గోరాకు తన పెద్దకుటుంబం భారంగాకాక, ప్రేరణదాయకంగా ఉండేది. ఈ మాట ఎంతమంది అనగలరు? గోరా ప్రబోధించే ఆదర్శాలకు అనుగుణంగా వారి కుటుంబం అంతా మారింది, ఆచరిస్తోంది. అందుకే ఆయన మాటకు అంత విలువ. కష్టాలలో, సుఖాలలో, ఒకటిగా నిలిచింది. సమాజంలో వచ్చిన వ్యతిరేకతను శాంతంగా గోరా కుటుంబం ఎదుర్కొంది. ఇలాంటి కుటుంబం ఎక్కడోగాని కనబడదు. ఈ కుటుంబంలో జరుగుతున్న ప్రయోజనాలు ఒక వినూత్నమైన పంథాలో సాగుతున్నాయి. వాటి మంచిచెడ్డల, లాభనష్టాల విలువకట్టడం అప్పుడే సాధ్యంకాదు.



# నిరంతర ఆశావాది

గోరా ఒకసారి కలకత్తాలో ఒక ఉపాధ్యాయుల సభలో "ఉపాధ్యాయునిగా నేను నేర్చుకున్నది" అనే అంశంపై మాట్లాడుతూ ఇలా అన్నారు. "నేను మనిషిగా జీవించాలని ప్రయత్నిస్తున్నాను. తోటి మానవులు కూడా నావంటివారే కనుక వారు కూడా మనుషులుగా జీవించాలని నేను కోరుతున్నాను. అందుకుగాను తోడ్పడాలని నేను కృషి చేస్తున్నాను. ఇందులో చేస్తూన్నది చెప్పాలనీ, చెబుతున్నది చెయ్యాలనీ నేను ప్రయత్నిస్తున్నాను. మానవులందరూ సమానులని మన తత్వశాస్త్రాలు, నీతిగ్రంథాలు అన్నీ ప్రబోధిస్తున్నాయి. దీనినే ఆచరణలో పెట్టాలని ప్రయత్నిస్తున్నాను. కులం మతం అడ్డువచ్చాయి. ఆర్థిక అసమానతలు అడ్డు వచ్చాయి. దైవభావం, కర్మసిద్ధాంతం, పరలోక నమ్మకాలు అడ్డువచ్చాయి. వీటిని నిర్ధారణ అనే గీటురాయితో చూశాను. నిలువలేదు. అందుచేత ఇవి అబద్ధం అన్నాను. మానవ కల్పితం అన్నాను. ఈ ముక్క చెప్పినందుకు నన్ను ఉద్యోగాలలోనుంచి తీసివేశారు. సంఘం నుంచి బహిష్కరించామన్నారు. మరికొంత ముందుకు సాగాను. ప్రభుత్వ విధానాలు మనిషిని మనిషిగా బ్రతకనివ్వడంలేదు. నియంతృత్వం, పార్టీతత్వం, ఆడంబరాలు వీనిలో ప్రవేశించాయి. మనిషితో మనిషిగా మసలుటకు ఇవి అడ్డం తగులుతున్నాయి. కనుక వీటిని కూడా తొలగించాలని కృషి చేస్తున్నాను. ఆర్థిక రంగమనీ, సాంఘికమనీ, రాజకీయమనీ, తాత్విక-వైజ్ఞానిక రంగాలనీ విడివిడిగాలేవు. ఇవన్నీ జీవితంతో పెనవేసుకుని ఉన్నాయి. తీగలాగితే డొంక అంతా కదిలినట్లు, మానవుడు మానవునిగా జీవించాలని ప్రయత్నిస్తే అన్ని రంగాలలోనూ మార్పు అవసరమౌతోంది. అందుకే నాకు నాస్తికత్వం అంటే నిరీశ్వర వాదం కాదు. అన్ని రంగాలలోను నాస్తిక దృక్పథం

అవసరం. నాస్తికత్వం అంటే నాకు సిద్ధాంతచర్చ కాదు. ఆచరణలో సమానత్వాన్ని ప్రతిబింబించే జీవిత విధానం. మానవుడు తోటి మానవుల మధ్య మానవునిగా జీవించడం నా ధ్యేయం. అందుకు నాస్తికత్వం నా విధానం".

పై వాక్యాలలో గోరా తన ధ్యేయాన్ని, సాధనాన్నీ చాలా స్పష్టంగా వివరించారు. మానవులమధ్య మానవులుగా బ్రతకడం, ఆయన ధ్యేయం.

అందుకే అభివాదంలో ఆయన 'జై ఇన్సాన్' అనే పదాన్ని వాడారు. ఇన్సాన్ అంటే ఉర్దూభాషలో మనిషి అని అర్థం. దాని వ్యుత్పత్తి తీసుకుంటే ప్రేమగలవాడు అని అర్థం. మానవుల మధ్య ప్రేమ, సహకారం, సహనం, సమానత్వం, బాధ్యత, స్వాతంత్ర్యం, సంతోషం పెంపొందించాలని గోరా ప్రయత్నించారు. ఆస్తిక విధానంలో చాలామంది ప్రయత్నించారు. కాని అందులో ఆధారం అసత్యం అయింది. ప్రత్యక్షంగా ఉన్న మానవునికంటే పరోక్షమైన "మానవాతీత గుణం" ప్రాధాన్యత వహించి, మానవుని బానిస చేసింది. అదే జీవితంలోని అన్ని రంగాలలోనూ వ్యాపించింది. కనుక ఏ రంగంలోనూ మానవునికి సుఖంలేదు. దీనిని మార్చాలంటే అన్ని రంగాలనుంచీ ఈ బానిస భావాన్ని తొలగించాలి. నాస్తికత్వాన్ని సాధనంగా తీసుకున్న గోరా కృషి అది. తాత్వికంగా దైవం, జన్మ పరంపర, పరలోకం అనే కల్పిత భావాల దాస్యం నుంచి, సాంఘికంగా కుల-మత కట్టుబాట్ల పరాధీనత నుంచి, రాజకీయంగా ప్రభుత్వ విధానాల నిరంకుశత్వం మంచి వ్యక్తిని విముక్తుణ్ని చేయుటకు గోరా మూఢనమ్మకాల నిర్మూలన, వయోజనవిద్య, సహపంక్తి భోజనాలు, వర్ణాంతర, మతాంతర వివాహాలువంటి కార్యక్రమాలనుంచి ప్రజాప్రాతినిధ్యం నుండి పార్టీతత్వం, ఆడంబరాలు తొలగించుటవరకూ కృషి చేశారు.

గోరా భావాలతో, కృషితో మనం ఏకీభవించకపోవచ్చు. కాని ఆయన నిజాయితీ, త్యాగం, దీక్ష, సమానతకై ఆవేదన, ప్రతి అన్యాయాన్నీ ఎదిరించాలనే సాహసం అందరికీ మార్గదర్శకం. అందుకే ఆంధ్రదేశంలోని ఒక గాంధేయ కార్యకర్త ఒకసారి శ్రీ కిశోర్‌లాల్ మశ్రువాలాకు గోరాపై ఫిర్యాదుచేస్తూ ఉత్తరం వ్రాశారు. దానికి మశ్రువాలాగారు సమాధానం ఇస్తూ ఇలా వ్రాశారు:-

"......It is true that his (Gora's) approach is quite different from that of Gandhiji's or mine or yours, But we must appreciate his sincerity and regard for truth. He does not conceal facts for fear of consequences and is prepared to suffer all kinds of hardships for

his principles. This is more than most of us can do; and so he is a much greater man than we, who are so called Asthiks."

(.....ఆయన (గోరా) విధానం గాంధీజీ విధానం లేక నా విధానం, లేక మీ విధానంకంటే భిన్నమైనదనుట నిజం. అయితే సత్యము యెడల ఆయనకున్న గౌరవం, నిజాయితీలను మనం హర్షించి తీరాలి. పరిణామాలకు భయపడి ఆయన యదార్థాలను దాచరు. తన సిద్ధాంతాల కొరకు అన్ని రకాల కష్టాలు, బాధలు సహించుటకు ఆయన సిద్ధపడి ఉన్నారు. ఇది మనలో చాలామంది చెయ్యలేనిపని, అందుచేత ఆస్తికుల మనుకునే మనకంటే ఆయన ఎంతో గొప్పవ్యక్తి.)

గోరా విధానాలకు విలువకట్టాలంటే సమకాలీన సమాజానికి, గోరాకు ఉన్న తేడాను దృష్టిలో ఉంచుకోవాలనే విషయాన్ని మ(ప్రఉవాలాకంటే తీవ్రంగా మరెవరు హెచ్చరించగలరు?

బహుశ ఇన్ని రంగాలలో ఒక్కసారి విప్లవశంఖం పూరించిన వ్యక్తి మార్క్సు తప్ప మరొకరులేరేమో. గోరాకి పూర్వం నాస్తికుణ్ణి అని అనుకున్న వ్యక్తులున్నారు. కాని వారెవరూ నాస్తికత్వాన్ని ఇంత సమగ్రంగా ఆచరణతో ప్రతిపాదించలేదు. జీవితంలోని అన్ని రంగాలను ఒక్కసారి తీసుకొనుటచేత గోరాను అర్థం చేసుకొనడమూ కొంచె కష్టమే. ప్రదర్శనయోగ్యమైన అభివృద్ధి కనబడడం లేదంటే ఆశ్చర్యపడవలసిన పనీలేదు. అందుకే కొంతమంది గోరాతో నాస్తిక ప్రచారం వదలి కేవలం సాంఘిక, ఆర్థిక, రాజకీయ కార్యక్రమాలపై కేంద్రీకరించమంటే, మరికొందరు ఈ కార్యక్రమాలను వదలి కేవలం నాస్తిక ప్రచారం పై కేంద్రీకరించమనేవారు. ఇందుకు గోరా సమాధానం ఒక్కటే, ఏది వదలినా జీవితంలో సమగ్రమైన విప్లవంరాదు. గోరాతో వేరువేరు రంగాలలో విడివిడిగా కలసి పనిచేసిన సహచరులు చెప్పుకోదగినంత మంది లేకపోలేదు. కాని సమగ్రంగా అన్ని రంగాలలోనూ గోరాగారితో సహకరించిన వారు కొద్దిమందే ఉన్నారనుకుంటాను. గాంధీజీ 1944 లో గోరాని నాస్తికదృక్పథంలో నీతో పూర్తిగా కలసి పనిచేసే సహచరులు ఎంతమంది ఉన్నారు. అని ప్రశ్నించారట. అప్పటికి కనీసం వందమంది అయినా నాస్తికులుగా గోరాతో కలసి పనిచేస్తున్నారు. గోరా వడపోసి, వడపోసి-తగ్గించి తగ్గించి నలుగురైనా ఉంటారని చెప్పారట. వెంటనే గాంధీజీ నవ్వి "నలుగురే. అయితే నువ్వు ప్రపంచ విప్లవం తేవచ్చు" అన్నారుట. "నీకు తెలుసా 40 సంవత్సరాలకు పైగా పనిచేస్తున్నా నాతో ఎంతమంది ఉన్నారో? ఒక్కరే. ఆ ఒక్కరూ ఎవరు? నేనే" అని గాంధీజీ చెప్పారట. తన అనుభవలేమికి గోరా సిగ్గుపడ్డారు. కాని తర్వాత అనుభవంలో గాంధీజీ చెప్పిన విషయం గోరాకి

అర్థం అయింది. "నువ్వు కాక నీ విధానంలో మరొక్కరు తయారైతే చాలు" అని గాంధీజీ అన్నారట.

గాంధీజీ అనంతరం గాంధీ చూపిన బాటను ముందుకు తీసుకువెళ్ళిన వారు ఎవరూ మిగలలేదనే చెప్పాలి. కాని గోరా విషయం వేరుగా కన్పిస్తుంది.

గోరా అనంతరం గోరా ప్రారంభించిన కార్యక్రమాలేవి కుంటుపడలేదు. ఆయన స్థాపించిన నాస్తికకేంద్రము మూతపడలేదు. ఆయన ప్రతిపాదించిన తత్వశాస్త్రానికి ప్రాముఖ్యత తగ్గలేదు. అంతేగాక గోరా అనంతరం మరింతదీక్షతో మరింత దృఢ నిశ్చయంతో మరింత విశాలంగా మరింత లోతుగా ఇవన్నీ కొనసాగింపబడుతున్నాయి. ఇంకా ముందుకు తీసుకొని పోబడుతున్నాయి. ఇందు కుటుంబసభ్యులేకాదు, గోరాసహచరులు చాలామంది పూర్తిగా నిమగ్నమైవున్నారు. ఇది ఒక ప్రత్యేకతగా కనబడుతుంది. గోరా అనంతరం మరెందరో గోరాతో సరితూగ గలవారు తయారవుతున్నారా, అనిపిస్తుంది.

గోరా తన కృషిలో తప్పటడుగులు వేయలేదా అనే ప్రశ్న వస్తుంది. తప్పకుండా వేసిఉంటారు. ఆయనకూడా మానవమాత్రులే అయితే రెండు విషయాలు మళ్ళా మనం చూడవలసి ఉంటుంది."తప్పు చేయడం తప్పుకాదు కాని తప్పు అని తెలిసిన తర్వాత దిద్దుకోకపోవడం తప్పు." అని గోరా అనేవారు. దిద్దుకున్నందువల్ల తప్పటడుగు ప్రభావంపోయి తప్పు కనబడదు. రెండవ విషయం : గోరా ఇన్ని రంగాలలో ఒక్కసారి కృషి చేస్తున్నప్పుడు ఒక రంగంలో చేసినపని కేవలం మరొక రంగం దృక్కోణంనుంచి మాత్రమేచూస్తే తప్పుగా కనబడవచ్చు. సమగ్రంగా అన్ని రంగాలలో దానివల్ల రాగల ఫలితాలను పరిణామాలను పరిశీలిస్తూ అది సరియైనదే కావచ్చు. ఇట్టి సమగ్రదృష్టితో గోరా జీవితానికి విలువ కట్టాలంటే ముందు ఆయనను సమగ్రంగా అర్థం చేసుకోవాలి. కనుక విలువ కట్టి తేల్చుటకు ఇంకా అదను రాలేదనిపిస్తుంది.

గోరా జీవితం ఒక నాస్తికుని జీవితగాథ అని ధ్యేయం వైపు సాగిన యాత్ర ఈ యాత్రలో పెనుతుఫానులను ఎదుర్కొన్నప్పుడు ఆయన సాగలేక నిలబడిన ఘట్టాలు ఉన్నాయి. కొంచెం వాలుగాలి వీస్తే పరిగెత్తిన సందర్భాలూ ఉన్నాయి. ఆయనకు వయస్సు పెరుగుతున్నా నిరుత్సాహం, నైరాశ్యం రాలేదు. నిరంతర ఆశావాది ఆయన. శరీరపటుత్వం సడలినా సుఖాన్ని కోరని త్యాగవాహిని. విరామమెరుగని చైతన్యంతో ఉరకలు వేసిన విప్లవప్రవాహం. ఎందరెందరినో ఆయన జీవితం ప్రభావితం చేసింది; చేస్తున్నది. ఆ ప్రభావాన్ని ఎంతగా హర్షించి, స్వీకరిస్తే అంత త్వరగా మానవులుగా మనగలుగుతాం.



# ఆధునిక నాస్తికోద్యమ నిర్మాత

**1975** జూలై 26 సాయంత్రం 5.30. గంటలకు నాస్తిక కేంద్రంనుంచి విజయవాడలో ఒక మీటింగు కొరకు గోరా బయలుదేరారు. "భారత గ్రామీణ సమాజంలో మార్పులు ఎలా తీసుకురావాలి" అనే విషయంపై సభలో ఆయన మాట్లాడుతున్నారు. దాదాపు ఆయన ఉపన్యాసం చివరకు వచ్చేసింది. ఆ ఉపన్యాసంలో భారతీయ సమాజంలో వ్రేళ్ళు పాతుకొని ఉన్న కులతత్వాన్ని, మతమౌఢ్యాన్ని, అజ్ఞానాన్ని ఆయన తీవ్రంగా నిరసించారు. శ్రమ శక్తికి విలువలేకపోవటాన్ని, విద్యావిధానం స్వతంత్ర భారతదేశానికి అనువుగా లేకపోవటం వల్ల సమాజానికి వచ్చిన నష్టాన్ని ఆయన వివరించారు. సమాజంలో మార్పుల కోసం గట్టి పట్టుదల, నిరంతర కృషి, త్యాగం అవసరమని ఆయన హెచ్చరించారు. దాదాపు తన జీవితానుభవసారాన్ని ఆ ఉపన్యాసంలో కుదించారని చెప్పవచ్చు. సుమారు 45 నిముషాలు మాట్లాడిన తరువాత వాక్యం మధ్యలో అకస్మాత్తుగా కూలిపోయారు. సభికులందరు నిశ్చేష్టులై, ఏమి జరిగిందో తెలియక అయోమయస్థితిలో పడ్డారు. నిమిషాల మీద దగ్గరలోవున్న డాక్టరు వద్దకు కారులో తీసుకు వెళ్ళారు. కాని ప్రయోజనం లేకపోయింది. మరి పదినిముషాలలో ఆయనను నాస్తికకేంద్రానికి తీసుకొని వచ్చారు.

అప్పటికే చూచాయగా విషయం తెలిసి, ఆతృతగా గోరా గారిని మొదటగా తీసుకువెళ్ళిన నర్సింగ్‌హోమ్ వరకు వెళ్ళివచ్చిన గోరాగారి మూడవకుమారుడు డాక్టర్ సమరం తండ్రి శరీరాన్ని పరీక్షించి "అంతా అయిపోయింది. ఇక చేసేదేమీలేదు" అని ప్రకటించారు.

మరణమంటే కేవలం హృదయం, మెదడు పనిచేయటం ఆగిపోవటంతప్ప వేరేమీకాదని, ఆగినప్పుడల్లా తిరిగి వాటిని పనిచేసేటట్లు చేయగలిగితే మరణాన్ని జయించవచ్చని గోరా విశ్వాసం. నడుస్తూ, నడుస్తువున్న కారు అకస్మాత్తుగా ఆగిపోయినట్లే గోరా శరీరయంత్రం కూడా చివరిక్షణం వరకు అతిచైతన్యవంతంగా, ప్రక్రియంగా వుండి అకస్మాత్తుగా ఆగిపోయింది. ఒక్క క్షణమైనా ఆయన బాధను ప్రకటించలేదు, అనుభవించలేదు. ముఖంమీద చిరునవ్వు మటుమాయంకూడా కాలేదే. సెరిబ్రల్ హెమరేజ్–మెదడులో రక్తనాళాలు అకస్మాత్తుగా పగిలి పనిచేయటం మానివేశాయి అని డాక్టర్లు చెప్పారు.

ఆ మీటింగుకు వెళ్ళినపుడు గోరా వెంట ఆయన కుటుంబ సభ్యులెవరూ ప్రత్యేకంగా లేరు. ప్రత్యేకంగా తాము వెంటలేక పోయామనే బాధనుకూడా వారు ప్రకటించలేదు. కారణం ఆయన కేవలం కుటుంబానికే చెందలేదు. కేవలం నాస్తిక కేంద్రానికే చెందలేదు. తనను తాను మానవుడు అనుకున్నారు. మొత్తం మానవ సమాజానికే ఆయన చెందారు.

తన మరణం గురించి గోరా ఎప్పుడూ ఊహించలేదు. ఇతరులను గౌరవంగా, మనుషులుగా ఎలా బ్రతికించాలనేదే ఆయన ఆలోచన. అందుచేత హృదయం, మెదడు ఆగిపోయినపుడు గోరా శరీరాన్ని, ఏమి చేయాలనే సమస్యపై తన భావాలను ఆయన ఎప్పుడూ ప్రకటించలేదు.

నిమిషాలమీద గోరా మరణవార్త విజయవాడ పట్టణం, పరిసరాలు వ్యాపించింది. ఆకాశవాణి వార్తాప్రసారం ద్వారా దేశమంతా తెలిసింది. తండోపతండాలుగా జనం తరలిరావటం ప్రారంభించారు.

గోరా కుటుంబసభ్యులలో భార్య సరస్వతీగోరా, పిల్లలు లవణం, సమరం, నియంత, మైత్రి, విద్య. కోడళ్ళు హేమలతా లవణం, రశ్మి, సకల, అల్లుడు శేషగిరిరావు మాత్రం వెంటనే అందుబాటులో వున్నారు. పెద్దకుమార్తె మనోరమ, పెద్దఅల్లుడు అర్జునరావు, తమ్ముడు సాంబశివరావుగార్లు గుడివాడనుంచి వచ్చారు. రెండవ కుమారుడు విజయం, కోడలు సుమతి, నాల్గవ కుమార్తె మారు, చివరికుమార్తె నౌ, ఆమె భర్త వీరయ్య ఢిల్లీలో ఉండటంచేత రెండురోజులవరకు రాలేకపోయారు.

గోరా శరీరాన్ని ఏమిచేయాలా అనే ప్రశ్న ఎదురైంది. ఈ హఠాత్సంఘటననుంచి తేరుకుని, ఈ ప్రశ్నగురించి ఆలోచించేసరికి కొంత సమయం పట్టింది. అప్పుడు ముఖ్యంగా రెండు విషయాలు ఆలోచించాడు. వైద్యకళాశాలకు శరీరాన్ని అప్పగించటం, లేదా సాంఘిక సమానత్వం సాధన కొరకు జీవితాన్ని పణంగాపెట్టి ఎన్నెన్నో త్యాగాలు

చేసి ఎనలేని సాంఘిక విప్లవకారునిగా సమాజంచేత గుర్తింపబడిన గోరా శరీరం సాంఘిక విప్లవసాధనలో ఉపయోగపడగలదా అని కూడా ఆలోచించారు.

మృతదేహాన్ని వైద్యకళాశాలకు ఇవ్వటం అరుదైనా, క్రొత్తకాదు. అందుచేత గోరా శరీరాన్ని సాంఘిక విప్లవసాధనలో భాగంగా సాంప్రదాయాలను, అలవాట్లను ఉల్లంఘించుటకు వినియోగించాలని, ఆ సమయంలో అక్కడవున్న కుటుంబసభ్యులు, సహచరులు, మిత్రులు అందరూ కలసి ఏకగ్రీవంగా నిర్ణయం తీసుకున్నారు. ఈ నిర్ణయం తీసుకునేసరికి సుమారు రాత్రి రెండుగంటలయింది.

సాధారణంగా మృతదేహాన్ని బయటవారు ఎవరూ తాకరు. అంతేకాక కుమారులలో ఒకరు చితికి నిప్పు పెట్టాలనే ఆచారం వుంది. ఇందుకు భిన్నంగా గోరా చితికి అస్పృశ్యులనబడేవారితో నిప్పు పెట్టించటం అస్పృశ్యతా నిర్మూలనకు, సాంఘిక సమానత్వ సాధనకు దోహదం చేసే గొప్ప సంఘటన కాగలదని భావించబడింది. ఆ విధంగా 20 సంవత్సరాలకు పైగా గోరాతో కలిసి పనిచేస్తున్న చిట్టి రామచంద్రపురం హరిజనవాడకు చెందిన అతి సామాన్య వ్యక్తి సత్యానందంగారిని ఇందుకు నిర్ణయించారు.

27వ తేదీ మధ్యాహ్నం మూడుగంటలవరకు గోరా మృతదేహాన్ని నాస్తిక కేంద్రంలో చెట్లక్రింద, ప్రజలు చివరిసారిగా చూసి శ్రద్ధాంజలి ఘటించుటకు వీలుగావుంచారు. దగ్గరనుంచి, దూరంనుండి వేలాది స్త్రీలు, పురుషులు అన్ని వయస్సులకు చెందిన వారు, అన్నిస్థాయిలకు చెందినవారు, నాస్తికులు, నాస్తికాభిమానులు, వివిధ మతాలకు చెందినవారు - వారూ వీరూ అనే భేదం లేకుండా వచ్చి శ్రద్ధాంజలి ఘటించారు, మంత్రులు, ప్రభుత్వోద్యోగులు, మతగురువులు, సామాన్యులు, గ్రామీణులు, పట్టణవాసులు అన్ని తరహాలకు చెందినవారు వచ్చారు. గోరా అన్నగారు నరసింహారావు, చెల్లెళ్ళు బాలాత్రిపురసుందరి, సౌభాగ్యం, సామ్రాజ్యం, సేవాగ్రాం ఆశ్రమంనుంచి ప్రభాకర్‌జీ కూడా వచ్చారు. ట్రాక్టరు మీద గోరా శరీరాన్ని విజయవాడ పుర వీధులగుండా ఊరేగిస్తూ గాందీఘాట్ స్మశానానికి తీసుకొచ్చిన వెళ్ళారు. అచ్చట గోరా చితికి శ్రీ సత్యానందం నిప్పు పెట్టారు. ఎదురుగా స్మశానస్థలిలో విజయవాడ పౌరుల పక్షాన అప్పటి విద్యాశాఖామంత్రి శ్రీ మండలి వెంకట కృష్ణారావు అధ్యక్షతన శ్రద్ధాంజలి సభ జరిగింది.

"గోరాతో నాస్తికత్వం రాలేదు. గోరా మరణించినంత మాత్రాన నాస్తికత్వం ఆగిపోదు. అయితే, ఆధునిక నాస్తికోద్యమ నిర్మాతగా ఆయన మనందరి గౌరవానికి పాత్రులై వుంటారు. ప్రతి ఒక్కరం నాస్తికత్వానికి వారసులమే. అయితే ఎవరెవరు ఎంత చేయగలరో, ఏమి చేయగలరో, ఎలా చేయగలరో అనే విషయం మీద నాస్తికత్వం

భవిష్యత్తు ఆధారపడివుంది. నాస్తికత్వానికి గాను మనల్ని మనం పునరంకితం చేసుకోవలసిన సమయమిది" అంటూ శ్రీ లవణం ఆ సభలో ప్రకటించారు.

గోరా ఎన్నో ఉద్యమాలలో ఎందరెందరినో ప్రభావితం చేశారు. అయితే ఆయన చేసిన ప్రతీ కార్యక్రమంలోనూ, నాస్తికత్వం అంతర్నిహితంగా ప్రవహించింది. వేరువేరు వ్యక్తులకు వివిధ విధాలుగా గోరా కనబడతారు. అందుకే ప్రతీ ఒక్కరూ ఆయన మృతివల్ల తామేదో కోల్పోయినట్లుగా భావించారు.

ప్రపంచం నలుమూలలనుంచి వచ్చిన సందేశాలే ఇందుకు నిదర్శనం. ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధీ, ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు, మంత్రులు, ఉన్నతాధికారులు, నాస్తిక, హేతువాద సంఘాలు, మిత్రులు, సామాన్యులు-ఎందరో తమ బాధను, సానుభూతిని ప్రకటిస్తూ వ్రాశారు. వీటిలో కొన్నిటిని క్రోడీకరించి "సంకల్పాంజలి"గా ప్రచురించడం జరిగింది.

అమెరికా, కెనడా, మెక్సికో, వెస్టిండీస్, ఇంగ్లాండు, హాలెండు, ఫ్రాన్స్, బెల్జియం, స్వీడన్, నార్వే, పశ్చిమ జర్మనీ, ఇటలీ, స్విట్జర్లాండ్, సోవియట్ యూనియన్, బంగ్లాదేశ్, శ్రీలంక, ఆస్ట్రేలియా, న్యూజిలాండు, ఫిలిప్పీన్స్, ఫిజీ దీవులు, జపాన్, కొరియా, ఆఫ్రికాలోని గాంబియా, టాంజానియా, మధ్యప్రాచ్యంలోని బహరాయన్ మొదలైన అనేక దేశాలనుంచి ఎందరెందరో తన సానుభూతి తెలిపారు. భారతదేశంలోని పత్రికలేకాక, విదేశీ పత్రికలు ముఖ్యముగా ఎథీస్టు, హ్యూమనిష్టు, రేషనలిష్టు పత్రికలు గోరాకు శ్రద్ధాంజలి ఘటిస్తూ సంపాదకీయాలు వ్రాశాయి. వ్యాసాలు ప్రచురించాయి.

గోరా హఠాన్మరణం పెద్దలోటును సృష్టించినమాట వాస్తవమే అయితే నాస్తిక కేంద్రం కృంగిపోలేదు. గోరా మరణాన్ని సహజంగా స్వీకరించింది. ఆ పరిస్థితిని ఒక ఛాలెంజ్‌గా తీసుకొని ప్రతి రంగంలోను ముందుకే అడుగువేస్తోంది.

సాధారణంగా ఒక గొప్పవ్యక్తి మరణం అనంతరం వారి ఉద్యమం గాని, సంస్థలుగాని కొంచమైనా దెబ్బతింటాయి. కాని గోరా విషయంలో ఇందుకు భిన్నంగా జరిగింది. వారు స్థాపించిన నాస్తికకేంద్రంగాని, వారు ప్రారంభించిన కార్యక్రమాలు గాని గోరా అనంతరం ఏ మాత్రము సడల లేదు సరిగదా, మరింత పటిష్టమై ముందుకు సాగుతున్నాయి. అవి చిలవలు పలవలు వేసి విశాలమవుతున్నాయి. వాటితోపాటు మరికొన్ని క్రొత్త కార్యక్రమాలు కూడా వచ్చి చేరుతున్నాయి. నిత్య నూతనత్వంతో కళకళలాడుతున్న నాస్తికకేంద్రంలోని ప్రతిచెట్టు, ప్రతికొమ్మ, ప్రతి ఆకు గోరాను ప్రతిబింబిస్తున్నాయి. ప్రతిధ్వనిస్తున్నాయి అంటే అతిశయోక్తి కాదేమో !

శ్రీమతి హేమలతా లవణం వ్రాసినట్లుగా

"భావికర్తృత్వ దీక్షకు

ఒక సవాల్ నీదు మరణం"

అవును ఆ సవాల్‌ను స్వీకరించారు. అందుచేతనే అసలు విషయం అర్థమయింది.

"చేసింది చెప్పి, చెప్పింది చేసి

నీతికొక నూతన రూపం చూపిన

దెబ్బదేండ్ల ఉద్యమ వీరుని,

పిరికిబోతు మరణం

చేతగాని చాటు దెబ్బ కొట్టింది,

లాక్కుంది ఒక్క గోరాను

గోరా ఒక్కడుకాదన్న నిజం

ఆ తదుపరి తెలిసిన సత్యం"

ఒక్క గోరాను మరణం లాక్కొంటే వేలవేల గోరాలు ఉద్భవిస్తున్నట్లుగా కనబడుతోంది. అందుకే గోరా జీవించి వుండగా ఎంత మహోన్నతంగా నాస్తికకేంద్రం నిలిచిందో అంతగాను, అంతకంటే ఎక్కువగాను కూడా నేడు కనబడుతోంది. అందుకే ఒక మిత్రులు అన్నట్లు గోరా జీవితం ఎంత మహోన్నతమో, ఆయన మరణం అంతకంటే మహోన్నతం. జీవన్మరణాల స్థితిని దాటిన గోరా భావాలు, అనుభవాలు, ఆయన కార్యక్రమాలు, ఉద్యమాలు తరతరాలుగా యుగయుగాలుగా ఎందరెందరినో ప్రభావితం చేస్తూ వుండగలవనడంలో సందేహం లేదు.

గోరా ఒక చైతన్య స్రవంతి. నిత్యం పురోగమించిన మానవుడు. ఆయన కేవలం మానవుడే కాదు, సంకుచిత పరిధులను దాటిన విశ్వమానవుడు, గోరాను తలచుకొంటే మన హృదయాలు ఎదురుప్రశ్న వేస్తాయి. "నువ్వు ఏం చేస్తున్నావు?" ప్రతి ఒక్కరి ఈ ప్రశ్నకు సమాధానం వెతుక్కుంటే గోరాకు జోహార్లు అర్పించినట్లే కాగలదు.



# గోరాకు నివాళులు

## శ్రీ గోరా

## ఆంధ్రజ్యోతి (దినపత్రిక)

## సంపాదకీయం : 29-7-1975

ప్రవాహం వాలునుబట్టి ఎంత వేగంగానైనా, ఎంత దూరమైనా వెళ్ళగల గజ ఈతగాళ్ళు లోకంలో కోకొల్లలు. ప్రవాహానికి ఎదురీదేవారు మాత్రం కొద్దిమందే వుంటారు. వారు ఎంతో దూరం వెళ్ళలేకపోవచ్చు. కాని, ఎదురీతకు ఉద్యమించటమే విశేషం. అట్టి కొద్దిమందిలో "గోరా"గా ప్రసిద్ధులైన శ్రీ గోపరాజు రామచంద్రరావు ఒకరు.

ఆయన జీవితమే ఒక రణరంగం, నలభైఏళ్ళకు పైగా ఆయన రాజీలేని పోరాటాలు సాగించారు. మనిషిని విధిచేత కీలుబొమ్మగా మిగిల్చిన దైవభావనపై, మూఢవిశ్వాసాలపై పోరాటం, మనిషికి మనిషికి మధ్య అడ్డుగోడలు నిర్మించిన కుల, మతవ్యవస్థల పై పోరాటం, రాజకీయాలలో పార్టీ వ్యవస్థలపై పోరాటం, అవినీతిపై, ఆడంబరాలపై, పోరాటం -ఒకటీ రెండు కావు ఆయన సాగించిన పోరాటాలు.

ఈ పోరాటాలలో ఆయన చేయని త్యాగం లేదు, పడని బాధలేదు. తినని తిట్లు లేవు. అయినా, ఆయన ఆత్మవిశ్వాసాన్ని కోల్పోలేదు. ఆశావాదాన్ని విడనాడలేదు. గత శనివారంనాడు తుదిశ్వాస విడిచేవరకు ఆయన ఈ పోరాటాలను సాగిస్తూనే ఉన్నారు.

ఆయన తన ఉద్యమాలలో ఏ పాటి విజయాలు సాధించారన్నది ప్రశ్నకాదు. అవి పరిమితమయినవే కావచ్చు కాని, వ్యక్తికి చరితార్థత చేకూర్చేది విజయముకాదు, చిత్తశుద్ధితో కూడిన ప్రయత్నమే.

శ్రీ గోరాకు అనుచరుల కంటే అభిమానులు ఎక్కువ. అభిమానులకంటే వ్యతిరేకులు ఎక్కువ. ఆయన సిద్ధాంతాలతో పెక్కుమంది ఏకీభవింపలేకపోవచ్చు. కొన్ని సందర్భాలలో ఆయన వింత పుంతలు త్రొక్కినట్టు, అతిగా పోయినట్టు కూడా అనిపించి వుండవచ్చు. కాని, ఎంత వ్యతిరేకులయినా ఆయన విశ్వాసబలాన్ని కాదనలేరు. చెప్పినదాన్ని చేసి చూపిన వాడుగా ఆయన ధైర్య సాహసాలను మెచ్చుకోకుండా వుండలేరు.

శ్రీ గోరా జీవితాన్ని స్మరించినప్పుడు టాగోర్ వ్రాసిన "ఏక్‌లా చలో-ఏక్‌లా చలో-ఏక్‌లా చలోరే" అన్న బెంగాలీ గీతం పల్లవి జ్ఞాపకం వస్తూంది. ఆయన జీవితాంతవరకు దాదాపు ఏకాకిగానే నిలిచారు. ఏకాకిగానే ముందుకు సాగిపోయారు ఆయన ధన్యజీవి.

# నాస్తిక నాయకుడు గోరా

## ఆంధ్రప్రభ (దినపత్రిక)

## సంపాదకీయం : 28-7-1975

గోరా (గోపరాజు రామచంద్రరావు) మృతివలన భారతదేశానికేగాక, ప్రపంచంలోని అనేక ఉద్యమాలకు తీరని నష్టం కల్గిందనీ, వారివలె పట్టుదలతో, చిత్తశుద్ధితో, దీక్షతో ఉద్యమాలను కొనసాగింపగల నాయకులు లభించడం దుర్లభమని అంగీకరించని వారుండరు. వారికి మానవుని యందు, మానవత్వమందు తప్ప ఇతర ఐహిక, ఆముష్మిక విషయాలలో విశ్వాసములేదు. శాస్త్ర విజ్ఞాన పరీక్షలకు, పరిశోధనలకు నిలవని వాటియందు వారికి నమ్మకం ఏర్పడకపోవడం సహజమే. వారు నమ్మిన సిద్ధాంతాలకై ఎంతో త్యాగం చేశారు. ఎన్నో త్యజించారు. నూతన సాంఘిక వ్యవస్థ నిర్మాణం వారి ధ్యేయం. ఆ వ్యవస్థ నిర్మాణంద్వారా ఇతర రంగాలలో విప్లవాత్మకమైన మార్పులను తీసుకురావచ్చునని, జీవితాంతం అందుకై కృషిచేస్తూ వచ్చారు. తమ భావాలు కారణంగా సమాజంలో అవహేళన పాలు కావలసి వస్తుందని

తెలిసికూడా అందుకు సిద్ధమై అనేక ఉద్యమాలను సాగించారు. ఈ విషయాలలో కీ.శే. గోరా చాలావరకు కీ.శే. చక్రవర్తి రాజగోపాలాచారికి సన్నిహితంగా ఉంటారు.

సిద్ధాంతాలపై, విధానాలపై మహాత్మునితో ఏకీభవింపజాలక ఆ విషయాన్ని బహిరంగంగా ప్రకటించి భిన్న మార్గాలను అనుసరింప కలిగిన బహుకొద్దిమంది నాయకులలో కీ.శే. గోరా ఒకరు.

కీ.శే. గోరాకు కర్మయందే నమ్మకంలేదు. కాని కర్త, క్రియల యందు నమ్మకం ఉన్నందుననే, వారు స్వధర్మ నిర్వహణలో నిమగ్నులై కన్ను మూశారు. దేశంలోని ప్రముఖ మేధావులలో ఒకరై, అంతర్జాతీయ ఖ్యాతి గడించినా, నిరాడంబరమైన జీవితాన్నే ఆఖరువరకూ గడుపుతూ వచ్చారు. పటమటలోని వారి నివాసం నాస్తికకేంద్రం "వసుధైక కుటుంబం" గా వర్ధిల్లుతూ వుంది. వారు సమాజాన్ని వెంటాడి మరమ్మత్తు చేయడానికి నిర్విరామంగా కృషిచేశారు గాని, సమాజాన్ని తమ వెంట పడనివ్వలేదు.

యువకులేకాక, ప్రజాసేవలో ఉన్న, ప్రజాసేవకులు కాదల్చుకున్న వారందరికీ కీ.శే. గోరా జీవితం మార్గదర్శకం, ఆదర్శప్రాయం. ఒక మహావృక్షం నుంచి అనేక ఊడలు దిగి తిరిగి భూమిలో ప్రవేశించినట్లు కీ.శే. గోరా జీవితంనుంచి ఎన్ని ఉద్యమాలో, ఎన్ని సిద్ధాంతాలో బయలుదేరి వ్యాపించినవి. అట్టి సార్థకజన్ములు వదిలిన ఖాళీని ఎవరు పూర్తిచేయగలరు? భర్తీ చేయువారెవరు?

# 'గోరా'

## ఈనాడు (దినపత్రిక)

## సంపాదకీయం 28-7-1975

**తే**ట మనసులు, తేనే తలపులు అందరికీ రమ్మంటేరావు. అంతమాత్రాన పూర్వజన్మ సుకృతం క్రింద తేల్చివేసి, యధావిధిగా సంచరించలేము. సమాజ సంపర్కం, కలివిడి సంస్కారం అన్నింటికీ మించి విశ్వజనీన దృష్టి మనిషి మనసును తీర్చి దిద్దుతాయి. విశ్వాసాలను క్రమబద్ధం చేస్తాయి. తద్వారా తాను మంచి అనుకున్న నిర్ణయాలను అమలు జరిపిస్తాయి.

కడుపులో కత్తెర, నోట పంచదారతో అలవాటుపడిన నేటి సంఘజీవనంలో అటువంటి విశిష్టజీవులు వున్నారంటే నమ్మశక్యం కాకపోవచ్చు. కాన్నీ, నిన్న స్వర్గస్థులైన

గోపరాజు రామచంద్రరావు అట్టి గొప్ప వ్యక్తులలో ఒకరు. గాంధీ సంప్రదాయంలో పెరిగినవారు చాలామంది ఉన్నారు. కాని వారి పెరుగుదల కేవలం ఆహార్యంలో అనుకరణవరకే నిలిచిపోయింది. కాని ఆచరణకు రాలేదు. గోరా రాజకీయాలలో సర్వోదయవాదిగానే కాక సంఘజీవనంలో అతి నిరాడంబరుడుగా, గొప్ప సంస్కర్తగా ఎదిగివచ్చినవారు.

ఇతరులకు బోధించడమే పాండిత్యంగా భావించకుండా ఆ బోధలను తన జీవితానికేగాక మొత్తం తన కుటుంబానికే వర్తింపజేశారు. బహుశః ఆంధ్రదేశంలో ఏ తండ్రీ చేయనంతటి ముద్రను తన కుటుంబంపై వేసిన వ్యక్తి ఆయన ఒక్కడేనేమో!

బయట సంస్కరణ వివాహాలు, వర్ణాంతర వివాహాలు చేయించడమేగాక, ఇంటిల్లపాదిని ఆ సాంప్రదాయానికి గురిచేసినవారు గోరా. సంస్కరణ వివాహాలలో ఒకప్పుడు సోషలిస్టు భావాలు, కమ్యూనిస్టుభావాలు గల యువకులు ముందడుగు వేశారు. కాని ఆ పరిణామం కేవలం కొలదిమంది వ్యక్తులవరకే పరిమితమయింది. తమ కుటుంబాలను వారు ప్రభావితం చేయలేక పోయారు. రచ్చ గెలిచేముందు ఇంట గెలవలేక పోయారు. మూఢవిశ్వాసాలతో ముందుకు సాగుతున్నారు. కాని ఇందుకు విరుద్ధమైన ఘనత గోరా కుటుంబానికి మాత్రమే దక్కినదంటే అతిశయోక్తి కాజాలదు.

మానవుడి మనుగడను మానవుడే తీర్చుకోవాలన్న విశ్వాసం కలవాడు నాస్తికుడు గోరా. తెలుగునాట నాస్తికప్రచారంలో, దాని వ్యాప్తి ప్రభావంలో గోరా పాత్ర అమోఘం.

గాంధీ రాజకీయ సంప్రదాయంలో ఎదిగిన గోరా కాంగ్రెస్ పావలా సభ్యత్వంలో తృప్తిపడలేదు. స్వాతంత్ర్యానంతరం రాజకీయ సంస్థలలో పేరుకుపోయిన కుళ్ళును చూసి, సర్వోదయవాదిగా మారారు. వృద్ధ కాంగ్రెస్ వాదులు కొందరిలో బయలుదేరిన నైరాశ్యం ఈయనకు కూడా ప్రాకింది. 'పార్టీలెస్ డెమోక్రసీ' ప్రబోధకులలో ఒకరయ్యారు. రాజకీయ విశ్వాసాలు ఎలా వున్నా గోరా గొప్ప సంఘ సేవకుడు. ప్రజల అభిమాని. అందుకే ఆయన తరం వారికేగాక, తరంవారిలో కొందరికి కూడా ఆయనపట్ల అంతటి ఆదరాభిమానాలు.

# మేటి సంఘ సంస్కర్త

## ఆంధ్రభూమి (దినపత్రిక)

## సంపాదకీయం : 29-7-1975

శ్రీ గోరా (గోపరాజు రామచంద్రరావు) మరణంతో ప్రముఖంగా ఆంధ్రప్రదేశ్, బాహుళ్యంగా మొత్తం దేశమూ ఒక గొప్ప సంఘసంస్కర్తను కోల్పోయింది. చివర నిముషం వరకూ ఆయన ఆరోగ్యంగా, దృఢంగా ఉన్నారు. (వయస్సు 73 సంవత్సరాలు) క్రిందటి శనివారం విజయవాడలో ఒకానొక సమావేశంలో ప్రసంగిస్తూ ఉండగా హఠాత్తుగా గుండెపోటు వచ్చి వెంటనే మరణించారు. మరికొన్ని సంవత్సరాలపాటు ఆయన జీవించి ఉంటే మన రాష్ట్రానికి ఆయన ఇంకా ఎంతో సేవచేసి ఉండేవారు. విధి అన్యధా తలచినది. అయితే ఆయనకు విధిలాంటి విషయంలో నమ్మకం ఉండేదికాదు. ఒక విధంగా ఆయన గాంధేయవాది. సర్వోదయవాది కూడా. అయితే ఒక్క తేడా వుంది. గాంధీజీ పరిపూర్ణమైన ఆస్తికుడు. గోరాగారు పరిపూర్ణమైన నాస్తికుడు. తన యావచ్ఛక్తినీ వినియోగించి జీవితకాలమంతా నాస్తిక వాదాన్ని ప్రచారం చేశారు. 1944 ప్రాంతాలలో గాంధీజీని కలుసుకొని నాస్తికత్వం, ఆస్తికత్వం మీద పెద్దవాదం నడిపారు. దేవుడులేడని గాంధీతో వాదించారు. వారిద్దరి మధ్య జరిగిన సంభాషణ తదనంతరం పుస్తకరూపంలో వెలువడింది. ఐతే ఒక్క విషయాన్ని పేర్కొనాలి. గోరా ప్రచారం చేసిన నాస్తికత్వం కేవలం దేవుడి ఉనికిని కాదనడం మాత్రమే కాదు, హేతువాదాన్ని ఆలంబనగా చేసుకొని ఆయన ప్రతిపాదించిన నాస్తికత్వంలో నైతిక విలువలూ, మానవత్వమూ రెండూ నిండుగా ఉన్నాయి.

ఆస్తిక, నాస్తిక వాదాలు ఈనాటివి కావు. అనాది నుండి వస్తూన్నవి. సమసమాజ నిర్మాణాన్ని, మానవతావాదాన్ని ప్రచారం చేసే గోరాగారి మతమూ, దైవంపట్ల నిండు విశ్వాసంతో సర్వోదయ స్థాపనకు గాంధీగారి మతమూ ఒకే నాణేనికి బొమ్మా బొరుసూ లాంటివి.గోరాగారు ఆదర్శవాది కాని స్వాప్నిక జగత్తులో విహరించలేదు. కులవర్గ రహితమైన సమాజంలోనే మానవుడి శ్రేయస్సు ఇమిడి ఉందని ఆయన ప్రగాఢ విశ్వాసం. ఆంధ్రదేశంలో హరిజనోద్ధరణోద్యమాన్ని చేపట్టిన వైతాళికులలో గోరాగారు ఒకరు. హరిజనోద్ధరణ ఆయనకు కేవలం ఒక వాంఛనీయమైన సంఘసంస్కరణ మాత్రమేకాదు. తానుదూరంగా కూర్చుని వారిని ఉద్ధటించడానికి యత్నించలేదు. వారితో కలసి మెలసి వారిలో ఒకడిగా త్రికరణశుద్ధిగా జీవించారు. తన కుమార్తెను

ఒక హరిజనునికి ఇచ్చి 1948 గాంధీజీ సేవాగ్రాం ఆశ్రమంలో వివాహం జరిపించారు. శ్రీ గోరాగారి కుమారుడు ఒక హరిజన యువతిని 1960లో వివాహం చేసుకున్నారు. ఈ విధంగా ఆయన హరిజనులతో వియ్యమందారు. శ్రీ గోరాగారిలోని గొప్పతనమదే. తాను మనసారా నమ్మినది ఎల్లవేళలా ఆచరించి చూసేవారు. ఆ విధంగా ఆయన ధీరోదాత్తుడు. దూషణ భూషణ తిరస్కారాలను లెక్కించకుండా సంఘ సంస్కరణోద్యమాన్ని దిగ్విజయంగా ముందుకు తీసుకువెళ్ళారు. ఆ విధంగా రెండు మూడు తరాలలో కొందరు యువతీ యువకులను ఆకర్షించి ప్రభావితులను చేశారు. గోరాగారికి ఎందరో అనుయాయులున్నారు. వారందరూ ఆయన అడుగుజాడలలో నడిచి ఆయన ఆదర్శాలను ఆచరణ ద్వారా ముందుకు తీసుకెళ్ళగలుగుతున్నారు. ఆయన చిత్తశుద్ధి, మొక్కవోని నిజవర్తన ఎందరినో ప్రభావితులను చేశాయి. ఆయనను వ్యతిరేకించే వర్గాలవారు కూడా ఆయన చిత్తశుద్ధికీ, అచంచల ధైర్యానికీ నమోవాకాలర్పించకుండా ఉండలేకపోయేవారు.

ఆయన తలచుకుంటే ఎంతో ధనమార్జించి భోగభాగ్యాలను అనుభవింప గలిగి ఉండేవారు. కాస్తంత కలవారి ఇంట్లోనే ఆయన జన్మించారు. అత్యున్నత విద్య నభ్యసించి జీవశాస్త్రంలో యం.యస్‌సి. పట్టా తీసుకొని కొలంబో విశ్వవిద్యాలయంలో కొంతకాలం ఆచార్యుడుగా పనిచేశారు. తదుపరి స్వరాష్ట్రం వచ్చి చాలా కాలేజీలలో పనిచేశారు. ఆయన మేధస్సు నిశితమైనది. అదే వృత్తిలో ఆయన కొనసాగితే అగ్రశ్రేణి వైజ్ఞానికవేత్తగా రాణించేవారు. కానీ ఆయన సంఘ సేవకే జీవితాన్ని అంకితం ఇచ్చుకున్నారు. సంఘంలోని మూఢ విశ్వాసాలను, అజ్ఞానాన్ని, మతంపేరిట జరిగే దోపిడీలనూ, కులంపేరిట జరనిగే దురన్యాయాలనూ చూసి భరించలేక వాటిని నిర్మూలించడానికి రంగంలోకి దిగారు. మతంపేరిటా, దేముడిపేరిటా గడుసువాళ్ళు అమాయకుల్ని ఎలా మోసం చేస్తున్నారో ప్రజలకు నచ్చచెప్పడానికి ఒక ఉద్యమాన్ని ప్రారంభించారు. ఆర్థికవ్యవస్థ కూడా మూలవేళ్ళనుండి సంస్కరణ కోరుతున్నదని గ్రహించి, దానికోసం ఆయన పాటుపడ్డారు. సమసమాజ నిర్మాణం ఏర్పడి, వైజ్ఞానిక దృక్పథం హెచ్చరిల్లి, హేతువాదం సమాజాన్ని నడిపించిననాడు మానవుడు ఎంతో సుఖంగా జీవించగలడని ఆయన సందేశం. నిలవనీటివంటి సమాజాన్ని కదిలించి, దానిలో చైతన్యం తీసుకురావడానికి యావచ్ఛక్తి ధారపోశారు. నమ్మిన విశ్వాసాల కోసం త్రికరణశుద్ధిగా పాటుబడిన కర్మయోగి. ఆయన స్మృతికి జోహార్లు.-



వల్లభనేని కాశీవిశ్వనాథం

# మాణిక్యవీణ

ఆంధ్రప్రభ (వారపత్రిక)

**13-8-1975**

చెయ్యడమెంత కష్టమో చెప్పడమంత సులభం.

అందువల్లనే ప్రతివారూ చెప్పడంలో ఆరితేరి, చేయడం దగ్గరికి వచ్చేసరికి తప్పుకుంటూ ఉంటారు.

అలాగే కొందరు కొన్ని పనులు చేస్తూ ఉంటారు. కానీ, అవి సరైనవని నమ్మరు.

అవసరమై ఏదో ఒకటి చేస్తున్నామనుకుంటారే కానీ ఇందులో తప్పులేదనుకోరు

మరికొందరు ఏదో చేసినా, చేయకూడదనుకున్నా ఆ మాట వెల నాడలేరు

ఏదో అనుకుంటారు. అలా చేస్తారు. కానీ అది సరైనదే అని అనలేరు

కుల మత భేదాలు పాటించరాదు అనే నీతి సూత్రమే ఉందనుకోండి.

కొందరు బల్లగుద్ది కులాలకూ, మతాలకూ అతీతంగా ఉండాలని నొక్కి వక్కాణిస్తారుగానీ తమ దాకా వచ్చేసరికి అన్నిటినీ పాటిస్తారు.

స్వకుల స్వమతాభిమానాలను వ్యక్తీకరించడమే కాదు. చేతలలో పర కుల మతాది విద్వేషాన్ని కూడా వెల్లడిస్తారు.

వీరి నీతి చెప్పడం వరకే. చేయడానికి కాదు.

మఱేమో కొందరు అవసరం కొలదీ కుల మతాదులను వాటినీ పాటించరనుకోండి

అయినా వారు వాటిమీద నమ్మకం ఉంచుతారు, వర్ణ వ్యవస్థ చక్కనిదనుకుంటారు. ఏదో అగతికంగా దానిని పాటించలేక పోతున్నామనుకుంటారు.

అలాగే కొందరేమో వాటిని మనసులో నమ్మరు. ఆచరణలో పాటించారు. కానీ ఆ విషయం బయటికి చెప్పలేరు. చెప్పడం తప్పని కూడా అనుకుంటారు.

***

ఈ కారణం వల్లనే మనసా, వాచా, కర్మణా త్రికరణ శుద్ధిగా దేనినైనా సరే పాటించడం ధర్మమన్న మాట బయలుదేరింది.

ఒకటి అనుకొని, ఇంకొకటి చెప్పి, మరొకటి చెయ్యడం ధర్మ విరుద్ధంగా పెద్దలు భావించారు.

ఏది చేసినా త్రికరణశుద్ధిగా చేయాలన్నారు. అలా చేసిన వారిని మహితాత్ములుగా ఉగ్గడించారు.

మాటలకూ, చేతలకూ, మనసుకూ అవినాభావ సంబంధం ఉన్నప్పుడు ఏ పనికైనా చరితార్థత అన్నారు.

అలాంటి వారిని ఉత్తమ చరిత్రులన్నారు

***

అలాంటి ఉత్తమోత్తమ చరిత్రులలో గోరా గారొకరు.

గోపరాజు రామచంద్రరావుగారు గోరా అయి చాలా కాలమయింది.

వారు ఏది చేసినా, ఏది చెప్పినా ఏది సంకల్పించినా వాటిలో సందిగ్ధత లేదు. అనుమానం లేదు. దోలాయమానత లేదు. వజ్ర సంకల్పమాయనది, దృఢ వ్రతుడాయన, క్రియాశీలత్వ మాయనసొత్తు.

దేవుడు లేదు-అన్నారు: అంతే ఇక అందులో ఏ సందేహాస్పదతా లేదు.

కుల మతాదులు మానవ ప్రగతికి భంజకాలనుకున్నారు. అంతే, ఆ మాటకు తిరుగులేదు.

వీటిలో దొంగచాటు వ్యవహారం ఏదీ లేదు. ఆయన తార్కికంగా, తాత్వికంగా కొన్ని విశ్వాసాలను ఏర్పరచుకొన్నారు.

వాటినే నిర్ద్వందంగా, బాహాటంగా 'మేరు శిరమ్ముపై నెక్కి మిన్నులదర'లోకానికి చాటారు.

అంతేకాదు, ఆ విధంగా ఆచరించారు. ఎక్కడో ఏమోకాదు, తన కుటుంబంలో, తన కుటీరంలో తన పరిసరాలలో అన్నిటా ఆ చిత్తశుద్ధిని ప్రస్ఫుటం చేశారు.

అది అత్యుజ్జ్వలమై ప్రకాశించి అనేకులలో దివ్యజ్యోతిని వెలిగించింది.

ఒక నిర్మలతను, నిశ్చలతను, నిర్మమతను ప్రదీప్తం చేసింది.

ఆయన గాంధీజీతో పనిచేశారు. ఆ ఆశ్రమంలోనూ ఉన్నారు.

వినోబాజీతో తిరిగారు. సర్వోదయోద్యమంలో పనిచేశారు.

ఇవన్నీ చేస్తున్నా తన నాస్తికతను వదలలేదు. దానిని దాచుకోలేదు.

అలాగే అనేకులు గాంధేయ నామధారులు ఆయన కుల మతాతీతను నమ్మినట్టు నటించినా నమ్మినవారు బహుతక్కువ. ఈయన అలా కారు.

అందువల్లనే ఆయనకు ఆయనే సాటిగా నిలిచారు. అంత నిరాడంబర జీవనం నెఱపుతూ, అంతగా తన నమ్మకాలను ఆచరణలో పెడుతూ సంఘ సేవనం

నెరపినవారు బహు అరుదు. చదవడంలో తప్ప నాలాంటి చిన్న జీవితంలో, నా ఎరుకలో అసలు లేరు.

నే నాయనను అతి సన్నిహితంగా ఎరుగుదును. ఆయన నన్ను బహుధా ప్రభావితుని చేశారు. ఆయన సునిశిత తర్కం నన్ను ముగ్ధుణ్ణి చేసింది. ఆయన తిరుగులేని నమ్మకం నన్ను చకితున్ని చేసింది.

కానీ, ఆయన నమ్మకాలతో ఏకీభవిస్తేనే ఆదరాభిమానాలన్న మాటలేనేలేదు. నా యెడ ఆయన కనబరుస్తూ వచ్చిన వాత్సల్యం నిర్వ్యాజం, నిరుపమానం.

నా నమ్మకాలు వేరని ఆయనకు తెలుసు. నా దారి వేరని ఆయన ఎరుగును. అయినా నాలోని ఏ చిత్తశుద్ధి లవమో ఆయన అనురాగాన్ని స్పందింపజేసింది.

తనతో ఏకీభవించలేని వారంతా బుద్ధిహీనులని భావించే వారు కారాయన.

అది కూడా వారి గొప్ప లక్షణమే !

* * *

గోరాగారు నిండు మనుగడ సాగించి తుదకు కన్నుమూశారంటే గుండె గుబ గుబ లాడుతుంది. ముందే కాస్త గుండె దెబ్బతిన్న వాడనేమో ఆమాట అనుకోవడానికే జంకుతున్నాను.

తుట్టతుదకు తను ఉపన్యసిస్తూనే చివరి ఊపిరి విడిచారంటే అంతకంటే సార్థకజన్మ వేరేమిటనిపిస్తుంది.

పరిపక్వ జీవితావస్థలో, చేయగలిగినంతా చేసి, ఇంకా చేస్తూ చేస్తూ కాలంలో విలీనమయిపోయిన ఆ మహితాత్ముని సంస్మరణం ఏ కొంత కార్యవాదితనూ, సేవా తత్పరతనూ ప్రేరేపించినా అదే పదివేలు.

అంతకంటే కావలసిన దేమున్నది గనుకా!

డబ్బై రెండేళ్ళ అనుపమాన జీవితం! అప్రతిమాన సంగ్రామంలో కొనసాగించిన మనుగడ-ఇంకా కావలసినదేమున్నది గనుకా?

ధన్యజీవిత మాయనది. ధన్యుడాయన.

**29-7-1975** విద్వాన్‌విశ్వం

# ప్రధానమంత్రి ఇందిరాగాంధీ సందేశం

గోరా సమాజ పరివర్తనకు అంకితమైన సంఘ సంస్కర్త. తాను చెప్పినది ఆచరించి చూపే అరుదైన బహు కొద్దిమందిలో ఆయన ఒకరు.

అస్పృశ్యతా నిర్మూలనోద్యమం ఆయనకెంతో ఋణపడి ఉంది. ఆదర్శవంతమైన ఆయన జీవితం సమాజ సేవారంగంలో పనిచేసే కార్యకర్తలకు ప్రేరణను ఇచ్చుగాక.

- ఇందిరాగాంధీ

# నాస్తికత్వ చరిత్రలో శాశ్వత స్థానం

భారత నాస్తికోద్యమ నాయకులు గోరా మరణవార్త విని మేమెంతో విచారించాము.

గోరాను కలుసుకున్న సందర్భం మా మనసుల్లో ఇంకా తాజాగా ఉంది. వయస్సు మళ్ళినా ఆయనలో శక్తి, పట్టుదల ఏ మాత్రం తగ్గలేదు. సోవియట్ యూనియన్ గురించి వారి అభిప్రాయాలను 1974 జూలై-సెప్టెంబర్ 'ఎథీస్ట్' లో చదివాము. మా పాఠకులకు వారి వ్యాసాన్ని అందించాలనుకుంటున్నాము. ఆయన అభిప్రాయాలతో పూర్తిగా మేము ఏకీభవించలేనప్పటికీ, మౌఢ్యం నుంచీ, జడత్వంనుంచీ మానవ చైతన్యానికి విముక్తి కలిగించుటకు గోరా చేసిన కృషిని గుర్తించి హర్షిస్తున్నాము. నాస్తికత్వ చరిత్రలో ఆయన పేరు శాశ్వతంగా నిలిచిపోగలదు.

ఎ. ఇవానోవ్

'నౌకా రెలిజియా' ప్రధాన సంపాదకులు,

మాస్కో

# సోవియట్ యూనియన్ శ్రద్ధాంజలి

ప్రముఖ నాస్తికులు, సాంఘిక విప్లవకారులు, ప్రజాస్వామ్యానికి, సమాజ పరివర్తనకు పట్టుకొమ్మ అయిన గోరా హఠాన్మరణమునకు మా ప్రగాఢ సంతాపము తెలుపుతున్నాము.

1974 జూలైలో ఆయన మాస్కో వచ్చి మాతో కొద్దిరోజులు గడపగలిగినందుకు మేము సంతోషిస్తున్నాము. ఆయన సోవియట్ యూనియన్ వచ్చినప్పుడు ఆయన వ్యక్తిత్వము, తన సిద్ధాంతాల యెడలగల నమ్మకము, స్ఫటికము వంటి వారి నిజాయితీ, స్వార్ధరహిత వర్తన మమ్మల్ని ఎంతో ప్రభావితం చేసాయి. గోరా ఇక్కడ మా అందరికీ మంచి స్నేహితులు. మా గౌరవాభిమానాలు చూరగొన్న వ్యక్తి. ఆయన ఉన్నత గుణగణాలు, ఉత్తమ సౌహార్దతను మేము ప్రేమించాము.

నాస్తికోద్యమంలో ఆయన పాత్ర మహిమాన్వితమైనది. మూఢనమ్మకాలు, కులభేదాలు, నిరక్షరాస్యత, అజ్ఞానం, దారిద్ర్యం తొలగించుటకు ఆయన నిరంతరం

కృషి సలిపారు. జీవితాంతం ఆయన ఏ ఆదర్శాల కొరకు పోరాడారో అవి తప్పక విజయవంతం కాగలవు.

మీకు మా హృదయ పూర్వక సానుభూతి.

ఎ. లెడోవస్కీ
ఉపాధ్యక్షులు
సోవియట్ స్నేహ సంఘాల సమాఖ్య,
మాస్కో

ఇరీవా కె. ఎర్షోవా
ప్రధాన కార్యదర్శి
సోవియట్-భారత సాంస్కృతిక సంఘం,
మాస్కో

## ముఖ్యమంత్రి సంతాపం

గోపరాజు రామచంద్రరావుగారు 'గోరా'గా తెలుగువారికి చిరపరిచితులు. స్వాతంత్ర్య సమరంలో పాల్గొన్న యోధులుగా సుప్రసిద్ధ గాంధేయ వాదులుగా, ప్రముఖ నాస్తిక ప్రచారకులుగా, నిరాడంబరమూర్తులుగా, ఆదర్శవాదులుగా, సంఘ సంస్కరణ అభిలాషులుగా ఆంధ్రప్రదేశ్‌లో వారిని ఎరుగని వారు లేరు. భారత స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొని కారాగార శిక్షను సైతం అనుభవించిన జాతీయవాది ఆయన. గాంధీజీ అడుగుజాడలలో చివర వరకు నడచిన నిజమైన గాంధేయవాది. గాంధీజీతో ఆయనకున్న తేడా అల్లా ఒక్క దేవుడి విషయంలోనే. గోరాగారి నాస్తికవాదం గాంధీజీకి అనుయాయి కావడానికి ఎంతమాత్రం అడ్డంకి కాలేదు. గాంధీజీ ప్రవచించిన నిరాడంబర జీవనం, నైతిక ప్రవర్తన, సంస్కరణాభిలాష, ఆదర్శకార్యదీక్ష, నిర్వహణలో నిర్భయత్వం గోరాగారిలో పూర్తిగా మూర్తీభవించి వున్నాయి.

సంఘంలోని హెచ్చుతగ్గులకు కులవ్యవస్థే ప్రధానకారణమని గట్టిగా నమ్మి, కులనిర్మూలనకు ఉద్యమాన్ని నడిపిన వాస్తవవాది. సంస్కరణాభిలాషి. ఆయన

కులనిర్మూలన నినాదాలతో తృప్తిపడక ఆచరణలో చేసి చూపించిన ఆదర్శవ్యక్తి. తన పిల్లలను ఇతర కులాలవారికి ఇచ్చి పెళ్ళిచేసి, తను చెప్పినది చేసి చూపించిన నిజమైన సంస్కర్తగా, కార్యకర్తగా లోకానికి నిరూపించుకున్నారు. ఆయన ఒక వ్యక్తిగా కాక, ఒక వ్యవస్థగా తెలుగు ప్రజల చేత గుర్తింపబడుతూ వచ్చారు. తన జీవితానికి ఆదర్శవంతమైన కొన్ని లక్ష్యాలను ఏర్పరచుకొని, ఆ లక్ష్యాల సాధనలోనే చివరి వరకు గడిపిన తపస్వి వంటివారు ఆయన. వారి ఆకస్మిక మరణంవల్ల ఆంధ్రప్రదేశ్‌కి తీరని వెలితి ఏర్పడినది. ఈ విచార సమయంలో నా ప్రగాఢ సానుభూతి తెలియజేస్తున్నాను.

**జలగం వెంగళరావు**
ముఖ్యమంత్రి, ఆంధ్రప్రదేశ్

# స్వేచ్ఛా స్వాతంత్ర్యాల పరిరక్షణకు కృషి

గోరా మరణవార్త నాకెంతో బాధ కలిగించింది. ఆయన ఇంగ్లాండు పర్యటన సందర్భంగా ఆయనను బాగా తెలుసుకోనడం జరిగింది. గోరాయే గనుక భారతదేశంలో కార్యభారం నుండి వీలు చేసుకొని మరికొంతకాలం ఇంగ్లాండులో గడిపి వున్నట్లయితే ఇంగ్లాండులో హ్యూమనిస్టు ఉద్యమాన్ని ఎంతగానో ప్రభావితం చేసివుండేవారనడంలో నాకు ఏ మాత్రం సందేహం లేదు. గోరా జీవితానికి, దృక్పథానికి, కార్యక్రమాలకి మూలం దైవభావాన్ని, మానవాతీత శక్తులను తిరస్కరించడం. ఇది గోరాను మూఢనమ్మకాలు, పాత విలువలు, కాలం చెల్లిన పాత భావాలపై తిరుగబడేటట్లు చేసింది.

ఆస్తికత్వం, మూఢనమ్మకాలు వంటివి కేవలం చర్చిలు, మత కర్మకాండల వరకే పరిమితం అయివుంటాయని మనం సాధారణంగా ఊహించేది తప్పని, యదార్థానికి వాటి ప్రభావం మన జీవితంమీద, సమాజంమీద ఎంతో వుంటుందని నిరూపించడం గోరా సాధించిన విజయం. వ్యక్తి వికాసాన్ని కుంటుపరచి, ఆలోచనకి, సమాజ అభివృద్ధికి అడ్డుపడే అన్ని రకాల ఆలోచనలను, సంస్థలను ఆయన తిరస్కరించారు.

వ్యక్తిగత ఆస్తిని వ్యతిరేకించడం, పార్టీలతో కలుషితం కాని ప్రజాస్వామ్య సాధనకై కృషిచేయడం, ఎంతోమంది ఆకలితో ఉన్నప్పుడు ఆహారాన్ని ఉత్పత్తి చెయ్యడానికి వనరులను వినియోగించాలనే ఉద్యమం, నికృష్టమైన అస్పృశ్యతను

అంతమొందించడానికి కట్టుబాట్లను ధిక్కరించి ముందుకు సాగడం ఇవి అన్నీ ఆయన స్వేచ్ఛాయుతమైన ఆలోచన నుండి వచ్చినవే. స్వేచ్ఛగా ఆలోచించడం వల్లనే ఆయన మతగ్రంథాలను, సమాజంలో పాత అలవాట్లను ఏ విధంగా ధిక్కరించారో, తక్కిన మార్పులకూ అదే విధంగా కృషి చేశారు.

ఆయన మరణించినప్పటికీ, ఆయన ప్రారంభించిన పనిని ముందుకు తీసుకెళ్ళడం జరుగుతుంది. తన నిత్య జీవితాచరణ ద్వారా గోరా సమాజానికి యిచ్చిన సందేశం మనల్ని ప్రభావితం చేస్తూనే వుంటుంది. ఒక్క భారతదేశంలోనే కాదు, ప్రపంచంలో ఎక్కడెక్కడికైతే గోరా వెళ్ళారో ప్రతీచోటా గోరా ప్రారంభించిన పనిని ముందుకు తీసుకువెళ్ళే కృషి జరుగుతుంది.

అత్యంత ప్రియమైన స్నేహపాత్రమైన మిత్రుని కోల్పోయాము. గొప్ప నాస్తికులైన గోరాకు జోహార్లు.

క్రిస్టోఫర్ మేసీ

"సైకాలజీ టుడే" సంపాదకులు

లండన్

## మానవత్వ దృక్పథం

గోరాను నేను మొదటిసారిగా 1970 జూలైలో కలిసాను. ఆయన ప్రపంచ పర్యటనలో హాలెండు వచ్చారు. హాలెండులో ఆయన పర్యటనను నిర్వహించినందుకు నేను గర్వపడుతున్నాను. పర్యటన సందర్భంలో కొద్ది రోజులు గోరా మాఇంటిలో కూడా వున్నారు.

గోరా సంపూర్ణవ్యక్తిత్వం, మానవత్వం దృక్పథం నన్నెంతో ప్రభావితుణ్ణి చేశాయి.

నిగర్వంగా కల్లాకపటం లేకుండా ఆయన అతి దీక్షతో, గట్టి పట్టుదలతో తన మహోన్నత ఆశయాల సాధనకై జరుపుతున్న కృషి గురించి తెలుసుకొని నాకు గోరా ఎడల ఎంతో గౌరవభావం ఏర్పడింది.

ఆయన ఎప్పుడూ సహృదయంతో చక్కగా మాట్లాడేవారు. ఎన్నో చిక్కు సమస్యలను ఎదుర్కొంటూ కూడా లక్ష్యసాధనకు కృషిచేసిన గొప్పవ్యక్తి గోరా.

ఆయనతో పరిచయం ఉన్న ప్రతి ఒక్కరికీ ఆయన విశాల హృదయం, స్వార్థరాహిత్యం అర్థమయి ప్రభావితమయ్యేవారు.

అంతర్జాతీయ మానవతావాదుల మహాసభలు 1970లో బోస్టన్‌లో జరిగినప్పుడు, 1974లో ఆమ్‌స్టర్‌డాంలో జరిగినప్పుడు ఆయన వచ్చి పాల్గొన్నారు.

రెండుసార్లు హాలండు వచ్చినప్పుడు ఆయన సందేశం ఒక్క భారతీయులకే కాదని, ప్రపంచంలో వివిధ దేశాలలోని మానవజాతికి ఉద్దేశించబడిందని మాకు స్పష్టం అయింది.

ఆయన జీవితవిధానం, చేసినపని ఎంతోమందికి స్ఫూర్తిని ఇస్తుందనడంలో సందేహం లేదు.

**జె. పాస్‌మన్**
హ్యూమనిస్టు లీగ్ మాజీ ఎగ్జిక్యూటివ్ డైరెక్టర్
హాలండు

# ఆస్ట్రేలియాలో నాస్తికత్వానికి తోడ్పడిన గోరా

నాస్తికత్వ దృక్పథాన్ని, నిర్మాణాత్మక కార్యక్రమ భావాల్ని గోరా అభివృద్ధి చేసినంతగా బహుశా మరే నాస్తికులూ ఇంత వరకూ చేయలేదు.

పార్టీరహిత ప్రజాస్వామ్యాన్ని గోరా ప్రచారం చేసి, తద్వారా బూజుపట్టిన పాతభావాలను దులిపివేసి, నూతన రాజకీయ దృక్పథాన్ని ప్రజల ముందుంచారు. ఇండియాలోను, ఆస్ట్రేలియాలోను కూడా పార్టీ రాజకీయాలనే పర్వతాన్ని ఢీకొని ప్రజాస్వామికం చిక్కులలో పడుతోందన్న విషయం స్పష్టం. వ్యక్తిగతంగానూ, పార్టీ పేర అధికారం కొరకు, మానవ విలువలను విస్మరించడం జరుగుతోంది.

కులతత్వానికి, మత తత్వానికీ వ్యతిరేకంగా ప్రజలమధ్య సాన్నిహిత్యం పెంచడానికి గోరా తలపెట్టిన వర్ణాంతర వివాహాల వంటి కార్యక్రమాలు ఎంతో నిర్మాణాత్మకమైనవి. విలువైనవి. ఒక్క భారతదేశంలోనేకాదు, ప్రపంచ మొత్తంమీద కులం, మతం, వర్ణభేదం, జాత్యహంకారం, జాతీయత అనేవి మానవ అభివృద్ధికి ఆటంకమైన సంకుచిత పరిధులు.

గోరా కార్యక్రమాలు ఆస్ట్రేలియాలో మా కందరికీ ఎంతో ఉత్సాహాన్ని, స్ఫూర్తిని యిచ్చాయి. గోరా మరణానికి ఆస్ట్రేలియా నాస్తికులు తమ హృదయపూర్వక సానుభూతిని తెలియజేస్తున్నారు.

**అలన్ రికార్డ్**
ఆస్ట్రేలియా నాస్తికసంఘం

## చెప్పింది చేసి చూపించిన గోరా

గోరా హఠాన్మరణ వార్త నాకు దిగ్భ్రాంతిని కలిగించింది. అయిదు నెలల క్రితం చివరిసారిగా మేము నాస్తిక కేంద్రంలో కలుసుకొన్నప్పుడు ఆయన చాలా ఆరోగ్యంగా, ఉత్సాహంగా ఉన్నారు. గోరా పూరిపాకల్లో వుంటూ, అతి నిరాడంబరంగా వుంటూ వున్నా, గొప్ప మేధావి అన్న విషయం నాకు ఆయనను నాస్తిక కేంద్రంలో కలుసుకొన్నప్పుడు నన్ను అత్యధికంగా ఆకర్షించి ప్రభావితం చేసింది.

ఆయన ఇంకా ఎంతోకాలం ఆరోగ్యంగా వుండి తన కార్యక్రమాల్ని నిరాఘాటంగా కొనసాగించగలరనే అభిప్రాయం నాకు గోరాను కలిసికొన్నప్పుడు కలిగింది. మహాత్మ్యాల బండారాన్ని బయటపెట్టే కార్యక్రమంలో అక్టోబరులో మరల ఇండియా వచ్చినప్పుడు గోరాను తిరిగి కలవాలన్నది ఆకాంక్షగానే మిగిలిపోయింది. నాకు ఆ అవకాశం లేకుండా పోయింది.

మా ఇద్దరి అభిప్రాయాలూ, మావిద్య ఒకటి కావడమే కాక, ఎన్నో విషయలలో గోరాకు, నాకు సన్నిహితత్వం వుంది. నాలాగే ఆయన కూడా నాస్తిక కుటుంబాన్ని తయారుచేశారు. లేని దేవుళ్ళను కొలుస్తూ పూజలు, పునస్కారాలలో తమకాలాన్ని ఆ కుటుంబ సభ్యులు వృథాచెయ్యరు. గోరా ఏదయితే చెప్పారో, దానిని ఆచరించి చూపారు.

గోరా మరణంతో భారతదేశం మానవత్వాన్ని ప్రేమించే ఒక గొప్ప వ్యక్తిని కోల్పోయింది.

సమాజంలో అణగారిన, వెనకబడిన ప్రజలపట్ల గోరాకు గల ప్రేమాభిమానాలు ఇతరుల లాగా మరణానంతరం స్వర్గం ప్రాప్తించాలన్న దృష్టితో కాదు, దేవుళ్ళనుండి వరాలు పొందడానికి కాదు.

1970లో గోరా ప్రపంచ పర్యటనలో కొలంబో వచ్చినప్పుడు కొద్దిరోజులు మా అతిథిగా వున్నారు. మూఢనమ్మకాల నిర్మూలన మతమౌఢ్యం తొలగించడం ఎలాగన్న విషయంపై మేమిద్దరం సుదీర్ఘమయిన చర్చలు జరిపాం.

పై కులంలో జన్మించినప్పటికీ, తన జీవితాన్నంతా గోరా కులనిర్మూలన అస్పృశ్యతానిర్మూలనకై ధారపోశారు. హరిజనుల సర్వతోముఖాభివృద్ధికై అనవరతం గోరా చేసినంత కృషి గాంధీ తప్ప పై కులాలలో జన్మించిన మరెవరూ చేయలేదేమో. ఆయన గొప్ప పని, ఆయన ఉదాహరణ ముందుతరాల భారతీయులను ఉత్తేజపరుచుగాక.

డాక్టర్ అబ్రహాం టి.కోవూర్

శ్రీలంక రేషనలిస్టు సంఘం అధ్యక్షులు, కోలంబో

## పార్టీరహిత ప్రజాస్వామ్యానికై కృషి

నేను గోరాను మొదటిసారిగా చూడటం నాకు బాగా జ్ఞాపకం వుంది. ఆయన అప్పుడు హైదరాబాదులో మంత్రుల ఆడంబరాలను వ్యతిరేకిస్తూ, పార్టీరహిత ప్రజాస్వామ్యం కోరుతూ ప్రదర్శన జరుపుతున్నారు. భారతదేశానికి కొత్తగా వచ్చిన నాకు ఆయన చర్య చిత్రంగా కనబడింది. కాని త్వరలోనే నాకు ఆయనతో పరిచయం కలగడంతో ఆయన ఆదర్శాలను హర్షించడం ప్రారంభించాను. అంతకంటే ముఖ్యంగా ఆయన తన జీవిత సిద్ధాంతాలను నిస్వార్ధంగా ఆచరణలో పెట్టడం నన్నెంతో ఆకర్షించింది.

ఆయన మరణం హఠాత్తుగా రావడం బాధాకరమైనా, చిట్ట చివరి నిమిషం వరకూ ఆయన సక్రియంగా వుండటం హర్షించదగినది. ఆయన చేసిన కృషిని ప్రభుత్వం, ప్రజలు గుర్తించడం సంతోషకరం. నాస్తికకేంద్రం ద్వారాను, ఆయన ఆశించిన కాలేజ్ ఫర్ సోషల్ ఛేంజి ద్వారాను ఆయన ప్రారంభించిన కృషిని ముందుకు తీసుకువెళ్ళగలరని నా విశ్వాసం.

ప్రొఫెసర్ జియోఫ్రే ఆస్టర్‌గార్డ్

బర్మింగ్‌హాం యూనివర్శిటీ, ఇంగ్లాండు

## తీరనిలోటు

మా ప్రియతమ మిత్రులు గోరా మరణవార్త మా కెంతో బాధకలిగించింది. భారతదేశంలోని విద్యాధికులు, శాస్త్రజ్ఞులు, పండితులు, వేలాదిమంది నాస్తికులు, రేషనలిష్టులు గోరా లేని లోటును గుర్తిస్తారు. భారతదేశంలో నాస్తిక, హేతువాద, స్వేచ్ఛాభావ ఉద్యమంలో గోరా మరణంవలన ఏర్పడిన లోటును భర్తీ చేయదానికి

చాలాకాలం పడుతుంది. ఎంతోకాలంగా అజ్ఞానాంధకారంలో వున్న అశేష ప్రజానీకానికి వెలుగుబాట చూపాలని గోరా కృషి చేశారు. తన తీవ్రమైన కృషిలోనే గోరా మరణించారు. భారతీయులలో మహాత్మాగాంధీ, గోరా ఇద్దరూ అంటే నాకు చాలా ఇష్టం.

గంజాలో క్విగ్

ప్రెసిడెంటు, ఫిలిప్పీన్స్ హ్యూమనిస్టు అసోసియేషన్, మనీలా.

## నాస్తికత్వ వ్యాప్తికై అనవరతం కృషి

అన్ని దేశాలకంటే భారతదేశంలో గోరావంటి వ్యక్తుల ఆవశ్యకత ఎంతైనా వుంది. అలాంటివారు కనీసం వెయ్యిమందైనా కావాలి.

గోరా సహచరులు, పిల్లలు ఆయన మొదలుపెట్టిన కార్యక్రమాన్ని ముందుకు తీసుకొనిపోగలరని మా విశ్వాసం. జీవితాంతం వరకు అతి పట్టుదలతో మహోన్నతమైన నాస్తికత్వ వ్యాప్తికై గోరా జరిపిన కృషి, ఆయన జీవితం ఇతరులకు స్ఫూర్తిని యిస్తాయి.

జేమ్స్ హార్వే జాన్సన్

నాస్తికసంఘం అధ్యక్షులు. శాన్‌డియాగో, అమెరికా

## స్వతంత్ర భావాలు, సాహసం

గోరా హఠాన్మరణం మాకెంతో ఆశ్చర్యాన్ని కలిగించింది. ఆయన కార్యక్రమాలు, ఉద్యమాలు చూస్తూ వుంటే గొప్ప స్వతంత్ర భావాలు గల సాహసవంతుడయిన గోరా ఎడల నా గౌరవం మరింత ఇనుమడిస్తోంది. గోరా అసాధారణమైన గొప్పవ్యక్తి అనడంలో సందేహంలేదు. ఆయన ప్రారంభించిన ఉన్నతమైన, ముఖ్యమైన కార్యక్రమాన్ని నాస్తిక మిత్రులంతా ముందుకు తీసుకువెళ్ళగలరని నా విశ్వాసం.

ప్రొఫెసర్ ఇచిరో హారా

జపాన్ హ్యూమనిస్టు అసోసియేషన్ ప్రెసిడెంట్, టోక్యో

## అందరి బాధ్యత

నేను మరల విజయవాడ వచ్చినప్పుడు గోరాను కలవలేనంటే నమ్మశక్యం కాకుండావుంది. 1975 జనవరిలో భారతదేశం వచ్చినప్పుడు గోరా కుటీరంలో గంటలకొద్ది ఆయనతో మాట్లాడుతూ గడపడం ఇప్పుడు కూడా నాకళ్ళముందు వుంది. గోరా మరణించినా, ఆయన ఏ ఆదర్శాలకై కృషిచేశారో, ఏ సత్యాలైతే ఆయన ఎలుగెత్తి చాటారో, వాటిని మనం ఆందరం కలిసి ఉద్యమాలద్వారా ముందుకు తీసుకువెళ్ళాలి. ఇందులో మా అందరి అండదండలు ఎల్లప్పుడూ ఉంటాయి.

**డాక్టర్ జార్జి విల్లబీ**
ఫిలడెల్ఫియా, అమెరికా

## సన్నిహిత మిత్రుని కోల్పోయాం

గోరా మరణవార్త వినగానే మానవజాతి ఒక మిత్రుని కోల్పోయిందని, అంతేకాక, నేను సన్నిహిత మిత్రుని కోల్పోయానన్పించింది. నాకు ఇటీవలి సంవత్సరాలలోనే గోరాతో పరిచయం పెంపొందినప్పటికీ, నేను భారతదేశం పర్యటించినప్పుడు, అంతే కాక 1970 జూలైలో గోరా ఇంగ్లాండు వచ్చి లండనులో మా అతిథిగా వున్నప్పుడూ, ఆయనతో నాకు చాలా సన్నిహితత్వం పెంపొందింది.

గోరా చివరిక్షణంవరకూ తన కర్తవ్యాన్ని నిర్వహిస్తూ మరణించారు. నా హృదయపూర్వక సానుభూతి.

**రెవరెండ్ యల్.జాన్ కాలిన్స్**
సెయింట్ పాల్ కెథడ్రల్, లండన్

గోరా శాన్‌ఫ్రాన్సిస్కో వచ్చినప్పుడు ఆయనను కలుసుకొనడం, ఆయన విశాలదృక్పథాన్ని, అధునికతను అర్థం చేసుకోవడం జరిగింది. గోరాలాంటి వ్యక్తులు చాలా అరుదు. ఎంతో విలువైన ఆయన సందేశాన్ని అందరూ గుర్తించడం జరుగుతుందని మా ఆకాంక్ష.

**బి.టి. రొక్కొ**
యునైటెడ్ సెక్యులరిస్ట్స్ ఆఫ్ అమెరికా అధ్యక్షులు
శాన్‌ఫ్రాన్సిస్కో, అమెరికా

గోరా మరణం హేతువాద ఉద్యమానికి తీరని లోటు. గోరాయొక్క నిరాడంబరత తాను నమ్మిన సిద్ధాంతాల ఎడల అకుంఠిత దీక్ష నన్నెంతో ఆకర్షించాయి. మతమౌఢ్యాన్ని తొలగించడానికై ఆయన దీక్ష, తాను వ్యాప్తిచేసిన విషయాలను ఆచరించి చూపిన ధైర్యశాలిగా గోరా అంటే నాకు ఎంతో గౌరవం

**ఎ. సోలోమన్**
బ్రస్సెల్స్, బెల్జియం

గోరా మరణం మాకందరికీ ఎంతో బాధకరమైనది. మానవత్వం పురోభివృద్ధి కొరకు పోరాడే నిజమైన గొప్ప మానవుణ్ణి కోల్పోవడం జరిగింది.

**సిగ్మండ్ లేమను**
బెర్న్‌బాచ్, పశ్చిమజర్మనీ





సరస్వతీగోరా - గోరా దంపతులు



గోరా దంపతులతో తొమ్మిది మంది పిల్లలు. వరుసగా నిల్చున్నవారు : విజయం, లవణం, మనోరమ, సరస్వతీ గోరా, గోరా, మైత్రి, విద్య
కూర్చున్నవారు: నియంత, నౌ, మారు, సమరం



గోరా తండ్రి - వెంకట సుబ్బారావు (మహదేవ శంభో), తల్లి - రాజ్యలక్ష్మి




గోరా సోదరులు, సోదరీమణులు- నరసింహారావు, సాంబశివరావు, సౌభాగ్యం, అనసూయ, కృష్ణవేణి, త్రిపుర సుందరి, సామ్రాజ్యం



తమ తొలి సంతానం మనోరమతో గోరా, సరస్వతీ గోరాలు



కొడుకులుల - కోడళ్ళు, కూతుళ్ళు - అల్లుళ్ళతో సరస్వతీగోరా






పెరియార్ రామస్వామి నాయకర్‌తో



వార్ధాలో సేవాగ్రాం ఆశ్రమంలో 1949, మార్చి 13న ప్రధానమంత్రి జవహర్‌లాల్ నెహ్రూ సమక్షంలో గోరా ప్రథమ కుమార్తె మనోరమకు, అర్జునరావుతో జరిగిన వివాహదృశ్యం. గాంధీ అనుచరులు ప్రభాకర్‌జీ, అర్యనాయకమ్ తదితరులు.



ప్రముఖ శాస్త్రవేత్త అబ్రహాం టి. కోవూర్‌తో శ్రీలంకలో



ఢిల్లీలో రాజ్‌ఘాట్‌లో గాంధీ సమాధి వద్ద ముగిస్తున్న 1100 కి.మీ. పాదయాత్ర




మంత్రుల ఆడంబరాలకు వ్యతిరేకంగా నిర్వహించిన ఢిల్లీ పాదయాత్ర



వియ్యంకులు - గోరా, గుర్రం జాషువా, విశ్వమానవులు. కుల-మత రహిత సెక్యులర్ సమాజం కొరకు విశిష్ట కృషిచేశారు.

ఆధునిక నాస్తికోద్యమ నిర్మాత, అస్పృశ్యతా నిర్మూలనకై, కులమత భేదభావాలను పారద్రోలి సమసమాజ నిర్మాణానికై అనవరతం కృషిసల్పిన ప్రముఖ సాంఘిక విప్లవకారులు, నిర్మాణాత్మక నాస్తిక జీవితవిధానాన్ని రూపొందించి ప్రప్రథమంగా ప్రపంచమంతటా నాస్తికత్వవ్యాప్తికై దేశదేశాలు పర్యటించిన నాస్తికోద్యమ నాయకులు, రాజకీయ ఆర్థిక రంగాలలో మార్పులకై ఎన్నో ఉద్యమాలు నడిపి మానవుని వ్యక్తిత్వ వికాసానికి, స్వాతంత్ర్య పరిరక్షణకు పోరాటం సల్పిన ధీశాలి, మాటకు – చేతకు వారధి, నిరంతర ఆశావాదిగా, విరామమెరుగక పురోగమించిన సత్యాన్వేషి, ప్రజలలోని మౌఢ్యాన్ని పారద్రోలి శాస్త్రీయ దృక్పథాన్ని, చైతన్యాన్ని, మానవత్వ దృక్పథాన్ని పెంపొందించడానికై కృషిసల్పిన గొప్ప వ్యక్తి. నిరాడంబరత, మొక్కవోని ధైర్యం, సమాజానికి ఎదురీదగల సాహసం, వాస్తవికత – సంఘదృష్టి – వ్యక్తిత్వం గల గోరా, తన విశిష్టజీవితం ద్వారా ఎంతోమందిని ప్రభావితం చేశారు, చేస్తున్నారు.

1902లో జన్మించి 1975 జూలై 26న ఒక సభలో ప్రసంగిస్తూ హఠాత్తుగా మరణించిన గోరా మహోన్నత జీవిత గాథను శ్రీ వల్లభనేని కాశీ విశ్వనాథం ఈ పుస్తకంలో చక్కగా వివరించారు.



ప్రజాశక్తి బుక్‌హౌస్ PSBH

210

